శ్రీరస్తు.

శ్రీమద్రామాయణాంతర్గత

# బాలకాండము.

శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులుగారి

ఆంధ్ర తాత్పర్యసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1954.

శ్రీరస్తు.

# శ్రీరామాయణవైభవమ్



శ్రీరామప్రాతిపదిక మవశేనాపి సంగృణన్,
ముక్తిం ప్రాప్నోతి మనుజః కిం పున ర్బుద్ధిపూర్వకమ్. ౧
రాశబ్దోచ్చారణాదేవ పాతకా దేహపఞ్జరాత్,
నిర్యాన్త్యాయాన్తి పాపాని మవర్ణాదర్శనాత్పునః. ౨
రాశబ్దోచ్చారణే జాతే వక్త్రాత్పాపం విగచ్ఛతి,
మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి. ౩
రామేతి రామచన్ద్రేతి రామభద్రేతి వా మనుమ్,
యావజ్జీవం జప న్మర్త్యో జీవన్ముక్తో న సంశయః. ౪
రామాయణస్య మాహాత్మ్యం వక్తుం వర్షశతైరపి,
అశక్యం విస్తరా ద్వక్తుం సంక్షేపా ద్వచ్మి సాంప్రతమ్. ౫
రామాయణస్య వాక్యం వా పాదం వా పదమేవ వా,
భక్త్యన్తేతు ప్రచుం జానో బ్రహ్మభూయాయ కల్పతే. ౬

ఇత్యుమాసంహితాయాం శ్రీరామాయణవైభవం

సమాప్తమ్.



శ్రీరస్తు.

# బాలకాణ్డస్థ శ్లోకసర్గాదీనాం పారాయణ శ్రవణాదిఫలమ్.

ఉమాసంహితాయామ్.

'తపస్స్వాధ్యాయ నిరత' మితి శ్లోకస్య వై శ్రుతేః,
తపసాం సిద్ధి మాప్నోతి స్వాధ్యాయస్య చ మానవః. ౧
శ్రుత్వా సంక్షేపకం కావ్యం ప్రత్యహం శ్రావయేత వా,
పఠేద్వా ప్రత్యహం మర్త్యో బ్రహ్మభూయాయ కల్పతే. ౨
'పఠన్ద్విజ' ఇతి ప్రోక్త శ్లోకస్య పఠనా త్సదా,
సర్వజ్ఞత్వ మవాప్నోతి నాత్ర కార్యా విచారణా. 3
'మానిషాదప్రతిష్ఠాం త్వ'మితిశ్లోకస్య వై శ్రుతేః,
వాగ్మినాం ప్రవరో మర్త్యో లోకే భూత్వా చరిష్యతి. ४

బ్రహ్మాండపురాణే.

తస్మాదిదం బాలకానాం పాఠ్యమాదరతః పురాః,
కృత్స్నశాస్త్రేషు నిపుణో భవిష్యతి న సంశయః. ౫
వక్తా సభాసు సర్వత్ర భవిష్యతి చ వల్లభః,
అయోధ్యావర్ణనం శ్రుత్వా ముచ్యేత సకలాఘతః. ౬

మహాభూతసముత్థానం యే శృణ్వంతి మహీతలే,
తేషాం భూతాదిసంభూతా నాస్తి పీడా కదాచన. ౭
నృపాంగనానాం రాజ్ఞా తు పాయసస్య ప్రభేదనమ్,
శృణోతి యా స్త్రీ పుత్రం సా లభతే నచిరాదిహ. ౮
రామాదీనాం చతుర్ణాం తు ప్రసూతిం యశ్శృణోతిహి,
సపుత్రపౌత్రైస్సంయుక్తస్స్థిత్వా రామపదం వ్రజేత్ ౯
ఋషేః పూజాం సమాకర్ణ్య ఋణాన్ముక్తో భవేన్నరః,
తాటకాఖ్యానమాకర్ణ్య పాపం తరతి మానవః. ౧౦
తాటకావధమాకర్ణ్య హ్యవిద్యానాశమాప్నుయాత్,
‘సహత్వా రాక్షసాన్సర్వా’నితి శ్లోకానువర్తినః. ౧౧
శ్రవణేన సకారస్య దూరతో యాన్తి పాతకమ్,
శైలేంద్రో హిమవాన్నామ ధాతూనామాకరో మహాన్. ౧౨
ఇత్యుపక్రమ్య గంగాయా వైభవస్య శ్రుతేర్నరః,
విముక్తభవబంధస్తు గంగాసాయుజ్యమాప్నుయాత్. ౧౩
సగరస్యాశ్వమేధస్య శ్రుత్వా విధిమనుత్తమం,
బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముక్తాస్స్యుశ్శ్రద్ధయా నరాః.
సగత్వా నగరం రాజా ఇత్యుపక్రమ్య శృణ్వతః,
పితరస్స్వర్గమాయాంతి నిరయస్థా అనామకాః. ౧౪
శ్రుత్వా రుద్రస్య చరితం రుద్రలోకం గమిష్యతి,
కుమారసంభవం భక్త్యా యశ్శృణోతి నరోత్తమః. ౧౫
భక్తశ్చ యః కార్తికేయే కాకుత్స్థ భువి మానవః,

ఆయుష్మాన్పుత్రపౌత్రైశ్చస్కందసాలోక్యతాం వ్రజేత్.
శాపముక్తిశ్చ భార్యాయాశ్శ్రుత్వా చేద్గౌతమస్యహ,
నరగ పాపాద్విముచ్యేత నారీవా వ్యభిచారణాత్. ౧౮
'ఇమౌకుమారౌ'విత్యాది జనకేన సుభాషితమ్,
హారేస్తవం సమాకర్ణ్య ముచ్యతే సర్వబంధనాత్. ౧౯
'విశ్వామిత్రస్తుధర్మాత్మే' త్యత్రాద్యక్షరసంశ్రవాత్,
నష్టపాపో విదోషస్సన్సోమలోకే మహీయతే. ౨౦
'ప్రాపమధ్యే'త్యుపక్రమ్య జానక్యా మంగళోత్సవమ్,
శ్రుత్వావివాహసమయే భర్తాదీర్ఘాయురాప్నుయాత్. ౨౧
'రామ దాశరథే వీర వీర్యంతే శ్రూయతేఽద్భుతమ్,'
ఇత్యాదిశ్రవణాత్పుంసాం బ్రహ్మతేజోఽభివర్ధతే. ౨౨
కాణ్డాన్తం శ్రావయేద్వాపి శృణుయాద్వా నరర్షభః,
ఉపేత్య భార్యాం హృద్యాం చ రమతే ప్రీతిపూర్వకమ్.

ఇతి శ్రీబాలకాణ్డఫలశ్రుతి స్సమాప్తా.

---

శ్రీరస్తు.

# ఆంజనేయస్తోత్రమ్.



శృణు దేవి ప్రవక్ష్యామి స్తోత్రం సర్వభయాపహమ్,
సర్వకామప్రదం నృణాం హనూమత్ స్తోత్ర ముత్తమమ్.
తప్తకాంచనసఙ్కాశం నానారత్నవిభూషితమ్,
ఉద్యద్బాలార్కవదనం త్రినేత్రం కుణ్డలోజ్జ్వలమ్. ౨
మౌఞ్జీకౌపీనసంయుక్తం హేమయజ్ఞోపవీతినమ్,
పిఙ్గళాక్షం మహాకాయం టఙ్కశైలేన్ద్రధారిణమ్. ౩
శిఖానిక్షిప్తవాలాగ్రం మేరుశైలాగ్రసంస్థితమ్,
మూర్తిత్రయాత్మకం పీనం మహావీరం మహాహనుమ్. ౪
హనూమన్తం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణమ్,
త్రిమూర్త్యాత్మకమాత్మస్థం జపాకుసుమసన్నిభమ్. ౫
నానాభూషణసంయుక్త మాఞ్జనేయం నమామ్యహమ్,
పఞ్చాక్షరస్థితం దేవం నీలనీరదసన్నిభమ్. ౬
పూజితం సర్వదేవైశ్చ రాక్షసాన్తం నమామ్యహమ్,
అచలద్యుతిసఙ్కాశం సర్వాలఙ్కారభూషితమ్. ౭
షడక్షరస్థితం దేవం నమామి కపినాయకమ్,
తప్తస్వర్ణమయం దేవం హరిద్రాభం సురార్చితమ్. ౮
సున్దరం సాబ్జనయనం త్రినేత్రం తం నమామ్యహమ్,

అష్టాక్షరాధిపం దేవం హీరవర్ణసముజ్జ్వలమ్. ౯
నమామి జనతావంద్యం లఙ్కాప్రాసాదభఞ్జనమ్,
అతసీపుష్పసఙ్కాశం దశవర్ణాత్మకం విభుమ్. ౧౦
జటాధరం చతుర్బాహుం నమామి కపినాయకమ్,
ద్వాదశాక్షరమన్త్రస్య నాయకం కున్తధారిణమ్. ౧౧
అఙ్కుశఞ్చ దధానఞ్చ కపివీరం నమామ్యహమ్,
త్రయోదశాక్షరయుతం సీతాదుఃఖనివారణమ్. ౧౨
పీతవర్ణం లసత్కాయం భజే సుగ్రీవమన్త్రిణమ్,
మాలామన్త్రాత్మకం దేవం చిత్రవర్ణం చతుర్భుజమ్. ౧౩
పాశాఙ్కుశాభయకరం ధృతటఙ్కం నమామ్యహమ్,
సురాసురగణైస్సర్వై స్సంస్తుతం ప్రణమామ్యహమ్. ౧౪
ఏవం ధ్యాయే న్నరో నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే,
ప్రయాతి చిన్తితం కార్యం శీఘ్రమేవ నసంశయః. ౧౫
అష్టమ్యాం వా చతుర్దశ్యాం మర్కవారే విశేషతః.
సన్ధ్యాపూజాం ప్రకుర్వీత ద్వాదశ్యాఞ్చ విశేషతః. ౧౬
అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః,
పూజయే త్తత్ర విద్వాన్ యో రక్తవస్త్రేణ వేష్టయేత్. ౧౭
బ్రాహ్మణా న్భోజయే త్పశ్చా త్తత్ప్రీత్యై సర్వకామదామ్,
యఃకరోతి నరో భక్త్యా పూజాం హనుమతస్సుధీః. ౧౮
న శస్త్రభయ మాప్నోతి భయం వాప్య న్తరిక్షజమ్,
అక్షాది రాక్షసహరం దశకణ్ఠదర్ప
నిర్మూలనం రఘువరాంఘ్రిసరోజభక్తమ్,

సీతాఽవిషహ్యఘునదుఃఖనివారకం తం
వాయోస్సుతం గిలితభాను మహం నమామి. ౧౯
మాం పశ్యపశ్య హనుమన్ నిజదృష్టిపాతైః
మాం రక్ష రక్ష పరితో రిపుదుఃఖపుంజాత్,
వశ్యం కురు త్రిజగతీం వసుధాధిపానామ్
మే దేహి దేహి మహతీం వసుధాం శ్రియం చ. ౨౦
ఆపద్భ్యో రక్ష సర్వత్ర ఆంజనేయ నమోఽస్తుతే,
బన్ధనం ఛేదయాజస్రం కపివీర నమోఽస్తుతే, ౨౧
దుష్టరోగాన్ హన హన రామదూత నమోఽస్తుతే,
ఉచ్చాటయ రిపూ న్సర్వా న్మోహనం కురు భూభుజామ్. ౨౨
విద్వేషిణో మారయ త్వం త్రిమూర్త్యాత్మక సర్వదా,
సఞ్జీవపర్వతోద్ధార మనోదుఃఖం నివారయ. ౨౩
ఘోరానుపద్రవాన్ సర్వాన్ నాశయాఽసురాన్తక,
ఏవం స్తుత్వా హనూమన్తం నర శ్శ్రద్ధాసమన్వితః. ౨౪
పుత్రపౌత్రాదిసహితో సర్వసౌఖ్య మవాప్నుయాత్

ఇత్యుమాసంహితాయాం ఆంజనేయస్తోత్రమ్
సమాప్తమ్.

---

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణ పారాయణక్రమః.



సద్గురుసకాశాల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణపారాయణం కుర్యాత్ - దేశ కాలౌ సంకీర్త్య—

అస్య శ్రీరామాయణమహామంత్రస్య, వాల్మీకిర్భగవాన్ ఋషిః ; అనుష్టుప్ఛందః ; శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా ; రాం బీజం ; శ్రీం శక్తిః ; మం కీలకం! మమ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే వినియోగః; రాం అంగుష్ఠాభ్యాన్నమః, రీం తర్జనీభ్యాం స్వాహా; రూం మధ్యమాభ్యాం వషట్! రైం అనామికాభ్యాం హుం; రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్; రః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్, రాం హృదయాయ నమః! రీం శిరసే స్వాహా! రూం శిఖాయై వషట్; రైం కవచాయ హుం! రౌం నేత్రత్రయాయ వౌషట్ ; రః అస్త్రాయ ఫట్! లోకత్రయేణ దిగ్బంధః.

ధ్యానమ్,

కాలాంభోధరకాంతికాంత మనిశం వీరసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని,
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

## అథ మానసికపూజా.

లంపృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే గంధం సమర్ప యామి-హం ఆకాశాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే పుష్పం సమర్పయామి-యం వాయ్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే దీపం దర్శయామి - వం అమృతాత్మనే శ్రీరామ చంద్రపరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి-సం సర్వా త్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే సర్వోపచారపూజాస్సమర్ప యామి - ఇతిమానసికపూజా.

## మూలమంత్రః.

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషేచాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్,

ఇతి, యథాశక్తి జపిత్వా, శ్రీరామాయణపారాయణంకు ర్యాత్. అనంతరం, పునః, ధ్యానం, మానసికపూజాం, హృద యాదిన్యాసం చ కుర్యాత్ - లోకత్రయేణ దిగ్విమోకః.

గుహ్యాతిగుహ్యగోప్తాత్వం గృహాణాస్మత్కృతం జపమ్,
సిద్ధి ర్భవతు మే దేవ త్వత్ప్రసాదా ద్రఘూద్వహ.
ఇతి పారాయణం శ్రీరామచంద్రాయ సమర్పయేత్.

శ్రీరామచంద్రార్పణమస్తు.

## దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః.

---

## వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వ న్రామకథానాదం కో నయాతి పరాం గతిమ్.

---

## ఆంజనేయ ప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

---

# శ్రీరామాయణ ప్రశంసా.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్సాక్షా ద్రామాయణాత్మనా.
శ్రీమద్బ్రహ్మాత దేవబీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాండై స్సప్తభి రన్వితో౽తివితతో ఋష్యాలవాలోదితః,
పత్రై స్తత్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః పంచభిః
స్వాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణస్య స్తరుః.
యశ్శకర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్విష్ణోః పదం శాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా,
శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయమ్.

—·—

శ్రీ ర స్తు.

# శ్రీమద్రామాయణే, బాలకాండే

## ప్ర థ మ స్స ర్గః.

---

### మూలమ్.

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. ౧

కోన్వస్మింత్సాంప్రతం లోకే గుణవాన్కశ్చ వీర్యవాన్,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః? ౨

చారిత్రేణ చ కో యుక్త స్సర్వభూతేషు కో హితః,
విద్వా న్కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః? ౩

ఆత్మవాన్కో జితక్రోధో ద్యుతిమాన్కోఽనసూయకః,
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే? ౪

ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే,
మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవంవిధం నరం. ౫

శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము, బాలకాండము

## ప్రథమసర్గము

---

(తాత్పర్యము)

వాల్మీకిమహాముని, తపోవిశేషముచేత నిష్కల్మషుఁడై, వేదాంత పరమార్థము దెలిసికొనఁగోరి, మహాశ్రోత్రియుఁడును, బ్రహ్మనిష్ఠాగ్రగణ్యుఁడు నగు నారదమహామునిని భక్తితో నిట్లని యడిగెను. ౧

ఇమ్మహీతలమ్మున శ్లాఘ్యగుణములు గలవాఁడును, పరాక్రమవంతుఁడును, ధర్మమెఱిఁగినవాఁడును, ఉపకారము మరవనివాఁడును, సత్యవాదియు, అచలసంకల్పుండు నెవ్వఁడు? ౨

పరంపరాగత మగుసదాచారసంపత్తితోఁ గూడియుండువాఁడును, సమస్తభూతములయెడఁ బ్రేమఁ బాటించువాఁడును, విద్వాంసుండును, నేరుపరియు, అభినవవిలసనంబుల దర్శనీయుండను ఎవ్వఁడు? 3

ధైర్యశాలియు, వశీకృతామర్షుండును, మనోహరకాంతిమంతుండును, అసూయారహితుండును, కోపము గలుగుచుండఁగ దేవతలనైన రణంబున భయంపడఁజేయువాఁడును ఎవ్వఁడు.? ౪

మహర్షీ! నాకు ఏవంవిధగుణగణవిశిష్టమహామానుషరూపవస్తువును విన మిక్కిలి యాశయగుచున్నది కదా. నీవు ఈలాటి నరు నెఱుంగ నేర్పరివి. ౫

శ్రుత్వా చైతత్త్రిలోకజ్ఞో వాల్మీకి ర్నారదో వచః,
శ్రూయతామితి చా మంత్ర్య ప్రహృష్టో వాక్య మబ్రవీత్

బహవో దుర్లభాశ్చైవ యేత్వయా కీర్తితాగుణాః,
మునేవక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తశ్శ్రూయతాన్నరః.

ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైశ్శ్రుతః,
నియతాత్మామహావీర్యో ద్యుతిమా న్ధృతిమా న్వశీ. ౮

బుద్ధిమా న్నీతిమా న్వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః,
విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః. ౯

మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః,
ఆజానుబాహు స్సుశిరా స్సులలాట స్సువిక్రమః. ౧౦

సమ స్సమవిభక్తాంగ స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః. ౧౧

లోకమున నన్నింటిని ఎఱింగియున్న నారదమహర్షి, వాల్మీకిమహా మునియొక్క ప్రశ్నమును విని, 'ఇదిగో! వినవలసినది' అని వారి నభిముఖీకరించుకొని, 'ఈవాల్మీకి, సమస్తగుణసంపన్నుఁడైన మనుష్యునిఁ దెలిసికొనఁ గోరెను. ఈగుణములు సార్వభౌమసామాన్యునియందు దొరకొనవు. సమస్త జగద్రక్షణార్థము మనుష్యరూపముతో నవతరించిన సాక్షాన్నారాయణమూర్తియొకఁడే యిట్టి గుణములు కలిగినవాఁడు కావున, భగవద్గుణకీర్తనముఖుఁడితఁడని సంతోషించి, ఇట్లని ప్రత్యుత్తరమును జెప్పెను. ౬

ఓ వాల్మీకిమహామునీ! నీవడిగినగుణములు అనంతములు. సాధారణులయందు దొరకొనవు. అట్టిగుణములతోఁ గూడినమహాపురుషుని నిశ్చయించిచెప్పెదను, సావధానముగా వినుము. ౭

ఇక్ష్వాకుమహారాజవంశమునఁ బుట్టినరామచంద్రుఁడుగదా లోకులచేత నారాయణాపరావతారమూర్తియని నిర్ణయింపఁబడినవాఁడు. నిశ్చితమగు స్వభావముగలవాఁడు. కొలదికిమించుశక్తికలవాఁడు. ప్రశస్తమగుప్రకాశముకలవాఁడు. ధైర్యశాలి. ఇంద్రియజేత. ౮

మఱియు, ప్రశస్తమతిమంతుఁడు. ప్రసిద్ధనీతిమంతుఁడు. వక్త. అఖండైశ్వర్యశాలి. శత్రునిషూదనుఁడు. ఉన్నతస్కంధుఁడు. మహాబాహువు. శంఖముబోలుకంఠము గలవాఁడు. గొప్పవియగు చెక్కిళ్ల పైభాగములు గలవాఁడు. ౯

మఱియు, వెడందఱొమ్ముగలవాఁడు. గొప్పవిల్లుకలవాఁడు. కన్పడని మూపులసంధియెముకలుగలవాఁడు. కామక్రోధాద్యరిషడ్వర్గంబులఁ బోకార్చువాఁడు. మోకాళ్లవఱకు దిగజాఱు నిడుదలగు భుజములుకలవాఁడు. మహారాజలక్షణలక్షిత మగుశిరంబుగలవాఁడు. మంచినడతగలవాఁడు. ౧౦

మఱియు, సమానుఁడు. న్యూనాధికములుగాక విభజింపఁబడిన కరచరణాద్యవయవములుగలవాఁడు. నును పైనవర్ణముకలవాఁడు. ప్రశస్తపరాక్రమవంతుఁడు. పీనోరస్కుఁడు. దీర్ఘము లగునేత్రములు కలవాఁడు. కాంతిమంతుఁడు. మంగళకరములగు లక్షణములు గలవాఁడు. ౧౧

ధర్మజ్ఞస్సత్యసంధశ్చ ప్రజానాం చ హితే రతః,
యశస్వీ జ్ఞానసంపన్న శ్శుచి ర్వశ్య స్సమాధిమాన్. ౧౨

ప్రజాపతిసమ శ్శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా. ౧౩
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,
వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః. ౧౪
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ స్స్మృతిమా న్ప్రతిభానవాన్,
సర్వలోకప్రియ స్సాధు రదీనాత్మా విచక్షణః. ౧౫

సర్వదాభిగతస్సద్భి స్సముద్ర ఇవ సింధుభిః,
ఆర్యస్సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః. ౧౬

స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః,
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ. ౧౭

విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః,
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః. ౧౮

ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః,

తమేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్, ౧౯
జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథస్సుతమ్,
ప్రకృతీనాం హితైర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా. ౨౦
యౌవరాజ్యేన సంయోక్తు మైచ్ఛత్ప్రీత్యా మహీపతిః,

మఱియు, ఆర్తత్రాణాదిధర్మముల నెఱింగినవాఁడు. జనులకు సేమము చేయుటయందే ఆసక్తిగలవాఁడు. కీర్తిమంతుఁడు. జ్ఞాని. శుద్ధుఁడు. ఆశ్రితపరతంత్రుఁడు. ఆశ్రితావన చింతనుఁడు. ౧౨

మఱియు, బ్రహ్మసముఁడు. సర్వాతిశాయి. పోషకుఁడు. శత్రువుల నిరసించువాఁడు. రక్షకుఁడు. ధర్మముల విశేషించి రక్షించువాఁడు. ౧౩

మఱియు, స్వధర్మపరిపాలకుండు. స్వజనరక్షకుఁడు. వేద వేదాంగాదిసిద్ధాంతము నెఱింగినవాఁడు. ధనుర్వేదంబునను సమర్థుఁడు. ౧౪

మఱియు,సమస్తశాస్త్రాభిప్రాయ సిద్ధాంతజ్ఞుఁడు. మేధావంతుఁడు. ప్రతిభావంతుఁడు. సర్వజనహితుఁడు. ప్రత్యుపకారి. కలఁగని మనము గలవాఁడు. చక్కఁగ మాటలాడువాఁడు. ౧౫

మఱియు, సతతము, సముద్రము నదులచేతఁ బలె సత్పురుషులచేతఁ బొందఁబడినవాఁడు. పూజ్యుఁడు. అంతట సమానబుద్ధిగలవాఁడు. ఎల్లప్పుడుఁ జూడఁదగినవాఁడు. ౧౬

ఆ శ్రీరాముఁడే సమ సకల్యాణగుణపరిపూర్ణుఁడు. పుత్రుఁడై కౌసల్యకు ఆనందము వృద్ధిపఱచువాఁడు. గాంభీర్యమున సముద్రమువంటివాఁడు. స్థైర్యమున హిమవంతునిఁ బోలినవాఁడు. ౧౭

పరాక్రమమున విష్ణువుతో సమానుఁడు. చంద్రుఁడువలెఁ జూడఁదగువాఁడు. క్రోధముగలుగుచుండఁగా ప్రలయకాలాగ్నిఁ బోలినవాఁడు. ఓర్పున భూమితో సమానుఁడు. ౧౮

దానమందు కుబేరుఁ బోలినవాఁడు. సత్యమున ధర్మదేవతవలె నున్నవాఁడు. ౧౮½

దశరథమహారాజు, ఈలాటిగుణములుకలవాఁడు, అమోఘవిక్రమవంతుఁడు, కుమారులలోఁ బెద్దవాఁడు, గుణగరిష్ఠుఁడు, ప్రియుఁడు సర్వజనప్రియకారి యగురాముని ప్రజలకు ప్రీతిచేయవలయుననుకోరికచే ప్రేమతో యువరాజును జేయ నిచ్ఛగించెను. ౧౯-౨౦½

తస్యాభిషేకసంభారాన్దృష్ట్వా భార్యాథ కైకయీ. ౨౧
పూర్వన్దత్తవరా దేవీ వరమేన మయాచత,
వివాసనం చ రామస్య భరతస్యాభిషేచనమ్. ౨౨
స సత్యవచనాచ్చైవ ధర్మపాశేన సంయతః,
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్. ౨౩

స జగామ వనం వీరః ప్రతిజ్ఞా మనుపాలయన్,
పితుర్వచననిర్దేశా త్కైకేయ్యాః ప్రియకారణాత్. ౨౪

తం వ్రజంతం ప్రియో భ్రాతా లక్ష్మణోఽనుజగామహ,
స్నేహా ద్వినయసంపన్న స్సుమిత్రానందవర్ధనః. ౨౫
భ్రాతరం దయితో భ్రాతు స్సౌభ్రాత్రమనుదర్శయన్,

రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా. ౨౬
జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా,
సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః. ౨౭
సీతాప్యనుగతా రామం శశినం రోహిణీ యథా,
పౌరైరనుగతో దూరం పిత్రా దశరథేన చ. ౨౮

ఇట్టిసమయంబున ప్రియయగు కైకయి యువరాజ్యాభిషేకోపక రణములఁ జూచి, తొలుత వరము దీసికొన్నది గనుకనే శ్రీరామవన ప్రవాసమును, భరతరాజ్యాభిషేకమును వరముగా నడిగెను. ౨౧, ౨౨

సమస్తజనులను సంతోషింపఁ జేయుచుండు నాదశరథమహారాజు సత్యవాక్యుఁడు కావున, పూర్వము తాను కైక కిచ్చినవరద్వయమునం జేసి, ధర్మమునతిక్రమింపలేక, తనకుఁ బ్రియపుత్త్రుఁడైనను, రాముని, వనమునకుఁ బంపెను. ౨౩

ఆరాముఁడు, అతిపరాక్రమశాలియైనను, కైకేయికి సంతోషము గలిగించుటకై, తండ్రిగారు మాటమాత్రము చెప్పినంతనే, తాను 'తద్బ్రూహి వచనందేవి రాజ్ఞోయదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానేచరామోద్విర్నాభిభాషతే' (తల్లీ! రాజుగారికేదియిష్టమో, ఆమాటను జెప్పుము. దానిఁజేసెదను. ఆప్రకారము ప్రతిజ్ఞచేయుచున్నాను. రాముఁడు రెండువిధములుగ మాటలాడువాఁడుకాఁడు) అని కైకేయీసమ్ముఖమునఁ జేసినప్రతినను బాలింపుచు, వనముఁగూర్చి వెళ్లెను. ౨౪

ఆరాముఁ డరణ్యమునకు వెళ్లుచుండఁగా నతని కిష్టుఁడును, అనుజుఁడు నగుసుమిత్త్రాపుత్త్రుఁడైన లక్ష్మణుఁడు, రామునియందు సహజప్రీతి గలవాఁడుకావున, నతనికిఁ గైంకర్యముసేయుఁగోరి మంచి తోడఁబుట్టుఁదనమును జనులకుఁ దెలియఁజేయుచు, భక్తితో వెంబడించెను. ౨౫

రామునకుఁ బ్రియభార్యయుఁ బ్రాణసమానురాలును, ఎల్లప్పుడు హితకారిణియు నై, జనకకులమందుఁబుట్టి తిలోత్తమవలెసర్వోత్తరసౌందర్యశాలినియై, సర్వలక్షణములును గలిగి యుత్తమవనితయై వెలింగెడు సీతాదేవియును, చంద్రునిరోహిణి వెంబడించునట్లు, రాముని వెంబడించెను. ౨౬, ౨౭

'పునర్విశ్లేషభీరుత్వం పరమాభక్తిరుచ్యతే' (మఱల వియోగమునందు భయము గలుగుట 'పరమాభక్తి' యని చెప్పఁబడుచున్నది.) అన్నట్టు పరమభక్తివలన, బాలవృద్ధావిశేషముగ, సమస్తపౌరులును, దశరథుఁడును దూరమువఱకు రాముని వెంబడించిరి. ౨౮

శృంగిబేరపురే సూతం గంగాకూలే వ్యసర్జయత్,
గుహమాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియం. ౨౯
గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా,

తే వనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః. ౩౦
చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్,
రమ్యమావసథం కృత్వా రమమాణా వనే త్రయః. ౩౧
దేవగంధర్వసంకాశా స్తత్ర తే న్యవసన్సుఖమ్,

చిత్రకూటం గతే రామే పుత్రశోకాతుర స్తథా. ౩౨

రాజా దశరథ స్స్వర్గం జగామ విలపన్ సుతమ్,
మృతే తు తస్మిన్ భరతో వసిష్ఠప్రముఖై ర్ద్విజైః. ౩౩
నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛ ద్రాజ్యం మహాబలః
స జగామ వనం వీరో రామపాద ప్రసాదకః. ౩౪

గత్వాతు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
అయాచద్భ్రాతరం రామమార్యభావపురస్కృతః. ౩౫

త్వమేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్,

రామోఽపి పరమోదారస్సుముఖ స్సుమహాయశాః. ౩౬
న చైచ్ఛత్పితురాదేశాద్రాజ్యం రామో మహాబలః,

ధర్మాత్ముఁడైనరాముఁడు గంగాతీరమందున్న శృంగిబేరమనెడు పట్టణమందు, బోయవాండ్రకుఁ బ్రభువగు గుహునిఁ జేరి, తనసారథియగు సుమంత్రుని నయోధ్యకుఁ బంపెను. ఆగుహుఁడు,రాముని, సీతాలక్ష్మణులతోఁ గూడఁ గంగానదిని దాఁటించెను.

ఆ సీతారామలక్ష్మణులు, ఒకవనమునుండి మఱియొక వనముఁ జేరుచు, గొప్పగొప్పనదులఁ దాఁటుచు, భరద్వాజమహామునిని సందర్శించి, వారి యాజ్ఞచేఁ జిత్రకూటపర్వతమునకుఁ బోయి యందొక పర్ణశాల నిర్మించికొని యయోధ్యలో సమస్తసుఖముల ననుభవించినవారైనను, వారుముగ్గురు, నా చిత్రకూటవనములో, దేవగంధర్వసమానులై, యెంతమాత్రమును దుఃఖము లేక సుఖముగాఁ గ్రీడింపుచుండిరి. 30, 31౹

రాముఁడు చిత్రకూటమునకు వెళ్ళినవెనుక, దశరథమహారాజు, పుత్రశోకముచేఁ బీడితుఁడై, పుత్రునిఁగూర్చి యేడ్చుచు మృతిఁబొందెను.

దశరథుఁడు మృతిబొందినవెనుక, భరతుఁడు, రాజ్యముసేయ సమర్థుఁడైనను,వసిష్ఠాదులుగూడఁ దన్ను రాజ్యముసేయుమని నియోగించినను, రాముని యందలి గౌరవముచే రాజ్యమున కొప్పలేదు. 33౹

రాగద్వేషాదులను జయించిన యాభరతుఁడు రామునిప్రసాదమును గోరి యరణ్యమునకు వెళ్ళెను. 38

ఆభరతుఁడు, వినయముతోఁ గూడుకొనినవాఁడై, పూజ్యంబగు హృదయమును ఎడతెగని సత్యవ్రతమునుగల తనభ్రాతయగు రామునిఁజేరి, యిట్లని ప్రార్థించెను. 39

'నీవు సమస్తధర్మముల నెఱిఁగినవాఁడవు. జ్యేష్ఠుఁ డుండఁగాఁ గనిష్ఠుఁడు రాజుగాఁగూడదను ధర్మము నీకుం దెలిసియేయున్నది. కాఁబట్టి నీవేరాజు, నీవుతప్ప మఱి యెవ్వరును, రాజు కాఁదగరు' అని భరతుఁడు రామునితోఁ జెప్పెను. 39౹

రాముఁడు, తాను, సమస్తజనులకు సంతోషమునే గలిగించువాఁడైనను, తనయొక్క సామ్రాజ్యము మొదలగు సమస్తాభీష్టముల నాశ్రితుల

పాదుకేచాస్య రాజ్యాయ న్యాసం దత్వా పునఃపునః. ౩౮
నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః,

సకామ మనవాప్యైవ రామపాదావుపస్పృశన్. ౩౯
నందిగ్రామేఽకరో ద్రాజ్యం రామాగమనకాంక్షయా,

గతేతు భరతే శ్రీమాన్ సత్యసంధో జితేంద్రియః. ౩౯
రామస్తు పునరాలక్ష్య నాగరస్య జనస్య చ,
తత్రాగమన మేకాగ్రో దండకాన్ప్రవివేశ హ. ౪౦

కిచ్చువాఁడైనను, 'యాచితో మోదమాదత్తేవాంఛితాదధికప్రదః, అనుసృత్య ప్రియం బ్రూతే తస్మాత్కర్ణోఽధికోఽర్జున' (యాచింపఁబడినవాఁడై సంతోషమునొందుచు, కోరినదానికన్న నెచ్చుగానిచ్చును. అనుసరించి ప్రియముగా మాటలాడును. కాఁబట్టి ఓయర్జునుఁడా! కర్ణుండధికుఁడు.) అని భారతమునం దున్నట్టు యాచనమాత్రముననే 'యాచకులమనోరథమును బూర్ణముచేయు నంతభాగ్యము నాకుఁగలిగెనుగదా!" అనిసంతోషమునొందువాఁడైనను, 'సర్వార్థినః కార్యవశాదుపేతాః కకుత్స్థవంశే విముఖాః ప్రయాంతి' (కకుత్స్థవంశము నందుఁ గార్యార్థమైవచ్చిన యాచకులు, విముఖులై పోవనుగదా.) అని విష్ణుపురాణమునందున్నట్లు, పురాణప్రసిద్ధమైన దానజనితమగు కీర్తిగలవాఁడైనను' ఆశ్రితాభీష్టముల నెఱవేర్చుటకు సమర్థుఁడైనను, భరతుఁ డెంత ప్రార్థించినను దండ్రి పనుపునం జేసి, రాజ్యమును గోరలేదు. ౩౭

అయితే, రాముఁడు, రాజ్యము నేలుటకుఁగాఁ దన పాదుకలను భరతునకుఁ దాను వచ్చునంతవఱకును దనకుఁ బ్రతినిధిగా నుంచికొనుమని యిచ్చి, అటువెనుక నతని నయోధ్యకుఁ బొమ్మని నానావిధములుగా బోధించి పంపెను. ౩౮

ఆభరతుఁడు. రామకైంకర్యము సేయవలెనను తనమనోరథమును బొందకయే వెళ్లి, రామపాదుకలను సేవింపుచు, రాముఁడులేని యయోధ్యలో నుండరోసి, నందిగ్రామమందు, రామాగమనమును గోరుచు రాజ్యముచేసెను.

భరతుఁడు వెళ్లఁగానే, రాముఁడు, భరతుఁడు వచ్చినపుడు తనకుఁ గలిగిన ప్రతిజ్ఞాభంగభయము పోవుటచే సుధ్వాతిశాయియగు కాంతిగలిగినవాఁడై ప్రియానుజుఁడగు భరతుఁ డెంత నిర్బంధించినను గొంచెమైనఁ దనస్థిరమైన ప్రతినను జలింపనీయక, కౌసల్య, భరతుఁడు, వీరు చేసిన ప్రార్థనలు, రాజ్యాంగీకారమం దవకాశమునకు వ్యాజముగానుండినను, రాజ్యభోగములం దెంతమాత్రమును జాపలమునొందక, యీ చిత్రకూటపర్వతమునందుఁ దానుండుట యందఱకును దెలిసియున్నందున, అయోధ్యలోనుండు జనులుగాని, భరతుఁడుగాని మఱల వచ్చుటకిఁ వత్తురని యూహించి, పిత్రాజ్ఞాపరిపాలనమందు సావధానుఁడై దండకావనమును బ్రవేశించెను. ౩౯, ౪౦

ప్రవిశ్యతు మహారణ్యం రామో రాజీవలోచనః,
విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శహ. ౪౧
సుతీక్ష్ణం చాప్యగస్త్యంచ అగస్త్యభ్రాతరం తథా,

అగస్త్యవచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనమ్. ౪౨
ఖడ్గంచ పరమప్రీత స్తూణీచాక్షయసాయకౌ,

వసతస్తస్య రామస్య వనే వనచరైస్సహ. ౪౩
ఋషయోఽభ్యాగమ న్సర్వే వధాయాసురరక్షసామ్,

స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథా వనే. ౪౪

ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధస్సంయతి రక్షసామ్,
ఋషీణా మగ్నికల్పానాం దండకారణ్యవాసినామ్. ౪౫

తేన తత్రైవ వసతా జనస్థాననివాసినీ,
విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ. ౪౬

తతశ్శూర్పణఖావాక్యాదుద్యుక్తాన్సర్వరాక్షసాన్,
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్. ౪౭
నిజఘాన రణే రామ స్తేషాం చైవ పదానుగాన్,
వనే తస్మి న్నివసతా జనస్థాననివాసినామ్. ౪౮
రక్షసా న్నిహతా న్యాస న్సహస్రాణి చతుర్దశ,

కమలములవంటి నేత్రములుగల రాముఁడు దండకారణ్యమును, ప్రవేశించుచునే, విరాధుఁడను రాక్షసునిఁ జంపి, శరభంగులవారిని, సుతీక్ష్ణ మహామునిని, అగస్త్యమహర్షిని, అగస్త్యభ్రాతయగు సుదర్శనమహామునిని చూచెను. ౪౧½

అగస్త్యుఁడు తన కింద్రునిచే నివ్వఁడిన, విల్లు, కత్తి, యుద్ధములో నెంత ప్రయోగించినను దగ్గనిబాణములుగలయమ్ములపొదులు రెండు, వీటిని బుచ్చుకొనుమని చెప్పఁగా, రాముఁడు తనపరాక్రమమునకుఁ దగినయాయుధములు దొరకొనినందుకు సంతసించినవాఁడై, వానిఁబుచ్చుకొనెను. ౪౨½

ఆశరభంగమహామునియొక్క తపోవనమునందు రాముఁడు వాసము సేయుచుండఁగాఁ, జుట్టుప్రక్కలనుండు సమస్తఋషులును, అసురులను రాక్షసులను వధింపుమని ప్రార్థించుటకొఱకు, రామునిసమీపమునకు వచ్చిరి.

ఆ రాముఁడు రాక్షసనివాసభూతమైన దండకారణ్యమందు ఋషులు తన్నుఁ బ్రార్థించినట్లు అంగీకరించెను. ౪౪

అగ్నిహోత్రమువలెఁ బరిశుద్ధస్వభావులై దండకారణ్యమందు వాసముచేయుచుండు ఋషులకొఱకు, 'యుద్ధమునందు రాక్షసులఁ దప్పక వధించెద' నని రాముఁడు ప్రతిజ్ఞచేసెను. ౪౫

రాముఁడాదండకారణ్యములోనే వాసము చేయుచు, నాదండకారణ్యములో రావణునిసేనానివేశస్థానమగు జనస్థానమందు వాసముచేయుచుఁ గామరూపిణియై యున్న శూర్పణఖయను రక్కసిని, ముక్కుఁ జెవులుఁగోసివిరూపిణిగాఁ జేసెను. ౪౬

శూర్పణఖ విరూపితయైన పిమ్మట. ఆ శూర్పణఖయొక్క మాట విని యుద్ధమునకువచ్చిన, ఖరుని, త్రిశిరుని, దూషణుని, వారిసైన్యములును, నిశ్శేషముగా, రాముఁడు యుద్ధమునందుఁ జంపెను. ౪౭

రాముఁడు, తా నాదండకారణ్యములో నుండఁగా, జనస్థానమునందు వాసముసేయువారలలోఁ, బదునాలుగువేలరాక్షసులను జంపెను. ౪౮½

తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః. ౪౯
సహాయం వరయామాస మారీచన్నామ రాక్షసమ్,

వార్యమాణ స్సుబహుశో మారీచేన సరావణః. ౫౦
న విరోధో బలవతా క్షమో రావణ తేన తే,

అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః. ౫౧
జగామ సహమారీచ స్తస్యాశ్రమపదం తదా,

తేన మాయావినా దూర మపవాహ్య నృపాత్మజౌ ౫౨
జహార భార్యాం రామస్య గృధ్రం హత్వాజటాయుషమ్,

గృధ్రంచ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వాచ మైథిలీమ్. ౫3
రాఘవ శ్శోకసంతప్తో విలలాపాకులేంద్రియః,

తత స్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్. ౫౪
మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శహ,
కబంధన్నామరూపేణ వికృతం ఘోరదర్శనమ్. ౫౫

తన్నిహత్య మహాబాహు ర్దదాహ స్వర్గతశ్చ సః,

రామునిచే ఖరాదులు చచ్చినవెనుక, రావణుఁడు, తనదాయాదులగు ఖరాదులమరణమునువిని, చాలఁగోపముగలవాఁడై, సీతనపహరించుటయందుఁ దనకుఁ దోడుగానుండుటకు, మారీచుఁడను రాక్షసునిఁ గోరెను.

ఆమారీచుఁడు 'ఓరావణా! మహాబలవంతులైన ఖరుఁడు మొదలగుపదునాలుగువేల రాక్షసులను జంపినట్టి బలవంతుఁడైన యారామునితోఁ బగ నీకుఁ దగదు. సీతను అపహరింపవలదు' అని పలుమాఱు రావణు నడ్డగించెను. ౫౦౪

రావణుఁడు, తనకు మృత్యువు సమీపములో నున్నందున, నా మారీచునిమాట నెంతమాత్ర మొప్పుకొనక, ఆమారీచుని వెంటఁబెట్టుకొని, యప్పుడు రాముని యాశ్రమమునకు వెళ్లెను. ౫౧౪

మాయకాఁడైన మారీచుడు దనమాయచే రామలక్ష్మణులను దూరముగొనిపోవఁగా, నారావణుఁడు రామునిభార్యయగు సీతాదేవినపహరించి యాసీతాదేవిని విడిపించుటకై యుద్ధమునకు వచ్చిన జటాయువును జంపెను.'

రాముఁడు, చచ్చుటకు సిద్ధమై పడియున్న జటాయువునుజూచి, ఆజటాయువువలన రావణుఁడు సీతాదేవినపహరించిన సంగతిని విని, మిక్కిలి దుఃఖితుఁడై, ఇంద్రియములను వశములోనుంచలేక యేడ్వసాగెను. ౫౩౪

అంత, రాముఁడు, ఆదుఃఖముతోనే, జటాయువు గద్దయైనను, దనతండ్రిగారికి మిత్రుఁడై తనకార్యమునకుగా యుద్ధముచేసి చచ్చినందున, నాజటాయువునకు, దహనసంస్కారముచేసి, అరణ్యమందు, సీతాదేవిని వెదకుచు, వికృతరూపుఁడై చూపరులకు భయముఁ బుట్టించునట్టి కబంధుఁడను రాక్షసునిఁ జూచెను. ౫౮, ౫౫

బలిష్ఠములైన బాహువులుగలయారాముఁడు కబంధునిఁ జంపి వానిని దహనక్రియతో సంస్కరించెను. ఆకబంధుఁడును, రామునిచే దహనసంస్కారమును బొంది స్వర్గమునకు వెళ్లెను. ౫౫౪

సచాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్ ౫౬
శ్రమణీం ధర్మనిపుణామభిగచ్ఛేతి రాఘవ,

సోఽభ్యగచ్ఛన్మహాతేజా శ్శబరీం శత్రుసూదనః. ౫౭

శబర్యా పూజిత స్సమ్య గ్రామో దశరథాత్మజః,

పంపాతీరే హనుమతా సంగతో వానరేణహ. ౫౮

హనుమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః,

సుగ్రీవాయచ తత్సర్వం శంసద్రామో మహాబలః. ౫౯
ఆదిత స్తద్యథా వృత్తం సీతాయాశ్చ విశేషతః,

సుగ్రీవశ్చాపి తత్సర్వం శ్రుత్వా రామస్య వానరః. ౬౦
చకార సఖ్యం రామేణ ప్రీతశ్చైవాగ్నిసాక్షికం,

తతో వానరరాజేన వైరానుకథనం ప్రతి. ౬౧
రామాయావేదితం సర్వం ప్రణయాద్దుఃఖితేన చ,

ఆ కబంధుఁడు, స్వర్గమునకుఁ బోవుచు, 'ఓ రామuఁడా ! ధర్మసూక్ష్మముల నెఱింగి, సమస్తధర్మములనాచరించుచు, సన్న్యాసాశ్రమము నవలంబించియున్న, యొక శబరజాతిస్త్రీ యున్నది. నీవాబిడ్డవద్దకుఁబొమ్ము. నిన్నుఁ జాల సత్కరించును.' అని రామునకుఁ జెప్పెను. ౫౬౪

ఆ రాముఁడు, తాను మహాతేజుండును, సమస్తశత్రువుల బాధించువాఁడు నైనను, భక్తపరాధీనుఁడు గావున, నది నీచజాతిలోఁ బుట్టిన దైనను, ఆ శబరస్త్రీ వద్దకుఁ బోయెను. ౫౭

ఆ శబరస్త్రీ, యాతిథ్యాదిపూజలచే దశరథపుత్రుఁ డగు రాముని జక్కఁగా సత్కరించెను. ౫౭౪

రాముఁడు, విరహిజనులకుఁ జాలబాధ గలిగించునట్టి పంపాతీరమందుఁ జరింపుచు, లోకప్రసిద్ధమైన పరాక్రమముగల హనుమంతుఁ డను వానరునితోఁ జేరెను. సంతోషము! ౫౮

రామునకు, హనుమంతుని స్నేహమువలన, సుగ్రీవునితోఁ గూడ, స్నేహము సమకూరెను. ౫౮౪

మహాబలుఁడైన రాముఁడు జన్మము మొదలు, తనవృత్తాంతమంతయును సుగ్రీవునకును హనుమంతునకును జెప్పి, మఱి విశేషముగా సీతావృత్తాంతమును నడచినది నడచినట్లు వారలకుఁ దెలియఁజేసెను. ౫౯౪

సుగ్రీవుఁడు రామవృత్తాంతమంతయును విని, తనవలెనే దుఃఖితుఁడైన మహాబలునితోడ మైత్రి గలిగినదని సంతోషించి, యగ్నిహోత్రుని సాక్షిగా నుంచికొని మునితో మైత్రి గావించెను. ౬౦౪

అంతట, పరమస్నేహితుఁడైన రాముఁడు సమీపమందుండుటచే, దుఃఖము పైటికుబ్బఁగాఁ దల్లడిల్లుచున్న సుగ్రీవునిఁ జూచి, యా రాముఁడు 'నీకును వాలికిని విరోధ మెట్లు కలిగె' నని యడిగెను. అందుకు సుగ్రీవుఁడు, స్నేహమువలన, రహస్యములనుసగా దాఁపక, సమాచారమంతయుం, రామునకుఁ జక్కఁగాఁ దెలియఁజెప్పెను. ౬౧౪

ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి. ౬౨
వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః,

సుగ్రీవ శ్శంకితశ్చాసీ న్నిత్యం వీర్యేణ రాఘవే. ౬౩

రాఘవప్రత్యయార్థంతు దుందుభేః కాయముత్తమమ్,
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్. ౬౪

ఉత్ స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్యచాస్థి మహాబలః,
పాదాంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశయోజనమ్. ౬౫

బిభేదచ పున స్సాలాన్ సప్తైకేన మహేషుణా,
గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయంతదా. ౬౬

తతః ప్రీతమనాశ్చైవ విశ్వస్త స్సమహాకపిః,
కిష్కింధాం రామసహితో జగామచ గుహాం తదా. ౬౭

తనకును వాలికిని విరోధము గలిగినరీతిని సుగ్రీవుఁడు చెప్పిన వెనుక, రాముఁడు, 'వాలిని దప్పక చంపెద' నని ప్రతిజ్ఞచేసెను. ౬౧

ఆఋశ్యమూకమందు, సుగ్రీవుఁడు, అరుణోదయము మొదలు సూర్యోదయములోపల నాలుగుసముద్రములయందును అర్ఘ్యములు విడుచుట మొదలగు వాలియొక్క బలమునంతయుఁ రామునకుఁ జెప్పెను. ౬౨

సుగ్రీవుఁడు, రామునిఁ జూచినది మొదలుకొని, 'యితఁడువాలిని జంప సమర్థుఁడో' యని సందేహించుచుండెను. ౬౩

సుగ్రీవుఁడు, రామునియందుఁ దనకు నమ్మకము గలుగుటకై, పూర్వము వాలిచే దూరముగా విసరివైవఁబడి కొండవలెనున్న దుందుభి యను రాక్షసుని కళేబరమును, రామునకుఁ జూపెను. ౬౪

లెక్కింపరాని బలముగలవాఁడును, ఆబలమునకుఁ దగినట్లుకార్యము సేయ సమర్థములైన బాహువులు గలవాఁడు నగు రాముఁడు, అస్థిమయమైన యాదుందుభికళేబరమును జూచి, 'ఇది యెంతమాత్రము' అని నవ్వి, కొంచెమైనను దక్కువలేకుండఁ బదియోజనముల దూరములోఁబడునట్లు, దానిఁ, దన పాదాంగుష్ఠముతో నెత్తి చిమ్మెను. ౬౫

అప్పు డారాముఁడు, దుందుభికళేబరమును జిమ్ముటచేత సుగ్రీవునకుఁ దనయందు నమ్మకము గలుగకపోవుటనుజూచి యతనికిఁదనయందునమ్మకమును బుట్టించుటకై, ఏడుమద్దిచెట్లను, ఆసమీపమందుండు కొండను, అధోలోకములలో నాఱవదియగు రసాతలలోకమును, ఒకబాణముచే భేదించెను.

సప్తసాలములను, సమీపపర్వతమును, రసాతలలోకమును, నొక బాణముచే భేదించిన వెనుక, సుగ్రీవుఁడు, రాముఁడు వాలిని జంపఁగలఁడని నమ్మినవాఁడై, తనకు శీఘ్రముగా రాజ్యము ప్రాప్తమగునని సంతోషించి, రాముని వెంటఁబెట్టుకొని, తనకు, రామునితోడులేక, యెంతమాత్రమును, జొరుట కశక్యమైన, కిష్కింధాపట్టణమును బ్రవేశించెను. ౬౬

తతోఽగర్జ ద్ధరివరస్సుగ్రీవో హేమపింగళః,

తేన నాదేన మహాతా నిర్జగామ హరీశ్వరః. ౧౮

అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః,

నిజఘాన చ తత్రైవం శరేణైకేన రాఘవః. ౧౯

తతస్సుగ్రీవవచనాద్ధత్వా వాలిన మాహవే,
సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్. ౨౦

సచ సర్వాన్ సమానీయ వానరాన్ వానరర్షభః,
దిశః ప్రస్థాపయామాస దిదృక్షుర్జనకాత్మజామ్. ౨౧

తతో గృధ్రస్య వచనాత్సంపాతేర్హనుమాన్బలీ,
శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్. ౨౨

తత్ర లంకాం సమాసాద్య పురీం రావణపాలితామ్,
దదర్శ సీతాం ధ్యాయంతీ మశోకవనికాం గతామ్. ౨౩

కిష్కింధకు బ్రవేశించుచునే, రామసాహాయ్యమునం జేసి, సంతోషాతిశయమున, బంగారువంటి వన్నెగలిగి ప్రకాశించుచుఁ, దనకన్న నెచ్చైన వానరుఁడు లేఁడని తలంచి సింహనాదముచేసెను. ౬౭½

ఎప్పటికన్నను విలక్షణముగానుండు సుగ్రీవుని సింహనాదమును విని, వాలి, గృహమునుండి బయలువెడలి వచ్చెను. ౬౮

ఇంటినుంచి బయలు వెడలునప్పుడు, వాలి, 'సుగ్రీవునకు బలవంతుఁడగు రాముఁడు సహాయుఁడుగానున్నాఁడని మనయంగదునివలనఁ దెలియవచ్చుచున్నది, కాఁబట్టి నీవిప్పుడు యుద్ధమునకు, బోవలదు' అనియడ్డగించు తనభార్యయగు తారను, 'రాముఁడు పరమధార్మికుఁడు, కాఁబట్టి నన్నేమియుఁ జేయఁడు'అని యొప్పించి, సుగ్రీవునితో యుద్ధము సేయసాగెను. ౬౮½

అతిపూజ్యమగు రఘువంశమునందుఁ బుట్టుటచే సకలధర్మసూక్ష్మముల నెఱింగినరాముఁడు, యుద్ధభూమియందుఁ జాల వరబలముగలిగి సుగ్రీవునితో యుద్ధముసేయుచున్నవాలిని, ఒకబాణముతోనే చంపెను. ౬౯

రాముఁడు సుగ్రీవుని ప్రార్థనప్రకారము, సుగ్రీవునితో యుద్ధము సేయుచుండునపుడు, వాలినిజంపి, యావిమట, నావాలిరాజ్యమందు, సుగ్రీవునే పట్టాభిషిక్తుఁ జేసెను. ౭౦

వానరప్రభువైన యాసుగ్రీవుఁడును, రామునకుఁ బ్రత్యుపకరింపఁ దలంచినవాఁడై, సీతాదేవిని వెదకిచూచి వచ్చుటకుఁగా, సమస్తవానరులను రప్పించి నాలుగుదిక్కులకును బంపెను. ౭౧

సుగ్రీవుఁడు వానరుల నాలుగు దిక్కులకును బంపినపిమ్మట, బలవంతుఁడగు హనుమంతుఁడు, సంపాతియనెడు గద్ద బోధించిన ప్రకారము, నూఱుయోజనముల వెడల్పుగల యుప్పుసముద్రమును దాఁటెను. ౭౨

ఆహనుమంతుఁడు, సముద్రమును దాఁటి, రావణునిచేఁ బాలింపఁబడుచుండు, లంకాపురిఁ జేరి, యచ్చట, నశోకవనికయనెడు రావణుని యంతఃపురోద్యానమున నెప్పుడును రామునే స్మరించుచున్న సీతాదేవిని జూచెను. ౭౩

నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ,
సమాశ్వాస్య చ వైదేహీం మర్దయామాస తోరణమ్. ౭౪

పంచ సేనాగ్రగాన్ హత్వా సప్త మంత్రిసుతానపి,
శూరమక్షం చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్. ౭౫

అస్త్రేణోన్ముక్తమాత్మానం జ్ఞాత్వా పైతామహాద్వరాత్,
మర్షయన్రాక్షసాన్వీరో యంత్రిణస్తాన్ యదృచ్ఛయా. ౭౬
తతో దగ్ధ్వా పురీం లంకామృతే సీతాం చ మైథిలీమ్,
రామాయ ప్రియమాఖ్యాతుం పునరాయాన్మహాకపిః. ౭౭

సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్,
న్యవేదయదమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః. ౭౮

తతస్సుగ్రీవసహితో గత్వా తీరమ్మహోదధేః,
సముద్రం క్షోభయామాస శరైరాదిత్యసన్నిభైః. ౭౯

దర్శయామాస చాత్మానం సముద్రస్సరితాం పతిః,
సముద్రవచనాచ్చైవ నళం సేతుమకారయత్. ౮౦

ఆహనుమంతుఁడు, రాముఁడు తనచేతికిచ్చిన యంగుళీయకమును, సీతాదేవికి, గుఱుతుగా సమర్పించి, సుగ్రీవునకును రామునకును సఖ్యముగలిగి నది మొదలుగ వృత్తాంతమంతయును విన్నవించి, 'రాముఁడు శీఘ్రముగా వచ్చును దుఃఖింపకు' మని యామెను నూఱడించి, ఆయశోకవనబహిర్ద్వారమును చూర్ణముచేసెను. ౨౪

ఆహనుమంతుఁడు, సేనాపతులనైదుగురను, మంత్రిపుత్రుల నేడ్వురను జంపి శూరుఁడగు నక్షకుమారుని వధించి వానిశరీరమును ముద్దగాఁజేసి యింద్రజిత్తుచేఁ బ్రయుక్తమైన బ్రహ్మాస్త్రమునకుఁ గట్టుపడెను. ౨౫

సురాసురులకు సగా ప్రవేశింపఁగూడని లంకాపురిని బ్రవేశించి సీతం గాంచుటచేఁ బ్రసిద్ధమగు పరాక్రమముగలహనుమంతుఁడు, పూర్వము తనకు బ్రహ్మదేవుఁ డిచ్చినవరముయొక్క మహిమవలన, తన్ను బ్రహ్మాస్త్రబంధము వదలిపోవుట నెఱింగి, తన్నుఁ ద్రాటిచేఁగట్టి యీడ్చుకొనిపోవుచున్న రాక్షసులను వధించుటకు సమర్థుండైనను, రావణునిఁజూడఁగోరి, వారినిమన్నింపుచు, తానురావణునితో మాటలాడినవెనుక, సీతాదేవియుండు ప్రదేశమును విభీషణగృహమును మాత్రమువిడిచి, లంకాపురినంతయుఁగాల్చి, రామునకీసంతోషవార్తను జెప్పుటకై, మఱల రామునిసమీపమునకు వెళ్లెను. ౨౬, ౨౭

అతిబుద్ధిశాలియగు హనుమంతుఁడు, సీతావియోగము గలిగినను ఎంతమాత్రమును దగ్గని ధైర్యముగలరాముని వద్దకుఁబోయి, యాతనివలగొని 'చూడఁబడెను సీత' యని యథార్థముగా విన్నవించెను. ౨౮

హనుమంతుఁడు సీతావృత్తాంతమును జెప్పిన వెనుకనే, రాముఁడు సుగ్రీవునివెంటఁబెట్టుకొని సముద్రతీరముఁజేరి, సముద్రుఁడు తనకువశముగాకుండుటఁజూచి కోపించి, సూర్యునివలెఁ దీక్ష్ణములైనబాణములచే, సాసముద్రునిఁ గలఁతపడఁజేసెను. ౨౯

నదీనాయకుఁడగు సముద్రుఁడు, రామునికోపమునకు భయంపడి నిజరూపమును, రామునకుఁజూపెను. ఆరాముఁడును, సముద్రునిమాటప్రకారము, నళునిచే సేతువు కట్టించెను. ౩౦

తేన గత్వా పురీం లంకాం హత్వా రావణమాహవే,
రామస్సీతామనుప్రాప్య పరాం వ్రీడాముపాగమత్. ౮౧

తామువాచ తతో రామః పరుషం జనసంసది,

అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ. ౮౨

తతోఽగ్నివచనాత్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్,
బభౌ రామస్సంప్రహృష్టః పూజితస్సర్వదైవతైః. ౮౩

కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్,
సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః. ౮౪

అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్,
కృతకృత్యస్తదా రామో విజ్వరః ప్రముమోద హ. ౮౫

దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్,
అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః. ౮౬

రాముఁ డాసేతుమార్గమునచే లంకాపురిఁ జేరి, యుద్ధమునందు రావణుని వధించి, సీతాదేవిని బొంది యటువెనుక, 'పరగృహములోఁ జాలఁగాలము వసించినభార్య నెట్లు పరిగ్రహింతు' నని యధికముగా సిగ్గుపడెను. ౮౧

అందువలన రాముఁడు, మహాపాతివ్రత్యముతోఁ గూడి యున్న యాసీతాదేవితో, దేవతలు వానరులు రాక్షసులు వినుచుండఁ, గ్రూరముగా మాటలాడెను. ౮౧½

ఆసీతాదేవి, పతివ్రతగావున, రాముఁడు, తనయందు దోషము దలంచుటకు సహింప లేక, యగ్నిహోత్రముఁ జొచ్చెను. ౮౨

సీతాదేవి యగ్నిప్రవేశము చేసినవెనుక, రాముఁ డగ్నిహోత్రుని మాటను బట్టి, సీతాదేవిని కరణత్రయమందును ఎంతమాత్రము దోషగంధము లేనిదానిఁగా నెఱింగి, 'ప్రియురాలగుసీతాదేవి, పరిశుద్ధురాలై పరిగ్రహింపఁ దగియున్నదిగదా' యని సంతోషించి, సమస్తదేవతలచేతను బూజింపఁబడినవాఁడై ప్రకాశించెను. ౮౩

మహాధైర్యశాలియగు రాముఁడు, దుర్జయుండును లోకకంటకుఁడు నగురావణునిఁ జంపుటచే, జంగమస్థావరాత్మకము లైన మూఁడులోకములును, దేవతాఋషిసమూహసహితముగా సంతోషించినవి. ౮౪

రాముఁడు, తనప్రతిజ్ఞాప్రకారము, విభీషణుని లంకాపురిలో రాక్షసరాజుగా నభిషిక్తుని జేసి, కృతకృత్యుఁడై, తండ్రి, ఒకకొడుకు చనిపోయిన పిమ్మట మఱియొకకొడుకునకు, ఉత్సవకాలము వచ్చినప్పుడు సంతోషమునిండి యున్నను చనిపోయిన కొడుకును దలంచుకొని దుఃఖమునొందునట్లు, రాజ్యాభిషేకమును బొందకయే చని పోయినజటాయువునుదలంచుకొని దుఃఖించుచు సంతసించెను. ౮౫

రాముఁడు, రావణవధానంతరము విజయలక్ష్మీవిరాజమానుఁడైన తన్నుఁ జూడవచ్చిన దేవతలవలన వరముఁ బొంది, యావరముచే యుద్ధమునందుఁ జచ్చిన వానరులనందఱ బ్రతికించికొని, సుగ్రీవవిభీషణాదిస్నేహితులతోఁ గూడి పుష్పకవిమానారూఢుఁడై యయోధ్యనుగూర్చి పయనమైపోయెను. ౮౬

భరద్వాజాశ్రమం గత్వా రామస్సత్యపరాక్రమః,
భరతస్యాంతికం రామో హనూమంతం వ్యసర్జయత్. ౮౭

పునరాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః,
పుష్పకం తత్సమారుహ్య నందిగ్రామం యయౌ తదా. ౮౮
నందిగ్రామే జటాం హిత్వా భ్రాతృభిస్సహితోఽనఘః,
రామస్సీతామనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్. ౮౯

ప్రహృష్టముదితో లోకస్తుష్టః పుష్టస్సుధార్మికః,
నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః. ౯౦

న పుత్రమరణం కించిద్ద్రక్ష్యంతి పురుషాః క్వచిత్,
నార్యశ్చావిధవా నిత్యం భవిష్యంతి పతివ్రతాః. ౯౧
న చాగ్నిజం భయం కించిన్నాప్సు మజ్జంతి జంతవః,
న వాతజం భయం కించిన్నాపి జ్వరకృతం తథా. ౯౨
న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా,

సత్యవ్రతుం డగురాముఁడు, భరద్వాజమహామునియొక్క యాశ్రమమునకువెళ్లి, వారియాజ్ఞచే నచ్చోటనొకదినముండఁగోరి, తనరాకభరతునకుఁ దెలియుటకై, యతనియొద్దకు హనుమంతుని ముందుగాఁబంపెను. ౮౭

ఆరాముఁడు, సుగ్రీవవిభీషణాదులఁ గూడి, పుష్పకవిమానారూఢుఁడై, పూర్వవృత్తాంతములను జెప్పుకొనుచు నందిగ్రామమునకు వెళ్లెను.

పాపరహితుఁడగు రాముఁడు, తోడంబుట్టువులఁ గూడి, నందిగ్రామమందు, జటను విడిచి, మునివేషమును విడుచుటచే, సీతాదేవి ననుకరింపుచు, మఱల రాజ్యమును బొందెను. ౮౯

రాముఁడు రాజ్యాభిషిక్తుఁ డగుచుండఁగా లోకమునకంతయుం, నానందాతిశయమున గగుర్పాటు గలిగెను. 'ఇచ్ఛామోహి మహాబాహుంరఘువీరం మహాబలం, గజేన మహతాయాంతంరామం ఛత్రావృతాననం' (మహాబాహువును మహాబలుఁడును రఘువీరుఁడు నగురాముఁడు, పట్టాభిషిక్తుఁడై, మహాగజము నెక్కి శ్వేతచ్ఛత్రచ్ఛాయచేఁ గప్పఁబడిన ముఖము గలిగియుండఁ గోరెదము. అని యయోధ్యాకాండములోఁ జెప్పఁబడినట్లు తమకోరిక సఫలమగుటచే లోకమంతయుఁ బ్రీతియుక్తమయ్యె. సంతోషాతిశయమునంజేసి స్థావరజంగమాత్మకమైన ప్రపంచముయొక్క శరీరమంతయు వృద్ధిఁబొందెను. ప్రజలందఱుఁ జక్కఁగా ధర్మము నాచరించుచుండిరి. లోకమందుఁ బీడావ్యాధిదుర్భిక్షయములును దొలంగిపోయెను. ౯౦

రాముఁడు దొరతనము సేయునపుడు! తండ్రి బ్రతికియుండఁగాఁ బుత్రుఁడు చావఁబోఁడు, స్త్రీలందఱు విధవలు కాకుండఁ బతివ్రతలై యుందురు.

రామరాజ్యమందు, కొంచెమైన నగ్నిభయముగలుగదు. ప్రాణులు నీళ్లలోమునిఁగిచావరు. ఎంతమాత్రమును వాయుభయము కలుగదు. స్వల్పమైనను, జ్వరభయము జనింపదు. ప్రాణులు, ఎప్పుడును సిద్ధభోజనములుగానున్నందున, ఆఁకలిదుఃఖమెట్టిదో యెఱుఁగఁజాలరు. రాముఁడు దుష్టులఁ గఠినముగా శిక్షించువాఁడు కావునఁ బ్రజలకు దొంగలభయము కొంచెమైనను గలుగదు. ౯౧-౪

నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ. ౯౩

నిత్యం ప్రముదితాస్సర్వే యథాకృతయుగే తథా,

అశ్వమేధశతైరిష్ట్వా తథా బహుసువర్ణకైః. ౯౪
గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి,
అసంఖ్యేయం ధనం దత్వా బ్రాహ్మణేభ్యోమహాయశాః. ౯౫

రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః,
చాతుర్వర్ణ్యంచ లోకేఽస్మిన్ స్వేస్వేధర్మేనియోక్ష్యతి. ౯౬

దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ,
రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి. ౯౭

ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్,
యఃపఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే. ౯౮

ఏతదాఖ్యానమాయుష్యం పఠన్రామాయణన్నరః,
సపుత్రపౌత్రస్సగణః ప్రేత్య స్వర్గే మహీయతే. ౯౯

పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వమీయాత్,

పట్టణములును దేశములును, ధనధాన్యములుగలిగి సమృద్ధములుగా నుండును. ౯౨

సమస్తజనులును, సంపూర్ణమైన ధర్మముగల కృతయుగమునందు సంతోషముగలిగియుండునట్లు, రాముఁడు రాజ్యపాలనము సేయుచుండఁగాఁ ద్రేతాయుగమందును సంతోషముగలిగియుండెదరు. ౯౩

మహాయశుం డగురాముఁడు, అనేక శతాశ్వమేధముల చేతను, అనేక బహుసువర్ణకముల చేతను దేవతలఁ బూజించి, పదివేలకోట్లగోవులను లెక్కింపరాని ధనమును బ్రాహ్మణుల కిచ్చి, శాశ్వతమగు తనస్థానమును బొందఁగలఁడు. ౯౪, ౯౫

రాముఁడు క్షత్రియులకు రాజ్యములనిచ్చి నూఱింతలుగా వారి వంశమును వృద్ధిఁబొందించును. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను వారివారి వర్ణాశ్రమములకుఁ దగినధర్మములోఁ బ్రవర్తింపఁ జేయును. ౯౬

రాముఁడు పదునొకండువేల సంవత్సరములు రాజ్యమును, ప్రజలకు సుఖము గలుగునట్లు పాలించి, వైకుంఠమును బొందఁగలఁడు. ౯౭

పరిశుద్ధిసాధనమును సమస్తపాపములఁ బోఁగొట్టునదియుఁ, బుణ్యప్రదమును సర్వవేదసదృశము నగు నీరంజీవకరూపమైన రామచరిత్రమును, ఎవ్వఁడు, భక్తియుక్తుఁడై, వేదములఁబఠించునట్లు. నియమములోఁ, బఠించునో, సమస్తపాపములచేతను విడువఁబడును. ౯౮

ఆయుర్వృద్ధికరంబును, వాస్తవార్థప్రతిపాదకము నగు నీరామాయణమును బఠించుమనుష్యుఁడు, ఈలోకమందుఁ బుత్రపౌత్రమిత్రభృత్యబంధువులతోఁ గూడి సమస్తభోగముల ననుభవించి, అంతమందు స్వర్గలోకమునుబొంది, దేవతలచేఁ బూజింపఁ బడుచుండును. ౯౯

ఈరామాయణమును, బ్రాహ్మణుఁడు పఠించినట్టైన, నష్టాదశవిద్యాపారంగతుఁడగును. క్షత్రియుఁడు పఠించినట్టైన, భూమండలాధిపత్యమును

వణిగ్జనః పణ్యఫలత్వమీయాత్
జనశ్చ శూద్రోఽపి మహత్త్వమీయాత్. ౧౦౦

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే
సంక్షేపో నామ ప్రథమస్సర్గః.

---

## ద్వితీయస్సర్గః.

నారదస్య తు తద్వాక్యం శ్రుత్వా వాక్యవిశారదః,
పూజయామాస ధర్మాత్మా సహశిష్యో మహామునిః. ౧

యథావత్పూజిత స్తేన దేవర్షి ర్నారద స్తథా,
ఆపృష్ట్వైవాభ్యనుజ్ఞాతస్స జగామ విహాయసం. ౨

స ముహూర్తం గతే తస్మిన్ దేవలోకం ముని స్తదా,
జగామ తమసాతీరం జాహ్నవ్యా స్త్వవిదూరతః. 3

స తు తీరం సమాసాద్య తమసాయా మహామునిః,
శిష్యమాహ స్థితం పార్శ్వే దృష్ట్వా తీర్థమకర్దమమ్. ౪

అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ,
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా. ౫

బొందును. వైశ్యుఁడు పఠించినట్టైన, వాణిజ్యమునందు లాభమునుబొందును. శూద్రుఁడు పఠించినట్టైన, శూద్రకులములోఁ బూజ్యుఁ డగును. ౧౦౦

ఇట్లు, ఋషిప్రోక్తమైన రామాయణ మనునాదికావ్యమునందలి బాలకాండమునందు రామాయణకథాసంక్షేపమని ప్రసిద్ధమైన మొదటిసర్గము ముగిసినది.

---

## ద్వితీయసర్గము

సమస్తశాస్త్రార్థములఁ దెలిసికొని జ్ఞానమును గలిగించునట్టి కర్మానుష్ఠానము సేయుచున్న వాల్మీకిమహర్షి, బ్రహ్మోపదేశాచార్యుఁడైన నారదమహర్షి యుపదేశించిన వేదాంతార్థమును వినినంతనె, తాను బ్రహ్మానుభవమును బొందుటయేకాక, శిష్యులకును ఆయర్థమునుపదేశించి, శిష్యునితోఁగూడినవాఁడై, యెల్లప్పుడు నావేదాంతపరమార్థానందమునే యనుభవింపుచుండెను. ౧

దేవర్షి యగు నారదమహాముని, వాల్మీకిచేయథోచితముగఁబూజింపఁబడినవాఁడై, యావాల్మీకిని ఆలింగనాదులచే సంతోషపఱచి, వారి యనుజ్ఞనుబొంది, యాకాశమార్గమున, దేవలోకమునకు వెళ్లెను. ౨

ఆనారదమహాముని శీఘ్రములోనే బ్రహ్మలోకమునకు వెళ్లిన వెనుక వాల్మీకి మాధ్యాహ్నికస్నానమునకై, గంగానదికి సమీపమందుండు తమసానదీతీరముఁ జేరెను. ౩

ఆవాల్మీకిమహాముని, తమసానదీతీరముఁ జేరి, యందు బురదలేనిరేవును జూచి, పక్కనున్నతన శిష్యుఁ డగుభరద్వాజునితో నిట్లని చెప్పెను. ౪

ఓ భరద్వాజుఁడా! సత్పురుషునిహృదయమువలె నిష్పంకమై, నిర్మలజలమై, మనోహరమై యుండు నీరేవును జూడుము. ౫

న్యస్యతాం కలశస్తాత దీయతాం వల్కలం మమ,
ఇదమేవావగాహిష్యే తమసాతీర్థముత్తమమ్. ౬

ఏవముక్తో భరద్వాజో వాల్మీకేన మహాత్మనా,
ప్రాయచ్ఛత మునే స్తస్య వల్కలం నియతో గురోః. ౭

స శిష్యహస్తాదాదాయ వల్కలం నియతేంద్రియః,
విచచార హ పశ్యం స్తత్సర్వతో విపులం వనమ్. ౮

తస్యాభ్యాశే తు మిథునం చరంతమనపాయినం,
దదర్శ భగవాం స్తత్ర క్రౌంచయోశ్చారునిస్వనమ్. ౯

తస్మాత్తు మిథునాదేకం పుమాంసం పాపనిశ్చయః,
జఘాన వైరనిలయో నిషాద స్తస్య పశ్యతః. ౧౦

తం శోణితపరీతాంగం వేష్టమానం మహీతలే,
భార్యాతు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్. ౧౧
వియుక్తా పతినా తేన ద్విజేన సహచారిణా,
తామ్రశీర్షేణ మత్తేన పత్రిణా సహితేనవై. ౧౨

తదాతు తం ద్విజం దృష్ట్వా నిషాదేన నిపాతితమ్,
ఋషేర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత. ౧౩

'నాయనా ! జలపాత్రమును క్రిందనుంచుము. నాకు నారచీర నిమ్ము. శ్రేష్ఠమైన యీతమసాతీర్థమునందే స్నానము చేసెదను.' అని వాల్మీకి శిష్యునితోఁ జెప్పెను. ౬

ఈప్రకారము, మహాత్ముఁ డగువాల్మీకి యనఁగఁగా, గురువిధేయుం డైనభరద్వాజుఁ డావాల్మీకికి నారచీరనిచ్చెను. ౭

ఆవాల్మీకి, భరద్వాజుని చేతినుంచి నారచీరను బుచ్చుకొని, తానిం ద్రియనిగ్రహము గలవాఁ డైనను, విశాలమగు నావనము నంతయుఁ జూచుచు సంచరించెను. ఆశ్చర్యము. ౮

శాపానుగ్రహాది మాహాత్మ్యముగలవాల్మీకిమహర్షి, యావనములో నాతమసాతీర్థమునకు సమీపమునందే, సంచరించుచు మనోహరంబుగఁ గూయుచున్నవియు, క్షణకాలమైన నెడఁబాటు లేనివియు నగుక్రౌంచపక్షి దంపతులం జూచెను. ౯

సమస్త జంతువులయందును సహజమైన పగగలిగి క్రూరముగా జీవించుచు నొక బోయవాఁడు, ఆక్రౌంచపక్షిదంపతులను దగ్గఱి, యందొక టైన పురుషపక్షిని, దానింజూచుచున్న వాల్మీకి మహాముని చూడ నాదరింపక చంపెను. ౧౦

భార్యయగుక్రౌంచి, ప్రశస్తములగు ఱెక్కలును, ఎఱ్ఱనితలయందు గలిగి రతిపరవశతచేఁ బ్రకాశింపుచుఁదనకుఁ బెనిమిటియై సహచారియైనసఖ ప్రియమై యున్న క్రౌంచముచే విడువఁబడినదై, బోయవానిచేఁ జంపఁబడి నేలంబొరలుచు నెత్తుటందోఁగిపడియున్న యాక్రౌంచమునుజూచి, కనికరము పుట్టునట్టు లేడ్చెను. ౧౧, ౧౨

అప్పుడు బోయవానిచేఁ బడఁద్రోయఁబడిన యాక్రౌంచమునుజూచి ధర్మస్వభావముగల యావాల్మీకిమహర్షికి దయపుట్టెను. ౧౩

తతః కరుణవేదిత్వాదధర్మోఽయమితి ద్విజః,
నిశామ్య రుదతీం క్రౌంచీమిదం వచనమబ్రవీత్ ౧౪

మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్. ౧౫

తస్యైవం బ్రువతశ్చింతా బభూవ హృది వీక్షతః,
శోకార్తేనాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా. ౧౬

చింతయన్ స మహాప్రాజ్ఞశ్చకార మతిమాన్ మతిమ్,
శిష్యం చైవాఽబ్రవీద్వాక్యమిదం స మునిపుంగవః. ౧౭

పాదబద్ధోఽక్షరసమ స్తంత్రీలయసమన్వితః,
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా. ౧౮

శిష్యస్తు తస్య బ్రువతో మునేర్వాక్యమనుత్తమమ్,
ప్రతిజగ్రాహ సంహృష్టస్తస్య తుష్టోఽభవద్గురుః. ౧౯

సోఽభిషేకం తతః కృత్వా తీర్థే తస్మిన్ యథావిధి,
తమేవ చింతయన్నర్థముపావర్తత వై మునిః. ౨౦

అటుపిమ్మట, ఆవాల్మీకిమహాముని యేడ్చుచున్నక్రౌంచిని జూచి, దయగలవాఁడై, "రతికాలమందుఁ జంపుట పాడికాదు" అని తలంచుచు, నిట్లని చెప్పెను. ౧౪

నిర్భాగ్యుఁడైన యోబోయవాఁడా! క్రౌంచపక్షిదంపతుల దగ్గఱ యందు మన్మథపరవశమగునొకదానిం జంపితివి, కావున నీవు, శాశ్వత కాలము ప్రతిష్ఠనుఁ బొందక పోయెదవుగాక; అని పలికెను. ౧౫

ఆక్రౌంచదంపతులను జూచి 'మానిషాదే' త్యాదివాక్యమును బలికిన యావాల్మీకిమహర్షికి హృదయమునందు "ఈపక్షిం జూచి దుఃఖితుఁడనైన నేనిట్టివాక్యమును బలికితిని?" అని చింత పుట్టినది. ౧౬

మహాపండితుఁడును బుద్ధిమంతుఁడు నగు వాల్మీకిమహాముని యీ ప్రకార మాలోచన సేయుచు వక్ష్యమాణప్రకారముగ నిశ్చయించి శిష్యునితో నిట్లని చెప్పెను. ౧౭

దుఃఖితుఁడనైన నాముఖమువలన నిర్గమించి నాలుగు పాదములు గలదై ప్రతిపాదమును సమసంఖ్యగల యక్షరములతోఁ గూడినదై వీణయందారోపించి నృత్తగీతవాద్యములతోఁ బాడఁదగియున్న ఈగ్రంథము శ్లోకమను పేరం బ్రసిద్ధముగఁ గాక! మఱి వేఱు పేరం జెప్పందగదు. ౧౮

భరద్వాజుఁడు తనగురువు వాల్మీకిమహామునిచేఁ జెప్పఁబడి, శ్రీమద్రామాయణార్థ సంగ్రహమగుటచే సర్వోత్తమమై వెలుఁగుచున్న 'మానిషాదే' త్యాది వాక్యమును, వాగ్విధేయముగాఁ జేసికొనెను; వాల్మీకి మహామునియును అందుకుఁ దనశిష్యునియందుఁ బ్రీతిగలవాఁడాయెను. ౧౯

పిమ్మట వాల్మీకిమహాముని యాతమసాతీర్థమునందు యథాశాస్త్రముగ మాధ్యాహ్నికస్నాన మొనరించి యాకస్మికముగఁ దననోటనుండి ఛందోబద్ధమును బరమార్థప్రతిపాదకమునగు శ్లోకము వెడలుటను గుఱించియే చింతింపుచు నాశ్రమముతట్టు మఱలెను. ౨౦

భరద్వాజ స్తతశ్శిష్యో వినీతశ్శ్రుతవాన్ మునిః,
కలశం పూర్ణమాదాయ పృష్ఠతోఽనుజగామహ. ౨౧

స ప్రవిశ్యాశ్రమపదం శిష్యేణ సహ ధర్మవిత్,
ఉపవిష్టః కథాశ్చాన్యాశ్చకార ధ్యానమాస్థితః. ౨౨

ఆజగామ తతో బ్రహ్మా లోకకర్తా స్వయంప్రభుః,
చతుర్ముఖో మహాతేజా ద్రష్టుం తం మునిపుంగవమ్. ౨౩

వాల్మీకిరథ తం దృష్ట్వా సహసోత్థాయ వాగ్యతః,
ప్రాంజలిః ప్రయతో భూత్వా తస్థౌ పరమవిస్మితః. ౨౪

పూజయామాస తం దేవం పాద్యార్ఘ్యాసనవందనైః,
ప్రణమ్య విధివచ్చైనం పృష్ట్వాఽనామయమవ్యయమ్. ౨౫

వాల్మీకిమహాముని యాశ్రమమునకట్లు మఱలఁగానే వినయసంపన్నుండై సమస్తశాస్త్రముల నెఱింగి, బ్రహ్మానుసంధానము సేయుచు వాల్మీకికి శిష్యుఁడై యున్న భరద్వాజుఁడు జలపూర్ణమగు కలశమును దీసికొని, యావాల్మీకిని వెంబడించెను. ౨౧

సమస్త ధర్మముల నెఱింగిన యావాల్మీకిమహాముని శిష్యునితోఁ గూడ నాశ్రమమును బ్రవేశించి, సుఖాసనంబునఁ గూర్చుండి, అకారణముగ బోయవాఁడు చారుస్వరంబగు క్రౌంచమును జంపుట, ఆకస్మికముగఁ దననోట ఛందోబద్ధమును విచిత్రార్థప్రతిపాదకము నగు శ్లోకరూపవాక్యము వెడలుట వీటినిగుఱించి చింతిపుచునే, బ్రహ్మయజ్ఞపారాయణము మొదలగు క్రియాకలాపము నిర్వర్తించెను. ౨౨

అటువెనుక, సమస్తలోకములను సృజించువాఁడును సమస్తలోకముల కధిపుండును నాలుగు మోములచే నొక్కట నాలుగు వేదముల నుచ్చరింప సమర్థుండును మహాప్రభావుండు నగు బ్రహ్మదేవుఁడు మునిశ్రేష్ఠుఁడైన యావాల్మీకిమహామునిం జూడ నేతెంచెను. ౨౩

వాల్మీకిమహాముని బ్రహ్మదేవునిఁ జూచుచునే, "ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతియూనస్స్థవిరఆగతే, ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే" (ముదుసలివాఁడు దగ్గఱకు వచ్చుచుండఁగనే ప్రాయపువాని ప్రాణంబులు పైకిఁ బోవంజూచును. అతం డెదురేగుట నమస్కరించుటలచే మఱల, వానిఁ బొందును.) అనుశాస్త్రమురీతిని, తనప్రాణములు పోఁజూచుననుభయంబున దిగ్గనలేచి, మిక్కిలి యాశ్చర్యమునుబొందినవాఁడై మౌనము ధరించి, చేమోడ్పు గీలుకొల్పి, పరిశుద్ధహృదయుండై నిలిచెను. ౨౪

వాల్మీకిమహాముని బ్రహ్మదేవుని యథాశాస్త్రముగ నమస్కరించి, యవిచ్ఛిన్నమగు కుశలమును బృచ్ఛించి, యర్ఘ్యపాద్యాసనములచేతను స్తుతులచేతను బూజించెను. ౨౫

అథోపవిశ్య భగవానాసనే పరమార్చితే,
వాల్మీకయే మహర్షయే సందిదేశాసనం తతః,
బ్రహ్మణా సమనుజ్ఞాతస్సోఽప్యుపావిశదాసనే, ౨౬॥
ఉపవిష్టే తదా తస్మిన్ సాక్షాల్లోకపితామహే,
తద్గతేనైవ మనసా వాల్మీకిర్ధ్యానమాస్థితః. ౨౭॥

పాపాత్మనా కృతం కష్టం వైరగ్రహణబుద్ధినా,
యస్తాదృశం చారురవం క్రౌంచం హన్యాదకారణాత్. ౨౮॥

శోచన్నేవ ముహుః క్రౌంచీముపశ్లోకమిమం పునః,
జగావంతర్గతమనా భూత్వా శోకపరాయణః. ౨౯॥

తమువాచ తతో బ్రహ్మా ప్రహసన్మునిపుంగవమ్,
శ్లోకఏవ త్వయా బద్ధో నాత్ర కార్యా విచారణా. ౩౦॥

మచ్ఛందాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ,
రామస్య చరితం సర్వం కురు త్వమృషిసత్తమ. ౩౧॥

ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః,
వృత్తం కథయ ధీరస్య యథా తే నారదాచ్ఛ్రుతమ్. ౩౨॥
రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్య ధీమతః,
రామస్య సహసౌమిత్రే రాక్షసానాంచ సర్వశః. ౩౩॥
వైదేహ్యాశ్చాపి యద్వృత్తం ప్రకాశం యదివా రహః,
తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి. ౩౪॥

భగవంతుఁ డగు బ్రహ్మదేవుఁడు పరమపూజిత మగు నుత్తమాసన మందుఁ గూర్చుండి, ఋషిశ్రేష్ఠుఁడగు వాల్మీకిమహామునిం గూర్చుండ నియోగించెను. ౨౬

సర్వలోకంబులకును పితామహుండైన బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షముగాఁ గూర్చుండియున్నను వాల్మీకి మహాముని యాక్రౌంచమునందే మనస్సునుంచి, చింతింపసాగెను. ౨౭

రతిపరవశమై మనోహరముగఁ గూయుచుండునట్టి క్రౌంచమును నిష్కారణముగఁ జంపఁ గలిగిన పాపస్వరూపుఁడును వైరోపజీవియు నగు నాబోయవాఁడు భయంకరమగు కార్యముఁ జేసెను. అని చింతించెను. ౨౮

దుఃఖపరవశుండగు వాల్మీకిమహర్షి హృదయగతమగు 'మా నిషాదే' త్యాదిశ్లోకార్థమును జింతింపుచు మఱల నాయాఁడు క్రౌంచపక్షిని దలంచి పలుమాఱు దుఃఖింపుచు, 'మానిషాదే' త్యాది శ్లోకమును బఠించెను. ౨౯

వాల్మీకి యాశ్లోకమును బఠింపఁగా విని, బ్రహ్మదేవుఁడు, మునిశ్రేష్ఠుఁడగు నా వాల్మీకిని జూచి, "ఇతఁడు నాదునియోగంబునఁ దనజిహ్వాగ్రమందవతీర్ణ యగు సరస్వతీదేవి నెఱుఁగఁడు" అని నవ్వుచు, "నీచేఁ గ్రథితంబైన వాక్యము శ్లోకమేయగును. ఈవిషయంబునఁ జింతింపవలదు" అనిచెప్పెను.

ఓవాల్మీకి మహామునీ! నాయొక్క యిచ్ఛవలననే నీముఖమునుండి యీ 'మానిషాదే' త్యాదిశ్లోకము వెడలినది; ఋషిశ్రేష్ఠుఁడా! నీవు రామకథనంతయును శ్లోకరూపముగాఁ జేయుము. ౩౧

ధర్మస్వభావుండును లోకమునందుఁ బ్రశస్తంబులగు సమస్తగుణములు గలవాఁడును బండితుండును ధైర్యశాలియు నగు రాముని చరిత్రమును నీవు నారదునివలన వినినట్లు చెప్పుము. ౩౨

లక్ష్మణసహితుఁడైన రామునియొక్కయు రాక్షసులయొక్కయు సీతాదేవి యొక్కయు భరతాదుల యొక్కయు రహస్యముగాఁగాని ప్రకాశముగాఁ గాని నడిచిన చరిత్ర మంతయు నిప్పుడు నీకుఁ దెలియకున్నను ఇఁక స్పష్టముగాఁ దెలియఁ బోవుచున్నది. ౩౩, ౩౪

న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి,
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్. ३४५

యావత్ స్థాస్యంతి గిరయస్సరితశ్చ మహీతలే,
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి. ३६५

యావద్రామాయణకథా త్వత్కృతా ప్రచరిష్యతి,
తావదూర్ధ్వమధశ్చ త్వం మల్లోకేషు నివత్స్యసి. ३७५

ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మా తత్రైవాంతరధీయత,
తతస్సశిష్యో భగవాన్మునిర్విస్మయమాయయౌ. ३८५

తస్య శిష్యాస్తతస్సర్వే జగుశ్శ్లోకమిమం పునః,
ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః.
సమాక్షరైశ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా,
సోఽనువ్యాహరణాద్భూయశ్శ్లోకశ్శ్లోకత్వమాగతః. ४०५

తస్య బుద్ధిరియం జాతా మహర్షేర్భావితాత్మనః,
కృత్స్నం రామాయణం కావ్యమీదృశైః కరవాణ్యహమ్.

ఉదారవృత్తార్థపదైర్మనోరమై
స్తదాస్య రామస్య చకార కీర్తిమాన్,
సమాక్షరైశ్శ్లోకశతైర్యశస్వినో
యశస్కరం కావ్యముదారధీర్మునిః. ४२५

ఈకావ్యమందు నీవు చెప్పినయొకమాటయైన నసత్యము కానేరదు; నీవు శ్లోకములచే రామకథను జేయుము. అది వినువారి స[illegible] బోఁగొట్టుచు వినినయుత్తరక్షణమునందే పరమానందమును బుట్టించుచుండును.

పర్వతములును నదులును భూతలమం దెంతవఱకుండఁగలవో? అంత వఱకు నీవు చేసిన రామాయణము సప్తలోకములయందును బ్రచారమును బొందఁగలదు. (ఈరామాయణం బెంతవఱకుఁ బ్రచారముగలిగియుండునో? అంతవఱకును నీదుకీర్తి లోకంబులయందు వ్యాపించి యుండును.) ౩౬॥

నీవు చేసినరామాయణం బెంతవఱకుఁ బ్రచారముగలిగియుండునో? అంతవఱకు నాచే సృజింపఁబడిన యూర్ధ్వలోకముల యందును అధోలోకములయందును ఎదురులేక సంచరింపుచుండఁగలవు. అని చెప్పెను. ౩౭॥

ఈప్రకారము వాల్మీకి కుపదేశించి, బ్రహ్మదేవుఁ డాయాసనము నందుండియే అంతర్ధానము బొందెను; అపిమ్మట బ్రహ్మదేవుఁ డుపదేశించిన యర్థమును దలంచి, వాల్మీకిమహాముని శిష్యునితోఁగూడి నాశ్చర్యమును బొందెను. ౩౮॥

ఆవెనుక వాల్మీకిశిష్యులందఱును మాటిమాటికి సంతసింపుచు మఱల నీ 'మానిషాదే' త్యాది శ్లోకమును బఠించి, యొండొరులకుఁ జెప్పికొనిరి. ౩౯॥

సమానమైన సంఖ్యగల నాలుగుపాదములతో వాల్మీకిచేఁ జెప్పంబడిన శ్లోకలక్షణముగలిగి యున్నశ్లోకము శిష్యులచే మాటిమాటికిఁ బఠింపఁబడుటం బట్టి మఱల శ్లోకమైనది. ౪౦॥

వాల్మీకిమహాముని పరమాత్మధ్యానము చేయుచు "రామాయణ కావ్యమునంతయుఁ దఱచుగా 'మానిషాదే' త్యాదిశ్లోకమువంటి శ్లోకములతోఁ జేసెద" నను బుద్ధి కలవాఁడయ్యెను. ౪౧॥

కీర్తిమంతుఁడును మహాబుద్ధిమంతుఁడు నగువాల్మీకిమహాముని యశస్వి యగు రాముని మాహాత్మ్యమును దెలుపునట్టికావ్యమును మనోహరములైనవి యును ఉత్తమములగు పద్యముల నర్థముల శబ్దములం బ్రకాశింపుచున్నవియును సమాక్షరములు గలిగినవియునగు ననేక శతశ్లోకములతోఁ జేసెను. ౪౨॥

తదుపగతసమాససంధియోగం
సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. ౮౩౫

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే. ద్వితీయస్సర్గః

---

## తృతీయస్సర్గః

శ్రుత్వా వస్తుసమగ్రం తద్ధర్మాత్మా ధర్మసంహితమ్,
వ్యక్తమన్వేషతే భూయో యద్వృత్తం తస్య ధీమతః. ౧

ఉపస్పృశ్యోదకం సమ్యఙ్మునిస్స్థిత్వా కృతాంజలిః,
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేషతే గతిమ్. ౨

రామలక్ష్మణసీతాభీ రాజ్ఞా దశరథేన చ,
సభార్యేణ సరాష్ట్రేణ యత్ప్రాప్తం తత్ర తత్త్వతః. 3
హాసితం భాషితం చైవ గతిర్యా యచ్చ చేష్టితమ్,
తత్సర్వం ధర్మవీర్యేణ యథావత్సంప్రపశ్యతి. ౪
స్త్రీతృతీయేన చ తదా యత్ప్రాప్తం చరతా వనే,
సత్యసంధేన రామేణ తత్సర్వం చాన్వవేక్షితమ్. ౫

తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగమాస్థితః,
పురా యత్తత్ర నిర్వృత్తంపాణావామలకం యథా. ౬

జనులారా! శాస్త్రప్రాప్తములైన సమాసములు సంధులును వ్యుత్పత్తులును గలిగి, సమములును మధురములును స్పష్టార్థములు నగువాక్యములతోఁ గూడియుండునట్లు రావణవధమునుగుఱించి వాల్మీకిచేఁ జేయంబడినరామచరిత్రమును (రామాయణమును) వినుఁడు. ౪౩౪

ఇట్లు ఋషిప్రోక్తమైన రామాయణమను నాదికావ్యమునందలి బాలకాండమునందు రెండవసర్గము ముగిసినది.

---

## మూడవసర్గము

ధర్మస్వభావుఁడైన వాల్మీకి నారదుఁడు చెప్పఁగా ధర్మసహితంబగు రామకథను సమగ్రముగ విని యందు అంతకన్న నధికమైన చరిత్రభాగమును దెలియఁగోరి యాలోచించెను. ౧

వాల్మీకి చక్కఁగా జలము నాచమించి, తూర్పుమొగములగు కొనలు గలుగునట్లు పఱచినదర్భలయందుండి చేమోడ్పుగీలించి, బ్రహ్మప్రసాదము నందు మనస్సునిడి, శ్రీరామచరిత్రము నాలోచించెను. ౨

దశరథమహారాజును రామలక్ష్మణసీతాదేవులును రాజ్యములో నేమేమి చేసిరో నవ్వులును మాటలు గమనములు చేష్టలు ఇవి మొదలగు వాటి నంతయుం బ్రహ్మానుగ్రహబలముచే వాల్మీకి యథార్థముగా నడిచినట్లు చక్కఁగాఁ దెలిసికొనెను. 3, ౪

వాల్మీకి, సత్యప్రతిజ్ఞుఁడగు రాముఁడు సీతాలక్ష్మణులతోఁగూడి యరణ్యములో సంచరింపుచుండునపుడు చేసినకార్యముల నన్నియును గూడఁ దెలిసికొనెను. ౫

అటుపిమ్మట ధర్మాత్ముండగు వాల్మీకి, పూర్వము రామాదులకు జరిగిన వృత్తాంతమంతయుం నఱచేతియందలి యుసిరికకాయవలెఁ దెలిసికొనెను. ౬

తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ స మహాద్యుతిః,
అభిరామస్య రామస్య చరితం కర్తుముద్యతః. ౭

కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తరమ్,
సముద్రమివ రత్నాఢ్యం సర్వశ్రుతిమనోహరమ్. ౮

స యథా కథితం పూర్వం నారదేన మహర్షిణా,
రఘువంశస్య చరితం చకార భగవానృషిః. ౯

జన్మ రామస్య సుమహద్వీర్యం సర్వానుకూలతామ్,
లోకస్య ప్రియతాం క్షాన్తిం సౌమ్యతాం సత్యశీలతామ్.

నానాచిత్రకథాశ్చాన్యా విశ్వామిత్రసమాగమే,
జానక్యాశ్చ వివాహం చ ధనుషశ్చ విభేదనమ్. ౧౧

రామరామవివాదం చ గుణాన్దాశరథేస్తథా,
తథాభిషేకం రామస్య కైకేయ్యా దుష్టభావతామ్. ౧౨

విఘాతం చాభిషేకస్య రాఘవస్య వివాసనమ్,
రాజ్ఞశ్శోకవిలాపం చ పరలోకస్య చాశ్రయమ్. ౧3

ప్రకృతీనాం విషాదం చ ప్రకృతీనాం విసర్జనమ్,
నిషాదాధిపసంవాదం సూతోపావర్తనం తథా. ౧౪

గంగాయాశ్చాపి సంతారం భరద్వాజస్య దర్శనమ్,
భరద్వాజాభ్యనుజ్ఞానాచ్చిత్రకూటస్య దర్శనమ్. ౧౫

వాస్తుకర్మనివేశం చ భరతాగమనం తథా,
ప్రసాదనం చ రామస్య పితుశ్చ సలిలక్రియామ్. ౧౬

మహాతేజుండగు వాల్మీకి యారామచరిత్రమునంతయు ధర్మశక్తిచే యథార్థముగాఁ దెలిసికొని, ధర్మార్థకామమోక్షంబు లగు చతుర్విధపురుషార్థం బుల విస్తరించి యిచ్చుటంబట్టి రత్నాకరంబగుసముద్రంబునుబోలియున్నది యును వినువారియొక్క కర్ణహృదయంబులనెల్ల నానందింపఁజేయునదియును శ్రుతిరహస్యార్థప్రతిపాదకంబునగు సమస్తగుణంబులచే నొప్పుచున్నరాముని చరిత్రంబుఁ జేయ నారంభించెను. ౭, ౮

భగవంతుండగు నావాల్మీకిమహర్షి, నారదమహాముని మునుపు తనకుఁ జెప్పియుండినట్లు రఘువంశమందుఁ బుట్టిన రామునిచరిత్రమును జేసెను. ౯

రామునియవతారమును, అతనిమహాపరాక్రమమును, అతఁ డందఱకు ననుకూలముగనుండుటను, అతఁడు లోకమునకంతయుఁ బ్రియుఁడగుటను, అతని యోర్పును, అతని సత్యస్వభావతను, అతని సౌందర్యమును, ౧౦

విశ్వామిత్రమహర్షితోఁ గూటమికల్గుచుండ నెన్నియో వింతలగుకథ లును, సీతమున్నగువారి కల్యాణమును, ఈశ్వరధనుర్భంగమును, ౧౧

పరశురామభంగంబును, శ్రీరామగుణములను, పట్టాభిషేకప్రయత్న మును, కైకేయిచెడుగు బుద్ధిని, ౧౨

రాజ్యాభిషేక భంగమును, శ్రీరామవనవాసమును, దశరథుని పుత్ర శోకము, స్వర్గతిని, ౧౩

జనవిషాదమును, స్వజనవిరహమును, నిషాదపతిసంభాషణమును, సారథి మరలుట, ౧౪

గంగామహానది దాఁటుటను, భరద్వాజమహర్షిని జూచుటను, వారి యనుమతిచే చిత్రకూటపర్వతమును జూచుటను, ౧౫

పర్ణశాలానిర్మాణమును, భరతుఁడు శ్రీరామసన్నిధికి వచ్చుటను, రాముని వేఁడుకొనుటను, పితృతర్పణమును, ౧౬

పాదుకాగ్ర్యాభిషేకం చ నందిగ్రామనివాసనమ్,
దండకారణ్యగమనం విరాధస్య వధం తథా. ౧౭

దర్శనం శరభంగస్య సుతీక్ష్ణేన సమాగమమ్,
అనసూయా సహాస్యా మప్యంగరాగస్య చార్పణమ్. ౧౮

అగస్త్యదర్శనం చైవ జటాయో రభిసంగమమ్,
పంచవట్యాశ్చ గమనం శూర్పణఖ్యాశ్చ దర్శనమ్. ౧౯
శూర్పణఖ్యాశ్చ సంవాదం విరూపకరణం తథా,
వధం ఖరత్రిశిరసో రుత్థానం రావణస్య చ. ౨౦
మారీచస్య వధం చైవవైదేహ్యా హరణం తథా,
రాఘవస్య విలాపంచ గృధ్రరాజనిబర్హణమ్. ౨౧
కబంధదర్శనంచైవ సంపాయాశ్చాపి దర్శనమ్,
శబర్యా దర్శనంచైవ హనూమద్దర్శనం తథా. ౨౨
ఋశ్యమూకస్య గమనం సుగ్రీవేణ సమాగమమ్,
ప్రత్యయోత్పాదనం సఖ్యం వాలిసుగ్రీవనిగ్రహమ్. ౨౩
వాలిప్రమథనం చైవ సుగ్రీవప్రతిపాదనమ్,
తారావిలాపం సమయం వర్షరాత్రనివాసనమ్. ౨౪
కోపం రాఘవసింహస్య బలానాముపసంగ్రహమ్,
దిశః ప్రస్థాపనం చైవ పృథివ్యాశ్చ నివేదనమ్. ౨౫
అంగుళీయకదానంచ ఋక్షస్య బిలదర్శనమ్,
ప్రాయోపవేశనం చాపి సంపాతేశ్చాపి దర్శనమ్. ౨౬
పర్వతారోహణం చాపి సాగరస్యచ లంఘనమ్,
సముద్రవచనాచ్చైవ మైనాకస్య చ దర్శనమ్. ౨౭

భరతుఁడు శ్రేష్ఠములైన రామపాదుకలకుఁ బట్టాభిషేకము సేయుటను, నందిగ్రామమందు నివసించుటను, రాముఁడు దండకారణ్యమునకుఁ బోవుటను, విరాధునిం జంపుటను, ౧౭

రాముఁడు శరభంగునిఁ జూచుటను, సుతీక్ష్ణునితోఁ జేరుటను, సీతాదేవి యనసూయాదేవితోఁ గూడఁ గూర్చుండుటను, ఆయనసూయాదేవి సీతాదేవికిఁ జందనంపు మైపూఁత నిచ్చుటను, ౧౮

అగస్త్యమహామునిని జూచుటయును, జటాయుసమాగమమును, పంచవటీగమనమును, శూర్పణఖను జూచుటను, ౧౯

శూర్పణఖాసంభాషణమును, శూర్పణఖాకర్ణనాసాచ్ఛేదమును, ఖరత్రిశిరోసురసంహారమును, రావణుని ప్రయాణమును, ౨౦

మారీచుని జంపుటను, సీతాహరణమును, రాముఁడు విలపించుటను, జటాయుమరణమును, ౨౧

కబంధునిఁ జూచుటను, పంపానదిం గనుఁగొనుటను, శబరి నవలోకించుటను, హనుమంతు వీక్షించుటను, ౨౨

ఋశ్యమూకపర్వతమునకుఁ బోవుటను, సుగ్రీవునిచేరికను, వాని నమ్మించుటను, స్నేహమును, వాలి సుగ్రీవుల యుద్ధమును, ౨౩

వాలీసంహారణమును, సుగ్రీవునకు రాజ్యమునిచ్చుటను, తార యేడ్చుటను. రామసుగ్రీవులసంకేతమును, వర్షాకాలయాపనమును, ౨౪

రామచంద్రుని కోపమును, సైన్యముఁ గూర్చుటను, అచ్చటచ్చటికి సైన్యములఁ బంపుటను, దేశస్థితిఁ జెప్పుటను, ౨౫

రాముఁడు హనుమంతున కుంగరమునిచ్చుటను, హనుమదాదులు ఋక్షబిలమను నొక గొప్ప గుహను జూచుటను, వారలు సీతంగానక మరణార్థము సిద్ధపడుటను, వారలు సంపాతిం జూచుటను, ౨౬

మహేంద్రపర్వత మెక్కుటను, హనుమంతుఁడు సముద్రము దాఁటుటను, సముద్రునిమాటమీఁద మైనాకపర్వతమును జూచుటను, ౨౭

సింహికాయాశ్చ నిధనం లంకామలయదర్శనమ్,
రాత్రౌ లంకాప్రవేశంచ ఏకస్యాథ విచింతనమ్. ౨౮
దర్శనం రావణస్యాపి పుష్పకస్య చ దర్శనమ్,
ఆపానభూమిగమన మవరోధస్య దర్శనమ్. ౨౯
అశోకవనికాయానం సీతాయాశ్చాపి దర్శనమ్,
అభిజ్ఞానప్రదానం చ రావణస్య చ దర్శనమ్. 30
రాక్షసీతర్జనం చైవ త్రిజటాస్వప్నదర్శనమ్,
మణిప్రదానం సీతాయా వృక్షభంగం తథైవచ. 3౧
రాక్షసీవిద్రవం చైవ కింకరాణాం నిబర్హణమ్,
గ్రహణం వాయుసూనోశ్చ లంకాదాహాభిగర్జనమ్. 3౨
ప్రతిప్లవనమేవాథ మధూనాం హరణం తథా,
రాఘవాశ్వాసనం చాపి మణినిర్యాతనం తథా. 33
సంగమం చ సముద్రేణ నళసేతోశ్చ బంధనమ్,
ప్రతారంచ సముద్రస్య రాత్రౌ లంకావరోధనమ్. 3౪

విభీషణేన సంసర్గం వధోపాయనివేదనమ్,
కుంభకర్ణస్య నిధనం మేఘనాదనిబర్హణమ్. 3౫
రావణస్య వినాశంచ సీతావాప్తిమరేః పురే,
విభీషణాభిషేకంచ పుష్పకస్యచ దర్శనమ్. 3౬
అయోధ్యాయాశ్చ గమనం భరతేన సమాగమమ్,
రామాభిషేకాభ్యుదయం సర్వసైన్యవిసర్జనమ్,
స్వరాష్ట్రరంజనం చైవ వైదేహ్యాశ్చ విసర్జనమ్. 3౭

సింహికామరణమును, లంకాస్థితమలయపర్వతదర్శనమును, రాత్రి లంకఁజొచ్చుటను, హనుమంతుని యాలోచనమును, ౨౮

రావణునిఁ జూచుటను, పుష్పకమును గనుటను, మద్యము త్రావు చోటి కేగుటను, అంతఃపురము వీక్షించుటను, ౨౯

అశోకవనమునకు వెళ్లుటను, సీతాదేవిని జూచుటను, ఉంగర మొసఁగుటను, మఱలియుం రావణాసురుని జూచుటను, ౩౦

రాక్షసుల యదలుపును, త్రిజట కలనుజూచుటను, సీతాదేవి హనుమంతునికి శిరోరత్నమిచ్చుటను, చెట్లను బడఁగొట్టుటను, ౩౧

రాక్షసస్త్రీలపలాయనమును, రావణభటులఁజంపుటను, హనుమద్బంధనమును, లంకాదాహమువలన గర్జనమును, ౩౨

మఱల సముద్రము దాఁటుటను, తేనెఁద్రావుటను, రామునికి శిరోరత్నము నప్పగించుటను, ౩౩

రాముఁడు ససైన్యముగ సముద్రముఁజేరుటను, నలుఁడు సేతువు బంధించుటను, ఎల్లరు సముద్రముదాఁటుటను, రాత్రి వేళ కపులు లంకను ముట్టడించుటను, ౩౪

విభీషణునితోఁడఁ గలయికను, వాఁడు రావణునిజంపువెరవును చెప్పుటను, కుంభకర్ణమరణమును, ఇంద్రజిన్నిధనమును, ౩౫

రావణసంహారమును, లంకాపట్టణమునసీతనుపొందుటను, విభీషణపట్టాభిషేకమును, కుబేరునిపుష్పకమును జూచుటను, ౩౬

అయోధ్యాపురప్రవేశమును, భరతునితోఁ జేరుటను, శ్రీరామసామ్రాజ్యపట్టాభిషేకమును, సైన్యము నెల్లను బంపించుటను, స్వరాజ్యరంజనమును, సీతను వదలుటను, ౩౭

అనాగతంచ యత్కించి ద్రామస్య వసుధాతలే,
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకిర్భగవానృషిః. ౩౮౪

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, తృతీయస్సర్గః.

---

## చతుర్థస్సర్గః

ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకిర్భగవానృషిః,
చకార చరితం కృత్స్నం విచిత్రపదమాత్మవాన్. ౧

చతుర్వింశత్సహస్రాణి శ్లోకానాముక్తవానృషిః,
తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్. ౨
కృత్వాపి తన్మహాప్రాజ్ఞస్సభవిష్యం సహోత్తరమ్,
చింతయామాస కోన్వేతత్ప్రయుంజీయాదితి ప్రభుః. ౩

తస్య చింతయమానస్య మహర్షేర్భావితాత్మనః,
అగృహ్ణీతాం తతః పాదౌ మునివేషౌ కుశీలవౌ. ౪

కుశీలవౌతు ధర్మజ్ఞౌ రాజపుత్రౌ యశస్వినౌ,
భ్రాతరౌ స్వరసంపన్నౌ దదర్శాశ్రమవాసినౌ. ౫
సతు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ,
వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః. ౬
కావ్యం రామాయణంకృత్స్నంసీతాయాశ్చరితంమహత్,
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః. ౭

సీతా విసర్జనమునకుఁ బూర్వము జరిగిన కథాభాగమును షట్కాండముల యందును, సీతావిసర్జనము మొదలగు భవిష్యత్కథాభాగము నుత్తర కాండము నందును, భగవంతుఁడగు వాల్మీకిమహర్షి, యభివర్ణించెను. ३०४

ఇది పరమార్థచంద్రికాఖ్యానంబను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు బాలకాండమున మూఁడవసర్గ ముగిసినది.

---

## నాల్గవ సర్గము

భగవంతుఁడును "నానృషిః కురుతే కావ్యం" (ఋషికానివాఁడు కావ్యము సేయఁజాలఁడు) అనునట్లు, ఋషియగుటంబట్టి, కావ్యము సేయసమర్థుండునగు వాల్మీకి, రాముఁడు రాజ్యమును బాలింపుచుండఁగా, నతనిచరిత్రమంతయు, విచిత్రంబులగు శబ్దములతోఁ జేసెను. ౧

వాల్మీకిమహర్షి, ఇరువదినాలుగు వేల శ్లోకములును, ఐదునూఱుల సర్గలును, ఏడుకాండములును, ఉండునట్లు, రామాయణము జేసెను. ౨

పండితశ్రేష్ఠుండును సమర్థుండునగువాల్మీకి, శ్రీరామపట్టాభిషేకమునకు వెనుకటికథలను, అశ్వమేధము సేయుటకు వెనుకటి భవిష్యత్కథలునుం జేర్చి, యీరామకథనంతయుం జేసి, "దీని నెవ్వఁడు పఠించి లోకమునందుఁ బ్రవర్తిల్లఁ జేయఁగలఁడు" అని యాలోచించెను. ౩

ఆవాల్మీకిమహాముని, తగినశిష్యుఁడు దొరకొనుటకై పరమాత్మయందు మనసునిడి చింతింపుచుండఁగా, మునివేషములధరించియుండు కుశలవులను రాజపుత్రులు, ఆవాల్మీకిపాదముల కభివందనముఁ జేసిరి. ౪

వాల్మీకియు, ధర్మముల నెఱింగినవారును, రాచకొమరులును, కీర్తిమంతులును, తోఁబుట్టువులును, శారీరసౌష్ఠవముగలవారునగు వారిని జూచెను. ౫

స్వతంత్రుఁడగు వాల్మీకి, బుద్ధిశాలులును సాంగంబుగ వేదాధ్యయనముఁ జేసినవారలునగు నా కుశలవులంజూచి, తాను సీతాచరిత్రమును రావణవధమును గుఱించి రచించిన రామాయణంబను మహాకావ్యము నాకుశలవులకుఁ దెలియఁజెప్పెను. ౬, ౭

పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్,
జాతిభిస్సప్తభిర్బద్ధం తంత్రీలయసమన్వితమ్. ౮
రసైశ్శృంగారకారుణ్యహాస్యవీరభయానకైః,
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేతదగాయతామ్. ౯
తౌ తు గాంధర్వతత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థానకోవిదౌ,
భ్రాతరౌ స్వరసంపన్నౌ గంధర్వావివ రూపిణౌ. ౧౦
బింబాదివోద్ధృతౌ బింబౌ రామదేహాత్తథాపరౌ. ౧౧

తౌ రాజపుత్రౌ కార్త్స్న్యేన ధర్మ్యమాఖ్యానముత్తమమ్.
వాచోవిధేయం తత్సర్వం కృత్వా కావ్యమనిందితౌ. ౧౨
ఋషీణాం చ ద్విజాతీనాం సాధూనాం చ సమాగమే,
యథోపదేశం తత్త్వజ్ఞౌ జగతుస్సుసమాహితౌ. ౧౩
మహాత్మానౌ మహాభాగౌ సర్వలక్షణలక్షితౌ. ౧౩½

తౌ కదాచిత్సమేతానామృషీణాం భావితాత్మనామ్,
ఆసీనానాం సమీపస్థావిదం కావ్యమగాయతామ్. ౧౪½

తచ్ఛ్రుత్వా మునయస్సర్వే బాష్పపర్యాకులేక్షణాః,
సాధుసాధ్వితి తావూచుః పరం విస్మయమాగతాః. ౧౫½

తే ప్రీతమనసస్సర్వే మునయో ధర్మవత్సలాః,
ప్రశశంసుః ప్రశస్తవ్యౌ గాయమానౌ కుశీలవౌ. ౧౬½

అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం తు విశేషతః,

గానశాస్త్ర రహస్యముల నెఱిఁగి షడ్జాదిస్వరముల యుత్పత్తిస్థానంబులఁ దెలిసికొని, నాటకయోగ్యములైన యభినయములతో, మనోహరంబగు కంఠంబున, మధురస్వరంబుగ భాషించుచు, మానవవేషధారులగు గంధర్వులంబోలె వెలుగుచున్నవారును మూలబింబంబగు రామదేహంబువలన సంగ్రహింపఁబడిన ప్రతిబింబములట్లున్నవారలు నగు నాకుశలవులు, మనోహరంబుగఁ బఠించుటకును బాడుటకునుదగి, ద్రుతమధ్యవిలంబితముల నొప్పుచు షడ్జాదిసప్తజాతులుగలిగి, శృంగారాదినవరసంబులచే రమణీయంబైన యీ రామాయణ కావ్యమును బాడిరి. ౮-౧౧

మిక్కిలిబుద్ధిశాలులును సమస్తశుభలక్షణములతోఁగూడినవారునగు నారాచకొమరులు, రామాయణముయొక్క యథార్థార్థము దెలిసికొని, సావధానులై, సమస్తస్థలములయందుధర్మయుక్తమై యుత్తమమై పూర్వముజరిగిన చరిత్రమును జెప్పుచున్న యీరామాయణమహాకావ్యమునంతయు నోటికి వచ్చునట్లుచేసికొని, ఋషులును ద్విజులును సాధువులును, జేరుకాలముల యందుఁ బాడసాగిరి. ౧౨,౧౩½

ఆకుశలవులు, ఒకానొకప్పుడు, పరమజ్ఞానులగు ఋషులుకొందఱు సభచేరి కూర్చుండియుండఁగా, వారిసమీపమునందుండి యీరామాయణకావ్యమును బాడిరి. ౧౪½

ఆఋషులు, వారి పాటనువిని, మిగులనాశ్చర్యమునుబొంది, కన్నులనానందబాష్పములు గాఱఁగా నాకుశలవులఁజూచి, బలే! బలే! అని మెచ్చుకొనిరి. ౧౫½

ధర్మైకబుద్ధిగల ఆఋషులందఱును, సంతసించి, మధురముగా రామాయణమును బాడుటం బట్టి కొనియాడందగి యున్న కుశలవులను, ప్రశంసించిరి. ౧౬½

(ఈపాట మిక్కిలి మధురముగానున్నది. శ్లోకములు మఱియు మధుర

చిరనిర్వృత్తమప్యేతత్ప్రత్యక్షమివ దర్శితమ్. ౧౭॥

ప్రవిశ్య తావుభౌ సుష్ఠు భావం సమ్యగగాయతామ్,
సహితౌ మధురం రక్తం సంపన్నం స్వరసంపదా. ౧౮॥

ఏవం ప్రశస్యమానౌ తౌ తపశ్శ్లాఘ్యైర్మహాత్మభిః,
సంరక్తతరమత్యర్థం మధురం తావగాయతామ్. ౧౯॥
ప్రీతః కశ్చి న్మునిస్తాభ్యాం సంస్థితః కలశం దదౌ,
ప్రసన్నో వల్కలం కశ్చిద్దదౌ తాభ్యాం మహాయశాః. ౨౦॥

ఆశ్చర్యమిదమాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్,
పరం కవీనామాధారం సమాప్తం చ యథాక్రమమ్. ౨౧॥
అభిగీతమిదం గీతం సర్వగీతేషు కోవిదౌ.
ఆయుష్యం పుష్టిజనకం సర్వశ్రుతిమనోహరమ్. ౨౨॥
ప్రశస్యమానౌ సర్వత్ర కదాచిత్తత్ర గాయకౌ,
రథ్యాసు రాజమార్గేషు దదర్శభరతాగ్రజః. ౨౩॥
స్వవేశ్మ చానీయ తతో భ్రాతరౌ స కుశీలవౌ,
పూజయామాస పూజార్హౌ రామశ్శత్రునిబర్హణః. ౨౪॥
ఆసీనః కాంచనే దివ్యే స చ సింహాసనే ప్రభుః,
ఉపోపవిష్టస్సచివై ర్భ్రాతృభిశ్చ పరంతపః. ౨౫॥
దృష్ట్వాతు రూపసంపన్నౌ తావుభౌ నియత స్తథా,
ఉవాచ లక్ష్మణం రామశ్శత్రుఘ్నం భరతం తథా. ౨౬॥
శ్రూయతామిదమాఖ్యానమనయోర్దేవవర్చసోః,
విచిత్రార్థపదం సమ్యగ్గాయకౌ తావచోదయత్. ౨౭॥

ములుగానున్నవి, ఈకావ్యము, రామకథ పెద్దకాలమునకు మునుపునడచినదైనను ఇప్పుడు కట్టెదుట నడచుచుండునట్లు, తేటగాఁ దెల్పుచున్నది. ౧౩॥

ఆకుశలవులు, ఇద్దఱును సమమైనలయముఁగలిగి యేకకంఠులై, కవి యభిప్రాయము రీతిని, ఆయారసముల నావిష్కరించుచు, మనోహరముగా షడ్జాదిస్వరములతోఁగూడి, రాగయుక్తమైయుండునట్లు పాడిరి. ౧౮॥

మిక్కిలియుఁ దపస్వులును బుద్ధిశాలులునగు మహర్షులీప్రకారము శ్లాఘింపుచుండఁగా, మఱింతమంచిరాగములతో మిక్కిలిమధురముగాఁబాడిరి.

ఒకానొక మహర్షి సంతసించి, ప్రేమాతిశయంబునలేచి, యాకుశలవులకు, జలపాత్రమునిచ్చెను; మహాయశుండగు మఱియొకండు, సంతుష్టుఁడై నారచీరనిచ్చెను.

"సమస్తగానములయందును సమర్థులైన ఓకుశలవులారా! వాల్మీకిమహామునిచే, పరుసదప్పక రచింపఁబడి, కవులకుఁ బరమాధారంబై, యాశ్చర్యావహంబై వెలుఁగుచున్న, శ్రీరామచరిత్రరూపమగు నీరామాయణంబును, ఆయుర్వృద్ధికరంబును బుష్టిప్రదంబును యుక్తస్వరావయవంబులచే నొప్పుచున్నదియు నత్యుత్తమంబునగు గానముచేఁ బాడితిరి" అని, అశ్వమేధయజ్ఞవాటమునందును రాజమార్గాదులయందును గొనియాడఁబడుచుండు కుశలవులను రాముఁడు తానశ్వమేధయాగము సేయుచున్నప్పుడు చూచెను. ౨౧॥-౨౩॥

శత్రువులఁ జంపునట్టి యారాముఁడాకుశలవులను దాఁ జూచినవెనుకనే, వారిం దనయశ్వమేధశాలాగృహమునకు రప్పించి, శ్లాఘించెను. ౨౪॥

యజ్ఞదీక్షితుండగు రాముఁడు, దశరథునిచేస్వర్గమునుండితీసికొని రాఁబడిన స్వర్ణమయసింహాసనమునందుఁ గూర్చుండి, తోఁబుట్టువులు మంత్రులునుంగొలువ నిండుకొలువుండి, యతిసుందర రూపులగు నాకుశలవులం జూచి, "ఆశ్చర్యావహంబులగుశబ్దార్థంబులనొప్పు ప్రబంధమును వీరు గానము సేయఁగా వినుఁడు" అని తోఁబుట్టువులకుఁ జెప్పి, యాకుశలవుల గానము సేయనియోగించెను. ౨౫॥-౨౬॥

తౌ చాపి మధురం రక్తం స్వంచితాయతనిస్వనమ్,
తంత్రీలయవదత్యర్థం విశ్రుతార్థ మగాయతామ్. ౨౮

హ్లాదయత్సర్వగాత్రాణి మనాంసి హృదయాని చ,
శ్రోత్రాశ్రయసుఖం గేయం తద్బభౌ జనసంసది. ౨౯

ఇమౌ మునీ పార్థివలక్షణాన్వితౌ
కుశీలవౌ చైవ మహాతపస్వినౌ,
మమాపి తద్భూతికరం ప్రవక్ష్యతే
మహానుభావం చరితం నిబోధత. ౩౦

తతస్తు తౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధానసంపదా,
స చాపి రామః పరిషద్గతశ్శనై
ర్బుభూషయా సక్తమనా బభూవ. ౩౧

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే,
చతుర్థస్సర్గః.

---

పంచమస్సర్గః.

సర్వాపూర్వమియం యేషామాసీత్కృత్స్నా వసుంధరా,
ప్రజాపతిముపాదాయ నృపాణాం జయశాలినామ్. ౧

ఆకుశలవులును మనోహరముగా, రాగయుక్తముగా, మిక్కిలి యొప్పు నారవము గలుగునట్లుగ, వీణె మొదలగు వాద్యతంత్రులకును తాలమునకు ననుగుణముగను, స్పష్టమగు నర్థము గలుగునట్లుగాఁ బాడిరి. ౨౮

వీనులకానందము గలుగఁజేయు నాకుశలవుల గానము, వినువారి సమస్తావయవములను, మనస్సులను, మనస్సులకధిష్ఠానభూతములైన హృదయములను సంతసింపఁజేయుచు, జనసమాజమందంతటను బ్రకాశించెను. ౨౯

ఓజనులారా! ఈకుశలవులు, సాధారణముగ మునులుగా నగుపడినను రాజలక్షణములు గలిగియున్నారు. గాయకులుగానున్నను గొప్పతపస్సుగలవారలుగానున్నారు. వీరలు, సీతావిరహముచేఁ బీడింపఁబడుచున్న నాకును గొంతసౌఖ్యము నిచ్చునదియు మహాప్రభావంబునగు సీతాచరిత్రమును జెప్పఁబోయెదరు కాఁబట్టి, సావధానముగా వినుఁడు. 30

అంత, రాముఁడు ప్రేరేపింపఁగానే, యాకుశలవులు, "మార్గము, దేశి" యనెడు గానప్రకారముల రెంటిలోను, ముఖ్యమైన మార్గమును బట్టి, పాడ నారంభించిరి. అంత రాముఁడును, "దిగ్గనలేచి వెళ్లినచో సభికులును లేవం జాతురు, దాన రసభంగమగు" నని, మెల్లగా సింహాసనమునుండి డిగ్గి సభఁ జేరి, యాశ్రోత్రానంద మనుభవింపఁగోరి, వారిపాటను విన నాసక్తుఁడయ్యెను.

శ్రీవాల్మీకిప్రోక్తంబు నాదికావ్యంబు నగు శ్రీమద్రామాయణమునందు
బాలకాండ నాల్గవసర్గ ముగిసినది.

---

## అయిదవసర్గము

జయశాలురైన యేరాజులదిగా నీభూమియంతయు, మనుప్రజాపతి మొదలుకొని. ఇతరరాజుల కెవ్వరికిని సంబంధము లేనట్లుండినదో. (అని మూఁడవశ్లోకంబుతో నన్వయము.) ౧

యేషాం స సగరో నామ సాగరో యేన ఖానితః,
షష్టిః పుత్రసహస్రాణి యం యాంతం పర్యవారయన్. ౨

ఇక్ష్వాకూణామిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనామ్,
మహదుత్పన్నమాఖ్యానం రామాయణమితి శ్రుతమ్. 3
తదిదం వ_ర్తయిష్యామి సర్వం నిఖిలమాదితః,
ధర్మకామార్థసహితం శ్రోతవ్యమనసూయయా. ౪

కోసలో నామ ముదితస్స్ఫీతో జనపదో మహాన్,
నివిష్టస్సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్. ౫

అయోధ్యా నామ నగరీ తత్రాసీల్లోకవిశ్రుతా,
మనునా మానవేంద్రేణ యాపురీ నిర్మితా స్వయమ్. ౬
ఆయతా దశచ ద్వేచ యోజనాని మహాపురీ,
శ్రీమతీ త్రీణి వి స్తీర్ణా సువిభ_క్తమహాపథా. ౭
రాజమార్గేణ మహతా సువిభ_క్తేన శోభితా,
ము_క్తపుష్పావకీర్ణేన జలసి_క్తేన నిత్యశః. ౮

తాంతు రాజా దశరథో మహారాష్ట్రవివర్ధనః,
పురీమావాసయామాస దివం దేవపతిర్యథా. ౯

కవాటతోరణవతీం సువిభక్తాంతరాపణామ్,
సర్వయంత్రాయుధవతీముపేతాం సర్వశిల్పిభిః. ౧౦

ఎవ్వనిచేఁ త్రవ్వింపఁబడిన సముద్రము "సాగర" మను పేరును బొందెనో, ఎవ్వఁడు, యుద్ధమునకు అఱువేలకుమారులతో వెళ్లుచుండెనో; అట్టిసగరచక్రవర్తి యెవ్వరివంశమునఁ బుట్టెనో-("అటువంటి" అని పై శ్లోకముతో నన్వయము). ౨

అటువంటిమహాత్ములైనయిక్ష్వాకువంశపురాజులవంశమునందు, రామాయణమను పేరం బ్రసిద్ధమగు, నీపూజ్యప్రబంధము, పుట్టినది. 3

సాక్షాద్బ్రహ్మప్రసాదమునఁ బుట్టిన ఈరామాయణమును నేను లోకమునం బ్రవర్తిల్లఁజేసెద, ధర్మకామార్థప్రదంబగు దీనినంతయుఁ దక్కువపడకుండ, నసూయలేని వారలై వినవలయును. ౪

అధికంబులగు ధనధాన్యంబులచే సమృద్ధమైయెప్పుడును సంతసంబునం బొదలెడి జనులతో నొప్పుచున్నకోసలదేశంబను నొకగొప్పదేశము, సరయూనదీతీరంబునంగలదు. ౫

ఆకోసలదేశమందు, మొట్టమొదట మనుష్యులకందఱకును రాజుగానుండిన వైవస్వతమనువుచే సంకల్పమాత్రమున నిర్మింపఁబడి, పండ్రెండుయోజనంబుల నిడుపును మూఁడుయోజనంబుల వెడల్పునుంగలిగి, వంకరలేనట్లు చక్కఁగా నేర్పఱుపఁబడిన గొప్పమార్గంబులచే నొప్పుచు, ఎల్లప్పుడును రాజపురుషులు పరిమళార్థమై పుష్పంబుల వెదచల్లఁ జల్లఁదనంబునకై యుదకంబునందడుపఁ గమ్మనితావిగలిగి చల్లగానుండు మందమారుతంబులశోభిల్లుచున్న రాజవీథిం దేజరిల్లుచు, లోకత్రయంబునను విఖ్యాతికెక్కిన, యయోధ్య యనెడు నొక్కపట్టణంబు గలదు. ౬-౭

గొప్ప రాజ్యమును ధర్మముతోఁ బాలించి వృద్ధిఁబొందింపఁగలిగినట్టి దశరథుఁ డనునొకరాజు, స్వర్గమునందు దేవేంద్రుఁడుంబోలె, నాయయోధ్యాపురియందు వాసముచేసెను. ౮

నగరమునకు వెలుపలితలుపులును, దారుబంధములు గలదియును, చక్కఁగ నేర్పఱుపఁబడిన యంతరములుగల యంగడివీథులు గలదియును,

సూతమాగధసంబాధాం శ్రీమతీమతులప్రభామ్,
ఉచ్చాట్టాలధ్వజవతీం శతఘ్నీశతసంకులామ్. ౧౧

వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్,
ఉద్యానామ్రవణోపేతాం మహతీం సాలమేఖలామ్. ౧౨

దుర్గగంభీరపరిఘాం దుర్గామన్యైర్దురాసదామ్,
వాజివారణసంపూర్ణాం గోభిరుష్ట్రైః ఖరైస్తథా. ౧౩

సామంతరాజసంఘైశ్చ బలికర్మభిరావృతామ్,
నానాదేశనివాసైశ్చ వణిగ్భిరుపశోభితామ్. ౧౪
ప్రాసాదై రత్నవికృతైః పర్వతైరుపశోభితామ్,
కూటాగారైశ్చ సంపూర్ణామింద్రస్యేవామరావతీమ్. ౧౫

చిత్రామష్టాపదాకారాం నరనారీగణైర్యుతామ్,
సర్వరత్నసమాకీర్ణాం విమానగృహశోభితామ్. ౧౬

గృహగాఢామవిచ్ఛిద్రాం సమభూమౌ నివేశితామ్,
శాలితండులసంపూర్ణామిక్షుకాండరసోదకామ్. ౧౭

దుందుభీభిర్మృదంగైశ్చ వీణాభిః పణవైస్తథా,
నాదితాం భృశమత్యర్థం పృథివ్యాం తామనుత్తమామ్. ౧౮
విమానమివ సిద్ధానాం తపసాధిగతం దివి,
సునివేశితవేశ్మాంతాం నరోత్తమసమావృతామ్. ౧౯

సమస్తములగుయంత్రములు ఆయుధములు గలదియును, సర్వశిల్పులతోఁ గూడినదియును, ౧౦

స్తోతలచేతను కాలమును బొగడువారిచేతను నిండియుండునదియును, సమృద్ధిగలదియును, అసమానమగు కాంతిగలదియు, ఉన్నతములగు కోట బురుజులును టెక్కెములుగలదియు, కొలఁదికిమించు ఫిరంగులు కలదియు, ౧౧

అంతటను స్త్రీలచేనాటకములచే నిండినదియు, ఆరామములతోను మామిడితోఁటలతోను గూడినదియును, విశాలమయినదియును, ప్రాకారమే మొలనూలుగాఁగలదియును, ౧౨

చొఱరానిలోతగునగడ్తగలదియును, ఇతరులకు ప్రవేశింపఁగూడనిది యును, మెండుగ గుఱ్ఱములు ఏనుఁగులు గలదియును, అట్టులనే ఆవులు ఒంటెలు గాడిదలు వెల్లిగొల్లగ గలదియును, ౧౩

కప్పముఁ గట్టుచిఱురాజులచే నిండినదియు, నానాదేశవాసులగు వైశ్యులతోఁ గూడినదియు, ౧౪

రత్నములచేఁ గట్టఁబడినరాచవారియిండ్లచేతను, క్రీడసేయు కొండల చేతను మించునదియు, మేడలపై మేడలచేత నిండినదియు, ఇంద్రునియమ రావతీపట్టణమువలె నొప్పునదియు, ౧౫

విచిత్రమయినదియు, జూదమాడు పీటవంటియాకారముగలదియును, ఉత్తమసుందరీజనముల గూడినదియు, సర్వవిధరత్నములచే మెఱయునదియు, చక్రవర్తిగృహంబులచే ప్రకాశించునదియు, ౧౬

దట్టముగ నిండ్లుగలదియు, దోసములేనిదియు, సమప్రదేశమున నిర్మింపబడినదియు, ఎక్కువ తెల్లవరిబియ్యముకలదియు, చెఱకుపాలఁ బోలు నీర్లుకలదియు, ౧౭

భేరీవీణామృదంగపణవాదుల చప్పుళ్లచే నిండినదియు, తనకన్న మఱి యొక పట్టణము శ్రేష్ఠమయినది లేనిదియు, ప్రసిద్ధమయినదియు, ౧౮

స్వర్గమునఁ దపస్సుచేఁ బొందఁబడిన తపస్సిద్ధుల విమానమువలె నున్న దియు, చక్కఁగ కట్టఁబడిన గృహప్రదేశములు గలదియు, ఉత్తమ పురుషులచే నిండినదియు, ౧౯

యేచ బాణైర్న విధ్యంతి వివిక్తమపరాపరమ్,
శబ్దవేధ్యం చ వితతం లఘుహస్తా విశారదాః. ౨౦
సింహవ్యాఘ్రవరాహాణాం మత్తానాం నర్దతాం వనే,
హంతారో నిశితైశ్శస్త్రైర్బలాద్బాహుబలైరపి. ౨౧
తాదృశానాం సహస్రైస్తామభిపూర్ణాం మహారథైః,
పురీమావాసయామాస రాజా దశరథస్తదా. ౨౨

తామగ్నిమద్భిర్గుణవద్భిరావృతామ్
ద్విజోత్తమైర్వేదషడంగపారగైః,
సహస్రదైస్సత్యరతైర్మహాత్మభి
ర్మహర్షికల్పైఋషిభిశ్చ కేవలైః. ౨3

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాణ్డే,
పఞ్చమస్సర్గః.

---

షష్ఠస్సర్గః.

తస్యాం పుర్యామయోధ్యాయాం వేదవిత్సర్వసంగ్రహః,
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః. ౧
ఇక్ష్వాకూణామతిరథో యజ్వా ధర్మరతో వశీ,
మహర్షికల్పో రాజర్షిస్త్రిషు లోకేషు విశ్రుతః. ౨
బలవాన్నిహతామిత్రో మిత్రవాన్విజితేంద్రియః,
ధనైశ్చ సంగ్రహైశ్చాన్యైశ్శక్రవైశ్రవణోపమః. 3

తాము నేర్పరితనముతో నతివేగముగ బాణప్రయోగము సేయఁగలిగియున్నను, ధార్మికులైనందున, నొంటరియైనవానిఁగాని, తండ్రులును గొడుకులును దోడంబుట్టువులును లేనివానిఁగాని, కంటికగుపడక, మఱుఁగుననుండి ధ్వనిమాత్రము గుఱిగాఁ గొట్టఁదగినవానిఁగాని, పరుగెత్తువానిఁగాని, యుద్ధమునందు బాణముచేనైనఁ బ్రహరింపనోడువారును, వనమునందుమదించి యథేచ్ఛముగ గర్జించుచున్న సింగములు పులులు మొదలగు క్రూర మృగంబులఁ బట్టి బలాత్కారముగ నాయుధములతోఁగాని తమభుజబలంబులతోఁగాని చంపఁ గలవారునగు గొప్పశూరులచే నిండియున్న యాయయోధ్యాపట్టణమందు, దశరథమహారాజు వాసముసేయుచుండెను. ౨౦—౨౨

ఆహితాగ్నులును, సద్గుణవంతులును, వేదాధ్యయన సంపన్నులును, షడంగ పారగులును, అనంతముగ దానముచేయువారును, కల్లలాడనివారును, మహానుభావులును, కేవలముఋషులైనను మహర్షులతో సమానులగు బ్రాహ్మణ క్షత్రియవైశ్యులచేత వసింపఁబడు నాయయోధ్యాపట్టణముదశరథమహారాజు అధిష్ఠించియుండెను. ౨౩

శ్రీవాల్మీకి ప్రోక్తంబు నాదికావ్యంబు నగు శ్రీరామాయణమునందు బాలకాండమందు అయిదవసర్గ ముగిసెను.

---

## ఆఱవసర్గము

దశరథమహారాజు, ఆయయోధ్యాపురంబున నివసింపుచు, వేదవేదార్థంబుల నెఱింగి, పండితులుశూరులు మొదలగువారి నెల్ల యథోచితంబుగ నాదరింపుచుఁ, బెద్దకాలంబునకుఁ బిమ్మటరాఁబోవునర్థము నెఱింగి యెచ్చరికతోఁ బ్రవర్తిల్లుచుఁ, బట్టణవసులయందును గ్రామవాసులయందు నేకరీతిగఁ బ్రీతి నెఱపుచు, నెల్లజనంబులస్వాధీనులుగాఁ జేసికొని, యాహితాగ్నియై ధర్మరతుండై, రాజర్షియై మహర్షియుంబోలెఁ బ్రకాశింపుచు, మూఁడు లోకంబులయందునుదన పేరు ప్రసిద్ధి వహింప మహాపరాక్రముఁడై చలంబునశత్రువుఁ

యథా మనుర్మహాతేజా లోకస్య పరిరక్షితా,
తథా దశరథో రాజా వసన్ జగదపాలయత్. ౪

తేన సత్యాభిసంధేన త్రివర్గమనుతిష్ఠతా,
పాలితా సా పురీ శ్రేష్ఠా ఇంద్రేణేవామరావతీ. ౫

తస్మిన్పురవరే హృష్టా ధర్మాత్మానో బహుశ్రుతాః,
నరాస్తుష్టా ధనైస్స్వైస్స్వైరలుబ్ధాస్సత్యవాదినః. ౬

నాల్పసన్నిచయః కశ్చిదాసీత్తస్మిన్ పురోత్తమే,
కుటుంబీ యో హ్యసిద్ధార్థోఽగవాశ్వధనధాన్యవాన్. ౭

కామీ వా న కదర్యో వా నృశంసః పురుషః క్వచిత్,
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నావిద్వాన్న చ నాస్తికః. ౮

సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలాస్సుసంయతాః,
ఉదితాశ్శీలవృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః. ౯

నాకుండలీ నామకుటీ నాస్రగ్వీ నాల్పభోగవాన్,
నామృష్టో నానులిప్తాంగో నాసుగంధశ్చ విద్యతే. ౧౦

జక్కఁడిచి, యింద్రకుబేరులుంబోలె వివిధధనంబులఁ గూడఁబెట్టుచు నిక్ష్వాకు వంశపురాజులలోపల నతిరథుండై, జితేంద్రియుండై మహాతేజుండగు వైవస్వతమనువుం బోలె భూమండలముం బాలింపుచుండెను. ౧-౪

ఆదశరథమహారాజు, సత్యమునందు శ్రద్ధగలిగి, ధర్మార్థకామంబులనను షరింపుచు, నింద్రుఁ డమరావతీపురిని బాలించునట్లు, ఆయయోధ్యాపట్టణమును బాలించెను. ౫

ఆయయోధ్యా పట్టణమందుమనుష్యులందఱునుమనస్సంతోషముగలిగి ధర్మస్వభావులై, యధికముగ శాస్త్రాభ్యాసముచేసి, మేరమీఱినయాశలేక తమ వర్ణాశ్రమధర్మములకుఁదగినట్లు తమకుదొరకొనుధనంబులం దృప్తింబొందుచు సత్యవాదులై యుండిరి. ౬

కొంచెముగాఁ గోశముగలిగి, ధర్మార్థకామములబొందనేరక, గోవులును గుఱ్ఱములును ధనధాన్యములు నేమియులేక, గొప్పకుటుంబము గలిగియుండు వాఁ డెవ్వఁడును లేఁడు. ౭

ఆయయోధ్యాపట్టణమందు, ఒకానొకచోటనైనను గాముకుఁడుగాని, యతిలోభంబునఁ దన్నుధర్మమును గొడుకులను భార్యను దలిదండ్రులను దోఁబుట్టువులనుం బీడించువాఁడుగాని, పండితుఁడు కానివాఁడుగాని, నాస్తికుఁడుగాని, యొకఁడైనను దొరకొనఁడు. ౮

ఆయయోధ్యాపట్టణమందుఁ, బురుషులును స్త్రీలునందఱును, ధర్మగుణము నింద్రియనిగ్రహమును గలవారలై, పుట్టిననాఁటనుండి మంచిస్వభావమును మంచియాచారమునుగలిగి, మహర్షులుంబోలెఁ బరిశుద్ధులుగానుండిరి.

కర్ణభూషణంలేనివాఁడును, శిరోభూషణములేనివాఁడును, పుష్పమాలలేనివాఁడును, అల్పసుఖియుం, అభ్యంగరహితుఁడును, మైపూఁతలేనియొడలుగలవాఁడును, పరిమళద్రవ్యము లేనివాఁడును ఆయయోధ్యలో లేఁడు. ౧౦

నామృష్టభోజీ నాదాతా నాప్యనంగద నిష్కధృక్,
నాహస్తాభరణో వాపి దృశ్యతే నాప్యనాత్మవాన్. ౧౧

నానాహితాగ్నిర్నాయజ్వా న క్షుద్రో వా న తస్కరః,
కశ్చిదాసీదయోధ్యాయా న్నచ నిర్వృత్త సంకరః. ౧౨
స్వకర్మనిరతా నిత్యం బ్రాహ్మణా విజితేంద్రియాః,
దానాధ్యయనశీలాశ్చ సంయతాశ్చ పరిగ్రహే. ౧౩

న నాస్తికో నానృతకో న కశ్చిదబహుశ్రుతః,
నాసూయకో నచాశక్తో నావిద్వాన్ విద్యతే తదా. ౧౪

నాషడంగవిదత్రాసీన్నావ్రతో నాసహస్రదః,
న దీనః క్షిప్తచిత్తో వా వ్యథితో వాపి కశ్చన. ౧౫

కశ్చిన్నరో వా నారీ వా నాశ్రీమాన్ నాప్యరూపవాన్,
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నా పి రాజన్యభక్తిమాన్. ౧౬
వర్ణే ష్వగ్ర్యచతుర్థేషు దేవతాతిథిపూజకాః,
కృతజ్ఞాశ్చ వదాన్యాశ్చ శూరా విక్రమసంయుతాః. ౧౭
దీర్ఘాయుషో నరాస్సర్వే ధర్మం సత్యం చ సంశ్రితాః,
సహితాః పుత్రపౌత్రైశ్చ నిత్యం స్త్రీభిః పురోత్తమే. ౧౮

మఱియుఁ గడుపునిండ భుజించనివాఁడును,దానము చేయనివాఁడును, బాహుపురులను రొమ్మున ధరింపఁదగినపతకము ధరింపనివాఁడును, కడియములు లేనివాఁడును, ఇంద్రియవశీభూతుండును గానరాఁడు. ౧౧

ఆహితాగ్ని కానివాఁడును, యాగము చేయనివాఁడును, నీచుఁడును, దొంగయు,వర్ణసంకరము చేయువాఁడును నాయయోధ్యాపురంబున లేఁడు. ౧౨

ఆయయోధ్యాపట్టణమందు, బ్రాహ్మణులందఱు నెల్లప్పుడును దమ కర్మముల ననుష్ఠింపుచు, జితేంద్రియులై యతిథుల కభీష్టంబుల నొసంగుచు, వేదంబులఁ బఠింపుచుఁ, గొంచెముగఁ బరిగ్రహము సేయుచు (అని గోవిందరాజాభిప్రాయము) స్వభార్యామాత్రగాములై పరదారపరాఙ్ముఖులై యున్నారు (అని మహేశ్వరతీర్థాభిప్రాయము.) ౧౩

ఆదశరథుఁడు పరిపాలించునప్పుడు నాస్తికుఁడును, కల్లలాడువాఁడును, మిగుల శాస్త్రాభ్యాసము లేనివాఁడును, పరుల మేలోర్వనివాఁడును, అసమర్థుఁడును, జ్ఞానహీనుఁడును లేఁడు. ౧౪

ఆ యయోధ్యలో షడంగముల నెఱుఁగనివాఁడును, వ్రతముల సలుపనివాఁడును, సహస్రజనులకు దానము సేయనివాఁడును, దైన్యముగలవాఁడును, కలఁతపడు చిత్తముగలవాఁడును, రోగియు నొకఁడేని లేఁడు. ౧౫

ఆయోధ్యాపట్టణమందు సమస్త పురుషులును, సమస్త స్త్రీలును గాంతియును రూపమునుం గలిగి రాజభక్తియుక్తులై యుండిరి. ౧౬

ఆయోధ్యాపట్టణమందు క్షత్రియ వైశ్య శూద్రులందఱును దేవతల నతిథులఁ బూజింపుచు,నుపకారజ్ఞులై యత్యంతముగా దానము సేయుచు,మిక్కిలి పరాక్రమముగలిగి యుద్ధములందు వెనుదీయని వారైనను, ఎల్లయుద్ధములందును జయము గొనుచుండుటంబట్టి దీర్ఘకాలము జీవింపుచు, ధర్మము సత్యంబు నవలంబించి కొడుకులును మనుమలునుం గలిగి, తమకు సన్న్యాసాశ్రమము నిషిద్ధమైనందున నెల్లప్పుడును గృహస్థాశ్రమమందే వర్తింపుచు నుండిరి. ౧౭,౧౮

క్షత్రం బ్రహ్మముఖం చాసీద్వైశ్యాః క్షత్రమనువ్రతాః,
శూద్రాస్స్వధర్మనిరతా స్త్రీన్వర్ణానుపచారిణః. ౧౯

సా తేనేక్ష్వాకునాథేన పురీ సుపరిరక్షితా,
యథా పురస్తాన్మనునా మానవేంద్రేణ ధీమతా. ౨౦

యోధానామగ్నికల్పానాం పేశలానామమర్షిణామ్,
సంపూర్ణా కృతవిద్యానాం గుహా కేసరిణామివ. ౨౧

కాంభోజవిషయే జాతైర్బాహ్లీకైశ్చ హయోత్తమైః,
వనాయుజైర్నదీజైశ్చ పూర్ణా హరిహయోత్తమైః. ౨౨

వింధ్యపర్వతజైర్మత్తైః పూర్ణా హైమవతైరపి,
మదాన్వితైరతిబలై ర్మాతంగైః పర్వతోపమైః. ౨౩
ఐరావతకులీనైశ్చ మహాపద్మకులైస్తథా,
అంజనాదపి నిష్పన్నై ర్వామనాదపిచ ద్విపైః. ౨౪

భద్రైర్మంద్రైర్మృగైశ్చైవ భద్రమంద్రమృగైస్తథా,
భద్రమంద్రైర్భద్రమృగైర్మృగమంద్రైశ్చ సా పురీ,
నిత్యమత్తైస్సదా పూర్ణా నాగైరచలసన్నిభైః. ౨౫
సా యోజనే చ ద్వే భూయస్సత్యనామా ప్రకాశతే,

క్షత్రియులు బ్రాహ్మణుల ననుసరించియుండిరి, వైశ్యులా క్షత్రియుల ననువర్తింపుచుండిరి. శూద్రులు బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులనుం గొలుచుచు, నాముగ్గురిని సేవించుటయనెడు స్వధర్మమందు వ్యవస్థితులుగా నుండిరి. ౧౯

బుద్ధిమంతుఁడును మనుష్యులకుఁ బ్రభువు నగు వైవస్వత మనువు, పూర్వ మయోధ్యానగరము నెట్లు రక్షించెనో, ఆప్రకారముగనే యిక్ష్వాకు వంశమురాజులలో మేటి యగు నాదశరథుఁ డయోధ్యానగరమును రక్షింపుచుండెను. ౨౦

ఆయయోధ్యాపట్టణమందు 'సమస్తశస్త్రవిద్యల నభ్యసించి శౌర్యంబున నిప్పువలెఁ బరిభవింప నశక్యులై, కొంచెమైనను గౌటిల్యములేక చాలఁ గోపముఁగలిగి వఱలుచున్న భటులు పర్వతగుహాయందు సింగంబులుం బోలె నిండియుండిరి. ౨౧

ఆయయోధ్యయందుఁ గాంభోజబాహ్లీకవనాయుం సింధుదేశము లందుఁబుట్టి యుచ్చైశ్శ్రవముతో సరియై వెలుఁగుచున్న శ్రేష్ఠములైన గుఱ్ఱములు మెండుగా నిండి యుండినవి. ౨౨

ఆ యయోధ్యయందు వింధ్యపర్వతమునందుఁ బుట్టినమత్తగజములును, హిమవద్గిరియందు జనియించిన యతిబలాఢ్యములగు మదపుటేనుంగులును, ఐరావతవంశమునందు సంభవించిన మత్తేభంబులును, పుండరీకకులంబునం దుత్పత్తినొందిన మాతంగంబులును, అంజన వామన సంతతులంగల్గినకుంజరంబులును నిండియుండినవి. ౨౩, ౨౪

ఆయయోధ్యాపట్టణమందు "భద్రములు, మంద్రములు, మృగములు, భద్రమంద్రమృగములు, భద్రమంద్రములు, భద్రమృగములు, మృగమంద్రములు" అనుగజజాతులలో నన్నిటియందును ఎల్లప్పుడు మదించి పర్వతములుం బోలె నున్నతములై యుండు నేనుంగులును నిండియుండినవి. ౨౫

ప్రపంచమునంతయుఁ బాలింపుచుండిన దశరథమహారాజునకు నివాసస్థానమైనయయోధ్యాపురము పట్టణమునకు వెలుపలనైతము రెండుయోజన

యస్యాం దశరథో రాజా వసన్ జగదపాలయత్. ౨౬

తాం పురీం స మహాతేజా రాజా దశరథో మహాన్,
శశాస శమితామిత్రో నక్షత్రాణీవ చంద్రమాః. ౨౭

తాం సత్యనామాం దృఢతోరణార్గళాం
గృహైర్విచిత్రైరుపశోభితాం శివామ్,
పురీమయోధ్యాం నృసహస్రసంకులాం
శశాస వై శక్రసమో మహీపతిః. ౨౮

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాణ్డే, షష్ఠస్సర్గః.

---

## సప్తమస్సర్గః

తస్యామాత్యా గుణైరాసన్నిక్ష్వాకోస్తు మహాత్మనః,
మంత్రజ్ఞాశ్చేంగితజ్ఞాశ్చ నిత్యం ప్రియహితే రతాః. ౧

అష్టౌ బభూవుర్వీరస్య తస్యామాత్యా యశస్వినః,
శుచయశ్చానురక్తాశ్చ రాజకృత్యేషు నిత్యశః. ౨

ధృష్టిర్జయంతో విజయస్సిద్ధార్థో హ్యర్థసాధకః,
అశోకో మంత్రపాలశ్చ సుమంత్రశ్చాష్టమోఽభవత్. 3

ములదూరము శత్రువులకెదిరింప నశక్యమై తనదు 'అయోధ్య' యనెడు నామధేయశబ్దముయొక్క యర్థము యథార్థముగాఁ దనయందున్నదని తెల్పుచుఁ ప్రకాశించుచున్నది. ౨౬॥

అధికంబగు పరాక్రమముగలిగి జనరంజనసామర్థ్యముతో వెలుంగుచున్న దశరథమహారాజు శత్రువులం జక్కడిచి చంద్రుఁడు తనభార్యలగు నక్షత్రంబులంబోలె జనులకందఱకును సౌఖ్యంబు గలుగఁ జేయుంచు, నాయయోధ్యను బాలింపుచుండెను. ౨౭॥

శత్రువులకెదిరింప నశక్యమైనందున యథార్థమగు 'అయోధ్య' అను పేరం బరఁగుచు దిటవు గలద్వారములు గడియమ్రాకులు నాశ్చర్యకరములైన గృహంబులుంగలిగి యెల్లప్పుడు మంగళోపేతమై వేనవేలమనుష్యులచే నిండియున్న యాయయోధ్యను, ఇంద్రతుల్యుండగు దశరథమహారాజు పాలింపుచుండెను. ౨౮॥

ఇట్లు వాల్మీకిమహర్షిప్రోక్తమైన శ్రీరామాయణమను నాదికావ్యమందలి
బాలకాండమున నాఱవసర్గ ముగిసినది.

---

## ఏడవసర్గము

అతిబుద్ధిశాలియగు నాదశరథమహారాజునకుఁ బ్రజ్ఞాదిబలముచేఁ గార్యాలోచనవిధము నెఱింగి ముఖవికాసాదులచేఁ బరులయభిప్రాయములం దెలిసికొనుచు రాజునకు మేలుసేయ నాసక్తులైన మంత్రులుండిరి. ౧

పరాక్రమమును గొప్పకీర్తియును గలదశరథునకుఁ బరిశుద్ధులును ఎల్లప్పుడును రాచకార్యములందు మిక్కిలి యాసక్తులునగు నెనమండ్రు మంత్రులుండిరి. ౨

వారలలో ధృష్టియనువాఁడు మొదటివాఁడు, జయంతుఁడు రెండవ వాఁడు, విజయుండు మూఁడవవాఁడు, సిద్ధార్థుఁడు నాలవవాఁడు, అర్థసాధకుఁడు ఐదవవాఁడు, అశోకుఁడు ఆఱవవాఁడు, మంత్రపాలుఁ డేడవవాఁడు, సుమంత్రుఁ డెనిమిదవవాఁడు నైరి. ౩

ఋత్విజౌ ద్వావభిమతౌ తస్యాస్తామృషిసత్తమౌ,
వసిష్ఠో వామదేవశ్చ మంత్రిణశ్చ తథాపరే. ౪

విద్యావినీతా హ్రీమంతః కుశలా నియతేంద్రియాః,
శ్రీమంతశ్చ మహాత్మానశ్శాస్త్రజ్ఞా దృఢవిక్రమాః. ౫
కీర్తిమంతః ప్రణిహితా యథావచనకారిణః,
తేజఃక్షమాయశః ప్రాప్తాస్స్మితపూర్వాభిభాషిణః. ౬

క్రోధాత్కామార్థహేతోర్వా న బ్రూయురనృతం వచః. ౬½

తేషామవిదితం కించిత్స్వేషు నాస్తి పరేషు వా,
క్రియమాణం కృతం చాపి చారేణాపి చికీర్షితమ్. ౭½

కుశలా వ్యవహారేషు సౌహృదేషు పరీక్షితాః,
ప్రాప్తకాలం తు తే దండం ధారయేయుస్సుతేష్వపి, ౮½

కోశసంగ్రహణే యుక్తా బలస్య చ పరిగ్రహే,
అహితం చాపి పురుషం న విహింస్యురదూషకమ్. ౯½

వీరాశ్చ నియతోత్సాహా రాజశాస్త్రమనుష్ఠితాః,
శుచీనాం రక్షితారశ్చ నిత్యం విషయవాసినామ్. ౧౦½

బ్రహ్మక్షత్రమహింసంతస్తే కోశం సమపూరయన్,
సుతీక్ష్ణదండాస్సంప్రేక్ష్య పురుషస్య బలాబలమ్. ౧౧½

ఆ దశరథమహారాజునకు వసిష్ఠుఁడనియు, వామదేవుఁడనియుం బిద్దఱుమహర్షులు ప్రధానపురోహితులుగ నుండిరి. అట్లే ఇతరులైన పురోహితులును మంత్రులు నుండిరి. ౪

ఆమంత్రులు సమస్తవిద్యలందును నేర్పరులై, యకార్యములవలన లజ్జచే నివర్తిల్లుచు,యుక్తాయుక్త పర్యాలోచనమునందు సమర్థులై, యుక్తంబగు నింద్రియవ్యాపారముగలిగి శ్రీమంతులై, బుద్ధిమంతులై, సమస్తశాస్త్రముల నెఱింగి పరాక్రమమునం దెదురు లేక,ప్రజలచేఁ గీర్తితులై,రాజకార్యములం దప్రమత్తులై, మాటదాఁటక జరిగించుచుఁ,బ్రతాపంబున నోర్పునం గీర్తి వహించి, మాత్సర్యములేక చిఱునవ్వుతో మాటలాడుచు నుండిరి. ౫, ౬

ఆమంత్రులు, కోపమువలన నైనను, కామనిమిత్తమైనను, అర్థనిమిత్తమైనను అసత్యము పలుకరు. ౭॥

తమరాజ్యములందును బరరాజ్యములందును చేయఁబడుచుండు నది గాని, చేయఁబడినదిగాని, చేయ నిశ్చయింపఁబడినదిగాని, యేదియైనను వేగు వానిమూలముగా నామంత్రులు తెలిసికొననిది లేదు. ౮॥

వ్యవహారములందు సమర్థులును, న్యాయవిచారణమున మిత్రశత్రులందును సమముగానుండువారు నగు నామంత్రులు తమకొడుకులైన నపరాధము చేసినచో, సరియైనదండమును విధింతురు. ౯॥

ఆమంత్రులు, బొక్కసమును వృద్ధిఁబొందింపుచు, సైన్యముల సంగ్రహించి కాపాడుచుఁ, దమకు శత్రువైనను, అపరాధము సేయనివాని నెంత మాత్రమును బీడింపరు. ౧౦॥

ఆమంత్రులు, శత్రువులజయింప సమర్థులై, యెల్లప్పుడును మిక్కిలి సంతోషముతోఁ బ్రయత్నములు సేయుచు,నీతిశాస్త్రోక్తపద్ధతిని గార్యములనడుపుచు, సమస్తస్థలములయందునుండు సాధుపురుషుల సంరక్షింపుచు నుండిరి.

ఆమంత్రులు బ్రాహ్మణక్షత్రియులఁ బీడింపక, అపరాధిబలాబలములఁ జక్కఁగాఁ బరీక్షించి, ప్రబలునకుఁ దీవ్రశిక్షయును దుర్బలునకు మృదు శిక్షయు విధింపుచు, బొక్కసమును నింపుచుండిరి. ౧౧॥

శుచీనామేకబుద్ధీనాం సర్వేషాం సంప్రజానతామ్,
నాసీత్పురే వా రాష్ట్రే వా మృషావాదీ నరః క్వచిత్. ౧౨½

కశ్చిన్న దుష్టస్తత్రాసీత్పరదారరతో నరః,
ప్రశాంతం సర్వమేవాసీద్రాష్ట్రం పురవరం చ తత్. ౧౩½

సువాససస్సు వేషాశ్చ తే చ సర్వే సుశీలినః,
హితార్థం చ నరేంద్రస్య జాగ్రతో నయచక్షుషా. ౧౪½

గురౌ గుణగృహీతాశ్చ ప్రఖ్యాతాశ్చ పరాక్రమే,
విదేశేష్వపి విజ్ఞాతాస్సర్వతో బుద్ధినిశ్చయాత్. ౧౫½

సంధివిగ్రహతత్త్వజ్ఞాః ప్రకృత్యా సంపదాఽన్వితాః,
మన్త్రసంవరణే శక్తాశ్శక్తాస్సూక్ష్మాసు బుద్ధిషు. ౧౬½

నీతిశాస్త్రవిశేషజ్ఞాస్సతతం ప్రియవాదినః. ౧౭

ఈదృశైస్తైరమాత్యైస్తు రాజా దశరథోఽనఘః,
ఉపపన్నో గుణోపేతైరన్వశాసద్వసుంధరామ్. ౧౮
అవేక్షమాణశ్చారేణ ప్రజా ధర్మేణ రంజయన్,
ప్రజానాం పాలనం కుర్వన్న ధర్మాన్ పరివర్జయన్. ౧౯

ఆమంత్రులందఱుఁ, బరస్పర మసూయపడక యేకకంఠులై, యైకమత్యముగలిగి, రాజ్యతంత్రములు విచారింపుచుండఁగా నయోధ్యాపట్టణమందును, దేశములయందును, ఏమూలయందైనను దబ్బఱలాడుమనుష్యుఁడు లేకపోయెను. ౧౨॥

ఆరాజ్యమునం దొకానొకఁడేనియుఁ గుటిలుఁడుగాని పరభార్యాసక్తుఁడుగాని లేకుండెను. ఆపట్టణశ్రేష్ఠమును ఆదేశమును దశరథపాలితమగు ప్రదేశ మంతయును మిక్కిలి శాంతముగనే యుండెను. ౧౩॥

ఆమంత్రులందఱును, మంచివస్త్రములు మంచి యలంకారములు మంచి యాచారములుఁ గలిగి, రాజునకు మేలుగలుగుటకై, యెల్లప్పుడును రాజనీతి యుక్తముగానే యెంతమాత్రము నేమఱక ప్రవర్తింపుచుండిరి. ౧౪॥

ఆమంత్రులందఱును, గురుజనమందు గుణములమాత్రము గ్రహించి దోషంబుల గణింపక గౌరవము నెఱపుచు, "గొప్పపరాక్రమము గలవా"రని వినుతినొందినవారై, అన్నివిషయములందు నిశ్చయజ్ఞానము గలిగియుండుటం బట్టి యెల్ల దేశంబులందును బ్రసిద్ధులై యుండిరి. ౧౫॥

ఆమంత్రులందఱును, ఎప్పుడు ఎవనితో సంధిసేయవలెనో, ఎప్పుడు ఎవనితో యుద్ధము సేయవలెనో ఆనిర్ణయమంతయుఁ నెఱిఁగినవారలై, పుట్టిననాఁటనుండి స్వతస్సిద్ధంబగు నైశ్వర్యంబునఁ బొదలుచు, మంత్రరహస్యంబుల నెవ్వరికిఁ దెలియరాకుండునట్లు మఱుఁగు పఱచుటకు దురవగాహంబులగు సూక్ష్మార్థంబుల నిర్ణయించుటకు నతిసమర్థులై యుండిరి. ౧౬

ఆమంత్రులందఱును, ఎవ్వని నెట్లు ఎప్పుడు శిక్షించఁదగునో ఆ నీతివిశేషముల నెఱింగినవారై, ఎల్లప్పుడును అందఱకు నింపు జనించునటులు మాటలాడువారుగా నుండిరి. ౧౭

పాపరహితుఁడగు దశరథమహారాజు సద్గుణగణమండనులగు నీలాటి మంత్రులతోఁ గూడినవాఁడై భూమిని బరిపాలించెను. ౧౮॥

పురుషశ్రేష్ఠుఁడైన యాదశరథమహారాజు, వేగువాండ్రవలన నిఖిల దేశవృత్తాంతంబుల నెఱుంగుచు, నపరాధులనెల్ల దండించి ప్రజలకు సంతో

విశ్రుతస్త్రిషు లోకేషు వదాన్యస్సత్యసంగరః,
స తత్ర పురుషవ్యాఘ్రశ్శశాస పృథివీమిమామ్. ౨౦

నాధ్యగచ్ఛద్విశిష్టంవా తుల్యంవా శత్రుమాత్మనః,
మిత్రవాన్నతసామంతః ప్రతాపహతకంటకః. ౨౧

స శశాస జగద్రాజా దివం దేవపతిర్యథా, ౨౧½
తైర్మంత్రిభిర్మంత్రహితే నివిష్టైః
వృతోఽనురక్తైః కుశలైస్సమర్థైః,
స పార్థివో దీప్తిమవాప యుక్త
స్తేజోమయైర్గోభిరివోదితోఽర్కః. ౨౨½

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాణ్డే, సప్తమస్సర్గః

---

## అష్టమస్సర్గః

తస్య త్వేవం ప్రభావస్య ధర్మజ్ఞస్య మహాత్మనః,
సుతార్థం తప్యమానస్య నాసీద్వంశకరస్సుతః. ౧

చింతయానస్య తస్యైవం బుద్ధిరాసీన్మహాత్మనః,

షము కల్పించుచుఁ, బ్రజలకు సౌఖ్యముఁగలుగునట్లు రక్షింపుచు, నధర్మమును బాఱిందోలి, తనకీర్తి మూఁడులోకంబులయందును వినుతికెక్క, మహా దాతయై, సత్యప్రతిజ్ఞుఁడై, యయోధ్యానగరంబున నివసించి, యీభూమండలంబంతయుఁ బాలింపుచుండెను. ౧౯, ౨౦

మిత్రసంపన్నుఁడగు దశరథమహారాజు, సామంత ప్రభువులందఱుఁ బాదానతులై, దన్నుఁ గొల్చుచుండఁ, బేరువినినంతనె తన ప్రతాపముఁ దలఁచి, శత్రువులందఱు విచ్చవడి పాఱిపోవ, నిష్కంటకుఁడై పుడమిఁ బాలింపుచుఁ, దనకన్న నధికుఁడుగాని సమానుఁడుగానియగు శత్రువెట్టివాఁడో యొకఁడుగలేనివాఁ డాయెను. ౨౦

ఆదశరథమహారాజు దేవేంద్రుఁడు స్వర్గమునువలె జగత్తును బరిపాలించెను.

ఆలోచనమందును దనకు మేలుసేయుటయందు నభినివిష్టులై, తన యందనురాగముఁగలిగి, సమస్తకార్యములయందునుసమర్థులైయుండు మంత్రులతోఁ గూడియున్న యాదశరథమహారాజు, తేజోరూపంబులగుటం జేసి పరులఁబరిభవింప సమర్థములైన కిరణములతోఁ గూడి యుదయించిన బాలసూర్యుఁడుఁబోలెఁ బ్రకాశించెను. ౨౨-౪

ఇట్లు వాల్మీకిమహర్షి ప్రోక్తమైన శ్రీరామాయణమను నాదికావ్యమందలి బాలకాండమున ఏడవసర్గ ముగిసినది.

## ఎనిమిదవసర్గము

ఇట్టిప్రభావముగల యాదశరథమహారాజు, ధర్మముల నెఱింగి ప్రవర్తింపుచు, ధర్మస్వభావముఁగలిగి, సంతానముగలుగుటకుఁ బ్రతిబంధక ములు లేకపోయినను దనకుఁ బుత్రుఁడుగలుగమింజేసి పరితపింపుచున్నను, వానికి వంశకరుఁడగు కుమారుఁడు జనింపలేదు. ౧

పుత్రుఁడు కలుగలేదని చింతింపుచున్న మహాబుద్ధిశాలియగు నాదశరథ

సుతార్థం హయమేధేన కిమర్థం న యజామ్యహమ్. ౨

స నిశ్చితాం మతిం కృత్వా యష్టవ్యమితి బుద్ధిమాన్,
మంత్రిభిస్సహ ధర్మాత్మా సర్వైరేవ కృతాత్మభిః. 3
తతోఽబ్రవీదిదం రాజా సుమంత్రం మంత్రిసత్తమమ్,
శీఘ్రమానయ మే సర్వాన్గురూంస్తాన్ సపురోహితాన్. ౪

తతస్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరితవిక్రమః,
సమానయత్స తాన్ సర్వాన్ సమస్తాన్వేదపారగాన్. ౫
సుయజ్ఞం వామదేవం చ జాబాలిమథ కాశ్యపమ్,
పురోహితం వసిష్ఠం చ యే చాన్యే ద్విజసత్తమాః. ౬
తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథస్తదా,
ఇదం ధర్మార్థసహితం శ్లక్ష్ణం వచనమబ్రవీత్ ౭
మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్,
తదహం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. ౮
తదహం యష్టుమిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా,
కథం ప్రాప్స్యామ్యహం కామం బుద్ధిరత్ర విచార్యతామ్. ౯

తతస్సాధ్వితి తద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్,
వసిష్ఠప్రముఖాస్సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. ౧౦

ఊచుశ్చ పరమప్రీతాస్సర్వే దశరథం వచః,
సంభారాస్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౧౧

మహారాజునకు, ఇదివఱకు నేనేల యశ్వమేధయాగముచే దేవతల నారాధింపలేదు? అని తలంపు వొడమినది. ౨

బుద్ధిశాలియుం ధర్మస్వభావుఁడునగు నాదశరథమహారాజు, మంత్రకార్యంబుల నారితేరి యెంతకునుం జాలియున్న మంత్రులందఱితో 'యాగము సేయవలసినది' అని గట్టిగా నాలోచనచేసి, యావిష్మట మంత్రిశ్రేష్ఠుఁడగు సుమంత్రునకు, 'మాగురువులఁ బురోహితుల నందఱిం దోడితెమ్ము' అని యాజ్ఞాపించెను. ౩, ౪

అనంతరము శీఘ్రగతిగలసుమంత్రుఁడు వెళ్లి, సుయజ్ఞుని వామదేవుని జాబాలికాశ్యపులు పురోహితుఁడగువసిష్ఠుని యింక యేయే వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణోత్తములుగలరో వారినెల్లరను దోడితెచ్చెను. ౫, ౬

ధర్మస్వభావుఁడగు దశరథుఁడు వారలఁ బూజించి ధర్మార్థములతోఁ గూడి మనోహరమగు వాక్య మీలాగున చెప్పెను. ౭

పుత్రులకొఱకు మిక్కిలి విలపించుచున్న నాకు సుఖము కలుగనేలేదు. అందువలన అశ్వమేధయాగముచే దేవతల నారాధించెదను. అని నా తలంపు. ౮

కావున శాస్త్రములఁ జూడఁబడిన క్రియాకలాపములచే యాగము చేయుంటకుఁ గోరుచున్నాను. నే నెట్లు నాకోర్కెబడయఁగలను? ఈవిషయమున విచారింపఁబడుగాత. ౯

అంతట వసిష్ఠుఁడు మొదలుగా బ్రాహ్మణులందఱును, సామ్రాజముఖంబునుండి బయలువెడలిన ధర్మిష్ఠమగు నావాక్యమును, 'చక్కఁగానున్నది' అని శ్లాఘించిరి. ౧౦

మిక్కిలి ప్రీతులగుచును దశరథునిగూర్చి పల్కిరి. ౧౦½

ఆప్రసిద్ధములగు యజ్ఞోపకరణములు సంపాదింపఁబడుగాక గుఱ్ఱము విడువఁబడుగాక. ౧౧

సర్వథా ప్రాప్స్యసే పుత్త్రానభిప్రేతాంశ్చ పార్థివ,
యస్య తే ధార్మికీ బుద్ధిరియం పుత్త్రార్థమాగతా. ౧౨
తతః ప్రీతోఽభవద్రాజా శ్రుత్వా తద్ద్విజభాషితమ్,
అమాత్యాంశ్చాబ్రవీద్రాజా హర్షపర్యాకులేక్షణః. ౧౩

సంభారాస్సంభ్రియంతాం మే గురూణాం వచనాదిహ,
సమర్థాధిష్ఠితశ్చాశ్వస్సోపాధ్యాయో విముచ్యతామ్. ౧౪

సరయ్వాశ్చోత్తరే తీరే యజ్ఞభూమిర్విధీయతామ్,
శాంతయశ్చాభివర్ధంతాం యథాకల్పం యథావిధి. ౧౫
శక్యః ప్రాప్తుమయం యజ్ఞస్సర్వేణాపి మహీక్షితా,
నాపరాధో భవేత్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. ౧౬
ఛిద్రం హి మృగయంతేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః,
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. ౧౭

తద్యథా విధిపూర్వం మే క్రతురేష సమాప్యతే,
తథా విధానం క్రియతాం సమర్థాః కరణేష్విహ. ౧౮

తథేతి చాబ్రువన్ సర్వే మంత్రిణః ప్రత్యపూజయన్,
పార్థివేంద్రస్య తద్వాక్యం యథాజ్ఞప్తం నిశమ్య తే. ౧౯
తథా ద్విజాస్తే ధర్మజ్ఞా వర్ధయంతో నృపోత్తమమ్,

రాజా! పుత్రార్థము నీ కిట్టిధార్మికబుద్ధి జనించినది. కావున నన్ని విధంబుల నుత్తమగుణు లగుకుమారులం బడసెదవు. ౧౨

అనంతరము దశరథమహారాజు బ్రాహ్మణోత్తములమాటలవిని సంతోషముచే కలఁతపడిన కనుఁగవలుకలవాఁడై మంత్రులతో (ముందుచెప్పఁబోవు మాదిరి) చెప్పెను. ౧౩

ఇప్పుడు నాగురువుల వాక్యమువలన కార్యోపకరణములు సంపాదింపఁబడుఁగాక. నేర్పరులచే రక్షింపఁబడినదియు, గురువుతోఁగూడినగుఱ్ఱము విడువఁబడుఁగాక. ౧౪

సరయూనదికి ఉత్తరపుదిశగట్టునందు యాగభూమి చేయఁబడుఁగాక. తచ్ఛాంతులును యథాశాస్త్రముగ యథాక్రమముగ వృద్ధినొందెడుఁగాక. ౧౫

ఈయశ్వమేధయాగమునం దపాయకరమైనయుపచారము గలుగుట కవకాశము లేకున్నట్టైన, దీని సమస్తరాజులును జేయ సమర్థులు కాఁగలరు.

బ్రాహ్మణులుగానుండి యాగములుచేయుటయందుఁ బ్రమాదంబులం గలుగుటంజేసి రాక్షసత్వంబు నొందిన బ్రహ్మరాక్షసులు, యాగములందుఁ గలుగునపరాధంబులఁ జక్కగా నెఱింగియున్నవారు కావున, నీయశ్వమేధ యాగము సేయునప్పుడును, అపరాధంబులనే వెదకుచు యాగమును జెఱుపం జూతురు. యాగముచెడినచో దానియజమానుఁడును అప్పుడే నశించును. ౧౬

కావున ఎట్లు నా ఈ యశ్వమేధయాగము శాస్త్రప్రకారము తుదముట్టునో, అట్లు తగుప్రయత్నము చేయఁబడుఁగాక. మీరలు కార్యభారములయందు నేర్పరులరు. ౧౭

దశరథమహారాజు వాక్యమును విని, యామంత్రులందఱును 'ఆజ్ఞాప్రకారము చేసెదము' అని మనవిచేసి శ్లాఘించిరి. ౧౮

ధర్మజ్ఞులగు నాబ్రాహ్మణు లందఱును, దశరథమహారాజునను 'నీవు కోరినపద్ధతినే, యజ్ఞము నిర్విఘ్నముగాఁ దుదముట్టెడు' నని యాశీర్వా

అనుజ్ఞాతా_స్తతస్సర్వే పునర్జగ్ముర్యథాగతమ్. ౨౦

విసర్జయిత్వా తా౯ విప్రా౯ సచివానిదమబ్రవీత్,
ఋత్విగ్భిరుపదిష్టోఽయం యథావత్క్రతురాప్యతామ్. ౨౧

ఇత్యుక్త్వా నృపశార్దూలస్సచివా౯ సముపస్థితా౯,
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. ౨౨
తతస్స గత్వా తాః పత్నీర్నరేంద్రో హృదయప్రియాః,
ఉవాచ దీక్షాం విశత యక్ష్యేఽహం సుతకారణాత్. ౨౩

తాసాం తేనాతికాంతేన వచనేన సువర్చసామ్,
ముఖపద్మాన్యశోభంత పద్మానీవ హిమాత్యయే. ౨౪

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాణ్డే అష్టమస్సర్గః

---

నవమస్సర్గః

...చ్ఛ్రుత్వా రహస్సూతో రాజానమిదమబ్రవీత్. ౪

ఋత్విగ్భిరుపదిష్టోఽయం పురావృత్తో మయా శ్రుతః. ౧

సనత్కుమారో భగవా౯ పూర్వం కథితవా౯ కథామ్,
ఋషీణాం సన్నిధౌ రాజ౯ తవ పుత్రాగమం ప్రతి. ౨

దయచేసి, యతనిచే సనుజ్ఞాతులై, వచ్చునపుడు తమకుఁగలిగిన గౌరవము లతో వెళ్లిరి. ౨౦

దశరథమహారాజు ఆబ్రాహ్మణులనందఱం బంపి,"ఋత్విక్కులు చెప్పిన ప్రకారము, యాగోపకరణద్రవ్యంబుల నన్నింటిని సంపాదింపుఁడు" అని మంత్రుల కాజ్ఞాపించెను. ౨౧

తేజశ్శాలియగు దశరథమహారాజీప్రకారముగచెప్పి చెంగటనున్న మంత్రులవదలి తనయిల్లు సేరెను. ౨౨

అంతట, నాదశరథమహారాజు, ఇంటిలోనికివెళ్లి, తనమనఃప్రియలగు కౌసల్యాదిపత్నులంజూచి "మీరు దీక్షనొందుఁడు, నేను బుత్రుఁడుగలుఁగుటకై యాగముచేసెదను" అనిచెప్పెను. ౨౩

అతిమనోహరంబగు నామాటను వినఁగానే, హేమంతఋతువు గడచినపిదపఁ గమలములు ప్రకాశించునట్లు, లాదశరథకాంతలముఖములు ప్రకాశించినవి. ౨౪

ఇది శ్రీవాల్మీకిప్రోక్తంబగు శ్రీరామాయణమను నాదికావ్యమునందు
బాలకాండమున నెనిమిదవసర్గము.

---

## తొమ్మిదవ సర్గము

సారథియగు సుమంత్రుఁ డీవార్తవిని వక్ష్యమాణప్రకారము రాజును గూర్చి పలుకుచున్నాఁడు.

ఈవసిష్ఠాదిమహర్షు లుపదేశించిన పుత్రప్రాప్త్యుపాయమును నేను బూర్వము ఇతిహాసరూపముగా వినియున్నాను. ౧

మున్ను భూతభవిష్యద్వర్తమానజ్ఞానాదిమాహాత్మ్యములుగల సనత్కుమారమహర్షి, ఋషులందఱును వినుచుండ నీపుత్రప్రాప్తినిగుఱించి జరుగంబోవు నొకకథను జెప్పెను. ౨

కాశ్యపస్య తు పుత్రో౽స్తి విభండక ఇతి శ్రుతః,
ఋశ్యశృంగ ఇతి ఖ్యాత స్తస్య పుత్రో భవిష్యతి. ౩
స వనే నిత్యసంవృద్ధో మునిర్వనచరస్సదా,
నాన్యం జానాతి విప్రేంద్రో నిత్యం పిత్రనువర్తనాత్. ౪

ద్వైవిధ్యం బ్రహ్మచర్యస్య భవిష్యతి మహాత్మనః,
లోకేషు ప్రథితం రాజన్ విప్రైశ్చ కథితం సదా. ౫

తస్యైవం వర్తమానస్య కాలస్సమభివర్తత,
అగ్నిం శుశ్రూషమాణస్య పితరం చ యశస్వినమ్. ౬

ఏతస్మిన్నేవ కాలేతు రోమపాదః ప్రతాపవాన్,
అంగేషు ప్రథితో రాజా భవిష్యతి మహాబలః. ౭

తస్య వ్యతిక్రమాద్రాజ్ఞో భవిష్యతి సుదారుణా,
అనావృష్టిస్సుఘోరా వై సర్వభూతభయావహా. ౮
అనావృష్ట్యాం తు వృత్తాయాం రాజా దుఃఖసమన్వితః,
బ్రాహ్మణాన్ శ్రుతవృద్ధాంశ్చ సమానీయ ప్రవక్ష్యతి. ౯
భవంతశ్శ్రుతధర్మాణో లోకచారిత్రవేదినః,
సమాదిశంతు నియమం ప్రాయశ్చిత్తం యథా భవేత్. ౧౦
వక్ష్యంతి తే మహీపాలం బ్రాహ్మణా వేదపారగాః. ౧౦½

విభండకసుతం రాజన్ సర్వోపాయైరిహానయ. ౧౧

కాశ్యపమహర్షికి విభండకుఁడను తనయుండు గలఁడు. అతనికి ఋశ్య
శృంగుఁ డను ప్రసిద్ధుఁడగుపుత్త్రుఁడు కాఁగలఁడు. ౩

అఋశ్యశృంగమహాముని విడువక యడవిలోనే పెరిఁగి యడవిలోనే యెల్లప్పుడును సంచరింపుచునడవిలోనుండుతండ్రిగారినే యనుసరింపుచు నుండుటంజేసి యడవికన్న నితరములగునగరగ్రామములనుగాని యందుండు విశేష పదార్థములనుగాని యెఱుంగక యుండును. ౪

అఋశ్యశృంగుఁడు లోకంబులందుఁ బ్రసిద్ధమై బ్రాహ్మణులచేఁ గొనియాడంబడురీతిని వ్రతిత్వమునను బ్రాజాపత్యత్వమునను రెండువిధముల బ్రహ్మచర్యముల నొందఁగలఁడు, ౫

అఋశ్యశృంగ మహాముని యగ్నిహోత్రమును గీర్తిసంపన్నుండగు తండ్రిని సేవింపుచుఁగొంత కాలము వ్రతిత్వంబనెడు బ్రహ్మచర్యమం దుండఁగలఁడు. ౬

ఈ కాలమందే యంగదేశమందు మహాపరాక్రమమును మహాబలమునుం గలిగి, జగద్విఖ్యాతుఁడై యుండు రోమపాదుండను రాజొకండుండఁగలఁడు. ౭

ఆరోమపాదుఁడు ధర్మము నతిక్రమించుటంజేసి పెక్కుదేశంబులం బెద్దకాలమువఱకు సర్వప్రాణిభయంకరంబైన యనావృష్టి జనింపంగలదు. ౮

అనావృష్టిరాఁగానే యారోమపాదుఁడు దుఃఖమునొంది, వేదశాస్త్రసంపన్నులగు బ్రాహ్మణుల రావించి యిట్లని యడుగును. ౯

మీరు సమస్తధర్మంబుల లోకాచారంబుల నెఱుంగుదురు. ఈయనావృష్టికిఁగారణమైనపాపముపోవునట్లుఒకనియమమును నాకుపదేశింపుఁడు.

వేదాంతమును చక్కఁగ నెఱింగిన యాబ్రాహ్మణులు ఆరోమపాదుని గూర్చి యిట్లనిచెప్పఁగలరు. ౧౦౪

రోమపాదమహారాజా! ఏయుపాయముచేతనైనను విభండకమహామునికొడుకైన ఋశ్యశృంగు నిచ్చటికిఁ దోడితెమ్ము; అట్టుచితసత్కారంబు

ఆనాయ్యచ మహీపాల ఋశ్యశృంగం సుసత్కృతమ్,
ప్రయచ్ఛ కన్యాం శాంతాం వై విధినా సుసమాహితః. ౧౨
తేషాంతు వచనం శ్రుత్వా రాజా చింతాం ప్రపద్యతే,
కేనోపాయేన వై శక్య ఇహానేతుం స వీర్యవాన్. ౧౩

తతో రాజా వినిశ్చిత్య సహమంత్రిభిరాత్మవాన్,
పురోహితమమాత్యాంశ్చ తతః ప్రేష్యతి సత్కృతాన్. ౧౪
తేతు రాజ్ఞో వచశ్శ్రుత్వా వ్యథితా వినతాననాః,
న గచ్ఛేమ ఋషేర్భీతా అనునేష్యంతి తం నృపమ్. ౧౫

వక్ష్యంతి చింతయిత్వా తే తస్యోపాయాంశ్చ తత్క్షమాన్,
ఆనేష్యామో వయం విప్రం న చ దోషో భవిష్యతి. ౧౬

ఏవమంగాధిపేనైవ గణికాభిః ఋషేస్సుతః,
ఆనీతోఽవర్షయద్దేవశ్శాంతా చాస్మై ప్రదీయతే. ౧౭

ఋశ్యశృంగస్తు జామాతా పుత్రాంస్తవ విధాస్యతి,
సనత్కుమారకథితమేతావద్వ్యాహృతం మయా. ౧౮
అథ హృష్టో దశరథస్సుమంత్రం ప్రత్యభాషత,
యథర్శ్యశృంగస్త్వానీతో విస్తరేణ త్వయోచ్యతామ్. ౧౯

ఇతి శ్రీమద్బాలకాణ్డే, నవమస్సర్గః.

లతోఁ దోడితెచ్చి,విచారముదక్కి, యాయనకు నీకూఁతురైనశాంతను యథావిధిగ నొసంగుము. ౧౧, ౧౨

ఆబ్రాహ్మణులమాటనువినఁగానే రోమపాదుండు "ఏయుపాయమున జితేంద్రియుండగునాఋశ్యశృంగునిటకుఁదోడితేఁదగు" నని యాలోచింపఁ గలఁడు. ౧౩

పిమ్మట మంత్రులతో నాలోచించి, నిశ్చయించి, మంత్రులను బురోహితులను బూజించి, ఋశ్యశృంగునిందోడితెచ్చుటకువారిం బంపఁగలఁడు.

అపురోహితమంత్రులును రోమపాదునిమాట నాలకించి, మహాతపస్వియును జండకోపుండునగు విభండకమహర్షివలన భయంపడి, దుఃఖితులై మొగమువాంచి "మేముపోఁజాలము" అనియారోమపాదునినునయింతురు.

అపురోహితమంత్రులు ఋశ్యశృంగునిఁ దోడితెచ్చుటకుం దగిన యుపాయంబు నాలోచించి, "మేము ఋశ్యశృంగునిదోడితెచ్చెదము దోష మేమియుంగలుగదు" అని యారోమపాదునకుం జెప్పఁగలరు. ౧౪

ఈప్రకారము రోమపాదుండు వేశ్యలచే నాఋశ్యశృంగునిఁ దన పట్టణమునకుం దోడితెప్పించఁగనే పర్జన్యుండు వర్షము గురియును; అంత రోమపాదుఁడు తనకూఁతురైనశాంత నాఋశ్యశృంగున కిచ్చును. ౧౫

అల్లుఁడగు ఋశ్యశృంగుఁడుమాత్రము నీకు పుత్రుల నొసంగఁగలఁడు. తొల్లి సనత్కుమారుఁడు నాకెఱింగించినవృత్తము నిప్పుడు చెప్పితిని. ౧౬

సుమంత్రుఁడు చెప్పినకథయంతయుం వినినపిమ్మట దశరథుఁడు సంతుష్టుఁడై "వారలు ఋశ్యశృంగునిం దోడి తెచ్చినవిధమంతయుం వివరముగాఁ జెప్పుము" అని సుమంత్రున కానతిచ్చెను. ౧౭

ఇ ది తొ మ్మి ద వ స ర్గ ము.

# దశమస్సర్గః

సుమంత్రశ్చోదితో రాజ్ఞా ప్రోవాచేదం వచస్తదా. ½

యథర్శ్యశృంగస్త్వానీతశ్శృణు మే మంత్రిభిస్సహ. ౧

రోమపాదమువాచేదం సహామాత్యః పురోహితః,
ఉపాయో నిరపాయోఽయమస్మాభిరభిచింతితః. ౨

ఋశ్యశృంగో వనచరస్తపస్స్వాధ్యాయనే రతః,
అనభిజ్ఞస్స నారీణాం విషయాణాం సుఖస్య చ. ౩

ఇంద్రియార్థైరభిమతైర్నరచిత్తప్రమాథిభిః,
పురమానాయయిష్యామః క్షిప్రం చాధ్యవసీయతామ్. ౪

గణికాస్తత్ర గచ్ఛంతు రూపవత్యస్స్వలంకృతాః,
ప్రలోభ్య వివిధోపాయైరానేష్యంతీహ సత్కృతాః. ౫

శ్రుత్వా తథేతి రాజా చ ప్రత్యువాచ పురోహితమ్,
పురోహితో మంత్రిణశ్చ తథా చక్రుశ్చ తే తదా. ౬

వారముఖ్యాశ్చ తచ్ఛ్రుత్వా వనం ప్రవివిశుర్మహత్. ౬½
ఆశ్రమస్యావిదూరేఽస్మిన్ యత్నం కుర్వంతి దర్శనే,
ఋషిపుత్రస్య ధీరస్య నిత్యమాశ్రమవాసినః. ౭½

# పదియవ సర్గము

అప్పుడు దశరథమహారాజుచేత ప్రేరేపింపఁబడిన సుమంత్రుఁడు వక్ష్యమాణరీతిగా పలికెను. ½

మంత్రులు ఋశ్యశృంగుని వెంటఁబెట్టుకొని వచ్చినవిధమును నావలన వినుము. ౧

పురోహితుఁడు మంత్రులతోఁ గూడినవాఁడై ఈవక్ష్యమాణమగు దానిని రోమపాదునిగూర్చి పల్కెను. అపాయములేని ఈయుపాయము మాచేత నాలోచింపఁబడినది. ౨

ఆఋశ్యశృంగుఁడు అడవియందే తిరుగుచు నెల్లప్పుడును దపస్సు వేదాధ్యయనము వీనియందే వర్తింపుచుండుటంబట్టి స్త్రీలంగాని విషయసుఖములంగాని యెంతమాత్రము నెఱుంగఁడు. ౩

పురుషహృదయములకు క్షోభమునుగలిగించు సర్వసమ్మతములైనరూపరసగంధాదులగు నింద్రియవిషయములచే నాఋశ్యశృంగునిహృదయమును వశీకరించి యతని నీపట్టణమునకుం దోడితెప్పించెదము. శీఘ్రముగా నాప్రకారము నిశ్చయింపుఁడు. ౪

ఆఋశ్యశృంగునియెడకు మంచిరూపముగలిగి, చక్కనైన యలంకారములు ధరించియుండు వేశ్యలం బంపవలయు. వారలా ఋశ్యశృంగుని బలుతెఱంగుల వంచించి యిటకుఁ దోడితేఁగలరు. ౫

రోమపాదుఁ డామాటను విని, యాలాగుననే సేయవలయునని పురోహితునితోఁ జెప్పెను. అప్పు డాపురోహితుఁడును మంత్రులును ఆప్రకారమె వేశ్యలను వనమున కేగ నాజ్ఞాపించిరి. ౬

మేటిభోగము వార లామంత్రిమాటలవిని గొప్పయడవిని జొచ్చిరి. ౬½

ఆవేశ్యలు, విభండకాశ్రమమునకు సమీపప్రదేశమునందుండి ఋశ్యశృంగుఁడు ఋషిపుత్రుఁడై యడవిలోనేయున్నందున నాగరులప్రక్రియ నెఱుఁగనివాఁడై జితేంద్రియుండై యెప్పుడు నాశ్రమములోనే యుండుటం బట్టి యాయనకుఁ గోపము వొడమకుండునట్లు గనుఁగొనుటెట్లనో యాప్రయత్నము చేయుచుండిరి. ౭½

పితుస్స నిత్యసంతుష్టో నాతిచక్రామ చాశ్రమాత్. ౘ

న తేన జన్మప్రభృతి దృష్టపూర్వం తపస్వినా,
స్త్రీవా పుమాన్వా యచ్చాన్యత్సర్వం నగరరాష్ట్రజమ్. ౯

తతః కదాచిత్తం దేశమాజగామ యదృచ్ఛయా,
విభండకసుతస్తత్ర తాశ్చాపశ్యద్వరాంగనాః. ౧౦
తాశ్చిత్రవేషాః ప్రమదా గాయంత్యో మధురస్వరాః,
ఋషిపుత్రముపాగమ్య సర్వా వచన మబ్రువన్. ౧౧

కస్త్వం కిం వర్తసే బ్రహ్మన్ జ్ఞాతుమిచ్ఛామహే వయమ్.
ఏకస్త్వం విజనే ఘోరే వనే చరసి శంస నః. ౧౨

అదృష్టరూపాస్తాస్తేన కామ్యరూపా వనే స్త్రియః,
హార్దాత్తస్య మతిర్జాతా వ్యాఖ్యాతుం పితరం స్వకమ్. ౧౩

పితా విభండకోఽస్మాకం తస్యాహం సుత ఔరసః,
ఋశ్యశృంగ ఇతి ఖ్యాతం నామ కర్మ చ మే భువి. ౧౪
ఇహాశ్రమపదోఽస్మాకం సమీపే శుభదర్శనాః,
కరిష్యేవోఽత్ర పూజాం వై సర్వేషాం విధిపూర్వకమ్. ౧౫
ఋషిపుత్రవచశ్శ్రుత్వా సర్వాసాం మతిరాసవై,
తదాశ్రమపదం ద్రష్టుం జగ్ముస్సర్వాశ్చ తేన తాః. ౧౬
ఆగతానాం తతః పూజామృషిపుత్రశ్చకారహ,
ఇదమర్ఘ్యమిదం పాద్యమిదం మూలంఫలం చ నః. ౧౭

ఆ ఋశ్యశృంగుఁడు పితృశుశ్రూషయందే యాసక్తుండగుటంబట్టి యాశ్రమమునుసైతము దాఁటి యావలికిఁ బోవుటలేదు. ౮

ఆఋశ్యశృంగుండు పుట్టినదిమొదలు అంతకుమున్ను స్త్రీనిగాని పురుషునిగాని యింక నితరములైనవానిగాని పట్టణములందు గ్రామములందుఁ బుట్టిన యేపదార్థమునుం జూచి యెఱుంగఁడు. ౯

పిమ్మట నొకానొకప్పు డాఋశ్యశృంగుండు దైవవశంబునం జేసి యావేశ్య లుండుచోటికే తెంచి, యాయుత్తమస్త్రీలం జూచెను. ౧౦

ఆవేశ్యలందఱును నానావిధంబులగు నలంకారంబులు దాల్చి, మనోహరంబైన కంఠధ్వనితో గానముచేయుచు నాఋశ్యశృంగునిం జేరి, యిట్లని పలికిరి. ౧౧

బ్రాహ్మణుండా! "నీవెవ్వఁడవు? ఎందు కీయడవిలో నుండెదవు? మేము దాని నెఱుంగఁగోరితిమి; జనసంచారమేలేక భయంకరంబైయుండునీయడవిలో నొంటిఁ జరించెదవేల. ఆకారణమును మాకుం జెప్పుము" అని పలికిరి. ౧౨

ఆవేశ్యలవంటిరూపముగలవారినడవియందు ఋశ్యశృంగుండెప్పుడుం జూచియుండనందున వారియందతనికి మిగులస్నేహముగలిగి, వారికిఁదనతండ్రిగారినిం దెలుపవలెనని బుద్ధిపుట్టెను. ౧౩

నాతండ్రి విభండకుఁడు. అతనికి నేనౌరసపుత్త్రుఁడ, నాపేరుఋశ్యశృంగుఁడని ప్రసిద్ధము, తపోరూపకర్మమును భువిని ప్రసిద్ధమే. ౧౪

దర్శనీయులారా! ఇచ్చట సమీపమున మాయాశ్రమ మున్నది. అచ్చట మీకందఱకు యథావిధిగా పూజ సల్పఁగలను. ౧౫

ఈలాటిఋశ్యశృంగునిమాటల విని వారలకు ఋష్యాశ్రమము జూడ నాశగల్గెను. ఋశ్యశృంగునితోఁ గూడ నచ్చటికి వెళ్లిరి. ౧౬

ఋశ్యశృంగుఁడు తనయాశ్రమమునకువచ్చినవారలకు యిదియ యర్ఘ్యము, ఇదియ పాద్యము, ఇదియ మూలము, ఇదియ ఫలము అని పూజచేసెను.

ప్రతిగృహ్య చ తాం పూజాం సర్వా ఏవ సముత్సుకాః,
ఋషేర్భీతాశ్చ శీఘ్రం తా గమనాయ మతిం దధుః. ౧౮

అస్మాకమపి ముఖ్యాని ఫలానీమాని వై ద్విజః,
గృహాణ ప్రతి భద్రం తే భక్షయస్వ చ మాచిరమ్. ౧౯
తతస్తాస్తం సమాలింగ్య సర్వా హర్ష సమన్వితాః,
మోదకాన్ప్రదదుస్తస్మై భక్ష్యాంశ్చ వివిధాన్ బహూన్. ౨౦

తాని చాస్వాద్య తేజస్వీ ఫలానీతి స్మ మన్యతే,
అనాస్వాదితపూర్వాణి వనే నిత్యనివాసినామ్. ౨౧

ఆపృచ్ఛ్య చ తదా విప్రం వ్రతచర్యాం నివేద్య చ,
గచ్ఛంతి స్మాపదేశాత్తా భీతాస్తస్య పితుస్స్త్రియః. ౨౨

గతాసు తాసు సర్వాసు కాశ్యపస్యాత్మజో ద్విజః,
అస్వస్థహృదయశ్చాసీద్దుఃఖాత్సం పరివర్తతే. ౨3
తతోఽపరేద్యుస్తం దేశమాజగామ స వీర్యవాన్,
మనోజ్ఞా యత్ర తా దృష్ట్వా రూపవత్యస్స్వలంకృతాః. ౨౪

దృష్ట్వైవ తాస్తదా విప్రమాయాంతం హృష్టమానసాః,
ఉపసృత్య తతస్సర్వాస్తాస్తమూచురిదం వచః. ౨౫
ఏహ్యాశ్రమపదం సౌమ్య హ్యస్మాకమితి చాబ్రువన్,
తత్రాప్యేష విధిశ్శ్రీమాన్ విశేషేణ భవిష్యతి. ౨౬

ఆవేశ్య లందఱును మిగుల నుత్సాహముతో నాఋశ్యశృంగుండు సేయు పూజం బ్రతిగ్రహించి, విభండకమహర్షి దీని నెఱింగినఁ గోపించి శపించునని భయమొంది, "యిచ్చటఁ దడవు సేయరాదు. శీఘ్రముగా వెళ్లవలయు" నని నిశ్చయించిరి. ౧౮

అన్నిట శ్రేష్ఠములైన యీమాఫలములనుం బుచ్చుకొనుము, దీన నీకు మంగళమొదవు నాలస్యముసేయక వీనిని భక్షింపుము. ౧౯

అంతట నావేశ్యలందఱును సంతోషముతో నాఋశ్యశృంగునిఁ గవుంగిలించికొని, యతనికిఁ గుడుములను మఱియును ననేకములయిన నానావిధ భక్ష్యములను నొసంగిరి. ౨౦

తపస్సునందేదృష్టిగల యాఋశ్యశృంగుఁడు వారిచ్చినభక్ష్యంబుల మెసవియుం నవి భక్ష్యములని తెలిసికొనంజాలక "ఇవి, యెల్లప్పుడునడవియందు వాసము సేయుం మాబోఁటివార లిదివఱకుం జవిచూడని ఫలములు" అని తలంచెను. ౨౧

అప్పుడావేశ్యలు, "విభండకునకుం దెలిసిన నపాయముగలుగు" నని భయమునొంది, ఋశ్యశృంగుని వీడుకొలిపి, "యిఁక వ్రతానుష్ఠానమునకుఁ బోవలయు" నని యొకసాకు సెప్పి వెళ్లిరి. ౨౨

ఆవేశ్యలందఱును వెళ్లినవెనుక, విభండకసుతుండగు నాఋశ్యశృంగుఁడు, మనస్సున స్వాస్థ్యములేక దుఃఖంబున నిట్టట్టు తిరుగుచుండెను. ౨౩

అంత నామఱుచటినాఁడు నియతబ్రహ్మచర్యుఁడైన ఋశ్యశృంగుఁడు తాను మున్ను మనోహరంబగు రూపముగలిగి మంచియలంకారంబులతో వెలుంగుచున్నయావేశ్యలం జూచినప్రదేశమునకు వచ్చెను. ౨౪

ఆఋశ్యశృంగుండు తమయొద్దికే తెంచుటను జూచినంతనే సంతసించి యతనికి దగ్గఱి యిట్లని పలికిరి. ౨౫

"సౌమ్యుఁడా! మాయాశ్రమమునకునీవు రావలయు; నచ్చట స్వదేశ మగుటవలన నీకుఁ జక్కఁగా సత్కారముసేయఁగలము; అని వచించిరి. ౨౬

శ్రుత్వాతు వచనం తాసాం సర్వాసాం హృదయంగమమ్.
గమనాయ మతిం చక్రే తంచ నిన్యుస్తదా స్త్రియః. ౨౩
తత్ర చానీయమానేతు విప్రే తస్మిన్ మహాత్మని,
వవర్ష సహసా దేవో జగత్ప్రహ్లాదయంస్తదా. ౨౮
వర్షేణైవాగతం విప్రం విషయం స్వం నరాధిపః,
ప్రత్యుద్గమ్య మునిం ప్రహ్వశ్శిరసా చ మహీం గతః. ౨౯

అర్ఘ్యం చ ప్రదదౌ తస్మై న్యాయతస్సుసమాహితః,
వవ్రే ప్రసాదం విప్రేంద్రాన్మా విప్రం మన్యురావిశత్. ౩౦

అంతఃపురం ప్రవిశ్యాస్మై కన్యాం దత్వా యథావిధి,
శాంతాం శాంతేన మనసా రాజా హర్షమవాప సః. ౩౧

ఏవం స న్యవసత్తత్ర సర్వకామైస్సుపూజితః. ౩౧౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, దశమస్సర్గః.

---

## ఏకాదశస్సర్గః

భూయఏవ హి రాజేంద్ర శృణు మే వచనం హితమ్,
యథా స దేవప్రవరః కథాయామేవమబ్రవీత్. ౧
ఇక్ష్వాకూణాం కులే జాతో భవిష్యతి సుధార్మికః,
నామ్నా దశరథో నామ శ్రీమాన్సత్యప్రతిశ్రవః. ౨

ఆవేశ్యలందఱును జెప్పిన మనోహరమైనమాటలనువిని, యాఋశ్యశృంగుఁడు, వారల వెంబడించుటకిచ్ఛగించెను. అంత వారలతనిందోడుకొనివెళ్లిరి.

అంగదేశమందునుమహాత్ముండగు నాఋశ్యశృంగుఁడు ప్రవేశించినంత నేశీఘ్రముగా ప్రపంచమునకెంతయుం, సంతోషముగలుగునట్లు వర్షముగురిసెను.

రోమపాదుండు వర్షముతోఁగూడఁ దనదేశమునకేతెంచిన మహాబ్రాహ్మణుండగు నాఋశ్యశృంగమహర్షిని వినయసమ్రుండై యెదుర్కొని, సాష్టాంగముగ నభినందించెను. ౨౯

ఆరోమపాదుఁడు నిర్మలమయిన హృదయముగలవాఁడై యాఋశ్యశృంగున కర్ఘ్యపాద్యంబుల శాస్త్రక్రమంబున నొసంగి యనుగ్రహింపవలయునని వేఁడెను. ఆఋశ్యశృంగుఁడును అతనిప్రార్థన నంగీకరించి యతండు మోసంబునం దన్నుఁ గొనితెచ్చుటకుఁ గోపగింపలేదు. ౩౦

రోమపాదమహారా జాఋశ్యశృంగుని నంతిపురికిం గొనిపోయి, శాంతమనస్కుండై యతనికిం దనకూఁతురైన శాంతను యథాశాస్త్రంబుగ నొసంగి సంతోషంబు నొందెను. ౩౧

ఆఋశ్యశృంగుఁ డాప్రకారము శాంతను వివాహంబై రోమపాదుండు తనకోర్కెలన్నియుం దీర్చుచుఁ గొలుచుచుండనాయంతఃపురంబునందుండెను. ౩౧౪

ఇది పదియవ సర్గము

---

## పదునొకండవ సర్గము

దశరథుఁడా! ఇంక నాసనత్కుమారుండు చెప్పినట్లు సెప్పెద; నామాట వినుము. ౧

శ్రీమంతుండును సత్యప్రతిజ్ఞుండునగు దశరథుండనియెడు నొకధార్మికుం డిక్ష్వాకువంశమునం బుట్టఁగలఁడు. ౨

అంగరాజేన సఖ్యంచ తస్య రాజ్ఞో భవిష్యతి. ౨
కన్యా చాస్య మహాభాగా శాంతా నామ భవిష్యతి. ౩
పుత్రస్తు సోఽంగ రాజస్య రోమపాద ఇతి శ్రుతః,
తం స రాజా దశరథో గమిష్యతి మహాయశాః. ౪
అనపత్యోఽస్మి ధర్మాత్మన్ శాంతాభర్తా మమ క్రతుమ్,
ఆహరేత త్వయాజ్ఞప్తస్సంతానార్థం కులస్య చ. ౫

శ్రుత్వా రాజ్ఞోఽథ తద్వాక్యం మనసా స విచింత్య చ,
ప్రదాస్యతే పుత్రవంతం శాంతాభర్తారమాత్మవాన్. ౬
ప్రతిగృహ్యాచ తం విప్రం స రాజా విగతజ్వరః,
ఆహరిష్యతి తం యజ్ఞం ప్రహృష్టేనాంతరాత్మనా. ౭
తంచ రాజా దశరథో యష్టుకామః కృతాంజలిః,
ఋశ్యశృంగం ద్విజశ్రేష్ఠం వరయిష్యతి ధర్మవిత్. ౮
యజ్ఞార్థం ప్రసవార్థంచ స్వర్గార్థంచ నరేశ్వరః,
లభతేచ స తం కామం ద్విజముఖ్యాద్విశాంపతిః. ౯

పుత్రాశ్చాస్య భవిష్యంతి చత్వారోఽమితవిక్రమాః,
వంశప్రతిష్ఠానకరాస్సర్వలోకేషు విశ్రుతాః. ౧౦

ఏవం స దేవప్రవరః పూర్వం కథితవాన్ కథామ్,
సనత్కుమారో భగవాన్ పురా దేవయుగే ప్రభుః. ౧౧
స త్వం పురుషశార్దూల తమానయ సుసత్కృతమ్,
స్వయమేవ మహారాజ గత్వా సబలవాహనః. ౧౨

ఆదశరథునకు నంగదేశప్రభువునకుం జెలిమి గలుగును. ౨౫

ఆయంగరాజునకు, రోమపాదుండనెడు ప్రసిద్ధుఁడైన కుమారుఁడుపుట్ట గలఁడు; ఆరోమపాదునకుశాంతయనెడు మహాభాగ్యవతియగు నొకకూఁతురు జనింపఁగలదు; ఆరోమపాదునియొద్దకు దశరథుండు పోఁగలఁడు. ౩,౪

"ధర్మాత్ముఁడవైన, రోమపాదుఁడా! నాకు సంతానములేకయున్నది;నీ వాజ్ఞాపించినట్టైన శాంతాపతియైన ఋశ్యశృంగుండు వంశమునకు సంతానము గలుగునట్లుగ నాయజ్ఞములు జక్కఁగా నెఱవేర్చును." అని దశరథుఁడు రోమపాదు నడుగంగలఁడు. ౫

దశరథమహారాజడుగఁగానే బుద్ధిశాలియగు రోమపాదుండుమనస్సున నాలోచించి, పుత్రప్రదానసమర్థుఁడైన ఋశ్యశృంగు నతనికియ్యఁగలఁడు. ౬

ఆదశరథమహారాజును ఋశ్యశృంగుం బుచ్చుకొని, మనస్తాపమువిడిచి సంతుష్టమానసుండై యాగమును చేయఁగలఁడు. ౭

ఆదశరథమహారాజును 'యజ్ఞముసేయఁదలంచి కైమోడ్చి, బ్రాహ్మణశ్రేష్ఠుండగు నాఋశ్యశృంగునిఁ దనయాగమును జేయించుటకును దాన సంతానము కలిగించుటకునుదాన స్వర్గముప్రాప్తించునట్లు సేయుంటకునుం బ్రార్థింపఁగలఁడు. ఆఋశ్యశృంగుఁడును దశరథునిప్రార్థన నంగీకరించి, యాకామ్యయాగమును జేయించును. ౮, ౯

దశరథమహారాజునకుఁగొలందిలేనిపరాక్రమము గలిగి, యాచంద్రార్కముగ వంశమును వృద్ధిఁబొందించుచు సమస్తలోకంబులందునుం బ్రసిద్ధులైవెలుంగు కొడుకులు నలువురు జనింపఁగలరు. ౧౦

దేవశ్రేష్ఠుండును మాహాత్మ్యముగలవాఁడును సమర్థుండు నగు నా సనత్కుమారుండు మునుపు కృతయుగమునం దీప్రకారము కథచెప్పెను. ౧౧

పురుషశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! నీవు పుత్రార్థివికావున నీవే సైన్యవాహనములతో నచ్చోటికివెళ్లి, గొప్పసత్కారముసేసి, యాఋశ్యశృంగునిం దోడ్కొనిరమ్ము; అని సుమంత్రుఁడు దశరథునకుఁ జెప్పెను. ౧౨

అనుమాన్య వసిష్ఠం చ సూతవాక్యం నిశమ్య చ,
సాంతఃపురస్సహామాత్యః ప్రయయౌ యత్ర స ద్విజః. ౧౩

వనాని సరితశ్చైవ వ్యతిక్రమ్య శనైశ్శనైః,
అభిచక్రామ తం దేశం యత్ర వై మునిపుంగవః. ౧౪
ఆసాద్య తం ద్విజశ్రేష్ఠం రోమపాదసమీపగమ్,
ఋషిపుత్రం దదర్శాదౌ దీప్యమానమివానలమ్. ౧౫

తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః,
సఖిత్వాత్తస్య వై రాజ్ఞ ప్రహృష్టేనాంతరాత్మనా. ౧౬
రోమపాదేన చాఖ్యాతమృషిపుత్రాయ ధీమతే,
సఖ్యం సంబంధకం చైవ తదా తం ప్రత్యపూజయత్. ౧౭

ఏవం సుసత్కృతస్తేన సహోషిత్వా నరర్షభః,
సప్తాష్టదివసాన్ రాజా రాజానమిదమబ్రవీత్. ౧౮

శాంతా తవ సుతా రాజన్ సహ భర్త్రా విశాంపతే,
మదీయనగరం యాతు కార్యం హి మహదుద్యతమ్. ౧౯

తథేతి రాజా సంశ్రుత్య గమనం తస్య ధీమతః,
ఉవాచ వచనం విప్రం గచ్ఛ త్వం సహ భార్యయా. ౨౦

ఋషిపుత్రః ప్రతిశ్రుత్య తథేత్యాహ నృపం తదా,
స నృపేణాభ్యనుజ్ఞాతః ప్రయయౌ సహ భార్యయా. ౨౧

ఆదశరథుఁడు సుమంత్రునిమాటవిని వసిష్ఠునకుం దెలిపి, వారియనుజ్ఞ నొంది యంతఃపురస్త్రీలనుం దోడ్కొని, మంత్రిసహితుఁడై యాఋశ్యశృంగుండున్న రోమపాదునిపట్టణమునకుం బోయెను. ౧౩

ఆదశరథమహారాజు, అడవులను నదులనుజూచుచు మెల్ల మెల్లగా దాఁటి, ఆఋశ్యశృంగుఁడున్న దేశమును బ్రవేశించెను. ౧౪

ఆదశరథుం డంగదేశముఁ బ్రవేశించి, మండెడునగ్నిహోత్రముంబోలెఁ బ్రకాశించుచు రోమపాదునిసమీపంబునఁగూర్చుండియున్న బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు నాఋశ్యశృంగుని మొదటఁ జూచెను. ౧౫

ఆవిష్మట రోమపాదుఁడు తనమిత్రుఁడు వచ్చినందున మిక్కిలి సంతసమంది యాదశరథమహారాజునకు న్యాయప్రకార మధికముగాఁ బూజచేసెను.

రోమపాదుఁడు, బుద్ధిశాలియగు నాఋశ్యశృంగునకు, "ఈదశరథమహారాజు, నాకుంజాల స్నేహితుండు; ఇతఁడు నీభార్యయగుశాంతకు, జనకపిత; నీకును మామయగు" నని చెప్పెను; అంత నాఋశ్యశృంగుఁడు దనమామయగుదశరథునిం బూజించెను. ౧౭

పురుషశ్రేష్ఠుడగు నాదశరథమహారాజు, ఈప్రకారము చక్కఁగాఁ బూజనొంది, యారోమపాదునితో గూడ నచ్చట నేడెనిమిదిదినములుండి, యంతవానితో నిట్లని చెప్పెను. ౧౮

మనుష్యులకందఱకును బ్రభుఁడవైనరోమపాదుఁడా! నీకొమార్తెయగు శాంత, పెనిమిటితోఁగూడ నాపట్టణమునకు రావలయును; గొప్పకార్యమొకటిసంభవించియున్నది. అని దశరథుఁడు రోమపాదునితోఁ జెప్పెను. ౧౯

రోమపాదుండు, బుద్ధిమంతుండగు ఋశ్యశృంగుఁ డయోధ్యకుంబోవుట నంగీకరించి, "నీవుభార్యతోఁగూడ దశరథునివెంటఁబొమ్ము" అని ఋశ్యశృంగునకుఁ జెప్పెను. ౨౦

అప్పుడా ఋశ్యశృంగుఁ డంగీకరించి, "యట్లే" యని రోమపాదునితోఁ జెప్పెను; ఇట్లు ఋశ్యశృంగుఁడు రోమపాదునిచే నభ్యనుజ్ఞనుబొంది, భార్యతోఁగూడఁ బయనం బయ్యెను. ౨౧

తావన్యోన్యాంజలిం కృత్వా స్నేహాత్సంశ్లిష్యచోరసా,
ననందతు ర్దశరథో రోమపాదశ్చ వీర్యవాన్. ౨౨
తతస్సుహృద మాపృచ్ఛ్య ప్రస్థితో రఘునందనః,
పౌరేభ్యః ప్రేషయామాస దూతాన్వై శీఘ్రగామినః. ౨౩

క్రియతాం నగరం సర్వం క్షిప్రమేవ స్వలంకృతమ్,
ధూపితం సిక్తసమ్మృష్టం పతాకాభి రలంకృతమ్. ౨౪

తతః ప్రహృష్టాః పౌరాస్తే శ్రుత్వా రాజాన మాగతమ్,
తథాప్రచక్రు స్తత్సర్వం రాజ్ఞా యత్ప్రేషితం యథా. ౨౫

తత స్స్వలంకృతం రాజా నగరం ప్రవివేశ హ,
శంఖదుందుభినిర్ఘోషైః పురస్కృత్య ద్విజర్షభమ్. ౨౬

తతః ప్రముదితా స్సర్వే దృష్ట్వా తం నాగరాద్విజమ్,
ప్రవేశ్యమానం సత్కృత్య నరేంద్రేణేంద్రకర్మణా. ౨౭

అంతఃపురం ప్రవేశ్యైనం పూజాం కృత్వా చ శాస్త్రతః,
కృతకృత్యం తదాత్మానం మేనే తస్యోపవాహనాత్. ౨౮

అంతఃపుర స్త్రియ స్సర్వా శ్శాంతాం దృష్ట్వా తథాగతామ్,
సహాభర్త్రావిశాలాక్షీం ప్రీత్యానందముపాగమన్. ౨౯

పూజ్యమానాచ తాభి స్సా రాజ్ఞా చైవ విశేషతః,
ఉవాస తత్ర సుఖితా కంచిత్కాలం సహర్త్విజా. ౩౦

ఇతి శ్రీమద్బాలకాండే, ఏకాదశస్సర్గః.

దశరథుఁడును రోమపాదుఁడును బరస్పర మంజలిఘటించి, స్నేహంబున నొక్కమాటఁ గవుఁగిలించుకొని సంతసించిరి. ౨౨

అంత నా దశరథుఁడు, తనమిత్త్రుఁడగు రోమపాదుని వీడుకొని, పయనంబై యయోధ్యావాసులగు జనులకుఁ దమరాక తెలియుటకై, శీఘ్రముగా నడువఁగల దూతలఁ బంపెను. ౨౩

"అయోధ్యాపట్టణ మంతయును, జక్కఁగా సింగారించి, ధూపము వేసి, వీధులనన్నిఁటిని దడిపి గరగరగా నుండునట్లు చేసి, ధ్వజములతో నలంకరించి యుంచవలెను." అని పౌరులకుఁ జెప్పుఁడని దశరథుఁడు దూతల కాజ్ఞాపించెను.

అంత నా పౌరులు, దశరథమహారాజ యయోధ్యకు వచ్చుటవిని, సంతసించినవారలై, యా దశరథమహారాజు ఎట్లు దేనిఁ జేయ నాజ్ఞాపించి పంపెనో, దానినట్లు చక్కఁగాఁ జేసిరి. ౨౫

అంత దశరథమహారాజు ఋశ్యశృంగుని ముందిడుకొని శంఖభేర్యాది వాద్యధ్వనులతోఁ గూడి, చక్కఁగా నలంకరింపఁబడియున్న యయోధ్యాపట్టణమును బ్రవేశించెను. ౨౬

అంతఁ బౌరులందఱు, దేవేంద్రునితో సరిసేయఁదగిన దశరథమహారాజు, నానావిధసత్కారంబులు సేసి దారిచూపుచుఁ, బట్టణంబునకుం దోడ్కొనివచ్చుచున్న ఋశ్యశృంగునిఁ జూచి సంతసించిరి. ౨౭

ఆ దశరథమహారాజు, ఋశ్యశృంగు నంతిపురికిఁ దోడ్కొని పోయి, యథాశాస్త్రముగఁ బూజించి, యతనిఁ దోడి తెచ్చినందునఁ దన్నుఁ గృతార్థునిఁగాఁ దలఁచుకొనెను. ౨౮

అంతిపురంబునందుండు దశరథ భార్యలందఱు, నంతటి వైభవంబునఁ జెలిమిటితో నేతెంచిన వెడందకన్నులుఁగల శాంతను జూచి, ప్రేమభరంబున నానందంబునొందిరి. ౨౯

ఆ శాంతయును, ఋశ్యశృంగసహితయై యంతఃపురస్త్రీలును విశేషించి దశరథమహారాజునుం దన్ను వివిధసత్కారంబులఁ బూజింపుచుండఁ గొంతకాలం బా యయోధ్యానగరంబునందు సుఖంబుండెను. ౩౦

ఇది పదునొకొండవ సర్గము.

## ద్వాదశస్సర్గః

తతః కాలే బహుతిథే కస్మింశ్చిత్సు మనోహరే,
వసంతే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనోఽభవత్. ౧
తతః ప్రసాద్య శిరసా తం విప్రం దేవవర్ణినమ్,
యజ్ఞాయ వరయామాస సంతానార్థం కులస్య వై. ౨

తథేతిచ స రాజాన మువాచచ సుసత్కృతః,
సంభారా స్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౩

తతో రాజాబ్రవీ ద్వాక్యం సుమంత్రం మంత్రిసత్తమమ్,
సుమంత్రావాహయ క్షిప్రం ఋత్విజో బ్రహ్మవాదినః. ౪
సుయజ్ఞం వామదేవంచ జాబాలి మథ కాశ్యపమ్,
పురోహితం వసిష్ఠంచ యేచాన్యే ద్విజసత్తమాః. ౫
తత స్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరితవిక్రమః,
సమానయ త్సతాన్ సర్వాన్ సమస్తాన్ వేదపారగాన్. ౬
తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథ స్తదా,
ధర్మార్థసహితం యుక్తం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౭
మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్,
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. ౮
తదహం యష్టు మిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా,
ఋషిపుత్రప్రభావేన కామాన్ ప్రాప్స్యామి చాప్యహమ్. ౯

# పండ్రెండవ సర్గము

---

అంతటం బెద్దకాలము కడచిన పిమ్మట, మిక్కిలి మనోహరమైన వసంతర్తువు తటస్థింపఁగానే దశరథమహారాజు యాగము సేయఁదలఁచెను. ౧

ఆపిమ్మట, నాదశరథుఁడు, దేవతయుం బోలె వెలుంగు చున్నయా ఋశ్యశృంగుని సాష్టాంగనమస్కారంబులఁ బ్రసన్నునిఁ జేసి, తనచే యాగము సేయించి తనవంశము పుత్త్రపౌత్త్రాదిపారంపర్యము గలిగియుండునట్లు ఘటింపఁ బ్రార్థించెను. ౨

ఆ ఋశ్యశృంగుఁడును, చక్కఁగా సన్మానమునొంది, యాదశరథ మహారాజునుగూర్చి, "అలాగే చేసెదను; యాగోపకరణములన్నియుం గూర్చుఁడు; అశ్వంబును విడువుఁడు." అని చెప్పెను. ౩

అంత, దశరథమహారాజు, మంత్త్రిశ్రేష్ఠుఁడగు సుమంత్త్రునిఁబిలిచి, "నీవు, ఋత్విజులును వేదాధ్యయనపరులునగు సుయజ్ఞుని, వామదేవుని, జాబాలినిఁ, గాశ్యపునిఁ, బురోహితుఁడగువసిష్ఠుని, నింక నితరులైనబ్రాహ్మణశ్రేష్ఠులెవ్వరుగలరో వారినందఱ శీఘ్రముగాఁ దోడితెమ్ము" అనియాజ్ఞాపించెను. ౪-౫

అంత శీఘ్రముగా నడుచునట్టి యాసుమంత్త్రుఁడు, త్వరితముగాఁ బోయి, సమస్తవేదంబుల నెఱింగిన వారినందఱ, గుంపుగాఁ దోడ్కొనివచ్చెను.

అప్పుడు, ధర్మస్వభావుఁ డగుదశరథమహారాజు, ఆసుయజ్ఞాదులఁ బూజించి, ధర్మార్థసహితంబును సంగతంబునగు మృదువైనమాటఁ జెప్పెను. ౭

కొడుకుల కొఱకు మిక్కిలి పరితపించుచున్న నాకు సౌఖ్యములేదు. దానికొఱకు అశ్వమేధయాగముచే దేవతల బూజించెదనని నామతి. ౮

కావున, నేనిప్పుడు యథాశాస్త్రముగ యాగము సేయఁగోరెదను; ఋశ్యశృంగుని ప్రభావంబునఁ జేసి, కోర్కులను బడయఁగలను. ౯

తత స్సాధ్వితి తద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్,
వసిష్ఠ ప్రముఖా స్సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. ౧౦
ఋశ్యశృంగపురోగాశ్చ ప్రత్యూచు ర్నృపతిం తదా,
సంభారా స్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౧౧
సర్వథా ప్రాప్స్యసే పుత్రాం శ్చత్వారోఽమితవిక్రమాన్,
యస్య తేధార్మికీ బుద్ధి రియం పుత్రార్థ మాగతా. ౧౨
తతః ప్రీతోఽభవ ద్రాజా శ్రుత్వా తద్ద్విజభాషితమ్,
అమాత్యాంశ్చాబ్రవీ ద్రాజా హర్షేణేదం శుభాక్షరమ్. ౧౩
గురూణాం వచనాచ్ఛీఘ్రం సంభారా స్సంభ్రియంతు మే,
సమర్థాధిష్ఠిత శ్చాశ్వ స్సోపాధ్యాయో విముచ్యతామ్. ౧౪

సరయ్వా శ్చోత్తరే తీరే యజ్ఞభూమిర్విధీయతామ్,
శాంతయశ్చాభివర్ధంతాం యథాకల్పం యథావిధి. ౧౫
శక్యః ప్రాప్తు మయం యజ్ఞ స్సర్వేణాపి మహీక్షితా,
నాపరాధో భవే త్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. ౧౬

ఛిద్రం హి మృగయంతేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః,
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. ౧౭

తద్యథా విధిపూర్వం మే క్రతు రేష సమాప్యతే,
తథా విధానం క్రియతాం సమర్థాః కరణేష్విహ. ౧౮

వసిష్ఠుఁడు మొదలుగా నాబ్రాహ్మణులందఱును దశరథమహారాజు ముఖంబునుండి వెల్వడినయామాటను జాలఁ గొనియాడిరి. ౧౦

వసిష్ఠుఁడు మొదలుబ్రాహ్మణులందఱును, ఋశ్యశృంగునిముందిడుకొని, "ఉపకరణములన్నియుం గూర్పుము; తురగమును విడువుము; నీకుఁ బుత్రార్థమై యిట్టిధార్మికబుద్ధిగలిగినందున సన్నివిధంబులం గొలందిలేనిపరాక్రమము గలనలువురఁగొడుకులం బడసెదవు" అని దశరథమహారాజునకుఁ జెప్పిరి.

దశరథమహారాజాబ్రాహ్మణుల మాటవిని సంతసమంది, మంత్రులకు మంగళకరములైన మాటలతో నిట్లని యాజ్ఞాపించెను. ౧౩

గురువులవారి యానతిచొప్పున యజ్ఞోపకరణములెల్లఁ గూర్పఁబడుగాత; (నేర్పరులచే రక్షింపఁబడినదియుం నుపాధ్యాయులతోఁ గూడిన గుఱ్ఱము విడువఁబడుగాత. ౧౪

సరయూనదికి నుత్తరపుదిశ గట్టునందు యాగభూమి చేయఁబడుగాత; తచ్ఛాంతులును యథాశాస్త్రముగ యథాక్రమముగ వృద్ధినొందెడుగాత. ౧౫

ఈ యశ్వమేధయాగమునందపాయకరమైన యపచారముగలుగుటకవకాశము లేకున్నట్టైన, దీని సమస్తరాజులును జేయ సమర్థులు కాఁగలరు. ౧౬

బ్రాహ్మణులుగానుండి యాగములఁ జేయుటయందుఁ బ్రమాదంబులు గలుగుటంజేసి, రాక్షసత్వంబు నొందిన బ్రహ్మరాక్షసులు, యాగములందుఁ గలుగునపరాధంబులఁ జక్కఁగా నెఱింగియున్నవారుకావున, నీయశ్వమేధయాగము సేయుచున్నప్పుడును, అపరాధంబుల నేవెదకుచు యాగమును జెఱుపఁజూతురు. యాగముచెడినచో దానియజమానుఁడును అప్పుడే నశించును. ౧౭

కావున ఎట్లు నా ఈ యశ్వమేధయాగము శాస్త్రప్రకారము తుదముట్టునో, అట్లుతగుప్రయత్నము చేయఁబడుగాక. మీరలు కార్యభారములయందు నేర్పరులరు. ౧౮

తథేతి చ తతస్సర్వే మంత్రిణః ప్రత్యపూజయన్,
పార్థివేంద్రస్య తద్వాక్యం యథాజ్ఞప్త మకుర్వత. ౧౯
తతో ద్విజాస్తే ధర్మజ్ఞ మస్తువన్ పార్థివర్షభమ్,
అనుజ్ఞాతా స్తత స్సర్వే పునర్జగ్ము ర్యథాగతమ్. ౨౦

గతేష్వథ ద్విజాగ్ర్యేషు మంత్రిణస్తా న్నరాధిపః,
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. ౨౧

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్వాదశస్సర్గః.

---

## త్రయోదశస్సర్గః

పునఃప్రాప్తే వసంతే తు పూర్ణస్సంవత్సరోఽభవత్,
ప్రసవార్థం గతో యష్టుం హయమేధేన వీర్యవాన్. ౧

అభివాద్య వసిష్ఠం చ న్యాయతః ప్రతిపూజ్య చ,
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం ప్రసవార్థం ద్విజోత్తమమ్. ౨

యజ్ఞో మే క్రియతాం బ్రహ్మన్ యథోక్తం మునిపుంగవ,
యథా న విఘ్నః క్రియతే యజ్ఞాంగేషు విధీయతామ్. 3

భవాన్ స్నిగ్ధ స్సుహృ న్మహ్యం గురుశ్చ పరమో మహాన్,
వోఢవ్యో భవతా చైవ భారో యజ్ఞస్య చోద్యతః. ౪

మంత్రులందఱును అలాగే చేసెదమని రాజశ్రేష్ఠుఁడగు దశరథుని వాక్యమును గొనియాడి, యాజ్ఞాప్రకార మంతయుం జేసిరి. ౧౯

అంత నాబ్రాహ్మణు లందఱును, సమస్తధర్మంబుల నెఱిఁగి, సమస్త రాజులకును మేటియై వెలుఁగుచున్న యాదశరథమహారాజును బ్రస్తుతించి, యతనివలన ననుజ్ఞఁ బొందివచ్చునప్పుడు తమకు గౌరవార్థమై రాజుచే సమర్పింపఁబడిన యుత్తమయానంబుల నారోహించి, యంతటిగౌరవంబు నచే తమతమయిరవులకుం బోయిరి. ౨౦

వసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణశ్రేష్ఠులందఱును వెళ్లఁగా, సంతోషముచే నధికమైన కాంతిగల యాదశరథుఁడు, మంత్రులకు సెలవిచ్చి తాను నంతఃపురంబునకుఁ బోయెను. ౨౧

ఇది పండ్రెండవ సర్గము.

---

## పదుమూఁడవ సర్గము

రెండవవసంతర్తువు రాఁగానే . యేఁడాది సంపూర్ణమయినది; అంతట బరాక్రమశాలియగు దశరథుఁడు, సంతానముకొఱకు, నశ్వమేధయాగము సేయుటకు యాగశాలను బ్రవేశించెను. ౧

ఆదశరథుఁడు, బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు వసిష్ఠమహామునిని నమస్కరించి యథాశాస్త్రముగఁ బూజించి, తనకు నిర్విఘ్నముగ సంతానముగల్గుటకై వినయముతో నిటని చెప్పెను. ౨

“మునిశ్రేష్ఠుఁడవగు వసిష్ఠుఁడా! నాయాగమును యథాశాస్త్రంబుగ నెఱవేర్ప వలయును; ఉపకరణము, క్రియ, దేవత మొదలగుయాగాంగములయందు రాక్షసు లంతరాయముసేయుట కవకాశము లేకుండునట్లు సేయ వలయును. ౩

నీవు నాకుఁ బరమస్నేహితుఁడవు; పరమపూజ్యాచార్యుఁడవు; ఈ యాగమునకు ఋత్విజుఁడవై, యిందలిభారమునంతయుం వహింపవలయును అని చెప్పెను. ౪

తథేతి చ స రాజాన మబ్రవీ ద్ద్విజస త్తమః,
కరిష్యేసర్వమేవైతద్భవతా యత్సమర్థితమ్. ౫
తతోఽబ్రవీ ద్ద్విజాన్వృద్ధా న్యజ్ఞ కర్మసు నిష్ఠితాన్,
స్థాపత్యే నిష్ఠితాంశ్చైవ వృద్ధాన్పరమధార్మికాన్. ౬
కర్మాంతికాన్ శిల్పకరా న్వర్ధకీన్ ఖనకానపి,
గణకాన్ శిల్పిన శ్చైవ తథైవ నటనర్తకాన్. ౭
తథా శుచీన్ శాస్త్రవిదః పురుషాన్ సుబహుశ్రుతాన్,
యజ్ఞకర్మ సమీహాంతాం భవంతో రాజశాసనాత్. ౮
ఇష్టకా బహుసాహస్రా శ్శీఘ్ర మానీయతామితి,
ఔపకార్యాః క్రియంతాంచ రాజ్ఞాం బహుగుణాన్వితాః. ౯

బ్రాహ్మణావసథాశ్చైవ కర్తవ్యాశ్శతశశ్శుభాః,
భక్ష్యాన్నపానై ర్బహుభి స్సముపేతా స్సునిష్ఠితాః. ౧౦

తథా పౌతజనస్యాపి కర్తవ్యా బహువిస్తరాః,
ఆవాసా బహుభక్ష్యా వై సర్వకామై రుపస్థితాః. ౧౧

తథా జానపదస్యాపి కర్తవ్యా బహుశోభనమ్,
దాతవ్య మన్నం విధివత్సత్కృత్య నతు లీలయా. ౧౨

సర్వే వర్ణా యథా పూజాం ప్రాప్నువంతి సుసత్కృతాః.
న చావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశాదపి. ౧౩

యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషా శ్శిల్పిన స్తథా,
తేషామపి విశేషేణ పూజా కార్యా యథాక్రమమ్. ౧౪

బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడును, "నీవు ప్రార్థించినదాని నంతయుం జాఁగఁజేసెదను" అని దశరథమహారాజుతోఁ జెప్పెను. ౫

అంత వసిష్ఠుఁడు, యాగకార్యనియుక్తులైన వృద్ధబ్రాహ్మణులను, వృద్ధులును, ధార్మికులునగు వారి ద్రవ్యములఁ దెప్పించుటయం దధికృతులైన వారలను, బనివాండ్రను, ఇటికలాళ్లు మొదలగువానిఁ జేయువారలను, వడ్లవాండ్రను, దటాకము మొదలైనవానిం ద్రవ్వువారలను, లెక్కలు వ్రాయువారలను, చిత్తరువులు కల్పించువారలను, రసభావంబుల నభినయించువారలను, మఱియుఁ, బరిశుద్ధులును శాస్త్రతత్త్వంబుల నెఱింగినవారలునగు రాజపురుషులనుం జూచి, "రాజాజ్ఞం బట్టి మీరందఱు యాగకార్యములం బ్రవర్తింపుఁడు, ఇటికలాళ్లు పెక్కుసహస్రంబులు కొనిరండు" అనియాజ్ఞాపించెను. ౬-౮

పెక్కుపదార్థంబుల సంపూర్ణంబులయిన రాజగృహంబుల రచియింపవలయును. ౯

నానావిధంబులగు భక్ష్యాన్నపానీయంబులతోఁ గూడి, మంగళకరంబులై గాలివానలం గూలకుండునట్లు సుస్థిరంబులై యుండు బ్రాహ్మణగృహంబులనుం గావింపవలయును. ౧౦

ఆప్రకారము పట్టణమునందుండు జనులకును, మిక్కిలి వెడల్పును నిడుపునుం గలిగి, నానావిధభక్ష్యంబులతోను శ్రేష్ఠములైన సమస్తపదార్థములతోనుం గూడిననివాసస్థానములు కల్పింపవలయును. ౧౧

ఆప్రకారము గ్రామ్యజనులకును, మిక్కిలి శ్రేష్ఠమైన యన్నమును, శాస్త్రప్రకారము శ్రద్ధతో నివ్వవలయును; అనాదరముగా మాత్రమివ్వఁగూడదు. ౧౨

అన్నిజాతులం బెట్టుచక్కఁగాఁ బూజనొందునో; ఆప్రకారముచేయవలయును; కామక్రోధములవలనఁగాని, యనాదరమువలనఁగాని, యొంత మాత్ర మవమానము చేయఁగూడదు. ౧౩

మఱియు, యాగకార్యములయం దాసక్తులయిన రాజపురుషులకును శిల్పులకును విశేషముగా వారివారియోగ్యతననుసరించి పూజసేయవలయును.

తే చ స్యుస్సంభృతా స్సర్వే వసుభి ర్భోజనేన చ. ౧౪½
యథా సర్వం సువిహితం న కించిత్పరిహీయతే,
తథా భవంతః కుర్వంతు ప్రీతిస్నిగ్ధేన చేతసా. ౧౫½

తతస్సర్వే సమాగమ్య వసిష్ఠ మిద మబ్రువన్. ౧౬
యథోక్తం తత్సువిహితం న కించిత్పరిహీయతే,
యథోక్తం తత్కరిష్యామో న కించిత్పరిహాస్యతే. ౧౭
తతస్సుమంత్ర మానీయ వసిష్ఠో వాక్య మబ్రవీత్. ౧౭½
నిమంత్రయస్వ నృపతీన్ పృథివ్యాం యేచ ధార్మికాః. ౧౮
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ఛూద్రాం శ్చైవ సహస్రశః,
సమానయస్వ సత్కృత్య సర్వదేశేషు మానవాన్. ౧౯

మిథిలాధిపతిం శూరం జనకం సత్యవిక్రమం,
నిష్ఠితం సర్వశాస్త్రేషు తథా వేదేషు నిష్ఠితమ్. ౨౦
తమానయ మహాభాగం స్వయమేవ సుసత్కృతం,
పూర్వసంబంధినం జ్ఞాత్వా తతః పూర్వం బ్రవీమి తే. ౨౧

తథా కాశీపతిం స్నిగ్ధం సతతం ప్రియవాదినం,
వయస్యం రాజసింహస్య స్వయమేవానయస్వహ. ౨౨

తథా కేకయరాజానం వృద్ధం పరమధార్మికం,
శ్వశురం రాజసింహస్య సపుత్రం త్వమిహానయ. ౨౩

అంగేశ్వరం మహాభాగం రోమపాదం సుసంస్కృతం,
వయస్యం రాజసింహస్య సమానయ యశస్వినమ్. ౨౪

యాగకార్యములయం దాసక్తులగువారందఱును ధనములచేతను భోజనములచేతను దృప్తులగుదురు. ౧౪½

సమస్తమును జక్కఁగాఁ జేయఁబడి, కొంచమైనను విడువంబడకుండునట్లు, మిక్కిలి ప్రేమగలహృదయముతో మీరలు చేయుదురుగాక; అని వసిష్ఠుఁడు ఆబ్రాహ్మణులఁజూచి చెప్పెను. ౧౫½

అంతట, వారలందఱును వచ్చి, "రాజగృహములు నిర్మించుటమొదలగువానిం, దాము సెలవిచ్చినపద్ధతినే చక్కఁగాఁజేసితిమి; కొంచెమైనను విడువలేదు; అన్నదానము మొదలగువానినిం, దాము సెలవిచ్చినట్లే చేసెదము; కొంచెమైనను విడువము" అని వసిష్ఠునితోఁ జెప్పిరి. ౧౬, ౧౭

అంత వసిష్ఠుఁడు, సుమంత్రు రావించి యిట్లని చెప్పెను. ౧౮½

భూమండలమందు ధార్మికులుగానున్న రాజులనందఱిఁ బిలువుము.

సమస్తదేశముల యందుండుఁ బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులనుం బూజించి, వేనవేల కొలంది నిటకుఁ దోడితెమ్ము. ౧౯

దృఢపరాక్రమముగలిగి శూరుఁడై, సమస్తశాస్త్రములును వేదములును జక్కఁగా నెఱింగి, మహాభాగ్యశాలియై యున్న మిథిలాధిపతియగు జనకమహారాజును, నీవే నానావిధసత్కారములం జేసి తోడితెమ్ము; అతఁడు మునుపటిసంబంధియని యెఱింగి యున్నందున, మొదట నతనిఁ దోడితెమ్మని నీకుఁ జెప్పితిని. ౨౦, ౨౧

దయాశాలియు, నెల్లప్పుడును బ్రియముగా మాటలాడువాఁడునై, రాజశ్రేష్ఠుండగు దశరథునకుఁ బ్రియమిత్రుండై యుండు కాశీరాజును నీవే తోడితెమ్ము. ౨౨

వృద్ధుఁడై ధర్మము నాచరించువారలలో శ్రేష్ఠుఁడై, రాజశ్రేష్ఠుఁడగు దశరథునకు ,మామయైన కేకయరాజు, నతనికుమారునితోఁగూడ నిచ్చటికి నీవు తోడితెమ్ము. ౨౩

సద్గుణంబులచే నలంకరింపఁబడి, శ్రేష్ఠంబైనకీర్తిగలిగి, మహాభాగ్యశాలియై రాజశ్రేష్ఠుఁ డగుదశరథునకుఁ బ్రియమిత్రుఁడై యున్నయంగదేశాధిపతియగు రోమపాదునిం దోడితెమ్ము. ౨౪

ప్రాచీనాన్సింధుసౌవీరాౝ సౌరాష్ట్రేయాంశ్చ పార్థివాౝ,
దాక్షిణాత్యా న్నరేంద్రాంశ్చ సమస్తా నానయస్వహ. ౨౫

సంతి స్నిగ్ధాశ్చ యే చాన్యే రాజానః పృథివీతలే,
తానానయ యథాక్షిప్రంసానుగాౝ సహబాంధవాౝ. ౨౬

వసిష్ఠవాక్యం తచ్ఛ్రుత్వా సుమంత్ర స్త్వరిత స్తదా,
వ్యాదిశ త్పురుషాం స్తత్ర రాజ్ఞా మానయనే శుభాౝ. ౨౭
స్వయమేవ హి ధర్మాత్మా ప్రయయౌ మునిశాసనాత్,
సుమంత్ర స్త్వరితో భూత్వా సమానేతుం మహీక్షితః. ౨౮

తేచ కర్మాంతికాస్సర్వే వసిష్ఠాయ చ ధీమతే,
సర్వం నివేదయంతి స్మ యజ్ఞే యదుపకల్పితమ్. ౨౯
తతః ప్రీతో ద్విజశ్రేష్ఠ స్తాౝ సర్వా నిద మబ్రవీత్,
అవజ్ఞయా న దాతవ్యం కస్యచిల్లీలయాపివా. 30

అవజ్ఞయా కృతం హన్యా ద్దాతారం నాత్ర సంశయః. 30౪
తతః కైశ్చిదహోరాత్రై రుపయాతా మహీక్షితః,
బహూని రత్నాన్యాదాయ రాజ్ఞో దశరథస్యవై. 3౧౪
తతో వసిష్ఠ స్సుప్రీతో రాజాన మిద మబ్రవీత్. 3౨

ఉపయాతా నరవ్యాఘ్ర రాజాన స్తవ శాసనాత్,
మయాపి సత్కృతా స్సర్వే యథార్హం రాజసత్తమాః. 33
యజ్ఞీయం చ కృతం రాజౝ పురుషై స్సుసమాహితైః,

తూర్పుదిక్కునందలి రాజులను, సింధుసౌవీరదేశంబులనుండు రాజులను, సౌరాష్ట్రదేశమునందుండు రాజులను, దక్షిణపు దిక్కునందలి రాజులను నందఱఁ దోడి తెమ్ము. ౨౫

మఱియు, భూమండలమందు నితరులైన దయాది సద్గుణములుగల రాజులెవ్వరుగలరో, వారినందఱను బరివారబంధుజనంబులతోఁ గూడ శీఘ్రంబుగఁ దోడి తెమ్ము: అని వసిష్ఠుఁడు సుమంత్రునకుఁ జెప్పెను. ౨౬

సుమంత్రుఁ డావసిష్ఠవచనము విని, శీఘ్రముగా గొందఱరాజులఁ దోడి తెచ్చుటకు, సద్గుణసంపన్నులయిన పురుషులఁ బంచెను. ౨౭

వసిష్ఠమహాముని పనుపునం జేసి, ధర్మస్వభావుఁడగు సుమంత్రుఁడు, జనకమహారాజు మొదలగుమహారాజులఁ జక్కఁగాఁ బిలిచికొనివచ్చుటకు, శీఘ్రముగాఁ దానేపోయెను. ౨౮

ఆపనివాండ్రందఱును, దాము యాగనిమిత్తము నిర్మించినదంతయు, బుద్ధిమంతుండగు వసిష్ఠున కప్పగించిరి. ౨౯

అంత, బ్రాహ్మణశ్రేష్ఠుఁడగువసిష్ఠుఁడు, సంతసించి, యాపనివాండ్ర నందఱంజూచి, "అనాదరముగాఁగాని, శ్రద్ధలేకగాని, యొకానొకనికైనను, దానము జేయఁగూడదు; అనాదరముగా దానము చేసినట్టయిన, దానము చేయువానికిం గీడువాటిల్లును; ఇందెంతమాత్రము సంశయంబులేదు." అని చెప్పెను.

అంతఁ గొన్నియహోరాత్రంబులకు, రాజులందఱు దశరథమహారాజున కుపాయనంబిడుటకై పెక్కుమణులం దీసికొని వచ్చిరి. ౩౦౧

అంత వసిష్ఠుఁడు మిక్కిలి సంతసించి, దశరథమహారాజుతో నిట్లని చెప్పెను. ౩౨

పురుషశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! నీయాజ్ఞవలన రాజులందఱు వచ్చిరి; నేను నారాజశ్రేష్ఠుల వారివారి గౌరవమునకుఁదగురీతిఁ బూజించితిని. రాజపురుషులుమిక్కిలియెచ్చరికగలిగి, యాగమునకుఁగావలయువానిం

నిర్యాతు చ భవాన్ద్రష్టుం యజ్ఞాయతనమంతికాత్. 3౪
సర్వకామై రుపహృతై రుపేతం వై సమంతతః,
ద్రష్టు మర్హసి రాజేంద్ర మనసేవ వినిర్మితమ్. 3౫

తథా వసిష్ఠవచనాదృశ్యశృంగస్య చోభయోః,
శుభే దివసనక్షత్రే నిర్యాతో జగతీపతిః. 3౬

తతో వసిష్ఠ ప్రముఖా స్సర్వఏవ ద్విజోత్తమాః,
ఋశ్యశృంగం పురస్కృత్య యజ్ఞకర్మారభం స్తదా. 3౭
యజ్ఞవాట గతా స్సర్వే యథాశాస్త్రం యథావిధి. 3౭౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రయోదశస్సర్గః.

---

## చతుర్దశస్సర్గః

అథ సంవత్సరే పూర్ణే తస్మిన్ ప్రాప్తే తురంగమే,
సరయ్వా శ్చోత్తరే తీరే రాజ్ఞో యజ్ఞోఽభ్యవర్తత. ౧

ఋశ్యశృంగం పురస్కృత్య కర్మ చక్రు ర్ద్విజర్షభాః,
అశ్వమేధే మహాయజ్ఞే రాజ్ఞోఽస్య సుమహాత్మనః. ౨

కర్మ కుర్వంతి విధివద్యాజకా వేదపారగాః,
యథావిధి యథాన్యాయం పరిక్రామంతి శాస్త్రతః. 3

చేసిరి ; నీవును యాగముచేయుటకై సమీపమందు సమస్తకామంబుల చేత నిండియున్న యజ్ఞశాలం బ్రవేశింపుము. ౩౪,౩౫

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా ; నీవు మనస్సుచేఁ జేయఁబడిన ట్లతి శీఘ్రముగా నిర్మింపఁబడిన యాగశాలను జూడవలయును. ౩౬

ఆప్రకారము, వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును జెప్పఁగా, దశరథ మహారాజు, మంగళకరమైన వారము నక్షత్రము గలతిథియందు గృహము నుండి యాగశాలకుఁ బోయెను. ౩౭

అంత, వసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణశ్రేష్ఠు లందఱు, ఋశ్యశృంగుని మున్నిడుకొని, యాగకార్యము నారంభించిరి. ౩౮

అందఱును యాగశాలం జేరి, కల్పములోఁ జెప్పఁబడినట్లును, వేదములచే విధింపఁబడినట్లును, యాగకార్యంబులఁ జేయసాగిరి. ౩౯

ఇది పదుమూఁడవసర్గము.

---

## పదునాలవసర్గము

గుఱ్ఱమును విడిచి యేఁడాదియు నిండఁగానే యాగుఱ్ఱము మరల వచ్చినది; అంత, సరయూనదియుత్తరతీరమందు, దశరథుని యశ్వమేధము ప్రవర్తించెను. ౧

మిక్కిలి పూజ్యంబగుస్వభావముగల యాదశరథుని యశ్వమేధమహా యాగమునందు, బ్రాహ్మణశ్రేష్ఠులందఱు ఋశ్యశృంగుని మున్నిడికొని, కార్యములఁ జేయుచుండిరి. ౨

సమస్తవేదములసారంబు దెలిసినట్టి ఋత్విజులు, యథాశాస్త్రముగఁ గర్మములఁ జేయుచు, వేదంబులయందు విధింపఁబడినట్లును, మీమాంసా న్యాయంబుల నిశ్చితంబగునట్లును, కల్పసూత్రంబునఁ జెప్పఁబడినట్లును సంచరింపుచుండిరి. ౩

ప్రవర్గ్యం శాస్త్రతః కృత్వా తథైవోపసదం ద్విజాః,
చక్రుశ్చ విధివత్సర్వ మధికం కర్మ శాస్త్రతః. ౪

అభిపూజ్య తతో హృష్టా స్సర్వే చక్రుర్యథావిధి,
ప్రాత స్సవనపూర్వాణి కర్మాణి మునిపుంగవాః. ౫

ఐంద్రశ్చ విధివద్దత్తో రాజా చాభిష్టుతోఽనఘః,
మాధ్యందినంచసవనం ప్రావర్తత యథాక్రమమ్. ౬

తృతీయసవనం చైవ రాజ్ఞోఽస్య సుమహాత్మనః,
చక్రుస్తే శాస్త్రతో దృష్ట్వా తథా బ్రాహ్మణ పుంగవాః. ౭

నచాహుత మభూత్తత్ర స్ఖలితం వాపి కించన,
దృశ్యతే బ్రహ్మవత్సర్వం క్షేమయుక్తం హి చక్రిరే. ౮

నతేష్వహస్సు శ్రాంతో వా క్షుధితో వాపి దృశ్యతే,
నావిద్వాన్బ్రాహ్మణ స్తత్ర నాశతానుచర స్తథా. ౯

బ్రాహ్మణా భుంజతే నిత్యం నాథవంతశ్చ భుంజతే,
తాపసా భుంజతే చాపి శ్రమణా భుంజతే తథా. ౧౦

వృద్ధాశ్చ వ్యాధితాశ్చైవస్త్రియో బాలా స్తథైవచ,
అనిశం భుంజమానానాం నతృప్తి రుపలభ్యతే. ౧౧

బ్రాహ్మణులు ప్రవర్గ్యమును, ఉపసత్తును యథాశాస్త్రముగఁ జేసి,
సమస్తమయినకర్మమును వేదవిధిప్రకారమును, కల్పసూత్రమందుఁ జెప్పఁబడి
నట్లును, గొఱఁతపడకుండఁ జేసిరి. ౪

మునిశ్రేష్ఠు లందఱును సంతోషముతో సాయా కర్మదేవతలఁ
బూజించి ప్రాతస్సవనము మొదలగుకర్మంబుల యథాశాస్త్రముగాఁ జేసిరి. ౫

ఇంద్రున కివ్వవలసిన హవిర్భాగంబింద్రున కివ్వఁబడినది; దోషరహితం
బగుసోమలతయును స్తుతింపఁబడినది; యథాక్రమముగా మాధ్యందిన సవన
మును జరిగినది. ౬

ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు, మహాత్ముఁ డగుదశరథమహారాజుకొఱకు, శాస్త్ర
ప్రకారము నెఱింగి తృతీయసవనమును జేసిరి. ౭

ఆ యాగమునందు మంత్రప్రకారము వేల్వఁబడనిదిగాని వేఱువిధ
ముగా వేల్వఁబడినదిగాని కొంచెమైన నుండలేదు; విఘ్నము లేమియును లేక క్షేమ
ముతోనే చేసిరి కావున మంత్రయుక్తముగా నేయంతయును గనుపడుచుండినది.

ఆయశ్వమేధయాగదినములందు దప్పిగొన్నవాఁడు గాని యాఁకలి
గొన్నవాఁడు గాని కనుపడలేదు; పండితుఁడు గాని బ్రాహ్మణుఁడు నుండలేదు;
నూఱుగురు పరివారజనులు లేనివాఁడు దొరకలేదు. ౯

ఆయాగమునం దెల్లప్పుడును బ్రాహ్మణులును, శూద్రులును, దపస్వు
లును, సన్న్యాసులును భుజింపుచుండిరి. ౧౦

ముసలివాండ్రును, వ్యాధిగ్రస్తులును, స్త్రీలును, బాలురును, ఎల్లప్పు
డును భుజింపుచున్నవారైనను, పదార్థముల యందలి రుచ్యతిశయమువలనఁ
దనివిఁ బొందలేరైరి. ౧౧

దీయతాం దీయతా మన్నం వాసాంసి వివిధానిచ,
ఇతి సంచోదితా స్తత్ర తథా చక్రు రనేకశః. ౧౨

అన్నకూటాశ్చ బహవో దృశ్యంతే పర్వతోపమాః,
దివసే దివసే తత్ర సిద్ధస్య విధివ త్తదా. ౧౩
నానాదేశా దనుప్రాప్తాః పురుషా స్త్రీగణా స్తథా,
అన్నపానై స్సువిహితా స్తస్మి న్యజ్ఞే మహాత్మనః. ౧౪

అన్నం హి విధివత్స్వాదు ప్రశంసంతి ద్విజర్షభాః,
అహో తృప్తాస్స్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః. ౧౫

స్వలంకృతాశ్చ పురుషా బ్రాహ్మణా న్పర్యవేష యన్,
ఉపాసతే చ తానన్యే సుమృష్టమణికుండలాః. ౧౬

కర్మాంతరే తదా విప్రా హేతువాదా న్బహూ నపి,
ప్రాహుశ్చ వాగ్మినో ధీరాః పరస్పరజిగీషయా. ౧౭
దివసే దివసే తత్ర సంస్తరే కుశలా ద్విజాః,
సర్వకర్మాణి చక్రు స్తే యథాశాస్త్రం ప్రచోదితాః. ౧౮
నాషడంగవిదత్రాసీ న్నావ్రతో నా బహుశ్రుతః,
సదస్యా స్తస్య వై రాజ్ఞో నావాదకుశలా ద్విజాః. ౧౯

"అన్నం బివ్వఁబడుఁగాక! యివ్వఁబడుఁగాక! నానావిధంబులగు వస్త్రంబులు నివ్వఁబడుఁగాక!" అని దశరథునిచే నాదరాతిశయంబునఁ బలుమాఱుఁ బ్రేరేపింపఁబడినవారలై రాజపురుషు లాప్రకార మనేకవిధములఁగా నిచ్చిరి. ౧౨

ఆయాగశాలలో నప్పుడు ప్రతిదినమందును పాకశాస్త్రపద్ధతిగ సిద్ధము చేయఁబడిన కొండలంతేసియన్నరాసు లనేకములు కనుపడినవి. ౧౩

మహాత్ముఁడగు దశరథునియశ్వమేధయాగమునందు నానాదేశముల నుండివచ్చినపురుషులును స్త్రీలును అన్నపానంబులచేఁ జక్కఁగాఁ దనివినొందునట్లు చేయఁబడిరి. ౧౪

"అన్నము బహురుచిగానున్నది! మిక్కిలి యుపచారముతో నివ్వఁబడుచున్నది! మేమందఱమును దనివినొందితిమి! ఆశ్చర్యము! నీకు మంగళమగుఁగాక!" అని బ్రాహ్మణశ్రేష్ఠులు నానావిధంబులఁ గొనియాడిరి; దాని దశరథుఁడు వినియెను. ౧౫

మంచియలంకారములతోఁ గూడినపురుషులును బ్రాహ్మణులకు వడ్డింపుచుండిరి; ఆపురుషులను మణికుండలములం దాల్చియున్న మఱికొందఱు సహాయార్థము సేవించిరి. ౧౬

అప్పుడు ఆయాగకర్మములమధ్యకాలమందుఁ బండితులును వావదూకులునగుబ్రాహ్మణులొండొరులజయింపఁదలంపుగొని యుక్తివాదంబులఁ జేసిరి.

ఆ యశ్వమేధమందు ప్రతిదినంబును యథాశాస్త్రముగా వృద్ధులచేఁ బ్రేరేపింపఁబడినవారలై ఋత్విజులు సమస్తకర్మంబులం జేసిరి, ౧౭

ఆ యశ్వమేధయాగమందు బ్రాహ్మణులందఱును 'శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తజ్యోతిష కల్పంబు' లనియెడు నాఱు వేదాంగంబుల నెఱింగినవారుగాను, బ్రహ్మచర్యాదివ్రతాచరణశీలురుగాను, అధికంబగుశాస్త్రాభ్యాసము గలవారుగాను నుండిరి; ఆదశరథమహారాజుసదస్యు లందఱును వాదమునందు సమర్థులుగా నుండిరి. ౧౮

ప్రాప్తే యూపోచ్ఛ్రయే తస్మిన్ షడ్బైల్వాః ఖాదిరా స్తథా,
తావంతో బిల్వసహితాః పర్ణినశ్చ తథాపరే. ౨౦
శ్లేష్మాతకమయ స్త్వేకో దేవదారుమయ స్తథా,
ద్వావేవ విహితౌ తత్ర బాహువ్యస్తపరిగ్రహౌ. ౨౧
కారితా స్సర్వ ఏవైతే శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః,
శోభార్థం తస్య యజ్ఞస్య కాంచనాలంకృతా భవన్. ౨౨

ఏకవింశతి యూపా స్తే ఏకవింశత్యరత్నయః,
వాసోభి రేకవింశద్భి రేకైకంసమలంకృతాః. ౨౩

విన్యస్తా విధివత్సర్వే శిల్పిభి స్సుకృతా దృఢాః,
అష్టాశ్రయ స్సర్వేవ శ్లక్ష్ణరూపసమన్వితాః. ౨౪

ఆచ్ఛాదితా స్తే వాసోభిః పుష్పై ర్గంధైశ్చ భూషితాః,
సప్తర్షయో దీప్తిమంతో విరాజంతే యథా దివి. ౨౫

ఇష్టకాశ్చ యథాన్యాయం కారితాశ్చ ప్రమాణతః,
చితోఽగ్ని ర్బ్రాహ్మణై స్తత్ర కుశలై శ్శుల్బకర్మణి. ౨౬

స చిత్యో రాజసింహస్య సంచితః కుశలై ర్ద్విజైః,
గరుడో రుక్మపక్షో వై త్రిగుణోఽష్టాదశాత్మకః. ౨౭

నియుక్తా స్తత్ర పశవ స్తత్త దుద్దిశ్య దైవతమ్,
ఉరగాః పక్షిణశ్చైవ యథాశాస్త్రం ప్రచోదితాః. ౨౮

ఆయశ్వమేధమందు యూపస్తంభంబుల నిలుపునప్పుడు ఆఱుబిల్వ యూపంబులను వానిదగ్గఱ నాఱుఖాదిరయూపంబులను ఆఱుపలాశయూపంబులను ఒకశ్లేష్మాతకయూపంబును రెండు దేవదారుయూపంబులను నిలిపిరి ; ఆయూపంబులలో రెండేసియూపంబులుగాఁ జాఁచినబాహువంత వ్యవధానముఁగల్గునట్లు నిలిపిరి. ౨౦.౨౧

ఈయూపములన్నియుం, శాస్త్రవేత్తలును యాగంబులం దెలిసినవారు నగు బ్రాహ్మణులచేఁ జేయింపంబడినవై, యా యాగశాల కలంకారంబు గల్గుటకై బంగారముచే నలంకరింపఁబడినవి. ౨౨

ఆ యిరువదియొక్క యూపస్తంభంబులు. చాఁచఁబడిన చిటికెన వ్రేలుగల పిడికిళ్లతోనుండు నిర్వదియొక్కమూరలపొడవుగలవై, ప్రతి యూపమును ఒక్కొకవస్త్రముచే నలంకరింపఁబడినవై యుండినవి ౨౩

యూపస్తంభంబు లన్నియు,యథాశాస్త్రంబుగ స్థాపితంబులై, శిల్పులచేఁ జక్కఁగాఁ జేయఁబడినవై దృఢంబులై యెనిమిదంచులుగల్గి నున్నగా నుండినవి. ౨౪

ఆయూపస్తంభంబులు వస్త్రంబులచేఁ గప్పఁబడి పుష్పగంధంబుల నలంకృతంబులై యాకాశమందుఁ దేజరిల్లెడు సప్తర్షులంబోలెఁ బ్రకాశింపుచుండినవి. ౨౫

శాస్త్రమునందుఁ జెప్పఁబడిన కొలఁదినిబట్టి యిటికరాళ్లు చేయింపఁబడినవి; శుల్బకార్యమందు నేర్పరులగు బ్రాహ్మణులు ఆయిటికరాళ్లతో నగ్నివేదిం గట్టిరి, ౨౬

సమర్థులగుదశరథునిఋత్విజులు ఆకట్టవలసినప్రదేశమును బంగారముతోఁగూడిన ఱెక్కలుగలిగి ప్రతిప్రస్తారమందును మూఁడేసి యిటికరాళ్లుండుటంజేసి యాఱుప్రస్తారములకును బదునెనిమిది యిటికరాళ్లు గలదియైయుండు గరుడపక్షిరూపమునఁ జక్కఁగాఁగట్టిరి. ౨౭

శాస్త్రంబులవిధింపఁబడినపశువులను, సర్పంబులను. పక్షులను, ఆయాదేవతలనుద్దేశించి యథావిధిగ నాయూపస్తంభంబులం గట్టిరి. ౨౮

శామిత్రే తు హయ స్తత్ర తథా జలచరాశ్చయే,
ఋత్విగ్భి స్సర్వ మేవైతన్నియు క్తం శాస్త్రత స్తదా. ౨౯

పశూనాం త్రిశతం తత్ర యూపేషు నియతం తదా,
అశ్వరత్నో త్తమం తస్య రాజ్ఞో దశరథస్యచ. ౩౦
కౌసల్యా తం హయం తత్ర పరిచర్య సమంతతః,
కృపాణై ర్విశశాసైనం త్రిభిః పరమయా ముదా. ౩౧
పతత్రిణా తదా సార్ధం సుస్థితేనచ చేతసా,
అవస ద్రజనీ మేకాం కౌసల్యా ధర్మకామ్యయా. ౩౨
హోతా ధ్వర్యు స్తథోద్గాతా హ స్తేన సమయోజయన్,
మహిష్యా పరివృత్త్యా చ వావాతాంచ తథాపరామ్. ౩౩

పతత్రిణ స్తస్య వపా ముద్ధృత్య నియతేంద్రియః,
ఋత్వి క్పరమసంపన్న శ్శ్రపయామాస శాస్త్రతః. ౩౪

ధూమగంధం వపాయాస్తు జిఘ్రతిస్మ నరాధిపః,
యథాకాలం యథాన్యాయం నిర్ణుదన్ పాపమాత్మనః. ౩౫

హయస్య యాని చాంగాని తాని సర్వాణి బ్రాహ్మణాః,
అగ్నౌ ప్రాస్యంతి విధివ త్సమంత్రా ష్షోడశ ర్త్విజః. ౩౬
ప్లక్షశాఖాసు యజ్ఞానా మన్యేషాం క్రియతే హవిః,
అశ్వమేధస్య యజ్ఞస్య వైతసోభాగ ఇష్యతే. ౩౭

త్ర్యహోఽశ్వమేధ స్సంఖ్యాతః కల్పసూత్రేణ బ్రాహ్మణైః,

పశుబంధము చేయుటయందుమాత్రమాకాలమందు ఋత్విజులు శాస్త్రోక్తంబులగు గుఱ్ఱము జలచరములు మొదలగు గ్రామజమృగంబులను మాత్రము ఆయూపంబులఁ గట్టిరి. [illegible]

ఆ యశ్వమేధమందుఁ బశుబంధకాలంబున మున్నూఱుపశువులును దశరథమహారాజు నుత్తమాశ్వంబును యూపస్తంభంబులందుఁ గట్టఁబడినవి.

దశరథునిభార్యలు ఆగుఱ్ఱమునకుఁ బ్రదక్షిణముచేసి మిక్కిలి సంతోషంబున బంగారపుసూదులచేఁ గత్తివాటువేసిరి. ౩౧

అప్పుడు కౌసల్యాదేవి ధర్మమునందలి యిచ్ఛచే సుస్థిరంబగు మనంబు గలిగి యాగుఱ్ఱముతోఁగూడ నొకరాత్రియంతయు నివసించెను. ౩౨

దశరథుఁడివ్వఁగా హోతయును అధ్వర్యువును ఉద్గాతయును బ్రహ్మయును యీనలువురు ఋత్విజులును మహిషిని పరివృత్తిని వావాతను బాలాకలిని క్రమముగఁ బరిగ్రహించిరి. ౩౩

ఇంద్రియనిగ్రహము గలవాఁడును సమస్తశాస్త్రంబుల శీలించిన వాఁడు నగునధ్వర్యువు ఆయశ్వమునందలి మెదడుకొత్తి యథాశాస్త్రంబుగ బక్వము చేసెను. ౩౪

దశరథమహారాజును దనపాపముఁబోఁగొట్టుకొనుటకై యూపవు యగ్నిహోత్రమందు వేల్వఁబడుచుండఁగా దానిపొగవాసనను శాస్త్రోక్తకాలంబునఁ శాస్త్రోక్తరీతి నాఘ్రాణించెను. ౩౫

మంత్రవేత్తలగు ఋత్విజులు పదియాఱుగురు ఆగుఱ్ఱము నంగంబులన్నియుఁ యథాశాస్త్రంబుగ నగ్నిహోత్రంబునందు హోమముచేసిరి. ౩౬

ఇతరయాగంబులకు హవిస్సు జువ్వికొమ్మలయందు సంస్కరింపఁబడుచున్నది ; అశ్వమేధంబునకు హవిర్భాగము ప్లక్షలతీఁగెలయందు సంస్కరింపఁ బడుచున్నది. ౩౭

కల్పసూత్రముచేతను వేదవాక్యంబులచేతను అశ్వమేధము మూఁడు దినములయాగమని యేర్పడుచున్నది. ౩౭½

చతుష్టోమ మహ_స్తస్య ప్రథమం పరికల్పితమ్,
ఉక్థ్యం ద్వితీయం సంఖ్యాత మతిరాత్రం తథో_త్తరమ్, ౩౮½
కారితా_స్తత్ర బహవో విహితా శ్శాస్త్రదర్శనాత్ ౩౯

జ్యోతిష్టోమాయుషీ చైవ మతిరాత్రౌ వినిర్మితౌ,
అభిజిద్విశ్వజిచ్చై_చ్చవ మప్తోర్యామో మహాక్రతుః. ౪౦

ప్రాచీం హోత్రే దదౌ రాజా దిశం స్వకులవర్ధనః,
అధ్వర్యవే ప్రతీచీంతు బ్రహ్మణే దక్షిణాం దిశమ్. ౪౧
ఉద్గాత్రే చ తథోదీచీం దక్షిణైషా వినిర్మితా,
అశ్వమేధే మహాయజ్ఞే స్వయంభువిహితే పురా. ౪౨

క్రతుం సమాప్యతు తదా న్యాయతః పురుషర్షభః,
ఋత్విగ్భ్యో హి దదౌ రాజా తాం ధరాం క్రతువర్ధనః. ౪౩
ఋత్విజ స్త్వబ్రువ న్సర్వే రాజానం గతకల్మషమ్,

భవానేవ మహీం కృత్స్నా మేకో రక్షితు మర్హతి. ౪౪

న భూమ్యా కార్య మస్మాకం నహి శక్తా స్స్మపాలనే,
రతా స్స్వాధ్యాయకరణే వయం నిత్యం హి భూమిప. ౪౫
నిష్క్రియం కించిదేవేహ ప్రయచ్ఛతు భవానితి. ౪౫½

మణిరత్నం సువర్ణం వా గావో యద్వా సముద్యతమ్,
తత్ప్రయచ్ఛ నరశ్రేష్ఠ ధరణ్యా న ప్రయోజనమ్. ౪౬½

ఆయశ్వమేధము మొదటిదినము చతుష్టోమమనియు, రెండవదినం బుక్థ్యమనియు, మూఁడదినం బతిరాత్రమనియుఁ జెప్పఁబడుచున్నది. ౩౮.

అందుఁ బ్రమాణాంతరమునుంబట్టి, శాస్త్రవిహితంబులగుబహుయాగంబులు చేయింపఁబడినవి. ౩౯

జ్యోతిష్టోమం బొకటియును, ఆయుర్యాగం బొకటియును, రెండతిరాత్రంబులును, అభిజిద్యాగం బొకటియును, విశ్వజిద్యాగం బొకటియును, ఆప్తోర్యామం బొకటియును జేసిరి. ౪౦

దానమహిమచేఁ దనకులంబును వృద్ధిఁబొందించునట్టి దశరథమహారాజు, హోతకుఁ దూర్పుదిక్కునందలి దేశమునిచ్చెను; అధ్వర్యునకుఁ బడమటిదిక్కునందలి దేశంబునొసంగెను; బ్రహ్మకు దక్షిణపుదిక్కునందలి దేశంబు సమర్పించెను; ఉద్గాత కుత్తరదిక్కునందలి దేశంబునిచ్చెను; మునుపు బ్రహ్మచే సృజింపఁబడిన యశ్వమేధమహాయాగమం దీదక్షిణ యేర్పఱుపంబడినది. ౪౧, ౪౨

అశ్వమేధంబు ముగియఁగానే, పురుషశ్రేష్ఠుఁడగు దశరథమహారాజు, క్రతుఫలంబభివృద్ధినొందుటకై, భూమండలం బంతయు ఋత్విక్కులకిచ్చెను.

ఋత్విజులందఱును, నిష్కల్మషుఁడగు దశరథమహారాజుతోఁ నిట్లని చెప్పిరి. ౪౩.

నీ వొక్కఁడవే సమస్తంబగుభూమినిఁ బరిపాలింప నర్హుఁడవగుదువు; మఱియెవ్వరును గాఁజాలరు. ౪౪

దశరథ మహారాజా! మాకు భూమిచే నేమియుం బ్రయోజనంబు లేదు; మేముదానిం బాలించుటకు సమర్థులము కామనియు, యెల్లప్పుడు వేదాధ్యయనమునే చేసికొనుచుండువారమనియు, నీకును దెలిసియున్నందున, మాకు దానఁగలుగుసంకటంబుల నెచ్చుగాఁ జెప్పనక్కఱలేదు; కావునఁ గొంచెముగనే దానికి బదులుగా మూల్యం బిత్తువుగాక. ౪౫, ౪౬.

పురుషశ్రేష్ఠుఁడ వగు దశరథుఁడా! మంచిరత్నముగాని, బంగారము గాని, ఏదిసిద్ధముగా నున్నదో దానిమాకిమ్ము; ఈభూమిచే మాకెంతయుఁ బ్రయోజనంబు లేదు. అని దశరథునితోఁ జెప్పిరి. ౪౭

ఏవ ముక్తో నరపతి ర్బ్రాహ్మణై ర్వేదపారగైః. ౪౭
గవాం శతసహస్రాణి దశ తేభ్యో దదౌ నృపః,
శతకోటీ స్సువర్ణస్య రజతస్య చతుర్గుణమ్. ౪౮

ఋత్విజశ్చ తత స్సర్వే ప్రదదు స్సహితా వసు,
ఋశ్యశృంగాయ మునయే వసిష్ఠాయ చ ధీమతే. ౪౯

తత స్తే న్యాయతః కృత్వా ప్రవిభాగం ద్విజోత్తమాః,
సుప్రీతమనస స్సర్వే ప్రత్యూచు ర్ముదితా భృశమ్. ౫౦
తతః ప్రసర్ప కేభ్య స్తు హిరణ్యం సుసమాహితాః,
జాంబూనదం కోటిసంఖ్యం బ్రాహ్మణేభ్యో దదౌ తదా. ౫౧
దరిద్రాయ ద్విజాయాథ హస్తాభరణ ముత్తమమ్,
కస్మైచిద్యాచమానాయ దదౌ రాఘవనందనః. ౫౨

తతః ప్రీ తేషు నృపతిః ద్విజేషు ద్విజవత్సలః,
ప్రణామ మకరో త్తేషాం హర్ష పర్యాకులేక్షణః. ౫౩

తస్యాశిషోఽథ విధివద్బ్రాహ్మణై స్సముదీరితాః,
ఉదారస్య నృవీరస్య ధరణ్యాం ప్రణతస్యచ. ౫౪

తతః ప్రీతమనా రాజా ప్రాప్య యజ్ఞ మనుత్తమమ్,
పాపాపహం స్వర్నయనం దుష్కరం పార్థివర్షభైః. ౫౫

తతోఽ బ్రవీ దృశ్యశృంగం రాజా దశరథ స్తదా,
కులస్య వర్ధనం త్వం తు కర్తు మర్హసి సువ్రత. ౫౬

సమస్తవేదంబులకు సాంగంబుగ పఠించినఋత్విజు లీరీతిం జెప్పఁగా, నాదశరథమహారాజు పదిలక్షలగోవులను, నూఱుకోట్ల బంగారమును నన్నూఱుకోట్లవెండిని వారల కిచ్చెను. ౪౭,౪౮

అంత; నాఋత్విజులందఱుఁ జేరి, దశరథుఁడు తమకందఱకును, మొత్తముగా దక్షిణయిచ్చినధనమును దమకుఁ బంచిపెట్టుటకై ఋశ్యశృంగమహామునికిని, బుద్ధిమంతుఁడగు వసిష్ఠమహర్షికిని సమర్పించిరి. ౪౯

అంత నాబ్రాహ్మణశ్రేష్ఠులందఱును, న్యాయముగా ధనమునంతయును బంచికొని సంతసమునొంది పరస్పరము స్తోత్రవాక్యములఁ జెప్పుకొనిరి. ౫౦

అంత నప్పుడాదశరథమహారాజు శ్రద్ధగలవాఁడై యభ్యాగతులగు బ్రాహ్మణులకు జాంబూనదీసంభవమైన బంగారమును గోటికొలంది నిచ్చెను.

అంత రాఘవుఁడగు నజమహారాజుకొడుకైనదశరథుఁడు ఒకానొక దరిద్రబ్రాహ్మణుఁడు యాచింపఁగా నతనికి శ్రేష్ఠంబగు తనచేతికడియము నిచ్చెను. ౫౨

అంత బ్రాహ్మణులయందుఁ జాలఁ బ్రేమగల దశరథమహారాజు, బ్రాహ్మణులు తృప్తినొందఁగానే, సంతోషవిశేషంబునఁ గలతపడినకండ్లుకలిగినవాఁడై వారలకు నమస్కారముచేసెను. ౫౩

అంత నాబ్రాహ్మణులును, మహాదాతయును మనుష్యుల నందఱిలోను బరాక్రమశాలి యనందగి యుండువాఁడును, దమముంగల నేలంబడియున్న వాఁడు నగునాదశరథమహారాజునకు వేదోక్తాశీర్వాదంబులు చేసిరి. ౫౪

అంత దశరథమహారాజు సర్వోత్తమంబును, సకలపాపంబులఁ బోఁగొట్టునదియును, స్వర్గప్రదంబునై రాజశ్రేష్ఠులచేతను జేయ నశక్యంబై యుండు నశ్వమేధం బొంది సంతుష్టుం డయ్యెను. ౫౫

అంత దశరథమహారాజు, ఋశ్యశృంగునిం జూచి, దృఢవ్రతుఁడవైన ఋశ్యశృంగుఁడా! నీవుమాత్రము నాకు వంశవృద్ధికరంబగు కర్మమును జేయ వలయునని చెప్పెను. ౫౬

తథేతి చ స రాజాన మువాచ ద్విజస త్తమః,
భవిష్యంతి సుతా రాజం శ్చత్వార స్తే కులోద్వహాః. ౫౭

ఇతి శ్రీమద్బాలకాండే, చతుర్దశస్సర్గః.

---

పంచదశస్సర్గః

మేధావీతు తతో ధ్యాత్వా స కించిదిద ము త్తరమ్,
లబ్ధసంజ్ఞ స్తత స్తంతు వేదజ్ఞో నృప మబ్రవీత్. ౧

ఇష్టిం తేఽ హం కరిష్యామి పుత్రీయాం పుత్ర కారణాత్,
అథర్వశిరసి ప్రోక్తైర్మంత్రైస్సిద్ధాం విధానతః. ౨

తతః ప్రాక్రమ్య తా మిష్టిం పుత్రీయాం పుత్ర కారణాత్,
జుహావ చాగ్నౌ తేజస్వీ మంత్రదృష్టేన కర్మణా. 3
తతో దేవా స్స గంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
భాగప్రతిగ్రహార్థం వై సమవేతా యథావిధి. ౪

తా స్సమేత్య యథాన్యాయం తస్మిన్ సదసి దేవతాః,
అబ్రువన్ లోకకర్తారం బ్రహ్మాణం వచనం మహత్. ౫
భగవన్ త్వత్ప్రసాదేన రావణో నామ రాక్షసః,
సర్వా న్నో బాధతే వీర్యా చ్ఛాసితుం త న్న శక్నుమః. ౬

త్వయా తస్మై వరో దత్తః ప్రీతేన భగవన్ పురా,
మానయంత శ్చతన్నిత్యం సర్వం తస్య క్షమామహే. ౭

బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు ఋష్యశృంగుఁడు, "దశరథమహారాజా! అలాగే చేసెదను; నీకు వంశోద్ధారకులగు నలుగురుకొడుకులు కల్గుదురు" అని దశరథ మహారాజుతోఁ జెప్పెను. ౫౭

ఇది పదునాల్గవసర్గము.

---

## పదునైదవసర్గము

అంత వేదంబుల నెఱింగిన ఋష్యశృంగుఁడు, "ఈదశరథునకుఁ బుత్రోత్పత్తి యే కర్మంబునం గల్గు" నని కొంచె మాలోచించి, ధారణసామర్థ్యంబు గలవాఁడు కావున నంతలో స్మృతినొంది, యాదశరథున కిట్లు ప్రత్యుత్తరంబు చెప్పెను. ౧

నేను నీకుఁ గొడుకులు గలుగుటకై, శాస్త్రసిద్ధంబై పుత్రోత్పత్తి నిమిత్తంబై యున్న యొకయాగమును, అథర్వశిరస్సునందు చెప్పఁబడిన మంత్రంబులచేఁ జేసెదను అని చెప్పెను. ౨

అంతఁ బుత్రనిమిత్తము పుత్రులఁగల్గించునట్టి యాయాగము నారంభించి, వేదమునందుఁ జెప్పఁబడినట్లు హోమమును జేసెను. ౩

అంత దేవతలును, గంధర్వులును, సిద్ధులును, బ్రహ్మదేవుఁడును, బరమర్షులును, ఆ యాగంబునందు హవిర్భాగమును బుచ్చుకొనుటకై, యొకటిగాఁ జేరిరి. ౪

ఆదేవతలందఱు యథాశాస్త్రంబుగ నాయాగసదస్సునందుఁ జేరి, లోకంబులఁ జేయునట్టి బ్రహ్మదేవునితో నిటని యొకగొప్పమాటను జెప్పిరి. ౫

భగవంతుఁడా! రావణుఁ డనునొకరక్కసుఁడు, నీయనుగ్రహము నొంది, పరాక్రమంబుచే మమ్ములం గాఱియపెట్టుచున్నాఁడు; అతనిశాసించ మాకు శక్తిలేదు. ౬

భగవంతుఁడా! నీవు పూర్వము, సంతోషవిశేషంబున నతనికి వరం బొసంగితివి; మేము నావరముఁ బాలింపుచు, వాఁడు చేసిన యపకారంబుల నంతయుం నోర్చుచున్నాము. ౭

ఉద్వేజయతి లోకాం స్త్రీ నుచ్ఛ్రితా న్ద్వేష్టి దుర్మతిః,
శక్రం త్రిదశరాజానం ప్రధర్షయితు మిచ్ఛతి. ౮

ఋషీన్ యక్షాన్ సగన్ధర్వానసురాన్ బ్రాహ్మణాం స్తథా,
అతిక్రామతి దుర్ధర్షో వరదానేన మోహితః. ౯

నైనం సూర్యః ప్రతపతి పార్శ్వే వాతి న మారుతః,
చలోర్మిమాలీ తం దృష్ట్వా సముద్రోఽపి న కంపతే. ౧౦

తన్మహన్నో భయం తస్మా ద్రాక్షసాద్ఘోరదర్శనాత్,
వధార్థం తస్య భగవన్నుపాయం కర్తు మర్హసి. ౧౧
ఏవము క్తస్సురైస్సర్వై శ్చింతయిత్వా తతోఽబ్రవీత్. ౧౧½

హంతాయం విదిత స్తస్య వధోపాయో దురాత్మనః. ౧౨

తేనగంధర్వయక్షాణాం దేవదానవరక్షసామ్,
అవధ్యోఽస్మీతి వాగుక్తా తథేత్యుక్తంచ తన్మయా. ౧౩

నాకీర్తయ దవజ్ఞానా త్తద్రక్షో మానుషాం స్తదా,
తస్మాత్స మానుషాద్వధ్యోమృత్యుర్నాన్యోఽస్యవిద్యతే. ౧౪

ఏత చ్ఛ్రుత్వా ప్రియం వాక్యం బ్రహ్మణా సముదాహృతమ్,
దేవా మహర్షయ స్సర్వే ప్రహృష్టా స్తేఽభవం స్తదా. ౧౫

ఆరావణుండు, దుర్బుద్ధియై లోకంబుల భయపడఁ జేయుచున్నాఁడు; ఉన్నతపదస్థులగు లోకపాలుర ద్వేషించుచున్నాఁడు; దేవతలందఱకును ప్రభుండగు నింద్రు నవమానింపఁ గోరుచున్నాఁడు. ౮

ఆరావణుఁడు, నీవరముచే నొదలెఱుంగక యొదిరింపనలవిగాక ఋషులను, యక్షులను, గంధర్వులను, అసురులను, బ్రాహ్మణులను నవమానించుచున్నాఁడు. ౯

ఈరావణుని మీఁద సూర్యుం డెండగాయఁడు; వాని ప్రక్కనైన వాయువు వీవనోపఁడు; ఎల్లప్పుడును జంచలంబులగు తరంగంబులు గలసముద్రుఁడును వానింజూచి కదలకుండు. ౧౦

కాఁబట్టి, భయంకరాకారుండగు నారాక్షసునివలన మాకు గొప్ప భయంబు గలిగియున్నది. అతనివధంబగునట్లు మీర వేదైనం జేయవలయును.

దేవత లీప్రకారముచెప్పఁగా బ్రహ్మదేవుం డాలోచించి, యాపిమ్మట దేవతల కిట్లని చెప్పెను. ౧౧౪

సంతోషము! దుష్టస్వభావుఁ డగునారావణుని వధంబున కియుపాయంబు దోఁచినది. ౧౨

ఆరావణుఁడు, తాను గంధర్వులకును, యక్షులకును, రాక్షసులకును, దేవతలకును, దానవులకును, అవధ్యుఁడు గావలయునని వరంబు గోరెను; నేనాలాగే యగుఁగాక యనిచెప్పితిని. ౧౩

ఆరావణుఁడు, వరమడుగుకాలమందు అవమానమగునని యెంచి, మనుష్యులవలనఁ దనకుఁ జావులేకుండున ట్లడుగలేదు; కాఁబట్టి, వాఁడు మనుష్యునిచేఁ జంపఁబడు; మఱియెవ్వఁడును వానిఁజంపలేడు. అని బ్రహ్మదేవుఁడు చెప్పెను. ౧౪

ఇట్లు బ్రహ్మదేవుఁడు చెప్పఁగా, సంతోషజనకంబగు బ్రహ్మదేవుని మాటను విని, దేవతలును, మహర్షులు నందఱును మిక్కిలి సంతోషము గలవారైరి. ౧౫

ఏతస్మిన్నంతరే విష్ణురుపయాతో మహాద్యుతిః,
శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః. ౧౬.

బ్రహ్మణాచ సమాగమ్య తత్ర తస్థౌ సమాహితః,
తమబ్రువన్ సురా స్సర్వే సమభిష్టూయ సన్నతాః. ౧౭
త్వాన్నియోక్ష్యామహే విష్ణో లోకానాం హితకామ్యయా,

రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభోః,
ధర్మజ్ఞస్య వదాన్యస్య మహర్షిసమతేజసః. ౧౮½
తస్య భార్యాసు తిసృషు హ్రీశ్రీకీర్త్యుపమాసుచ,
విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వాఽఽత్మానం చతుర్విధమ్,

తత్ర త్వం మానుషో భూత్వా ప్రవృద్ధం లోకకంటకమ్.
అవధ్యం దైవతై ర్విష్ణో సమరే జహి రావణమ్. ౨౦½

సహి దేవాంశ్చ గంధర్వాన్ సిద్ధాంశ్చ మునిసత్తమాన్,
రాక్షసో రావణో మూర్ఖో వీర్యోత్సేకేన బాధతే. ౨౧½

ఋషయశ్చ తతస్తేన గంధర్వాప్సరస స్తథా,
క్రీడంతో నందనవనే క్రూరేణ కిల హింసితాః. ౨౨½

వధార్థం వయ మాయాతా స్తస్య వై మునిభి స్సహ,
సిద్ధగంధర్వయక్షాశ్చ తత స్త్వాం శరణం గతాః. ౨౩½
త్వం గతిః పరమా దేవ సర్వేషాన్నః పరంతప,

ఇంతలో సూర్యునికిరణములు దొరకొనుటం గలిగినసంతోషవిశేషంబున వికసమడించిన కాంతిగలిగి, నిజభక్తులం బోరిగొన శారదాబ్దయక కరంబుల శంఖచక్రగదల ధరింపుచు, పీతాంబరుండును జగన్నాథుండు నగు విష్ణుదేవుఁ డరుగుదెంచెను. ౧౫

విష్ణుదేవుఁడు వచ్చి, బ్రహ్మతోఁగూడ నచ్చట సమాహితుఁడై యుండెను; దేవతలందఱును ఆవిష్ణుదేవునిం బ్రస్తుతించి నమ్రులై యిట్లనిపలికిరి. ౧౬

విష్ణుదేవుఁడా! సమస్తలోకంబులకును మేలుగలుగుటకై నిన్నొక కార్యమునందుఁ బ్రేరేపించెదము. ౧౭॥

విష్ణుదేవుఁడా! సమస్తధర్మంబుల నెఱిఁగి, మహోదాత్తయై మహర్షితుల్యుఁడై రాజ్యమును యథాన్యాయంబుగఁ బాలింపసమర్థుఁడై యయోధ్యానగరంబునకుఁ బ్రభువై యున్న దశరథమహారాజునకు హ్రీ శ్రీ కీర్తులతో సరివచ్చు నతని మువ్వురి భార్యలందును స్వరూపమును నాలుగుభాగంబులుగావించుకొని నలువురుకొడుకులుగా జనింపుము. ౧౮-౧౯॥

విష్ణుదేవుఁడా! నీ వాదశరథభార్యలందు మనుష్యుఁడవై పుట్టి, వరబలంబున నభివృద్ధి నొందినవాఁడును లోకకంటకుఁడును దేవతల కవధ్యుఁడునగు రావణుని యుద్ధంబునఁ జంపుము. ౨౦॥

రాక్షసుఁడును మూర్ఖుఁడునగు నారావణుఁడు పరాక్రమాతిశయంబున దేవతలను గంధర్వులను సిద్ధులను మునిశ్రేష్ఠులను గాసియపెట్టుచున్నాఁడు. ౨౧॥

ఆరావణుఁడు క్రూరస్వభావుఁడగుటచేసి ఋషులను నందనవనమందు గంధర్వులఁగూడి విహరింపుచున్నయప్సరసలను గాసియపెట్టెను; కావున, నీవవశ్యంబు వానిఁజంపవలయును. ౨౨॥

ఆరావణునివధముకొఱకు యక్షగంధర్వసిద్ధులును మునులును మేమును మీశరణువచ్చితిమి; అందుకై యే రక్షకుఁ డగునిన్నుఁ బొందితిమి. ౨౩॥

శత్రుంజయుండవగు విష్ణుదేవుఁడా! నీవు మాకందఱకును బరమగతివి.

వధాయ దేవశత్రూణాం నృణాం లోకే మనః కురు. ౨౪

ఏవముక్తస్తు దేవేశో విష్ణుస్త్రిదశపుంగవః. ౨౫
పితామహపురోగాం స్తాన్ సర్వలోకనమస్కృతః,
అబ్రవీత్త్రిదశాన్ సర్వాన్ సమేతాన్ ధర్మసంహితాన్. ౨౬

భయం త్యజత భద్రం వో హితార్థం యుధి రావణమ్,
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతిబాంధవమ్, ౨౭
హత్వా క్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహమ్,
దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ. ౨౮
వత్స్యామి మానుషే లోకే పాలయన్ పృథివీ మిమామ్,
ఏవం దత్త్వా వరం దేవో దేవానాం విష్ణురాత్మవాన్,
మానుషే చింతయామాస జన్మభూమిమథాత్మనః. ౨౯

తతః పద్మపలాశాక్షః కృత్వాఽఽత్మానం చతుర్విధమ్,
పితరం రోచయామాస తదా దశరథ న్నృపమ్. ౩౦

తతో దేవా స్సగంధర్వా స్సరుద్రా స్సాప్సరోగణాః,
స్తుతిభి ర్దివ్యరూపాభి స్తుష్టువు ర్మధుసూదనమ్. ౩౧
తముద్ధతం రావణ ముగ్ర తేజసం
ప్రవృద్ధదర్పం త్రిదశేశ్వరద్విషమ్,
విరావణం సాధు తపస్వికంటకం
తపస్వినా ముద్ధర తం భయావహమ్. ౩౨

రాక్షసులవధంబుకొఱకు మనుష్యలోకంబున నవతరింప నిచ్చగొనుము. అని దేవతలు చెప్పిరి. ౨౪॥

దేవత లీప్రకారము దన్నుఁ బ్రార్థింపఁగా దేవతాధిపుఁడును దేవశ్రేష్ఠుఁడును సమస్తలోకంబుచే నమస్కరింపఁబడిన వాఁడునగు విష్ణుదేవుఁడు ఆ సమయమునందుఁ జేరియున్న ధర్మిష్ఠులగు బ్రహ్మ మొదలైనదేవతల నందఱిం జూచి యిట్లని చెప్పెను. ౨౫,౨౬

దేవతలారా! మీరలు భయము విడువుఁడు; మీకు మంగళంబగుఁ గాక; మీమేలుకొఱకు క్రూరుఁడై దుష్టస్వభావుఁడై దేవతల ఋషుల నొప్పించుచున్న రావణుని వానికొడుకులను మనుమలను మంత్రులను మిత్రులను జ్ఞాతులను బంధువులను జంపి మనుష్యలోకంబున నీభూమిఁ బాలింపుచుఁ బదునొకండువేలవత్సరంబు లుండెదను. అని చెప్పెను. ౨౭, ౨౮॥

సృష్టిస్థితిలయంబులం గ్రీడించుచు,సమస్తజీవాత్మలకు నాధారభూతుఁడై యున్న విష్ణుదేవుఁ డీప్రకారము దేవతలకు వరంబొసంగి యంత మనుష్యలోకంబునందుఁ దాను బుట్టుటకుందగు నిరవు నాలోచించెను. ౨౯॥

అంత నపుడు తమ్మి ఱేకులంబోలునయనంబులు గల విష్ణుదేవుఁడు తన్ను నాలుగుభాగములుగాఁ జేసికొని దశరథమహారాజును దనకుఁ దండ్రిగానిచ్ఛించెను. ౩౦॥

అంత గంధర్వులును ఏకాదశరుద్రులును, దేవతలును అప్సరసలును దివ్యార్థవిషయకంబులగుస్తోత్రంబుల విష్ణుదేవునిం బ్రస్తుతించిరి. ౩౧॥

విష్ణుదేవుఁడా! సమస్తలోకంబులం బ్రసిద్ధుఁడై వరబలంబున నినుమడించినగర్వంబు గలిగి భయంకరంబగు పరాక్రమంబున లోకంబుల నన్నియుఁ మొఱలిడఁజేయుచు తపస్సుచేయువారలకు శత్రువై భయంబుఁ బుట్టింపుచు దేవేంద్రుని ద్వేషించియుండు నారావణునిం బుత్రపౌత్రాదిసహితంబుగాఁ జంపుము. ౩౨॥

తమేవ హత్వా సబలం సబాంధవం
విరావణం రావణ మగ్ర్యపౌరుషమ్,
స్వర్లోక మాగచ్ఛ గతజ్వర శ్చిరం
సురేంద్రగుప్తం గతదోషకల్మషమ్. 33౻

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పఞ్చదశస్సర్గః.

---

షోడశస్సర్గః

తతో నారాయణో దేవో నియుక్తస్సురసత్తమైః,
జానన్నపి సురానేవం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౧

ఉపాయః కో వధే తస్య రావణస్య దురాత్మనః,
యమహం తం సమాస్థాయ నిహన్యామృషికంటకమ్. ౨

ఏవ ముక్తాస్సురా స్సర్వే ప్రత్యూచు ర్విష్ణు మవ్యయమ్. ౨౻

మానుషీం తను మాస్థాయ రావణం జహి సంయుగే. 3
స హి తేపే తపస్తీవ్రం దీర్ఘకాల మరిందమ,
యేన తుష్టోఽభవద్బ్రహ్మాలోకకృల్లోకపూర్వజః. ౪

సంతుష్టః ప్రదదౌ తస్మై రాక్షసాయ వరం ప్రభుః,
నానావిధేభ్యో భూతేభ్యో భయం నాన్యత్రమానుషాత్. ౫

అవజ్ఞాతాః పురా తేన వరదానే హి మానవాః. ౫౻

ఏవం పితామహా త్తస్మా ద్వరం ప్రాప్య స దర్పితః,

దేవశ్రేష్ఠుఁడవగు విష్ణుదేవుఁడా! శ్రేష్ఠంబగు మఱియెట్టి లోకంబు లన్నియు మొఱలిడఁజేయుచున్న యారావణునిమాత్రము వానిసైన్యముల తోను బాంధవులతోను జంపి గతవ్యథుఁడవై పురాతనంబును, రహస్యంబును నిర్దోషంబునగు వైకుంఠమునకు రమ్ము. అని ఆదేవతలు విష్ణుదేవుని స్తుతియించిరి. 33½

ఇది పదునైదవసర్గము.

---

## పదునాఱవసర్గము

అంత, సృష్టిస్థితిలయంబులం గ్రీడించువాఁడును, సృష్టికిఁ బూర్వము జలంబులశయనించి యుండువాఁడునగు విష్ణుదేవుఁడు, దేవతలచేఁబ్రార్థితుఁడై తనకు రావణవధోపాయంబు దెలిసియున్నను, దేవతలఁగూర్చి యిట్లని మధురంబగుమాటను జెప్పెను. ౧

ఏయుపాయంబు నాశ్రయించి, ఋషులకుశత్రుఁడగు నారావణునిఁ జంపఁగలనో, దుష్టస్వభావుఁడగు రావణునివధంబునకై, యట్టియుపాయంబు నాకుఁ జెప్పవలయును అని పలికెను. ౨

ఈప్రకారము విష్ణుదేవుఁ డడుగఁగా, దేవతలందఱు నాశరహితుఁ డగు నావిష్ణుదేవున కిట్లని బదులుపల్కిరి. ౨½

మనుష్యదేహంబునొంది యుద్ధమునందు రావణునిం జంపుము. 3

ఆరావణుఁడు, బహుకాలము తీక్ష్ణంబగుతపస్సు చేసెను; దానంజేసి లోకంబులకన్నముందుపుట్టి సమస్తలోకంబులఁ బుట్టించునట్టి బ్రహ్మదేవుఁడు సంతసించినవాఁ డయ్యెను. ౪

వరదానంబుల సమర్థుఁడగు బ్రహ్మదేవుఁడు సంతసించి, ఆరావణా సురునకు మనుష్యుఁడుతక్కఁ దక్కినసమస్తభూతంబులవలనను భయంబులేదని వరంబొసఁగెను. ౫

మునుపు బ్రహ్మవరమిచ్చునట్టి కాలమునందు, నతండు మనుష్యుల "వీరలెంతమాత్రము" అని యవమానబుద్ధితోఁ జూచెను. ౫½

ఇట్లారావణుండు, బ్రహ్మదేవునివలనవరంబునొంది గర్వించి ముల్లోకం

ఉత్సాదయతి లోకాంస్త్రీన్ స్త్రియశ్చాప్యపకర్షతి. ౬
తస్మాత్తస్య వధో దృష్టో మానుషేభ్యః పరంతప. ౭

ఇత్యేతద్వచనం శ్రుత్వా సురాణాం విష్ణురాత్మవాన్,
పితరం రోచయామాస తదా దశరథం నృపమ్. ౮

స చాప్యపుత్రో నృపతి స్తస్మిన్ కాలే మహాద్యుతిః,
అయజత్పుత్రియా మిష్టిం పుత్రేప్సురరిసూదనః. ౯

స కృత్వానిశ్చయం విష్ణు రామంత్ర్య చ పితామహమ్,
అంతర్ధానం గతో దేవైః పూజ్యమానో మహర్షిభిః. ౧౦

తతో వై యజమానస్య పావకా దతులప్రభమ్,
ప్రాదుర్భూతం మహద్భూతం మహావీర్యం మహాబలమ్. ౧౧
కృష్ణరక్తాంబరధరం రక్తాస్యం దుందుభిస్వనమ్,
స్నిగ్ధహర్యక్షతనుజశ్మశ్రుప్రవరమూర్ధజమ్. ౧౨
శుభలక్షణసంపన్నం దివ్యాభరణభూషితమ్,
శైలశృంగసముత్సేధం దృప్తశార్దూలవిక్రమమ్. ౧౩
దివాకరసమాకారం దీప్తానలశిఖోపమమ్,
తప్తజాంబూనదమయీం రాజతాంతపరిచ్ఛదామ్. ౧౪
దివ్యపాయససంపూర్ణాం పాత్రీం పత్నీమివ ప్రియామ్,
ప్రగృహ్యవిపులాందోర్భ్యాంస్వయంమాయామయీమివ. ౧౫
సమవేక్ష్యాబ్రవీ ద్వాక్య మిదం దశరథం నృపమ్,
ప్రాజాపత్యం నరం విద్ధి మామిహాభ్యాగతం నృప. ౧౬
తతః పరం తదా రాజా ప్రత్యువాచ కృతాంజలిః,

ఋలనశింపఁ జేయుచున్నాఁడు; స్త్రీలనందఱను జెఱఁగొనుచున్నాఁడు. ౬-౭

అందువలన నారావణునకు మనుష్యులవలనఁ జావు సిద్ధము అని దేవతలుచెప్పిరి.

ఈప్రకారము, సమస్తజీవులకు నాధారభూతుఁడగు విష్ణుదేవుఁడు, దేవతలమాటలంతయువిని, యప్పుడు మనుష్యరూపంబున నవతరించుటకు దశరథమహారాజును దనకుఁ దండ్రిగాఁ గోరెను. ౮

ఆకాలమునందే గొప్పకాంతిగలిగి సమస్తశత్రువులఁజంపునట్టియా దశరథమహారాజును, దనకుఁగొడుకులు లేకుండుటఁజేసి కొడుకులఁబడయఁ గోరి పుత్రప్రదంబగు యాగముఁజేసెను. ౯

ఆవిష్ణుదేవుఁడు "మనుష్యులయందే యవతరించెదను" అని నిశ్చయించి, బ్రహ్మదేవునివీడుకొని, దేవతలచేతను మహర్షులచేతను బూజింపఁబడుచు నంతర్ధానంబు నొందెను. ౧౦

అంత సరిలేనికాంతియుఁ బరాక్రమంబును బలంబును గలిగి, ఎఱుపు నలుపును గలసినవస్త్రంబుగట్టి యెఱ్ఱనిముఖంబును భేరీధ్వనిసమానంబగు కంఠధ్వనియునుగల్గి, సింహకేశంబులం బోలినరోమంబులును మీసంబులును దలవెండ్రుకలును మనోహరంబులై ప్రకాశింప శుభలక్షణసహితంబై స్వర్గంబునందుఁబుట్టినయాభరణంబులధరించి, పర్వతశృంగంబునుబోలెనమున్నతంబై, మదించినపెద్దపులికి సాటియగుచు, సూర్యునితోను మండుచున్ననిప్పుమంటతోను సరివచ్చునాకారమునఁదేజరిల్లు నొకగొప్పభూతము, పురుషరూపంబుతో యాగముసేసెడు నాదశరథుని యగ్నిహోత్రంబుననుండి, తప్తంబగు బంగారముతో జేయఁబడిన వెండిమూఁతగలిగి, దివ్యపాయసపూర్ణంబై, మాయామయంబోయన్నట్లొప్పుఁదగియున్న యొక్కపాత్రమును, ప్రియభార్యఁ బోలె, బాహువులఁ గదియ బట్టి బయలువెడలెను. ౧౧-౧౫

ఆభూతము, దశరథమహారాజునుజూచి, "రాజా! ఇచ్చటికివచ్చిన నన్నుఁ బ్రజాపతియొద్దనుండివచ్చినపురుషునిఁగా నెఱుంగుము" అనిచెప్పెను.

అంత,నప్పుడు, దశరథమహారాజుచే మోడ్పుగేలించి, "భగవంతుఁడా

భగవన్ స్వాగతం తేఽస్తు కిమహం కరవాణి తే. ౧౭

అథో పున రిదం వాక్యం ప్రాజాపత్యో నరోఽబ్రవీత్. ౧౭½

రాజ న్నర్చయతా దేవా నద్య ప్రాప్త మిదం త్వయా. ౧౮

ఇదం తు నృపశార్దూల పాయసం దేవనిర్మితమ్,
ప్రజాకరం గృహాణ త్వం ధన్య మారోగ్యవర్ధనమ్. ౧౯

భార్యాణా మనురూపాణా మశ్నీతేతి ప్రయచ్ఛవై,
తాసు త్వం ప్రాప్స్యసే పుత్రాన్ యదర్థం యజసే నృప. ౨౦

తథేతి నృపతిః ప్రీత శ్శిరసా ప్రతిగృహ్య తామ్,
పాత్రీందేవాన్నసంపూర్ణాం దేవదత్తాం హిరణ్మయీమ్. ౨౧

అభివాద్య చ తదద్భుత మద్భుతం ప్రియదర్శనమ్,
ముదా పరమయా యుక్తశ్చకారాభి ప్రదక్షిణమ్. ౨౨

తతో దశరథః ప్రాప్య పాయసం దేవనిర్మితమ్,
బభూవ పరమప్రీతః ప్రాప్య విత్తమివాధనః. ౨౩
తత స్తదద్భుతప్రఖ్యం భూతం పరమభాస్వరమ్,
సంవర్తయిత్వా తత్కర్మ తత్రైవాంతరధీయత. ౨౪

హర్షరశ్మిభి రుద్ద్యోతితం తస్యాంతఃపుర మాబభౌ,
శారదస్యాభిరామస్య చంద్రస్యేవ నభోంఽశుభిః. ౨౫

నీకు స్వాగతంబగుఁగాక ? నీకు 'నేనేమిసేయుదు నానతిమ్ము" అని బదులు, చెప్పెను. ౧౬

అనిమ్మటఁ, ప్రజాపతియొద్దనుండివచ్చినపురుషుఁడు, మఱల నిట్లని దశరథునకుఁ జెప్పెను. ౧౭

దశరథమహారాజా ! నీవు యాగంబులచే దేవతలఁదృప్తినొందించితివి; కావున, నీపాయసం బిప్పుడు నీకుఁ బ్రాప్తించినది. ౧౮

రాజశ్రేష్ఠుఁడా ! దేవతలచేనిర్మింపఁబడి సంతానప్రదంబై ధన్యంబై యారోగ్యమును వృద్ధిఁబొందించునదియై యుండు నీపాయసంబును మాత్రము, నీవు తప్పక స్వీకరింపుము. ౧౯

రాజా ! ఈపాయసంబును, సజాతీయలగు క్షత్రియజాతీయభార్యలకు "భుజింపుఁడు" అని చెప్పియిమ్ము; దీనిఁ గుడుచుటవలన ఆభార్యలందు, నీవిప్పు డెవరికొఱకు యాగముసేసెదవో అట్టిపుత్రులను బడసెదవు. అని చెప్పెను. ౨౦

దశరథమహారాజు, అలాగేయని చెప్పి, దేవాన్నముతో నిండియున్నదియుఁ, దేవతలచే నివ్వఁబడినదియు, బంగారుతోఁ జేయఁబడినదియు నగు నాకలశమును శిరస్సుచే నమ్రుఁడై పుచ్చుకొని సంతసించెను. ౨౧

ఆదశరథుఁడు, పరమసంతోషమునొంది, ఆశ్చర్యకరుఁడును బ్రియదర్శనుండు నగునాప్రాజాపత్యపురుషునమస్కరించి, చుట్టును బ్రదక్షిణము చేసెను. ౨౨

అంత దశరథుఁడు, దేవనిర్మితంబగు పాయసంబునొంది, ధనము నొందిన దరిద్రుఁడువోలె మిక్కిలి అధికముగ సంతసించెను. ౨౩

అంత, నద్భుతంబగునాకారంబును బరమంబగు కాంతియునుగల ఆప్రాజాపత్యపురుషుఁడు, పాయసము నిచ్చుట ముగియఁగానే అచ్చటనే యంతర్ధానంబు నొందెను. ౨౪

సంతోషంబున గల్గుకాంతులచే వెలుఁగుచున్న యాదశరథు నంతిపురము శరత్కాలమందలి చంద్రునికాంతులచే వెలుఁగు నాకాశమునుబోలెఁ బ్రకాశించెను. ౨౫

సోఽంతఃపురం ప్రవిశ్యైవ కౌసల్యా మిద మబ్రవీత్,
పాయసం ప్రతిగృహ్ణీష్వ పుత్రీయం త్విదమాత్మనః. ౨౬
కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా,
అర్ధాదర్ధం దదౌచాపి సుమిత్రాయై నరాధిపః. ౨౭
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్,
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్. ౨౮
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః,
ఏవంతాసాం దదౌ రాజా భార్యాణాం పాయసంపృథక్. ౨౯

తా స్త్వేతత్పాయసం ప్రాప్య నరేంద్ర స్యోత్తమాస్త్రియః,
సమ్మానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః. 3౦

తత స్తుతాః ప్రాశ్య తదుత్తమ స్త్రియో
మహీపతే రుత్తమపాయసం పృథక్,
హుతాశనాదిత్యసమానతేజస
శ్చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా. 3౧
తతస్తు రాజా ప్రసమీక్ష్య తాః స్త్రియః
ప్రరూఢగర్భాః ప్రతిలబ్ధమానసః;
బభూవ హృష్ట స్త్రిదివే యథాహరిః,
సురేంద్రసిద్ధర్షి గణాభిపూజితః. 3౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షోడశస్సర్గః.

ఆదశరథుఁ డంతిపురము ప్రవేశించి, "నాకుఁ బుత్రప్రదంబగు నీపాయసమును దప్పక పుచ్చుకొనుము" అని కౌసల్యకుఁ జెప్పెను. ౨౬

అప్పుడు, దశరథమహారాజు సంతానముగలుగుటకై, యాపాయసంబులో సగము కౌసల్యకిచ్చెను; యామిగిలినసగములో సగము సుమిత్రకొసంగెను; సుమిత్రకివ్వఁగా మిగిలినదానిలో సగముకైకేయికిడెను; ఆవెనుక, సుమిత్ర కైకేయికన్న నెచ్చుగా భుజింప నర్హురాలని యాలోచించి, మఱలనాకైకేయికివ్వఁగా మిగిలిన పాయసమును సుమిత్రకొసఁగెను. ఈప్రకారము, దశరథమహారాజు, భార్యలకుఁ బాయసమును బంచిపెట్టెను. అనఁగా పాయసములో సగము కౌసల్యకును, నాలవపాలు సుమిత్రకును, ఎనిమిదవపాలు కైకేయికిని మఱల నామిగత యెనిమిదవపాలును సుమిత్రకిచ్చెను. ౨౭-౨౯

దశరథునిభార్యలందఱును శ్రేష్ఠములైన గుణములుగలవారు గావున, నాపాయసంబునొంది సంతసించినవారలై దశరథుఁడుచేసిన పాయసప్రదానక్రమమును జాల బహుమానముగా నెంచిరి. ౩౦

అంత నాదశరథుని యుత్తమభార్యలు, ఆ యుత్తమపాయసంబు భుజించి, అగ్నిహోత్రునితోను, సూర్యునితోను సరిపచ్చుకాంతిగలవారలై కొంతకాలమునకు వెనుక గర్భములఁబొందిరి. ౩౧

అంత, దశరథుఁడును, గర్భిణులైనతనభార్యలఁజూచి, స్వస్థచిత్తుఁడై, స్వర్గమునందు దేవశ్రేష్ఠులచేతను సిద్ధులచేతను ఋషులచేతను పూజింపఁబడుచుండు దేవేంద్రుఁడువోలె సంతసించియుండెను. ౩౨

ఇది పదునాఱవసర్గము.

---

# సప్తదశస్సర్గః



పుత్రత్వం తు గతే విష్ణౌ రాజ్ఞ స్తస్య మహాత్మనః,
ఉవాచ దేవతా స్సర్వా స్స్వయంభూ ర్భగవానిదమ్. ౧

సత్యసంధస్య వీరస్య సర్వేషా న్నో హితైషిణః,
విష్ణో స్సహాయా న్బలిన స్సృజధ్వం కామరూపిణః. ౨

మాయావిదశ్చ శూరాంశ్చ వాయువేగసమాఞ్జవే,
నయజ్ఞాన్ బుద్ధిసంపన్నాన్ విష్ణుతుల్యపరాక్రమాన్. ౩
అసంహార్యా నుపాయజ్ఞాన్ దివ్యసంహననాన్వితాన్,
సర్వాస్త్రగుణసంపన్నా నమృత ప్రాశనా నివ. ౪
అప్సరస్సు చ ముఖ్యాసు గంధర్వీణాం తనూషు చ,
సృజధ్వం హరిరూపేణ పుత్రాం స్తుల్యపరాక్రమాన్. ౫
పూర్వమేవ మయా సృష్టో జాంబవా నృక్షపుంగవః,
జృంభమాణస్య సహసా మమ వక్త్రా దజాయత. ౬

తే తథోక్తా భగవతా తత్ప్రతిశ్రుత్య శాసనమ్,
జనయామాసు రేవం తే పుత్రా న్వానరరూపిణః. ౭
ఋషయశ్చ మహాత్మాన స్సిద్ధవిద్యాధరోరగాః,
చారణాశ్చ సుతా న్వీరా న్ససృజు ర్వనచారిణః. ౮
వానరేంద్రం మహేంద్రాభ మింద్రో వాలిన మూర్జితమ్,
సుగ్రీవం జనయామాస తపన స్తపతాం వరః. ౯



అహల్యాశాపవిమోచనము—పుట. 360. బాల.

# పదునేడవసర్గము



విష్ణుదేవుఁడు, మహాత్ముఁడగు నాదశరథమహారాజునకుఁ గొడుకుగాఁ బుట్టుట కుద్యుక్తుఁడు కాఁగానే, భగవంతుఁడగు బ్రహ్మదేవుఁడు, దేవతలనందఱను గూర్చి యిట్లనిచెప్పెను. ౧

సత్యంబగు ప్రతిజ్ఞ గలిగిపరాక్రమశాలియై, మనకందఱకును మేలు గోరునట్టి విష్ణుదేవునకు, బలముగలవారును గామరూపులు నగుసహాయుల సృజింపుఁడు. ౨

దేవతలారా! సమస్తమాయల నెఱిఁగి శూరులై, వాయువేగము బోలినవేగంబుగలిగి, నయజ్ఞులై, బుద్ధిశాలులై విష్ణుదేవుఁడువోలెఁ బరాక్రమశాలులై, పరుల కెవరికి నలవిగానివారలై సమస్తోపాయంబులు నేర్చి, శ్రేష్ఠంబగు సింహశరీరంబునుబోలు శరీరంబును సర్వాస్త్రంబులకుంగల శక్తియును గలిగి యమృతముఁ గ్రోలినవారువోలె క్షుత్పిపాసాదిరహితులై, మీయొక్క పరాక్రమమువంటి పరాక్రమముతోఁ గూడిన వానరరూపధరులగుకొడుకులను, శ్రేష్ఠులగు నప్సరస్త్రీలయందును గంధర్వయువతులందును బుట్టింపుఁడు.

నేను మునుపే యెలుఁగుగొడ్డులలో శ్రేష్ఠుఁడగు జాంబవంతుఁడనువానిం బుట్టించితి; ఆతఁడు నేనావులింత విడుచుచుండఁగా నాముఖంబునుండి తటాలున బుట్టెను. అని బ్రహ్మదేవుఁడు దేవతలతోఁ జెప్పెను, ౬

బ్రహ్మదేవుఁ డట్లుచెప్పఁగానే యాయాజ్ఞ నంగీకరించి యాదేవతలు నాప్రకారము వానరరూపులగు పుత్రులను బుట్టించిరి. ౭

మహావీర్యులగు ఋషులును సిద్ధులును విద్యాధరులును ఉరగులును చారణులును పరాక్రమశాలులగు కోఁతిరూపులగుకొడుకుల సృజియించిరి. ౮

దేవేంద్రుఁడు మహేంద్రపర్వతముతో సరివచ్చు దృఢంబైనశరీరము గలవానరరాజగు వాలియనువానిఁ బుట్టించెను; ప్రతాపముగలవారిలో శ్రేష్ఠుఁడగు సూర్యుఁడు సుగ్రీవునిబుట్టించెను. ౯

బృహస్పతి స్త్వజనయ త్తారం నామ మహాహరిమ్,
సర్వవానరముఖ్యానాం బుద్ధిమంత మనుత్తమమ్. ౧౦
ధనదస్య సుత శ్శ్రీమాన్ వానరో గంధమాదనః,
విశ్వకర్మా త్వజనయ న్నళం నామ మహాహరిమ్. ౧౧
పావకస్య సుత శ్శ్రీమాన్ నీలోఽగ్నిసదృశప్రభః,
తేజసా యశసా వీర్యా దత్యరిచ్యత వానరాన్. ౧౨

రూపద్రవిణసంపన్నా వశ్వినౌ రూపసమ్మతౌ,
మైందంచ ద్వివిదంచైవ జనయామాసతు స్స్వయమ్. ౧౩
వరుణో జనయామాస సుషేణం వానరర్షభమ్,
శరభం జనయామాస పర్జన్యస్తు మహాబలమ్. ౧౪
మారుతస్యాత్మజ శ్శ్రీమాన్ హనుమాన్నామ వీర్యవాన్,
వజ్రసంహననో వేగో వైనతేయసమో జవే. ౧౫

తేసృష్టా బహుసాహస్రా దశగ్రీవవధే రతాః,
అప్రమేయబలా వీరా విక్రాంతాః కామరూపిణః. ౧౬

మేరుమందరసంకాశా వపుష్మంతో మహాబలాః,
ఋక్షవానరగోపుచ్ఛాః క్షిప్రమేవాభిజజ్ఞిరే. ౧౭

యస్య దేవస్య యద్రూపం వేషో యశ్చపరాక్రమః,
అజాయత సమ స్తేన తస్య తస్య సుతః పృథక్. ౧౮
గోలాంగూలీషు చోత్పన్నాః కేచి త్సమ్మత విక్రమాః,
ఋక్షీషుచ తథా జాతా వానరాః కిన్నరీషుచ. ౧౯

బృహస్పతియు, వానరశ్రేష్ఠులందఱిలో శ్రేష్ఠుండును బుద్ధిమంతుఁడు నగు తారుఁడను గొప్పవానరునిం బుట్టించెను. ౧౦

కుబేరునకు మంచికాంతిగలగంధమాదనుఁ డనువానరుఁడు కొడుకయ్యెను; విశ్వకర్మ నలుఁడను గొప్పకోఁతిని బుట్టించెను. ౧౧

అగ్నిహోత్రుని పుత్త్రుండగునీలుండు శ్రీమంతుండై యగ్నిదేవుని కాంతితో సరియగు కాంతి గలిగి, కాంతిచేతను గీర్తిచేతను బరాక్రమము చేతను కోఁతులనందఱ నతిశయించెను. ౧౨

రూపధనంబులతోఁ గూడిన యశ్వినీదేవతలు రూపమున గారవింపఁబడిన మైందద్వివిదులం బుట్టించిరి. ౧౩

వరుణునకు సుషేణుండను వానరశ్రేష్ఠుఁడుపుట్టెను; పర్జన్యునకు మహాబలుండగు శరభుండు పుట్టెను. ౧౪

వాయుదేవునకు శ్రీమంతుండై పరాక్రమశాలియై వజ్రముంబోలె నభేద్యమగుదేహముఁగలిగి వేగమునందు గరుత్మంతునకు సాటియై యుఁన్న హనుమంతుఁడు పుట్టెను. ౧౫

మఱియుఁ బెక్కు సహస్రములసంఖ్యగలవారు రావణవధమందాసక్తులై కొలందిలేనిబలంబుఁగలిగి వీరులై పరాక్రమించినవారలై కామరూపులై యుండువానరులు సృజింపఁబడిరి. ౧౬

మేరుపర్వతముతో మందరనగంబుతోను సరివచ్చుచు దృఢంబగు శరీరంబుగలిగి యధికబలములై యుండు నెలుఁగుగొడ్డులును గోఁతులును గొండముచ్చులును శీఘ్రంబుగఁ బుట్టినవి. ౧౭

ఏదేవున కేరూపము ఏవేషము ఏపరాక్రమము గలిగియుండునో ఆదేవునికొడుకు ఆరూపము ఆవేషము ఆపరాక్రమమునే గలిగియుండెను. ౧౮

అధికపరాక్రమశాలులగు కొందఱు వానరులు కొండముచ్చులందును కొందఱు ఎలుఁగు గొడ్డులందును కొందఱు కిన్నరస్త్రీలయందును జిత్రవిచిత్రముగాఁ బుట్టిరి. ౧౯

దేవా మహర్షిగంధర్వా స్తార్క్ష్యా యక్షా యశస్వినః,
నాగాః కింపురుషాశ్చైవ సిద్ధవిద్యాధరోరగాః. ౨౦
బహవో జనయామాసు ర్హృష్టా స్తత్ర సహస్రశః,
వానరాన్ సుమహాకాయాన్ సర్వాన్వై వనచారిణః. ౨౧
అప్సరస్సుచ ముఖ్యాసు తథా విద్యాధరీషు చ,
నాగకన్యాసు చ తథా గంధర్వీణాం తనూషుచ. ౨౨
కామరూపబలోపేతా యథాకామం విచారిణః,
సింహశార్దూలసదృశా దర్పేణచ బలేనచ. ౨౩

శిలాప్రహరణాస్సర్వే సర్వే పాదపయోధినః,
నఖదంష్ట్రాయుధాస్సర్వే సర్వే సర్వాస్త్రకోవిదాః. ౨౪

విచాలయేయుశ్శైలేంద్రాన్భేదయేయుస్థ్సిరాన్ ద్రుమాన్,
క్షోభయేయుశ్చ వేగేన సముద్రం సరితాం పతిమ్. ౨౫

దారయేయుః క్షితిం పద్భ్యామాప్లవేయుర్మహార్ణవమ్,
నభస్థ్సలం విశేయుశ్చ గృహ్ణీయురపి తోయదాన్. ౨౬

గృహ్ణీయురపి మాతంగాన్మత్తాన్ ప్రవ్రజతో వనే,
నర్దమానాశ్చ నాదేన పాతయేయుర్విహంగమాన్. ౨౭
ఈదృశానాం ప్రసూతాని హరీణాం కామరూపిణామ్,
శతం శతసహస్రాణి యూథపానాం మహాత్మనామ్. ౨౮
తే ప్రధానేషు యూథేషు హరీణాం హరియూథపాః,
బభూవు ర్యూథపశ్రేష్ఠా వీరాంశ్చాజనయన్ హరీన్. ౨౯

కీర్తిమంతులగు దేవతలును, మహర్షులును, గంధర్వులును, గరుడులును, యక్షులును, దిగ్గజంబులును, కింపురుషులును, సిద్ధులును, విద్యాధరులును, ఉరగులును సంతోషముతో నప్సరసలందును, విద్యాధరస్త్రీలయందును, నాగకన్యలయందును, గంధర్వస్త్రీలయందును వనంబులందుఁ దిరుగువారును, మహాకాయులునగు వానరులనంతఱ వేనవేలుగఁ బుట్టించిరి. ౨౦-౨౨

ఆవానరులు ఇచ్ఛకువచ్చినట్లు రూపంబును బలంబునుంగలిగి యిచ్ఛకు వచ్చినట్లు సంచరించుచు దర్పబలంబులచే సింహవ్యాఘ్రంబులతో సరివచ్చుచు నుండిరి. ౨౩

ఆవానరులందఱు [illegible] ఘోరరూపముగాఁ గలిగి, పెద్దపెద్దవృక్షంబులతో యుద్ధము సేయుచు గోళ్లుంగోఱలుం బ్రహరించుచు సమస్తాస్త్రంబుల నెఱింగియుండిరి. ౨౪

ఆవానరులు గొప్పపర్వతంబులఁ గదిలింపఁగలరు; గొప్పవృక్షంబులఁ బెఱికివైవఁగలరు, నదులకుఁ బెనిమిటియైన సముద్రునింగూడఁ గలఁత పఱచఁ జేయఁగలరు. ౨౫

ఆవానరులు పాదములతో భూమిని బగులఁగొట్టఁగలరు; ఎట్టి సముద్రమును దాఁటఁగలరు; ఆకాశమును బ్రవేశింపఁగలరు; మేఘములను జేతులతోఁ బట్టుకొనఁగలరు. ౨౬

ఆవానరులు అరణ్యంబున మదించి పరుగులెత్తుచున్న యేనుగులంబట్టుకొనఁగలరు; వారఱచినట్టియిన ఆధ్వనికిఁ బక్షులు సైతము క్రిందఁబడును.

ఇట్టిశక్తిగలిగినవారును ఇచ్ఛకు వచ్చినరూపును గైకొనసమర్థులును గొప్పధైర్యముగలవారునగు సేనానాయకులైన వానరులు నూఱులక్షలు పుట్టిరి.

ఆవాలిమొదలగు వానరసేనానాయకులు ప్రధానంబులగు వానరసమూహంబులందు సేనానాయకులలో ముఖ్యులుగానుండిరి; వారు పరాక్రమశాలులగువానరులం బుట్టించిరి. ౨౭

అన్యే ఋక్షవతః ప్రస్థానవతస్థు స్సహస్రశః,
అన్యే నానావిధాన్ శైలాన్ భేజిరే కాననానిచ. ౩౦
సూర్యపుత్రంచ సుగ్రీవం శక్రపుత్రంచ వాలినమ్,
భ్రాతరావుపతస్థుస్తే సర్వఏవ హరీశ్వరాః. ౩౧
నళం నీలం హనూమంతమన్యాంశ్చ హరియూథపాన్. ౩౧½
తే తార్క్ష్యబలసంపన్నాస్సర్వే యుద్ధవిశారదాః,
విచరంతో౽ర్దయన్ దర్పాత్సింహవ్యాఘ్రమహోరగాన్. ౩౨½
తాంశ్చ సర్వాన్ మహాబాహుర్వాలివిపులవిక్రమః,
జుగోప భుజవీర్యేణ ఋక్షగోపుచ్ఛవానరాన్. ౩౩½

తైరియం పృథివీ శూరైస్సపర్వతవనార్ణవా,
కీర్ణా వివిధసంస్థానైర్నానావ్యంజనలక్షణైః. ౩౪½

తైర్మేఘబృందాచలకూటకల్పైః
మహాబలైర్వానరయూథపాలైః,
బభూవ భూర్భీమశరీరరూపైః
స్సమావృతా రామసహాయహేతోః. ౩౫½

శ్రీమద్బాలకాణ్డే సప్తదశస్సర్గః.

---

అష్టాదశస్సర్గః

నిర్వృత్తేతు క్రతౌ తస్మిన్ హయమేధే మహాత్మనః,
ప్రతిగృహ్య సురా భాగాన్ ప్రతిజగ్ము ర్యథాగతమ్. ౧

మఱికొందఱువానరులు ఋక్షవత్పర్వతము ప్రాంతములందు నివసించిరి; మఱికొందఱు నానావిధంబులగుపర్వతంబుల నరణ్యంబుల నాశ్రయించిరి. ౩౦

ఆవానరశ్రేష్ఠులందఱును సుగ్రీవుని వాలిని నలుని నీలుని హనుమంతుని మఱియునితరులగు వానరసేనానాయకులనుం గొలుచుచుండిరి. ౩౧, ౩౧½

ఆవానరు లందఱు గరుడుని కున్నబలము గలిగి యుద్ధమునందు నేర్పరులై దర్పంబున సింహంబులను బెద్దపులులను గొప్పసర్పంబులను నొప్పించుచుఁ దిరుగుచుండిరి. ౩౨½

గొప్పచేతులును గొప్పపరాక్రమమునుం గలవాలి, యేనుంగు గొడ్డుల గొండమువ్వలఁ గోఁతులనందఱ బాహుపరాక్రమముచేఁ బాలించుచుండెను. ౩౩½

వారలందఱు నానావిధంబులైన యాకారంబులును నానావిధములంగా నుండు నానాదేహములను ఆయాజాతికిం గలగుఱుతులునుం గలిగి శూరులై భూమండలంబుఁగొని పర్వతంబులయందును వనంబులందును ద్వీపంబులందంతటను వ్యాపించియుండిరి. ౩౪½

మేఘసమూహంబులను గొండకొమ్ములనుం బోలినవారును అధికంబగు బలముగలవారును వెఱపు పుట్టించు శరీరాకృతులు గలవారునగు నావానర సేనానాయకులు రామునకు సహాయము సేయునిమిత్తము భూమండలం బంతయుం వ్యాపించియుండిరి. ౩౫½

ఇది పదునేడవ సర్గము.

---

## పదునెనిమిదవ సర్గము

మహాత్ముండగు నాదశరథుని యశ్వమేధంబును బుత్రకామేష్టియునుం గాఁగానే దేవతలు హవిర్భాగంబులం బుచ్చుకొని వచ్చినరీతి మరల వెళ్లిరి. ౧

సమాప్తదీక్షానియమః పత్నీగణసమన్వితః,
ప్రవివేశ పురీం రాజా సభృత్యబలవాహనః. ౨

యథార్హం పూజితాస్తేన రాజ్ఞావై పృథివీశ్వరాః,
ముదితాః ప్రయయుర్దేశాన్ ప్రణమ్య మునిపుంగవమ్. ౩

శ్రీమతాం గచ్ఛతాం తేషాం స్వపురాణి పురాత్తతః,
బలాని రాజ్ఞాం శుభ్రాణి ప్రహృష్టాని చకాశిరే. ౪

గతేషు పృథివీశేషు రాజా దశరథస్తదా,
ప్రవివేశ పురీం శ్రీమాన్ పురస్కృత్య ద్విజోత్తమాన్. ౫
శాంతయా ప్రయయౌ సార్ధం ఋశ్యశృంగస్సుపూజితః,
అన్వీయమానో రాజ్ఞాథ సానుయాత్రేణ ధీమతా. ౬

ఏవం విసృజ్య తాన్ సర్వాన్రాజా సంపూర్ణమానసః,
ఉవాచ సుఖితస్తత్ర పుత్రోత్పత్తిం విచింతయన్. ౭

తతో యజ్ఞే సమాప్తే తు ఋతూనాం షట్సమత్యయుః. ౭½
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ. ౮
నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిందునా సహ. ౯
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్,
కౌసల్యాఽజనయద్రామం సర్వలక్షణసంయుతమ్. ౧౦
విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనమ్. ౧౦½

దశరథమహారాజుయాగదీక్షానియమము ముగిసినపిమ్మటభార్యలతోను భృత్యులతోను సైన్యములతోను వాహనములతోనుం గూడి పట్టణమును ప్రవేశింప నుద్యుక్తుఁ డయ్యెను. ౨

యాగమునకువచ్చినరాజులందఱును, దశరథునిచేఁ దమతమయోగ్యతకుఁదగినట్లు పూజింపఁబడి సంతసముఁబొంది, మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుని నమస్కరించి తమతమ దేశంబులకుఁ బోయిరి. ౩

ఆయయోధ్యాపురంబునుండి తమతమపట్టణంబులకుఁ బోవుచున్న శ్రీమంతులగు నారాజులసైన్యంబులు దశరథునిచే నీఁబడిన వస్త్రాదులచేఁ దెల్లనివిగాసంతసంబుగలవై ప్రకాశించినవి. ౪

రాజులందఱుఁబోయినపిమ్మట శ్రీమంతుఁడగు దశరథమహారాజుబ్రాహ్మణశ్రేష్ఠుల మున్నిడుకొని యయోధ్యాపట్టణమును ప్రవేశించెను. ౫

అంత ఋశ్యశృంగుఁడు శాంతాదేవితోఁగూడఁ జక్కఁగాఁ బూజింపఁబడి, బుద్ధిమంతుండగురోమపాదమహారాజు భృత్యులతోఁగూడఁ దన్ను వెంబడింపఁగాఁ బోయెను. ౬

ఈప్రకారము బ్రాహ్మణశ్రేష్ఠులందఱు వారివారివాసస్థానముల కంపి, దశరథమహారాజు, సంపూర్ణమనోరథుఁడై కొడుకు లెప్పుడు పుట్టుదురో యని యాలోచించుచు సుఖముగా నుండెను. ౭

అశ్వమేధయాగము ముగిసినపిమ్మట నొకసంవత్సరము కడచినది. ౮

అంతఁ గౌసల్యాదేవి పండ్రెండవదియగు చైత్రమాసమునందు నవమీతిథియందుఁ బునర్వసునక్షత్రమందు సూర్యాంగారకశనిబృహస్పతిశుక్రులైదుగురును దమతమయుచ్ఛస్థానంబులగు మేషమకరతులాకర్కటకమీనంబులందుండఁగా నందుబృహస్పతిచంద్రునితోఁజేరియుండఁగాఁ గర్కటలగ్నమందు సమస్తలోకనాయకుండును సమస్తలోకంబులచే నమస్కరింపఁబడువాఁడును సమస్తశుభలక్షణంబులతోనుం గూడియుండువాఁడును ఇక్ష్వాకువంశంబునందుఁ బుట్టినవారికభివృద్ధిఁ బొందించువాఁడును మహాభాగ్యశాలియుం విష్ణుదేవునిలోసగంబు నైన రాముం డనుకొడుకును బ్రసవించెను. ౯-౧౦

కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా,
యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా. ౧౧½
భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగస్సర్వైస్సముదితో గుణైః. ౧౨½

అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాఽజనయత్సుతౌ,
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ. ౧౩½

పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః,
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ. ౧౪½

రాజ్ఞః పుత్రా మహాత్మానశ్చత్వారో జజ్ఞిరే పృథక్,
గుణవన్తోఽనురూపాశ్చ రుచ్యా ప్రోష్ఠపదోపమాః. ౧౫½

జగుః కళంచ గన్ధర్వా ననృతుశ్చాప్సరోగణాః. ౧౬
దేవదున్దుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా,
ఉత్సవశ్చ మహా నాసీ దయోధ్యాయాం జనాకులః. ౧౭
రథ్యాశ్చ జనసంబాధా నటనర్తకసంకులాః,
గాయనైశ్చ విరావిణ్యో వాదనైశ్చ తథాపరైః. ౧౮

ప్రదేయాంశ్చ దదౌ రాజా సూతమాగధవందినామ్,
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం గోధనాని సహస్రశః. ౧౯

అతీత్యైకాదశాహం తు నామకర్మ తథాఽకరోత్. ౧౯½

కౌసల్యాదేవి కొలందిలేని కాంతితోఁగూడిన యాకొడుకుం బొంది దేవశ్రేష్ఠుండగు నింద్రునిం బొందిన యదితియట్లు ప్రకాశించెను. ౧౧½

సాక్షాద్విష్ణుదేవునిలో నెనిమిదవయంశంబైనవాఁడును సమస్తగుణంబులతోనుంగూడినవాఁడును సత్యపరాక్రముండునగు భరతుండనువాఁడు కైకేయియందుఁ బుట్టెను. ౧౨½

అంతఁ బరాక్రమశాలులును సమస్తాస్త్రంబుల నెఱింగినవారు విష్ణుదేవుని యంశంబులం బుట్టినవారునునగు లక్ష్మణశత్రుఘ్నులను కొడుకు లిద్దఱు సుమిత్రకు జన్మించిరి. ౧౩½

నిర్మలంబగు బుద్ధిగలభరతుండు పుష్యమీనక్షత్రమందు మీనలగ్నమందుఁ బుట్టెను; లక్ష్మణశత్రుఘ్నులు ఆశ్లేషానక్షత్రమందుఁ గర్కాటలగ్న మధ్యాహ్నంబునఁ బుట్టిరి. ౧౪½

దశరథమహారాజునకుఁ దనతో సమానులైనవారును మహాత్ములును గుణవంతులును గాంతిచేఁ బూర్వాభాద్రోత్తరాభాద్రానామంబులైన నాలుగునక్షత్రంబులతో సరివచ్చువారునగు నలువురుకొడుకులు పుట్టిరి. ౧౫½

గంధర్వులు మధురముగాఁ బాడిరి; అప్సరసలాడిరి; దేవతలు భేరులు వాయించిరి; ఆకాశంబునుండి పుష్పవృష్టికురిసినది; అయోధ్యయందు జనసమూహముచే నిబిడమై గొప్ప వేడుక జరిగినది. ౧౬, ౧౭

రాజమార్గంబు లన్నియుం జనసమూహముచే నిబిడములై రసభావంబుల నభినయించునట నర్తకులచే నిండి పాటలచేతను వాద్యములచేతను మఱియు నితరములగు వంధిమాగధులచేతను స్తుతివాక్యములచేతను శబ్దాయమానములుగా నయినవి. ౧౮

దశరథమహారాజు పౌరాణికులకును వంశావళిం గీర్తించువారలకును స్తుతిపాఠకులకును బారితోషికంబుల నిచ్చెను; బ్రాహ్మణులకు ధనంబును గోవులను వేనవేలుగా నిచ్చెను. ౧౯

రాముఁడు పుట్టినదిమొదలు పండ్రెండవదినము గడవఁగానే దశరథమహారాజు కొడుకులకు నామకరణము చేసెను. ౧౯½

జ్యేష్ఠం రామం మహాత్మానం భరతం కైకయీసుతమ్. ౨౦
సౌమిత్రిం లక్ష్మణ మితి శత్రుఘ్న మపరం తథా,
వసిష్ఠః పరమప్రీతో నామాని కురుతే తదా. ౨౧
బ్రాహ్మణాన్ భోజయామాస పౌరాన్ జానపదానపి,
అదదాద్బ్రాహ్మణానాంచ రత్నౌఘమమితం బహు. ౨౨

తేషాం జన్మక్రియాదీని సర్వకర్మాణ్యకారయత్. ౨౨4

తేషాం కేతు రివ జ్యేష్ఠో రామో రతికరః పితుః,
బభూవ భూయో భూతానాం స్వయంభూరివ సమ్మతః. ౨3౪

సర్వే వేదవిద శ్శూరా స్సర్వే లోకహితే రతాః,
సర్వే జ్ఞానోపసంపన్నా స్సర్వే సముదితా గుణైః. ౨౪4

తేషామపి మహాతేజా రామ స్సత్యపరాక్రమః,
ఇష్ట స్సర్వస్య లోకస్య శశాంక ఇవ నిర్మలః. ౨౫4

గజస్కంధేఽశ్వపృష్ఠేచ రథచర్యాసు సమ్మతః,
ధనుర్వేదేచ నిరతః పితృశుశ్రూషణే రతః. ౨౬4

బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః,
రామస్య లోకరామస్య భ్రాతుర్జ్యేష్ఠస్య నిత్యశః. ౨౭4

వసిష్ఠుం డప్పుడు సంతోషంబున జ్యేష్ఠునకు రాముండనియుఁ గైకయి కొడుకునకు భరతుండనియు సుమిత్రకొడుకులలో నొకనికి లక్ష్మణుండనియు మఱియొకనికి శత్రుఘ్నుఁడనియుఁ బేర్లు పెట్టెను. ౨౦, ౨౧

అంత నాదశరథుండు పట్టణంబుల గ్రామంబుల నుండునట్టి బ్రాహ్మణులకు భోజనం బిడెను; బ్రాహ్మణులకుఁ గొలందిలేని రత్నసమూహంబు నధికముగా నిచ్చెను. ౨౨

దశరథుఁడు కొడుకులకు జాతకర్మ మొదలగు సమస్తకర్మంబులనుం (అన్నప్రాశనచౌలోపనయనంబులను) జేయించెను. ౨౨½

ఆకొడుకులలోఁ బెద్దవాఁడును గుణంబులచే నధికుఁడు కావున ధ్వజమువలెఁ బ్రకాశించుచున్నవాఁడునగు రాముఁడు తండ్రికి నితరులకన్న నధికముగా సంతోషము సేయుచు బ్రహ్మదేవుఁడుంబోలె సమస్తప్రాణులకు మిక్కిలియిష్టుఁడుగ నుండెను. ౨౩½

దశరథుని కొడుకులందఱు, వేదంబుల నెఱింగినవారుగను యుద్ధములందు భయములేనివారుగను లోకమునకు మేలుగోరువారలుగను వేదార్థంబు దెలిసినవారుగను దయ మొదలగుసద్గుణంబులతోఁ గూడినవారుగనుండిరి. ౨౪½

వారిలోను రాముఁడు అధికమయిన ప్రతాపమును ఎచ్చటనైనను వ్యర్థముకాని పరాక్రమముంగలిగి కళంకములేని చంద్రుఁడుంబోలె సమస్తలోకంబులకుం బ్రియుఁడై యుండెను. ౨౫½

రాముఁడు ఏనుఁగుమూఁపునందును గుఱ్ఱమువీఁపునందును రథంబులందును ఎక్కి యుద్ధంబు సేయసమర్థుండని యందఱు నొప్పుకొనిరి; మఱియు రాముఁడు విలువిద్య మొదలగు విద్యలందు మిక్కిలి సమర్థుండై పితృసేవయందాసక్తుఁడుగా నుండెను. ౨౬½

అనంతావతారముకావున భక్తులకు సంపద్వృద్ధిఁ జేయునట్టి లక్ష్మణుండు తనకు జ్యేష్ఠభ్రాతయు లోకంబులనంతయు రమింపఁజేయువాఁడునగు రామునియందు బాల్యము మొదలుగా నెల్లప్పుడును మిక్కిలి స్నేహము గలవాఁ డయ్యెను. ౨౭½

సర్వప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః,
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః. ౨౮॥

నచ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః,
మృష్టమన్నముపానీత మశ్నాతి నచ తం వినా. ౨౯॥

యదా హి హయమారూఢో మృగయాం యాతి రాఘవః,
తదైనం పృష్ఠతోఽన్వేతి సధనుః పరిపాలయన్. ౩౦॥
భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణావరజో హి సః,
ప్రాణైః ప్రియతరో నిత్యం తస్య చాసీత్తథా ప్రియః. ౩౧॥

స చతుర్భిర్మహాభాగైః పుత్రైర్దశరథః ప్రియైః,
బభూవ పరమప్రీతో దేవైరివ పితామహః. ౩౨॥

తే యదా జ్ఞానసంపన్నాస్సర్వే సముదితా గుణైః,
హ్రీమంతః కీర్తిమంతశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః. ౩౩॥
తేషామేవం ప్రభావానాం సర్వేషాం దీప్తతేజసామ్,
పితా దశరథో హృష్టో బ్రహ్మాలోకాధిపో యథా. ౩౪॥

తేచాపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనే రతాః,
పితృశుశ్రూషణరతా ధనుర్వేదే చ నిష్ఠితాః. ౩౫॥

సంపదతోఁ గూడియుండు లక్ష్మణుం డారామునకు ఆతనిదేహమున కన్నను సంతోషముగల్గించుచు దేహమునకు వెలుపలనుండు మఱియొక ప్రాణం బనఁదగి యుండెను. ౨౮వ.

పురుషశ్రేష్ఠుండగు నారామునకు ఆలక్ష్మణుఁడు లేనట్టైన నిద్రయైనను రాదు; మఱియు నాలక్ష్మణుని విడిచి శ్రేష్ఠమైన యాహారంబును భుజింప నిచ్ఛపుట్టదు. ౨౯వ.

రాముం డెప్పుడు గుఱ్ఱము నెక్కి వేటకుఁబోవునో అప్పుడే యాలక్ష్మణుండు విల్లుచేతంబూని యాతనిరక్షింపుచు వెంటనే వెంబడించును. ౩౦వ.

శత్రుఘ్నుఁడు లక్ష్మణుని తమ్ముఁడగుటంజేసి యతనికింగల గుణసంపత్తిగలవాఁడు కావున భరతునకుఁ బ్రాణంబులకన్న నధిక ప్రియుం డయ్యెను. ఆప్రకారముగానే భరతుండును శత్రుఘ్నునకు అధిక ప్రియుండుగా నుండెను. ౩౧వ

ఆదశరథుఁడు మహాభాగ్యశాలులును బ్రియులునగు నలువురు కొడుకులచేత నలువురు దిక్పాలకులచేత బ్రహ్మదేవుఁడుం బోలె మిక్కిలి సంతసించియుండెను. ౩౨వ.

ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు ఎప్పుడు శాస్త్రంబుల నెఱింగి సమస్త సద్గుణంబులుం గలిగి, తప్పుకార్యంబులవలన లజ్జించుచు, "మంచిగుణంబులుగలవారు; చక్కఁగా శాస్త్రంబుల నెఱింగినవారు" అనుకీర్తినొంది, సర్వజ్ఞులుగాను, దీర్ఘాలోచన గలవారుగాను ఐరో, అప్పుడు ఇంతటిప్రభావంబుతోఁగూడి తేజరిల్లుచున్న యారామలక్ష్మణభరతశత్రుఘ్నులచేం దండ్రి దశరథుఁడు, బ్రహ్మలోకాధిపతియుంబోలె సంతసించియుండెను. ౩౩వ, ౩౪వ

ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులును బురుషశ్రేష్ఠులు కావునఁ దండ్రి మెచ్చుటచే విఱ్ఱవీఁగి సోమరులుగాక మఱియు, నియమముగా స్మృతులు మొదలగువానిం జదువుటయందును, దండ్రికి శుశ్రూషసేయుటయందును, విలువిద్యయందును ఆసక్తులైయుండిరి. ౩౫వ

అథ రాజా దశరథస్తేషాం దారక్రియాం ప్రతి,
చింతయామాస ధర్మాత్మా సోపాధ్యాయస్సబాంధవః. ౩౬ ॥
తస్య చింతయమానస్య మంత్రిమధ్యే మహాత్మనః,
అభ్యగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహామునిః. ౩౭ ॥

స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షానువాచ హ,
శీఘ్రమాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధినస్సుతమ్. ౩౮ ॥

తచ్ఛ్రుత్వా వచనం త్రాసాద్రాజ్ఞో వేశ్మ ప్రదుద్రువుః,
సంభ్రాంతమనసస్సర్వే తేన వాక్యేన చోదితాః. ౩౯ ॥
తే గత్వా రాజభవనం విశ్వామిత్రమృషిం తదా,
ప్రాప్తమావేదయామాసు ర్నృపాయైక్ష్వాకవే తదా. ౪౦ ॥

తేషాం తద్వచనం శ్రుత్వా సపురోధాస్సమాహితః,
ప్రత్యుజ్జగామ తం హృష్టో బ్రహ్మాణమివ వాసవః. ౪౧ ॥

తం దృష్ట్వా జ్వలితం దీప్తతపసం సంశితవ్రతమ్,
ప్రహృష్టవదనో రాజా తతోఽర్ఘ్యముపాహారయత్ ౪౨ ॥

సరాజ్ఞః ప్రతిగృహ్యార్ఘ్యం శాస్త్రదృష్టేన కర్మణా,
కుశలం చావ్యయం చైవ పర్యపృచ్ఛన్నరాధిపమ్. ౪౩ ॥

పురే కోశే జనపదే బాంధవేషు సుహృత్సు చ,
కుశలం కౌశికో రాజ్ఞః పర్యపృచ్ఛత్సుధార్మికః. ౪౪ ॥

అంత ధర్మబుద్ధియగు నాదశరథమహారాజు కొడుకుల వివాహమును
గురించి పురోహితుని బంధువులనుంగూడి యాలోచించెను. ౩౬

ధర్మంబునం దాసక్తిగల యాదశరథమహారాజు మంత్రులతోఁ గొడు
కుల వివాహమునుగురించి యాలోచింపుచుండఁగా తపోవిశేషంబునం గల్గిన
ప్రభావం బధికముగాఁగల విశ్వామిత్రమహాముని వచ్చెను. ౩౭

ఆవిశ్వామిత్రుఁడు రాజును జూడఁగోరి, "మీరలు కుశికవంశంబున
బుట్టినవాఁడును గాధిపుత్రుండ నగు నేను వచ్చియున్నానని, రాజుతోఁ
జెప్పుఁడు" అని ద్వారపాలకులతోఁ జెప్పెను. ౩౮

ద్వారపాలకులందఱు విశ్వామిత్రునిమాట విని భయంబునఁ గలఁత
వడిన మనస్సుతో రాజగృహముఁగూర్చి పరుగులిడిరి. ౩౯

ఆద్వారపాలకులు రాజగృహంబునకుఁ బోయి, "విశ్వామిత్రుఁడను
బుషి యిప్పుడు వచ్చియున్నాఁడు." అని యిక్ష్వాకువంశంబునం బుట్టిన
దశరథమహారాజునకుఁ జెప్పిరి. ౪౦

ఆద్వారపాలకుల మాటలువిని దశరథుఁడు పురోహితునింగూడి ఎచ్చ
రికగలిగినవాఁడై సంతసించి బ్రహ్మదేవుని దేవేంద్రుండులోలె నావిశ్వామిత్రు
నెదుర్కొనెను. ౪౧

అంత శరీరకాంతిచే జ్వలించుచు నధికంబగుతపస్సును తీక్ష్ణంబగువ్రత
మునుం గలిగియున్న యావిశ్వామిత్రునిం జూచి సంతుష్టుండై యాయనకుఁ
బురోహితునిచే నర్ఘ్య మిప్పించెను. ౪౨

ఆవిశ్వామిత్రుఁడు యథాశాస్త్రంబుగ దశరథమహారా జిచ్చిన యర్ఘ్య
మును స్వీకరించి యాదశరథమహారాజును "నీకు క్షేమమా! అపాయములేక
యున్నదా" అని యడిగెను. ౪౩

మిక్కిలి ధార్మికుండగు నావిశ్వామిత్రుండు "నీపట్టణమును బొక్కస
మును దేశమును ఉపద్రవమును లేకయున్నదా? నీబంధువులు స్నేహితులును
క్షేమముగ నున్నారా?" అని చక్కఁగా దశరథమహారాజు నడిగెను. ౪౪

అపి తే సన్నతాస్సర్వే సామంతా రిపవో జితాః?,
దైవంచ మానుషంచాపి కర్మ తే సాధ్వనుష్ఠితమ్? ౪౫

వసిష్ఠంచ సమాగమ్య కుశలం మునిపుంగవః,
ఋషీంశ్చ తాన్ యథాన్యాయంమహాభాగా నువాచహ. ౪౬
తే సర్వే హృష్టమనస స్తస్య రాజ్ఞో నివేశనమ్,
వివిశుః పూజితా స్తత్ర నిషేదుశ్చ యథార్హతః. ౪౭
అథ హృష్టమనా రాజా విశ్వామిత్రం మహామునిమ్,
ఉవాచ పరమోదారో హృష్ట స్తమభిపూజయన్. ౪౮
యథాఽమృతస్య సంప్రాప్తి ర్యథా వర్ష మనూదకే,
యథా సదృశదారేషు పుత్రజన్మాఽప్రజస్య చ. ౪౯
ప్రణష్టస్య యథా లాభో యథా హర్షో మహోదయే,
తథైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే. ౫౦

కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః,
పాత్రభూతోఽసి మే బ్రహ్మన్ దిష్ట్యా ప్రాప్తోఽసి కౌశిక. ౫౧

అద్య మే సఫలం జన్మ జీవితంచ సుజీవితమ్. ౫౨
పూర్వంరాజర్షి శబ్దేన తపసా ద్యోతితప్రభః,
బ్రహ్మర్షిత్వమనుప్రాప్తః పూజ్యోఽసి బహుధా మయా. ౫౩

తదద్భుత మిదం బ్రహ్మన్ పవిత్రం పరమం మమ,
శుభక్షేత్రగతశ్చాహం తవ సందర్శనాత్ప్రభో. ౫౪

నీకుఁ బొరుగురాజులందఱు లొంగియున్నారా; శత్రువులుజయింపఁబడిరా? దేవతాసంబంధియైనయజ్ఞము మొదలయినకర్మమును మనుష్యసంబంధియగు సామదానభేదదండాదులును నీవు సరిగాఁ జేయఁబడుచున్నవా? అని విశ్వామిత్రుఁడు దశరథుని అడిగెను. ౪౫

మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుఁడు వసిష్ఠుని మఱియు మహాత్ములగునితర మునులను జేరి యథాన్యాయంబుగ వారివారిక్షేమంబు నడిగెను. ౪౬

ఆఋషులందఱు సంతసించి యాదశరథమహారాజు సభను బ్రవేశించిరి; అచ్చట వారివారియోగ్యతకుఁదగినట్లు కూర్చుండిరి. ౪౭

అంతఁ బరమదాతయగుదశరథుఁడు,సంతోషవిశేషంబున గగుర్పాటు నొందినవాఁడై యావిశ్వామిత్రమహామునిని బ్రస్తుతించుచు నిట్లనిపలికెను. ౪౮

విశ్వామిత్రుఁడా! అమృతములబ్ధమగుట యెట్టిదో నిర్జలప్రదేశమందు వానగురియుట యేలాటిదో సంతానము లేనివానికి సజాతీయయైనభార్య యందుఁగొడుకుపుట్టుట యెటువంటిదో అగుపడకపోయిననిక్షేపము మఱల దొరకుట యేరీతిదో ఉత్సవారంభమందు సంతోషముగల్గుటయెట్లో నేను గొడుకుల వివాహమునుగుఱించి యాలోచించుచుండఁగా నీవువచ్చుట యాలాటిదేయనితలఁచెద; నీకు స్వాగతంబగుఁగాక. ౪౯, ౫౦

బ్రాహ్మణుఁడవైన విశ్వామిత్రుఁడా! నీముఖ్యమైనకోరికయెద్ది? దాని నేవిధంబునఁ జేయవలయు ననతిమ్ము; నీవు నాకు దానయోగ్యుఁడవు; నా భాగ్యంబున నీవిచ్చోటికి విచ్చేసితివి. ౫౧

ఇప్పుడు నాపుట్టుక సఫలంబైనది నాబ్రతుకుమంచిబ్రతుకైనది. ౫౨

నీవు మొదటరాజర్షివై యటువెనుక సూర్యాదికాంతులకుఁ బ్రకాశముగల్గించు తపస్సునొందుటంజేసి బ్రహ్మర్షివైతివి, కావున బహువిధంబుల నీవునాకుఁ బూజ్యుఁడవు. ౫౩

విశ్వామిత్రుఁడా! అట్టినీవు వచ్చుట మిక్కిలియాశ్చర్యము! నాకుఁ జాలఁ బరిశుద్ధినిగల్గించునది; నిన్నుఁజూచుటవలన నేను పుణ్యస్థలంబునందుండు వాఁడనైతిని. ౫౪

బ్రూహి యత్ప్రార్థితం తుభ్యం కార్యమాగమనం ప్రతి,
ఇచ్ఛామ్యనుగృహీతోఽహం త్వదర్థపరివృద్ధయే. ౫౫
కార్యస్య న విమర్శం చ గన్తుమర్హసి కౌశిక,
కర్తా చాహమశేషేణ దైవతం హి భవాన్మమ. ౫౬

మమ చాయమనుప్రాప్తో మహానభ్యుదయో ద్విజ,
తవాగమనజః కృత్స్నో ధర్మశ్చానుత్తమో మమ. ౫౭
ఇతి హృదయసుఖం నిశమ్య వాక్యం
శ్రుతిసుఖమాత్మవతా వినీతముక్తమ్,
ప్రథితగుణయశా గుణైర్విశిష్టః
పరమఋషిః పరమం జగామ హర్షమ్. ౫౮

ఇతి శ్రీమద్బాలకాణ్డే అష్టాదశస్సర్గః.

---

## ఏకోనవింశస్సర్గః

తచ్ఛ్రుత్వా రాజసింహస్య వాక్యమద్భుతవిస్తరమ్,
హృష్టరోమా మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత. ౧

సదృశం రాజశార్దూల తవైతద్భువి నాన్యథా,
మహావంశప్రసూతస్య వసిష్ఠవ్యపదేశినః. ౨

యత్తు మే హృద్గతం వాక్యం తస్య కార్యస్య నిశ్చయమ్,
కురుష్వ రాజశార్దూల భవ సత్యప్రతిశ్రవాః. 3

నీవిప్పటి కేమి ప్రయోజనముం గోరివచ్చితివో దానిం జెప్పుము; నీచేని ట్లనుగ్రహమునొంది నీ ప్రయోజనంబభివృద్ధినొందునట్లు చేయఁగోరుచున్నాను.

విశ్వామిత్రుఁడా! "ఈకార్యమునొప్పుడే యితఁడు చేయఁ గలఁడో చేయలేఁడో చేయునో చేయఁడో" అనెడు విచారము నొందవలదు; నీవు నాకు దైవతమవు. కావున నాకార్యంబంతయుం నెంతమాత్రము కొఱఁత పడకుండనే చేసెదను. ౫౬

నాకు నీరాకయనెడు గొప్పమంగళము లబ్ధమైనది; నీరాకవలన నుత్తమంబగు ధర్మంబంతయుం దొరకొనినది. ౫౭

ఈ ప్రకారము మనస్సునకు జెవులకును సుఖకరంబగునట్లు బుద్ధిశాలియగు దశరథునిచే సవినయంబుగఁ జెప్పఁబడినమాటను విని మహాగుణవంతుఁడును కీర్తిగలవాఁడు నగు విశ్వామిత్రమహాముని పరమ సంతోషంబు నొందెను. ౫౮

ఇది పదునెనిమిదవ సర్గము.

---

## పందొమ్మిదవ సర్గము

రాజశ్రేష్ఠుఁడగు దశరథుని యత్యాశ్చర్యకరమైన మాటను విని మహాప్రభావుఁడగు విశ్వామిత్రుఁడు, సంతోషంబునఁ బులకితంబులగు నెండ్రుకలు గల్గి యిట్లని బదులుచెప్పెను. ౧

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! భూమియందు ఈప్రకారము మాటలాడుట రఘువంశమంతటి మహావంశమునందుఁబుట్టి వసిష్ఠునివలన నుపదేశము నొందిన నీకుఁ దగినదేను; వేఱుకాదు. ౨

రాజశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! నామనస్సునందున్నట్టి యేకార్యమిప్పుడు నాచేఁ జెప్పఁబడుచున్నదో దానికిఁ దప్పక తగినయేర్పాటుచేసి "ఏకార్యంబైనఁ జేసెదను"అని నీవుచేసినప్రతిజ్ఞను సత్యముగావించుకొనుము.

అహం నియమ మాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ,
తస్య విఘ్నకరౌ ద్వౌతు రాక్షసౌ కామరూపిణౌ. ౪
వ్రతే మే బహుశశ్చీర్ణే సమాప్త్యాం రాక్షసావిమౌ,
మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవంతౌ సుశిక్షితౌ. ౫
సమాంసరుధిరౌఘేణ వేదిం తామభ్యవర్షతామ్. ౫½
అవధూతే తథా భూతే తస్మిన్ నియమనిశ్చయే,
కృతశ్రమో నిరుత్సాహ స్తస్మా ద్దేశాదపాక్రమే. ౬½

నచ మే క్రోధ ముత్స్రష్టుం బుద్ధి ర్భవతి పార్థివ,
తథాభూతా హి సా చర్యా న శాప స్తత్ర ముచ్యతే. ౭½

స్వపుత్రం రాజశార్దూలం రామం సత్యపరాక్రమమ్,
కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతు మర్హసి. ౮½

శక్తో హ్యేష మయా గుప్తో దివ్యేన స్వేన తేజసా,
రాక్షసా యే వికర్తార స్తేషా మపి వినాశనే. ౯½
శ్రేయ శ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః,
త్రయాణామపి లోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి. ౧౦½
నచ తౌ రామ మాసాద్య శక్తౌ స్థాతుం కథంచన,
నచ తౌ రాఘవా దన్యో హంతు ముత్సహతే పుమాన్. ౧౧½
వీర్యోత్సిక్తౌ హి తౌ పాపౌ కాలపాశవశంగతౌ,
రామస్య రాజశార్దూల న పర్యాప్తౌ మహాత్మనః. ౧౨½

నచ పుత్రకృతస్నేహం కర్తు మర్హసి పార్థివ,

పురుషశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! నే నొకసిద్ధి నపేక్షించి దీక్షవహించితిని; దానికి విఘ్నముగావించు నిద్దఱు కామరూపులగు రాక్షసులున్నారు.

నావ్రతము చాలవఱకు కాచరింపఁబడి ముగింపునకు వచ్చునట్టి కాలమందుఁ బరాక్రమముగలవారును నేర్పరులు నగుమారీచుఁడును సుబాహుఁడునను నీయిద్దఱురాక్షసులు మాంసములతోఁ గూడిన నెత్తురుప్రవాహములచే నాయాగవేదినంతయుఁ దడిపిరి. ౫, ౫॥

ఆప్రకారము చాలవఱకు కాచరింపఁబడిన వ్రతము కొట్టుపడఁగానే నేను ప్రయాసమునొందియును ఉత్సాహములేనివాఁడనై యాప్రదేశమునుండి పాఱివచ్చితిని. ౬॥

ఆరాక్షసులపైఁ గోపమును బ్రయోగించుటకును దలఁపుగలుగదు; ఆయాగమునఁ గోపమునొందఁగూడదు; కావున నారాక్షసుల శపింప నలవి కాదయ్యె. ౭॥

ఎచ్చటనైనను వ్యర్థముకాని పరాక్రమముగలిగి యుద్ధంబుల భయములేనివాఁడై రాజశ్రేష్ఠుఁడై పిల్లజుట్టుధరించియుండు నీ జ్యేష్ఠకుమారుఁడగు రాముని నా కివ్వఁదలయును. ౮॥

ఈరాముఁడు నేను గాపుండఁగా దివ్యంబగు తన తేజస్సుచేత విఘ్నము చేయుం రాక్షసుల నందఱను జంప సమర్థుఁడు. ౯॥

ఈరామునకు మూఁడులోకంబులందును బ్రఖ్యాతిగల్గునట్లు నానావిధములుగా మంచి నిచ్చెదను. ౧౦॥

ఆమారీచసుబాహువులు రామునెదుట నెంతమాత్రము నిలువలేరు; రాముఁడుగాక మఱియొకఁడు వారలను జంపలేఁడు. ౧౧॥

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! పాపస్వభావులగు నా మారీచ సుబాహువులు, పరాక్రమముచే గర్వించియున్నవారైనను మృత్యుపాశమునకు లోఁబడినవా రగుటచే నధికపరాక్రమశాలి యగురామునకు యుద్ధమునందుఁ జాలరు.

దశరథమహారాజా! కొడుకనిగారాబముంచవలదు; నామాటనమ్ముము ;

అహం తే ప్రతిజానామి హతౌ తౌ విద్ధి రాక్షసౌ. ౧౩

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
వసిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసి స్థితాః. ౧౪

యది తే ధర్మలాభంచ యశశ్చ పరమం భువి,
స్థిత మిచ్ఛసి రాజేంద్ర రామం మే దాతు మర్హసి. ౧౫

యది హ్యనుజ్ఞాం కాకుత్స్థ దదతే తవ మంత్రిణః,
వసిష్ఠప్రముఖా స్సర్వే తతో రామం విసర్జయ. ౧౬
అభిప్రేత మసంసక్త మాత్మజం దాతు మర్హసి,
దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనమ్. ౧౭

నాత్యేతి కాలో యజ్ఞస్య యథాయం మమ రాఘవ,
తథా కురుష్వ భద్రంతే మాచ శోకే మనః కృథాః. ౧౮

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధర్మార్థసహితం వచః,
విరరామ మహాతేజా విశ్వామిత్రో మహామునిః. ౧౯
స తన్నిశమ్య రాజేంద్రో విశ్వామిత్రవచ శ్శుభమ్,
శోక మభ్యగమ త్తీవ్రం వ్యషీదత భయాన్వితః. ౨౦
ఇతి హృదయమనోవిదారణం
మునివచనం తదతీవ శుశ్రువాన్,
నరపతి రభవ న్మహాం స్తదా
వ్యథితమనాః ప్రచచాల చాసనాత్. ౨౧

ఇతి శ్రీమద్బాలకాండే, ఏకోనవింశస్సర్గః.

నేనునీకుఁ బ్రతిజ్ఞ చేసియిచ్చెదను; ఆరాక్షసులిద్దఱును జంపఁబడిరనియే యెఱుఁగుము.

ఈరాముఁడు అధికంబగు ధైర్యము గలవాఁడనియు నెచ్చటనైనను బ్రతిహతము గాఁగూడని పరాక్రమము గలవాఁడనియు నేనెఱుఁగుదును; మహాప్రభావుఁడగు వసిష్ఠుఁడు నెఱుఁగును; మఱియు తపస్సుచేయుచునీఋషులందఱు నెఱుఁగుదురు. ౧౪౹

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! భూమియందు పరమంబగు నీధర్మంబును గీర్తియును స్థిరముగా నుండవలయునని కోరువాఁడవైనట్టయిన రాముని నాకీయవలయు. ౧౫౹

వసిష్ఠుఁడు మొదలుగా నీమంత్రులందఱు నొప్పుకొనినట్టైన రాముని నాతోఁబంపుము. ౧౬౹

నీకుఁ బ్రియకుమారుఁడైనను తమ్మితేకులవంటి కండ్లుగల యీరాముని యాగసంరక్షణమునకై నాకు నీయక పదిరాత్రములు నావశంబున నుంచవలయు. ౧౭౹

దశరథుఁడా! నాయాగకాల మతిక్రమింపకమున్నె నాతో రాముని బంపుము నీకు మంగళంబగుఁగాక దుఃఖమునొందకుము. అని విశ్వామిత్రుఁడు దశరథునితోఁ జెప్పెను. ౧౮౹

ధర్మస్వభావంబును అధికమగు ప్రభావముగల విశ్వామిత్రమహాముని యీప్రకారము ధర్మార్థసహితంబగు మాటచెప్పి యంత విరమించెను.

రాజులలో మేటియగు నాదశరథుఁడు శుభంబగు నావిశ్వామిత్రుని మాటను విని భయమునొంది మిక్కిలియు దుఃఖింపసాగెను. ౨౦౹

ఇట్లు మనస్సుయొక్క యధిష్ఠానంబును మనస్సును బగులఁదీయు విశ్వామిత్రువచనంబు విని యప్పుడు పూజ్యుఁడగు దశరథమహారాజు నొచ్చిన మనస్సుగలవాఁడై సింహాసనంబుననుండి గడగడవడఁకెను. ౨౧౹

ఇది పందొమ్మిదవసర్గము.

---

# వింశస్సర్గః

తచ్ఛ్రుత్వా రాజశార్దూలో విశ్వామిత్రస్య భాషితమ్,
ముహూర్తమివ నిస్సంజ్ఞ స్సంజ్ఞావానిద మబ్రవీత్. ౧

ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః,
న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః. ౨

ఇయ మక్షౌహిణీ పూర్ణా యస్యాహం పతి రీశ్వరః,
అనయా సంవృతో గత్వా యోద్ధాఽహం తై ర్నిశాచరైః. ౩
ఇమే శూరా శ్చ విక్రాంతా భృత్యా మేఽస్త్రవిశారదాః,
యోగ్యా రక్షోగణై ర్యోద్ధుం న రామం నేతు మర్హసి. ౪

అహ మేవ ధనుష్పాణి ర్గోప్తా సమరమూర్ధని,
యావత్ప్రాణా న్ధరిష్యామి తావద్యోత్స్యే నిశాచరైః. ౫
నిర్విఘ్నా వ్రతచర్యా సా భవిష్యతి సురక్షితా,
అహం తత్రాగమిష్యామి న రామం నేతుమర్హసి. ౬
బాలో హ్యకృతవిద్యశ్చ నచ వేత్తి బలాబలమ్,
న చాస్త్రబలసంయుక్తో నచ యుద్ధ విశారదః. ౭

నచా సా రక్షసాం యోగ్యః కూటయుద్ధాహి తే ధ్రువమ్,

విప్రయుక్తో హి రామేణ ముహూర్త మపి నోత్సహే.
జీవితుంమునిశార్దూల న రామం నేతు మర్హసి. ౮

# ఇరువదవసర్గము

రాజశ్రేష్ఠుఁడగు దశరథుఁడు ఆవిశ్వామిత్రునిమాటవిని ముహూర్తకాలము తెలివిలేనివాఁడువోలెఁ బడియుండి యంతఁ దెలివి నొంది యిట్లని చెప్పెను. ౧

కమలములఁబోలుకన్నులు గలయీరామునకుఁ బదియాఱేండ్లయినను గాలేదు; వీఁడు రాక్షసులతో యుద్ధముసేయుటకు యోగ్యుఁడని నాకుఁ దోఁచలేదు. ౨

ఇదిగో సంపూర్ణమగు నక్షౌహిణియంతసేన నాకున్నది; ఈసేనతో వెళ్లి యారాక్షసులతో యుద్ధముచేసెదను. ౩

సమస్తాస్త్రంబుల సమర్థులై యుద్ధంబుల నెంతమాత్రము భయములేక పరాక్రమించియుండు నాభృత్యులు వీరలే; రాక్షసులతో యుద్ధముసేయఁ దగుదురు; రాముఁడు తగఁడు; కావున రాముని దోడ్కొనిపోవలదు. ౪

నేనే ధనుస్సు చేతఁబట్టి యాగమురక్షించెదను; నాకుఁబ్రాణంబు లున్నంతవఱకు యుద్ధభూమి మునుమున నిలిచి రాక్షసులతో యుద్ధముచేసెదను. ౫

నేను యాగంబునకువచ్చెదను, దానంజేసి నీవ్రతకార్యము నిర్విఘ్నముగాఁ జక్కఁగా రక్షింపఁబడును, రాముని దోడ్కొనిపోవలదు. ౬

రాముఁ డిప్పటికిఁ బండ్రెండేండ్లవాఁడు; ఇంకను విలువిద్యనుగూడఁ జక్కఁగా నేర్చుకొని యుండలేదు; బలమెట్టిదో యెఱుఁగఁడు; అస్త్రబలంబు గలవాఁడును గాఁడు; యుద్ధమునం దారితేఱియుండువాఁడును గాఁడు.

రాక్షసులు కపటముగా యుద్ధము సేయువారలుగావున నీరాముఁడు వారలతో యుద్ధముసేయఁదగినవాఁడు గాఁడు. ౮౯

విశ్వామిత్రుఁడా! నేను రామునివిడిచి ముహూర్తమైనను జీవించి యుండలేను కావున రామునిఁ దోడ్కొనిపోవలదు. ౧౯

యది వా రాఘవం బ్రహ్మన్ నేతు మిచ్ఛసి సువ్రత,
చతురంగ సమాయుక్తం మయాచ సహితం నయ. ౯½

షష్టి ర్వర్ష సహస్రాణి మమ జాతస్య కౌశిక,
దుఃఖేనోత్పాదిత శ్చాయం న రామం నేతు మర్హసి. ౧౦½
చతుర్ణా మాత్మజానాం హి ప్రీతిః పరమికా మమ,
జ్యేష్ఠం ధర్మప్రధానంచ న రామం నేతు మర్హసి. ౧౧½
కింవీర్యా రాక్షసా స్తేచ కస్య పుత్రాశ్చ కేచ తే,
కథంప్రమాణాః కేచైతాన్ రక్షంతి మునిపుంగవ. ౧౨½
కథంచ ప్రతికర్తవ్యం తేషాం రామేణ రక్షసామ్,
మామకై ర్వా బలై ర్బ్రహ్మన్ మయావాకూటయోధినామ్.

సర్వం మే శంస భగవన్ కథంతేషాం మయారణే,
స్థాతవ్యం దుష్టభావానాం వీర్యోత్సిక్తా హి రాక్షసాః. ౧౪½

తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రోఽభ్యభాషత. ౧౫
పౌలస్త్యవంశప్రభవో రావణో నామ రాక్షసః. ౧౫½

స బ్రహ్మణా దత్తవర స్త్రైలోక్యం బాధతే భృశమ్,
మహాబలో మహావీర్యో రాక్షసై ర్బహుభి ర్వృతః. ౧౬½

శ్రూయతేహి మహావీర్యో రావణో రాక్షసాధిపః,
సాక్షా ద్వైశ్రవణభ్రాతా పుత్రో విశ్రవసో మునేః.

యదా స్వయం న యజ్ఞస్య విఘ్నకర్తా మహాబలః. ౧౭

గొప్పవ్రతములుగల బ్రాహ్మణుడవైన విశ్వామిత్రుఁడా! నీవు రామునె దోడ్కొనిపోవలయునని కోరినట్టియు రథంబులును ఏనుగులును గుఱ్ఱంబులును నన్నునుగూడ రామునితోఁ గొనిపొమ్ము. ౯½

నాకు పదివేలేండ్లు వయసయినపిమ్మట వ్రతము ఉపవాసము మొదలగు పలుప్రయాసములచే నితఁడు పుట్టెను, కావున నీరామునిఁ గొనిపోవలదు.

కొడుకులు నల్వురిలోను నాకు రామునియందు మిక్కిలి ప్రీతి కావున జ్యేష్ఠపుత్రుఁడును ధార్మికుఁడునగు రామునిఁ గొనిపోవలదు. ౧౧½

ఆరాక్షసుల పరాక్రమమెట్టిది? వారెవ్వని కొడుకులు? వారల పేరేమి? వారల యాకార మెంతటిది? వారికిఁ బ్రభువులెవ్వరు? వీనిని, నాకుఁ జెప్పుము.

విశ్వామిత్రుఁడా! రాముఁడుగాని నాసైన్యములుగాని నేను గాని కపటముగా యుద్ధము సేయు నారాక్షసులకుఁ బ్రతీకారమెట్లు సేయవలయును? దీనిం జెప్పుము. ౧౩½

ఆరాక్షసుల యుద్ధమునందు నే నెవ్వ్యూహముఁబన్ని యేరీతిగ నుండవలయును. రాక్షసులు మిక్కిలియుఁ బరాక్రమించి యుందువారలు గావున నాకంతయుఁ జెప్పుము. అని దశరథుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౧౪½

విశ్వామిత్రుఁ డా దశరథుని మాటలను విని యిట్లని బదులుచెప్పెను. ౧౫

పులస్త్యమహాముని వంశంబునందుఁ బుట్టిన రావణుఁ డను రాక్షసుఁ డొకఁడు గలఁడు. ౧౫½

మహాబలుఁడును మహాపరాక్రమశాలియు నగు నా రావణుఁడు బ్రహ్మదేవునివలన వరంబు నొంది మూఁడులోకంబుల మిక్కిలియుఁ బీడించుచున్నాఁడు. ౧౬½

సాక్షాత్కుబేరునకుఁ దమ్ముఁడును విశ్రవసునకుఁ గొడుకును రాక్షసులకందఱకుఁ బ్రభువునైన మహాపరాక్రమశాలియగు రావణుఁడు ప్రసిద్ధుఁడేను! నీవును విని యున్నావుగదా! ౧౭½

ఆరావణుఁ డెప్పుడు దానే వచ్చి యాగవిఘ్నము సేయుటకు వీలుగాదో;

తేన సంచోదితౌ ద్వౌతు రాక్షసౌ సుమహాబలౌ,
మారీచశ్చ సుబాహుశ్చ యజ్ఞవిఘ్నం కరిష్యతః. ౧౯

ఇత్యుక్తో మునినా తేన రాజోవాచ మునిం తదా. ౧౯½

నహి శక్తోఽస్మిసంగ్రామే స్థాతుం తస్య దురాత్మనః. ౨౦

స త్వం ప్రసాదం ధర్మజ్ఞ కురుష్వ మమ పుత్రకే.
మమ చైవాల్పభాగ్యస్య దైవతం హి భవాన్గురుః. ౨౧

దేవదానవగంధర్వా యక్షాః పతగపన్నగాః,
న శక్తా రావణం సోఢుం కింపునర్మానవా యుధి. ౨౨
సహి వీర్యవతాం వీర్య మాదత్తే యుధి రాక్షసః,
తేన చాహం న శక్తోఽస్మిసంయోద్ధుం తస్య వా బలైః. ౨౩
సబలో వా మునిశ్రేష్ఠ సహితో వా మమాత్మజైః. ౨౩½
కథమప్యమర ప్రఖ్యం సంగ్రామాణా మకోవిదమ్,
బాలం మే తనయం బ్రహ్మన్ నైవ దాస్యామిపుత్రకమ్. ౨౪½

అథ కాలోపమౌ యుద్ధే సుతౌ సుందోపసుంద యోః,
యజ్ఞ విఘ్నకరౌ తౌ తే నైవ దాస్యామి పుత్రకమ్. ౨౫½

మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవంతౌ సుశిక్షితౌ,
తయోరన్యతరేణాహం యోద్ధా స్యాం ససుహృద్గణః. ౨౬½

ఇతి నరపతిజల్పనాద్ద్విజేంద్రం

అప్పుడు మహాబలులగు మారీచసుబాహువు లనెడు నిద్దఱు రాక్షసు లతనిచే నియోగింపఁబడి యాగవిఘ్నము సేయుచుందురు. అని విశ్వామిత్రుఁడు దశరథు నితోఁ జెప్పెను. ౧౭, ౧౮

ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పఁగా నామాట విని దశరథమహా రాజతనితో నిట్లని బదులుచెప్పెను. ౧౯౻

దుష్టస్వభావుఁడగు నారావణునితో యుద్ధము సేయుటకు నేను శక్తుఁడను గాను. ౨౦

ధర్మజ్ఞుఁడ వగు విశ్వామిత్రుఁడా! నీవు నాకాచార్యుఁడవు, దేవతవు కావున, నాచిన్నికొమరునియందును, అల్పభాగ్యుఁడ నగునాయందును అను గ్రహింపుము; కోపము సేయవలదు. ౨౧.

దేవతలును దానవులును గంధర్వులును యక్షులును బక్షులును బన్న గంబులును యుద్ధమునందు రావణునోర్వలేరు; మనుష్యులెట్లోర్వఁగలరు.

ఆరావణాసురుఁడు యుద్ధమున నెట్టిపరాక్రమము గలవారికైనను మొక్కపుచ్చును, నేను సైన్యము నాకొడుకులనుగూడియు వానితోఁగాని వానిసైన్యములతోఁగాని పోరొనర్పలేము. ౨౩౻

దేవతతో సమానుఁడుగా నుండువాఁడును యుద్ధమనుసమాచారమే యొంతమాత్రము తెలియనివాండ్రైండేండ్లపిల్లవాఁడును నన్నుఁ బున్నామకం బగు నరకంబునుండి రక్షించువాఁడునగు నాకొడుకు నెంతమాత్రము నిచ్చుట లేదు. ౨౪౻

మఱియు యుద్ధమునందు యమునకుసరివచ్చునట్టి సుందోపసుంద పుత్రులగు నా మారీచసుబాహువులు నీకు యాగవిఘ్నము సేయువారలుగా నున్నారుకావున నేనెంతమాత్రము నాచిన్ని కొడుకును నివ్వను. ౨౫౻

మారీచుఁడు సుబాహువును బరాక్రమము గలిగి మిక్కిలియు నేర్పరులుగా నున్నారు. వారిలోనొకనితోనైనను నేనునాస్నేహితులనందఱఁగూడి యును యుద్ధముసేయలేను. అని దశరథుఁడు విశ్వామిత్రునితోఁజెప్పెను. ౨౬౻

ఇట్లు దశరథమహారాజసంగతముగ మాటలాడఁగా బ్రాహ్మణశ్రేష్ఠుఁ

కుశికసుతం సుమహాన్ వివేశ మన్యుః,
సువాహుత ఇవ మఖేఽగ్ని రాజ్యసిక్త
స్సమభవ దుజ్జ్వలితో మహర్షివహ్నిః. ౨౮

ఇతి శ్రీమ ద్బాలకాణ్డే, వింశస్సర్గః

---

ఏకవింశస్సర్గః.

తచ్ఛ్రుత్వా వచనం తస్య స్నేహపర్యాకులాక్షరమ్,
సమన్యుః కౌశికో వాక్యం ప్రత్యువాచ మహీపతిమ్. ౧
పూర్వ మర్థం ప్రతిశ్రుత్య ప్రతిజ్ఞాం హాతు మిచ్ఛసి,
రాఘవాణా మయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః. ౨

యదీదం తే క్షమం రాజన్ గమిష్యామి యథాగతమ్,
మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖీ భవ సబాంధవః. 3

తస్య రోషపరీతస్య విశ్వామిత్రస్య ధీమతః,
చచాల వసుధా కృత్స్నా వివేశచ భయం సురాన్. ౪
త్రస్తరూపంతు విజ్ఞాయ జగత్సర్వం మహా నృషిః,
నృపతిం సువ్రతో ధీరో వసిష్ఠో వాక్య మబ్రవీత్. ౫

ఇక్ష్వాకూణాం కులే జాత స్సాక్షాద్ధర్మ ఇవాపరః,
ధృతిమాన్ సువ్రతః శ్రీమా న్నధర్మం హాతు మర్హసి. ౬

త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మాఇతి రాఘవ,
స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢు మర్హసి. ౭

దగు విశ్వామిత్రుఁడు మిక్కిలియుఁ గోపమునొంది యాగమునందు మొదట సమిధలచే వేల్వఁబడి యంతట నాజ్యమునం దడఁపఁబడిన యగ్నిహోత్రమును బోలెఁ బ్రజ్వరిలించెను. ౨౮

ఇది ఇరువదియవసర్గము.

---

## ఇరువదొకటవ సర్గము

పుత్రస్నేహంబునఁ దడఁబడుచు దశరథమహారాజుచేఁ జెప్పఁబడిన మాటనువిని విశ్వామిత్రుఁడు కోపించి దశరథమహారాజుతో నిట్లని చెప్పెను.

"నీవు కోరినదాని నిచ్చెదను" అని మొదట నొప్పుకొని యీప్రతిజ్ఞను విడువఁగోరెదవు, ఇట్లు ప్రతిజ్ఞనువిడుచుట రఘువంశమునందుఁ బుట్టిన వారికులమునకుఁ దగినదికాదు. ౨

ఇట్లు మొదట నొప్పుకొని వెనుకఁ బ్రతిజ్ఞతప్పుట నీకుఁ దగినదైనట్లైన నేను వచ్చినట్లు పోయెదను. నీవు ప్రతిజ్ఞతప్పి బంధువులఁగూడి సుఖంబుండుము. అని విశ్వామిత్రుఁడు దశరథునితోఁ జెప్పెను. ౩

బుద్ధిమంతుఁడగు నావిశ్వామిత్రుఁడు రోషము నొందఁగానే భూమి యంతయు వణఁకినది దేవతలు భయంబునొందిరి. ౪

ధీమంతుఁడును మంచివ్రతంబులం జేసినవాఁడును ధైర్యశాలియునగు వసిష్ఠుఁడు ప్రపంచము నంతయు సంత్రస్తంబుగా నెఱిఁగి, దశరథమహారాజుతో నిట్లని చెప్పెను. ౫

నీవు పరమధార్మికమగు నిక్ష్వాకువంశమునం బుట్టినవాఁడవు; రెండవది యగుసాక్షా ద్ధర్మమునందగి యుండువాఁడవు; ధైర్యవంతుఁడవు; గొప్పవ్రతములు చేసినవాఁడవు; శ్రీమంతుఁడవు; అట్టినీకు ధర్మమువిడుచుట దగదు. ౬

రఘువంశమునందుఁ బుట్టినదశరథుఁడా! నీవుమూఁడులోకంబులను ధర్మాత్ముఁడని ఖ్యాతివహించినవాఁడవు. నీకులధర్మంబగు ప్రతిజ్ఞాపాలనము సేయుము. అధర్మంబు ననుసరింపవలదు. ౭

సంశ్రుత్యైవం కరిష్యామీత్యకుర్వాణస్య రాఘవ,
ఇష్టాపూర్తవధో భూయా త్తస్మా ద్రామం విసర్జయ. ౮

కృతాస్త్ర మకృతాస్త్రంవా నైనం శక్ష్యంతి రాక్షసాః,
గుప్తం కుశికపుత్రేణ జ్వలనేనామృతం యథా. ౯

ఏష విగ్రహావాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః,
ఏష బుద్ధ్యాఽధికో లోకే తపసశ్చ పరాయణమ్. ౧౦
ఏషోఽస్త్రాన్ వివిధాన్వేత్తి త్రైలోక్యే సచరాచరే,
నైన మన్యః పుమాన్వేత్తి నచ వేత్స్యంతి కేచన. ౧౧
నదేవా నర్షయః కేచి న్నాసురా న చ రాక్షసాః,
గంధర్వయక్షప్రవరా స్సకిన్నరమహోరగాః. ౧౨

సర్వాస్త్రాణి భృశాశ్వస్య పుత్రాః పరమధార్మికాః,
కౌశికాయ పురా దత్తా యదా రాజ్యం ప్రశాసతి. ౧౩
తేఽపి పుత్రా భృశాశ్వస్య ప్రజాపతిసుతాసుతాః,
నైకరూపా మహావీర్యా దీప్తిమంతో జయావహాః. ౧౪

జయాచ సుప్రభాచైవ దక్షకన్యే సుమధ్యమే,
తే సువాతేఽస్త్రశస్త్రాణి శతం పరమభాస్వరమ్. ౧౫
పంచాశతం సుతాన్ లేభే జయానామ పరాన్ పురా,
వధాయాసురసైన్యానా మమేయాన్ కామరూపిణః. ౧౬

సుప్రభాఽజనయచ్చాపి పుత్రాన్పంచాశతం పునః,
సంహారాన్నామ దుర్ధర్షాన్ దురాక్రామాన్ బలీయసః. ౧౭

ఈప్రకారము చేసెదనని మొదట నొప్పుకొని యటువెనుక నొప్పకొని నట్లు చేయనివాని యాగములును వాపీకూపతటాకాదినిర్మాణాదికర్మంబులును నిష్ఫలంబులగును కావున రాముని విశ్వామిత్రున కిమ్ము. ౭

ఈరాముఁడు అస్త్రంబులయందు సమర్థుఁడుకాని యసమర్థుఁడుకాని విశ్వామిత్రునిచే రక్షింపఁబడియుండఁగా నితని నగ్నిహోత్రునిచే రక్షింపఁబడిన యమృతమునుంబోలె రాక్షసులెంతమాత్రము సాధింపలేరు. ౮

ఈవిశ్వామిత్రుఁడు ఆకారముదాల్చిన ధర్మము, ఇతండు పరాక్రమము కలవారిలో మేటి, లోకంబున నందఱికన్నను బుద్ధిశాలి, మహాతపస్వి, జంగమ స్థావర సహితంబగు త్రైలోక్యంబునం గల అస్త్రంబుల నన్నింటి నెఱుంగును, ఇతఁడెఱింగినన్ని యస్త్రంబుల మఱియెవ్వరిప్పటి కెఱుంగరు, ఇకమీఁద నెఱుంగఁబోరు, దేవతలకును ఋషులకును అసురులకును రాక్షసులకును గంధర్వులకును యక్షులకును కిన్నరులకును మహోరగులకును ఎవ్వరికిని ఇన్ని యస్త్రంబులు తెలియవు. ౧౦-౧౩

పూర్వము రాజ్యముఁ బాలింపుచుండునపుడు ఈవిశ్వామిత్రునకు భృశాశ్వునకుఁ బుట్టినపరమధార్మికంబు లగునస్త్రంబులన్నియుఁ నీశ్వరుఁడిచ్చెను.

ఆ భృశాశ్వునికొడుకులు దక్షప్రజాపతికొమార్తెలకుఁ బుట్టినవారు; నానావిధంబు లగురూపంబులుగల్గి మిక్కిలియుఁ బరాక్రమవంతులై ప్రకాశింపుచు జయముగల్గించుచుందురు. ౧౪

సౌందర్యవంతులగు జయ సుప్రభ యనెడిదక్షకన్య లిర్వురును మిక్కిలియుం బ్రకాశించుచు శత్రువర్గంబుల భేదించునట్టియస్త్రంబుల నూటిని గనిరి.

పూర్వము జయయనునది రాక్షససైన్యంబులం జంపుటకయి యధికులై కొలతలేని ప్రభావమును ఇచ్ఛాధీనమగు రూపంబునుంగల్గి వెలుంగుచుండు నేబదికొడుకులం బొందెను. ౧౬

సుప్రభయనునదియును జంపువారనెడు, పేరువహించి దుర్ధర్షులై యమోఘులై మిక్కిలియుం బలముగల్గియుండు నేబదికొడుకులం బుట్టించెను.

తాని చాస్త్రాణి వేత్త్యేష యథావత్కుశికాత్మజః,
అపూర్వాణాం చ జననే శక్తో భూయస్సధర్మవిత్. ౧౮

ఏవంవీర్యో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః,
న రామగమనే రాజన్ సంశయం కర్తుమర్హసి. ౧౯

తేషాం నిగ్రహణే శక్తస్స్వయంచ కుశికాత్మజః,
తవ పుత్రహితార్థాయ త్వాముపేత్యాభియాచతే. ౨౦

ఇతి మునివచనాత్ప్రసన్నచిత్తో
రఘువృషభస్తు ముమోద భాస్వరాంగః,
గమన మభిరురోచ రాఘవస్య
ప్రథితయశాః కుశికాత్మజాయ బుద్ధ్యా. ౨౧

ఇతి శ్రీమద్బాలకాణ్డే ఏకవింశస్సర్గః.



ద్వావింశస్సర్గః

తథా వసిష్ఠే బ్రువతి రాజా దశరథస్స్వయమ్,
ప్రహృష్టవదనో రామ మాజుహావ సలక్ష్మణమ్. ౧
కృతస్వస్త్యయనం మాత్రా పిత్రా దశరథేనచ,
పురోధసా వసిష్ఠేన మంగళై రభిమంత్రితమ్. ౨
సపుత్రం మూర్ధ్న్యుపాఘ్రాయ రాజా దశరథః ప్రియమ్,
దదౌ కుశికపుత్రాయ సుప్రీతేనాంతరాత్మనా. 3
తతో వాయు స్సుఖస్పర్శో నీరజస్కో వవౌ తదా,
విశ్వామిత్రగతం దృష్ట్వా రామం రాజీవలోచనమ్. ౪

ఈవిశ్వామిత్రుం డాయస్త్రంబులనన్నింటినిం జక్కఁగా నెఱుంగును; మఱియుం సకలధర్మంబుల నెఱింగినయావిశ్వామిత్రుఁడు క్రొత్తక్రొత్తయస్త్రంబులనుం బుట్టింపఁగలఁడు. ౧౮

విశ్వామిత్రుఁడు ఇట్టి పరాక్రమముంగలవాఁడు; మిక్కిలియుఁ బ్రభావము గలవాఁడు; చాలఁగీర్తిగలవాఁడు; కావున దశరథమహారాజా! "రాముఁడు విశ్వామిత్రునితోఁ బోయినట్టయిన నేమిసంభవించునో" అని యొంతమాత్రము సందేహింపవలదు. ౧౯

విశ్వామిత్రుఁడు తాను నారాక్షసులం జంప సమర్థుండే అయినను నీకొడుకులకు మేలు గలుగుటకై నిన్ను యాచించుచున్నాఁడు. అని వసిష్ఠుఁడు దశరథునకుఁ జెప్పెను. ౨౦

రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుండగు దశరథుఁడు వసిష్ఠుని మాటవిని ప్రసన్నహృదయుఁడై యవయవంబు లుప్పొంగ సంతసించెను. అంత మహాకీర్తియగు నాదశరథుఁడు విశ్వామిత్రార్థమై రామగమనము నంగీకరించెను. ౨౧

ఇది ఇరువదియొకటవసర్గము.

---

## ఇరువదిరెండవసర్గము.

వసిష్ఠుం డాప్రకారము చెప్పఁగానే దశరథమహారాజు సంతసించి తానే రాముని లక్ష్మణునితోఁ గూడ రమ్మని పిలిచెను. ౧

ఆదశరథమహారాజు తానుం గౌసల్యయును రామునకు మంగళంబు గావించి పురోహితుండైన వసిష్ఠునిచే మంగళప్రదంబులగు మంత్రంబులచే నభిమంత్రింపఁబడిన ప్రియకుమారుండగు నారాముని శిరంబున మూర్కొని పరమ సంతుష్టం బగుహృదయంబున విశ్వామిత్రున కిచ్చెను. ౨, 3

అంత విశ్వామిత్రునింబొందిన కమలలోచనుండగు రామునిం జూచి, గాలి, దుమ్ములేక సుఖముగా వీచెను. ౪

పుష్పవృష్టి ర్మహత్యాసీ ద్దేవదుందుభినిస్వనైః;
శంఖదుందుభినిర్ఘోషః ప్రయాతేతు మహాత్మని. ౫

విశ్వామిత్రో౽యయావగ్రే తతో రామో ధనుర్ధరః,
కాకపక్షధరో ధన్వీ తంచ సౌమిత్రిరన్వగాత్. ౬

కలాపినౌ ధనుష్పాణీ శోభయానౌ దిశో దశ,
విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షావివ పన్నగౌ. ౭
అనుజగ్మతు రక్షుద్రౌ పితామహ మివాశ్వినౌ. ౭½

తదా కుశికపుత్రంతు ధనుష్పాణీ స్వలంకృతౌ. ౮
బద్ధగోధాంగుళిత్రాణౌ ఖడ్గవంతౌ మహాద్యుతీ,
కుమారౌ చారువపుషౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౯
అనుయాతౌ శ్రియా దీప్తౌ శోభయేతా మనిందితౌ,
స్థాణుం దేవ మివాచింత్యం కుమారావివ పావకీ. ౧౦

అధ్యర్ధ యోజనం గత్వా సరయ్వా దక్షిణే తటే,
రామేతి మధురాం వాణీం విశ్వామిత్రో౽భ్యభాషత. ౧౧
గృహాణ వత్స సలిలం మాభూత్కాలస్య పర్యయః,
మంత్రగ్రామం గృహాణ త్వం బలామతిబలాం తథా. ౧౨
న శ్రమో న జ్వరో వా తే న రూపస్య విపర్యయః,
నచ సుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యంతి నైరృతాః. ౧౩

న బాహ్వోస్సదృశో వీర్యే పృథివ్యా మస్తి కశ్చన,
త్రిషు లోకేషు వై రామ నభవే త్సదృశ స్తవ. ౧౪

మహోత్సుండగు రాముఁడు విశ్వామిత్రునితోఁ గూడం బోయినంతనే గొప్పపుష్పవృష్టి గల్గినది; దేవతలు దుందుభుల మ్రోయించిరి; దశరథుం డును శంఖంబుల భేరులను ధ్వనింపఁజేసెను. ౫

ముందట విశ్వామిత్రుఁడు నడిచెను; అతని ధనుర్ధరుండైన రాముండు వెంబడించెను; కాకపక్షధరుండగు లక్ష్మణుండు విల్లు చేతంబూని రాముని వెంబడించెను. ౬

ఆరామలక్ష్మణులు ప్రత్యేకముగా రెండేసియమ్ముల పొదుల ధరించి యుండుటంబట్టి మూఁడుతలల సర్పంబులుంబోలె వెలుంగుచు ధనుష్పాణులై దశదిక్కులం బ్రకాశింపఁజేయుచు కుటిలులుగాక మహోత్సుండగు విశ్వామిత్రుని నశ్వినీదేవతలు బ్రహ్మదేవునట్లు వెంబడించిరి. ౭,౮౪

అప్పుడు మనోహరంబగు దేహముగలిగి కాంతిచేఁ బ్రకాశింపుచు, ధనుష్పాణులై యుండుముతోలుతోఁ జేసిన హస్తకవచంబు నంగుళికవచం బునుం దొడిగి ఖడ్గధరులై చక్కగా నలంకరింపఁబడి విశ్వామిత్రుని వెంబడిం పుచున్నసహోదరులును బాలురును నిందింపఁదగనివారునగు రామలక్ష్మ ణులు అచింత్యుఁడగు నీశ్వరుని వెంబడించు నగ్నిహోత్రోద్భవులగు స్కంద విశాఖులుంబోలెఁ బ్రకాశించిరి. ౮-౧౦

ఒకటిన్నఱ యామడ దూరముపోయి సరయూనదిదక్షిణతీరమందు విశ్వామిత్రుఁడు "రాముఁడా!" అని మధురముగాఁ బిలిచెను. ౧౧

బిడ్డా! జలము తీసికొనుము: కాలాతిక్రమము కారాదు; సమస్త మంత్రసమూహస్వరూపములైన బల అతిబల యనెడువిద్యలం దెలిసికొనుము.

ఈవిద్యల నెఱింగినట్టయిన నీకు అలసటగాని దప్పిగాని మాఱురూపు గాని కలుగదు: నీవు నిద్రపోవుచుండినను మఱపుదగిలి యుండినను నిన్ను రాక్షసు లెదిరింపలేరు.

ఈవిద్యల నీవు జపించుచున్నయెడల భూమండలమందు బాహుబలం బున నీకెవ్వఁడును సాటికాఁజాలఁడు; ముల్లోకంబులందును నీకు సమానుఁ డెవ్వఁడును నుండఁడు. ౧౪

న సౌభాగ్యే న దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధినిశ్చయే,
నోత్తరే ప్రతివక్తవ్యే సమో లోకే తవాऽనఘ. ౧౫

ఏతద్విద్యాద్వయే లబ్ధే భవితా నాస్తి తే సమః,
బలా త్వతిబలా చైవ సర్వజ్ఞానస్య మాతరౌ. ౧౬

క్షుత్పిపాసే న తే రామ భవిష్యేతే నరోత్తమ,
బలామతిబలాం చైవ పఠతః పథి రాఘవ. ౧౭
విద్యాద్వయ మధీయానే యశశ్చాప్యతులం త్వయి. ౧౭౺
పితామహసుతే హ్యేతే విద్యే తేజస్సమన్వితే,
ప్రదాతుం తవ కాకుత్స్థ సదృశ స్త్వంహి ధార్మిక, ౧౮౺

కామం బహుగుణాస్సర్వే త్వయ్యేతే నాత్ర సంశయః,
తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః. ౧౯౺

తతో రామో జలం స్పృష్ట్వా ప్రహృష్టవదనశ్శుచిః,
ప్రతిజగ్రాహ తే విద్యే మహర్షేర్భావితాత్మనః. ౨౦౺

విద్యాసముదితో రామ శ్శుశుభే భూరివిక్రమః. ౨౧
సహస్రరశ్మి ర్భగవాన్ శరదీవ దివాకరః,
గురుకార్యాణి సర్వాణి నియుజ్య కుశికాత్మజే. ౨౨
ఊషుస్తాం రజనీం తత్ర సరయ్వాం సుసుఖం త్రయః. ౨౨౺

పాపరహితుండవైన రామునా! నీ వీవిద్యల జపింపుచున్నట్టయిన ప్రపంచమునందంతటను సౌందర్యమందును సామర్థ్యమందును తెలివియందును బుద్ధిచేఁ గార్యాకార్యంబుల నిశ్చయించుటయందును ఉత్తరప్రత్యుత్తరముల యందును నీకు సరియైనవాఁ డుండఁడు. ౧౫

ఈరెండువిద్యలం బొందినపిమ్మట నీకు సరియైనవాఁ డిప్పటి కుండఁడు; మఱియెప్పటికి నుండఁబోఁడు; బల అతిబల అనువిద్యలు సమస్తజ్ఞానంబుల నిచ్చునవి. ౧౬

నరశ్రేష్ఠుండవైనరాముఁడా! నీవు మార్గమునందు బలాతిబలలను జపింపుచు నడిచినట్లయిన నీకు ఆఁకలియును దప్పియును గలుగదు. ౧౭

ఈరెండువిద్యల జపించుచున్నట్టయిన నీకు సరిలేనికీర్తియును గలుగును. మహాప్రభావంబులగు నీవిద్యలు బ్రహ్మదేవునిచే సృజింపఁబడినవి; ధార్మికుండవు; కకుత్స్థవంశంబునం బుట్టినవాఁడవు నీవె యిట్టివిద్యలకుఁ బాత్రభూతుండవు; నీవుదక్క నీవంటివాఁడు మఱియెవ్వఁడును లేఁడు. ౧౮-౯

ఇప్పుడు చెప్పఁబడిన సౌభాగ్యాది గుణములన్నియు నీయందు మెండుగానున్నవి; ఇందెంతమాత్రము సందేహము లేదు; ఈవిద్యలును గొప్పతపస్సుచేసి సంపాదింపఁబడినవి గావున బహుఫలంబుల నీయఁగలవు. అని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. ౧౯-౯

అంత రాముఁ డాచమనంబు చేసిసంతుష్టుఁడై శుచియై యెల్లప్పుడుం బరమాత్మధ్యానము సేయుచుండు నావిశ్వామిత్రమహామునివలన నావిద్యల రెంటినిం బ్రతిగ్రహించెను. ౨౦-౯

విశ్వామిత్రునకు వందనాదిగురుకార్యంబులుచేసి రాముఁడు విద్యలచే వృద్ధిఁ బొందినవాఁడై శరత్కాలమందు భగవంతుండును వేయికిరణంబులు గలవాఁడు నగుసూర్యుఁడుంబోలె మహాపరాక్రమశాలియై ప్రకాశించెను. ౨౨

ఆసరయూనది దక్షిణతీరమందు రామలక్ష్మణవిశ్వామిత్రులు మువ్వురును ఆరాత్రియంతయుం సుఖముగా నివసించిరి. ౨౨-౯

దశరథనృపసూనుసత్తమాభ్యాం
తృణశయనేఽనుచితే సహోషితాభ్యామ్,
కుశికసుతవచోఽనులాలితాభ్యాం
సుఖమివ సా విబభౌ విభావరీ చ. ౨౩౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్వావింశస్సర్గః.

---

## త్రయోవింశస్సర్గః

ప్రభాతాయాం తు శర్వర్యాం విశ్వామిత్రో మహామునిః,
అభ్యభాషత కాకుత్స్థౌ శయానౌ పర్ణసంస్తరే. ౧
కౌసల్యాసుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్. ౨
తస్యర్షేః పరమోదారం వచ శ్శ్రుత్వా నృపాత్మజౌ,
స్నాత్వా కృతోదకౌ వీరౌ జేపతుః పరమం జపమ్. ౩

కృతాహ్నికౌ మహావీర్యౌ విశ్వామిత్రం తపోధనమ్,
అభివాద్యాభిసంహృష్టౌ గమనాయాభితస్థతుః. ౪

తౌ ప్రయాతౌ మహావీర్యౌ దివ్యాం త్రిపథగాం నదీమ్,
దదృశాతే తతస్తత్ర సరయ్వాస్సంగమే శుభే. ౫
తత్రాశ్రమపదం పుణ్య ఋషీణా ముగ్రతేజసామ్,
బహువర్షసహస్రాణి తప్యతాం పరమం తపః. ౬
తం దృష్ట్వా పరమప్రీతౌ రాఘవౌ పుణ్యమాశ్రమమ్,
ఊచతుస్తం మహాత్మానం విశ్వామిత్ర మిదం వచః. ౭

దగ్గఱగాఁ గసవుతోఁ బాన్పులు పఱచికొని కూడఁ బరుండి విశ్వామిత్రునిమాటలచే బుజ్జగింపఁబడుచున్న దశరథమహారాజుకొడుకులలో శ్రేష్ఠులగు రామలక్ష్మణులకు ఆరాత్రియంతయుం సుఖముగానే యుండెను. ౨౩ ౫

ఇది యిరువదిరెండవ సర్గము.

---

## ఇరువదిమూఁడవ సర్గము

వేకువకాఁగానే మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు పర్ణశయనంబునందుఁ బవ్వళించియున్న రామలక్ష్మణులం జూచి యిట్లని పలికెను. ౧

కౌసల్యాదేవి సత్పుత్రుఁడవైనరాముఁడా! వేకువ కావచ్చినది: పురుషశ్రేష్ఠుఁడా! లెమ్ము. ఈశ్వరచోదితమైన నిత్యకర్మము సేయవలయును. ౨

ఆవిశ్వామిత్రమహర్షి సెప్పిన పరమగంభీరమగు మాటను విని పరాక్రమశాలులగు రామలక్ష్మణులు స్నానముచేసి యర్ఘ్యంబు విడిచి పరమంబగుగాయత్రీమంత్రంబును జపించిరి. 3

మహాపరాక్రమశాలులగు రామలక్ష్మణులుసంధ్యోపాసనబ్రహ్మయజ్ఞసమిధాదానాదిప్రాతఃకాలకరణీయంబుల నిర్వర్తించినవారలై తపోధనుండగు విశ్వామిత్రు నమస్కరించి సంతోషంబునఁ బయనంబయిరి. ౪

మహాపరాక్రమశాలులగు నారామలక్ష్మణవిశ్వామిత్రులు అచ్చటనుండి తర్లి మంగళకరంబగు సరయూనదీసంగమమందు గంగానదిం జూచిరి. ౫

ఆసరయూనదీసంగమమందు రామలక్ష్మణవిశ్వామిత్రులు మహాప్రభావులై పెక్కువేలేండ్లు పరమతపంబుచేయు ఋషులయాశ్రమస్థానంబుచూచిరి.

రామలక్ష్మణులు పవిత్రంబగునాయాశ్రమమునుజూచి చాలసంతసించి మహాత్ముండగు విశ్వామిత్రునితో నిట్లని చెప్పిరి. ౭

కస్యాయ మాశ్రమః పుణ్యః కో న్వస్మిన్ వసతే పుమాన్,
భగవన్ శ్రోతు మిచ్ఛావః పరం కౌతూహలం హి నౌ. ౮

తయో స్తద్వచనం శ్రుత్వా ప్రహస్య మునిపుంగవః,
అబ్రవీ చ్ఛ్రూయతాం రామ యస్యాయం పూర్వ ఆశ్రమః. ౯
కందర్పో మూర్తిమానాసీ త్కామ ఇత్యుచ్యతే బుధైః. ౯½

తపస్యంత మిహ స్థాణుం నియమేన సమాహితమ్. ౧౦
కృతోద్వాహం తు దేవేశం గచ్ఛంతం సమరుద్గణమ్,
ధర్షయామాస దుర్మేధా హుంకృతశ్చ మహాత్మనా. ౧౧

అవదగ్ధస్య రౌద్రేణ చక్షుషా రఘునందన,
వ్యశీర్యంత శరీరాత్స్వా త్సర్వగాత్రాణి దుర్మతేః. ౧౨
తస్య గాత్రం హతం తత్ర నిర్దగ్ధస్య మహాత్మనా,
అశరీరః కృతః కామః క్రోధా ద్దేవేశ్వరేణ హి. ౧౩

అనంగ ఇతి విఖ్యాత స్తదా ప్రభృతి రాఘవ,
స చాంగవిషయశ్శ్రీమా న్యత్రాంగం ప్రముమోచ హ. ౧౪
తస్యాయ మాశ్రమః పుణ్య స్తస్యేమే మునయః పురా,
శిష్యా ధర్మపరా నిత్యం తేషాం పాపం న విద్యతే. ౧౫
ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన,
పుణ్యయోః సరితో ర్మధ్యే శ్వ స్తరిష్యామహే వయమ్. ౧౬
అభిగచ్ఛామహే సర్వే శుచయః పుణ్య మాశ్రమమ్,

పవిత్రంబగు నీయాశ్రమ మెవ్వనిది? ఇందెవ్వఁడు వాసముచేయుచున్నాఁడు? భగవంతుఁడా! మేము దానినెఱుఁగఁగోరెదము; మాకధికముగాఁ గౌతుకమున్నది అని చెప్పిరి. ౭

రామలక్ష్మణులమాటవిని మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు నవ్వి యిట్లని చెప్పెను; రాముఁడ! ఈయాశ్రమము ఎవ్వనిదో అంతయుం దెల్పెద వినుము. ౮

మునుపు మన్మథుఁడు ఆకారము గలిగియుండెను; అతనినే పండితులు కాముఁడని చెప్పెదరు. లేక పూర్వము కుత్సితంబగు గర్వముఁ రూపము గలిగియుండెను; దానినే పండితులు కాముఁడని చెప్పెదరు, ౯.

దుష్టుండగు నామన్మథుఁడు. ఈయాశ్రమమందుఁ దపస్సుసేయుచు దృఢంబగు నియమంబున సమాధి గలిగియున్న దేవేశ్వరుండగు శివుఁడు పార్వతిని వివాహమై దేవతలఁగూడి యిచ్చటనుండి పోవుటకు మునుపు, ధర్షించెను; అంత మహాత్ముండగు శివుండు హుంకారంబున నామన్మథు ప్రేటుపడఁ జేసెను. ౧౦, ౧౧

రాముఁడా! అగ్నినేత్రంబున దహింపఁబడిన దుష్టుఁడగు మన్మథుని దేహంబంతయుం నీఱైనది. ౧౨

అప్పుడు మహాప్రభావుండగు నీశ్వరునిచే నగ్నినేత్రంబున దహింపఁబడినదై యామన్మథునిశరీరము భస్మమైనది; దేవేశ్వరుండగు నీశ్వరుఁడు కోపంబున మన్మథుని శరీరములేనివానిగాఁ జేసెను. ౧౩

రాముఁడా! అదిమొదలు మన్మథుఁడు అనంగుఁడని ప్రసిద్ధినొందెను; మన్మథుఁడెచ్చట శరీరమును విడిచెనో ఆదేశము అంగదేశమని ప్రసిద్ధినొందెను.

ఆస్థాణుని యాశ్రమం బిది; యీమును లతనిశిష్యులు; వీరలు ఎల్లప్పుడును ధర్మపరులు; వీరలకుఁ బాపంబేమియుం లేదు. ౧౪

శుభదర్శనుండవైన రాముఁడా! ఇచ్చట నీరాత్రియంతయుం నుందుము; రేపు పవిత్రంబులగు నీరెండునదులనడుమను గంగానదిని దాఁటుదము. ౧౫

రాముఁడా! మనమందఱమును స్నానముచేసి జపముసల్పి హోమంబు

స్నాతాశ్చ కృతజప్యాశ్చ హుతహవ్యా నరోత్తమ. ౧౭

తేషాం సంవదతాం తత్ర తపోదీర్ఘేణ చక్షుషా,
విజ్ఞాయ పరమప్రీతా మునయో హర్షమాగమన్. ౧౮

అర్ఘ్యం పాద్యం తథాతిథ్యం నివేద్య కుశికాత్మజే,
రామలక్ష్మణయోః పశ్చా దకుర్వ న్నతిథిక్రియామ్. ౧౯
సత్కారం సమనుప్రాప్య కథాభి రభిరంజయన్,
యథార్హ మజపన్ సంధ్యా మృషయ స్తే సమాహితాః. ౨౦

తత్ర వాసిభి రానీతా మునిభి స్సువ్రతై స్సహ,
న్యవసన్ సుసుఖం తత్ర కామాశ్రమపదే తదా. ౨౧

కథాభిరభిరామాభి రభిరామౌ నృపాత్మజౌ,
రమయామాస ధర్మాత్మా కౌశికో మునిపుంగవః. ౨౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రయోవింశస్సర్గః.

చతుర్వింశస్సర్గః

తతః ప్రభాతే విమలే కృతాహ్నిక మరిందమౌ,
విశ్వామిత్రం పురస్కృత్య నద్యాస్తీర ముపాగతౌ. ౧

తే చ సర్వే మహాత్మానో మునయ స్సంశితవ్రతాః,
ఉపస్థాప్య శుభాం నావం విశ్వామిత్ర మథాబ్రువన్. ౨
ఆరోహతు భవాన్నావం రాజపుత్రపురస్కృతః,
అరిష్టం గచ్ఛ పంథానం మాభూత్కాలవిపర్యయః. 3

గావించి పరిశుద్ధులమై పవిత్రంబగు నాశ్రమపదంబు ప్రవేశించెదము. అని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౧౮

ఆరామలక్ష్మణవిశ్వామిత్రు లచ్చట సల్లాపము సేయుచుండఁగా నా యాశ్రమమందలి మునులు తపోవిశేషంబున సంపాదింపఁబడిన దివ్యజ్ఞానంబుచే తెలిసి మిక్కిలి సంతసించి సంతోషంబు గలవారలై వారియొద్దకువచ్చిరి.

ఆమునులు మొదట విశ్వామిత్రునకు అర్ఘ్యపాద్యాతిథ్యములసమర్పించి పిమ్మట రామునకు లక్ష్మణునకును ఆతిథ్యము నిచ్చిరి. ౧౯

ఆఋషులు రామలక్ష్మణవిశ్వామిత్రులవలన సత్కారమును బొంది అతిథులైన రామలక్ష్మణవిశ్వామిత్రులను కథలచే సంతోషపఱచిరి. అంత మనస్సమాధానముఁ బొంది యథాయోగ్యముగ సంధ్య నుపాసించిరి. ౨౦

ఆ రామలక్ష్మణ విశ్వామిత్రులు ఆయాశ్రమవాసులగుమునులచేతనాశ్రమమునకుఁ దోడ్కొనిపోఁబడి యచ్చట సువ్రతులగుమునులతోఁగూడ సుఖంబుండిరి. ౨౧

ధర్మస్వభావుండును మునిశ్రేష్ఠుఁడు నగు విశ్వామిత్రుఁడు మనోహరులగు రామలక్ష్మణులను వినవిన నింపుగానుండు కథలచే రమింపఁజేసెను. ౨౨

ఇది ఇరువదిమూఁడవ సర్గము.

---

## ఇరువదినాల్గవ సర్గము

అంత సూర్యోదయముకాఁగానే మహాపరాక్రమశాలురగు రామలక్ష్మణులు ప్రాతఃకాలకృత్యంబుదీర్చికొని సిద్ధుఁడుగానున్న విశ్వామిత్రుని ముందిడికొని గంగానదీతీరమునకుఁ బోయిరి. ౧

మహాత్ములును దీక్షితవ్రతులు నగునామునులందఱునుమంచియోడదెచ్చి విశ్వామిత్రునితో నిట్లని చెప్పిరి. ౨

నీవు రామలక్ష్మణుల వెంటఁబెట్టికొని యోడనెక్కుము; మార్గంబున శుభంబుల నొందుచుఁ బొమ్ము, కాలవిళంబము లేకపోవుఁగాక. అని మునులు చెప్పిరి. ౩

నానాప్రకారై శ్శకునై ర్వాశ్యద్భి ర్భైరవస్వనైః,
సింహవ్యాఘ్రవరాహైశ్చ వారణైశ్చోపశోభితమ్. ౧౪
ధవాశ్వకర్ణకకుభై ర్బిల్వతిందుకపాటలైః,
సంకీర్ణం బదరీభిశ్చ కిన్వే తద్దారుణం వనమ్. ౧౫
తమువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః,
శ్రూయతాం వత్స కాకుత్స్థ యస్యై తద్దారుణం వనమ్. ౧౬

ఏతౌ జనపదౌ స్ఫీతౌ పూర్వ మాస్తాం నరోత్తమ,
మలదాశ్చ కరూశాశ్చ దేవనిర్మాణనిర్మితౌ. ౧౭
పురా వృత్రవధే రామ మలేన సమభిప్లుతమ్,
క్షుధాచైవ సహస్రాక్షం బ్రహ్మహత్యా సమావిశత్. ౧౮
త మింద్రం స్నాపయన్ దేవా ఋషయశ్చ తపోధనాః,
కలశై స్స్నాపయామాసు ర్మలం చాస్య ప్రమోచయన్. ౧౯

ఇహ భూమ్యాం మలం దత్వా దత్వా కారూశ మేవచ,
శరీరజం మహేంద్రస్య తతో హర్షం ప్రపేదిరే. ౨౦
నిర్మలో నిష్కరూశశ్చ శుచి రింద్రో యదాఽభవత్,
దదౌ దేశస్య సుప్రీతో వరం ప్రభు రనుత్తమమ్. ౨౧

ఇమౌ జనపదౌ స్ఫీతౌ ఖ్యాతిం లోకే గమిష్యతః,
మలదాశ్చ కరూశాశ్చ మమాంగమలధారిణౌ. ౨౨

సాధు సాధ్వితి తం దేవాః పాకశాసన మబ్రువన్,
దేశస్య పూజాం తాం దృష్ట్వా కృతాం శక్రేణ ధీమతా. ౨౩

సింహవ్యాఘ్రవరాహంబులచేత నేనుంగులచేతఁ బూర్ణంబై చంద్ర యినుమద్ది యేఱుమద్ది మాఁడేడు తుమికి కలిగొట్టు రేఁగు మొదలగువృక్షంబుల నిండియున్నది; ఆశ్చర్యము! భయంకరంబగు నీయడవి పేరేమి? అని రాముఁ డడిగెను. ౧౩-౧౪

మహాప్రభావుండగు విశ్వామిత్రమహాముని రామునిం జూచి యిట్లని చెప్పెను; రాముఁడా! భయంకరంబగు నీవనం బేప్రాణిదో ఆప్రాణిం జెప్పెద వినుము. ౧౫

రాముఁడా! దేవతలుచేయం బనివంటిపనిచేత నిర్మింపఁబడిన యీమలద, కరూశదేశంబులు రెండును మునుపు ధనధాన్యంబుల వృద్ధినొంది యుండినవి.

రాముఁడా! పూర్వము ఇంద్రుఁడు వృత్రునిం జంపిన పిమ్మట నాయింద్రుఁడు అశుచిత్వము నాఁకలియును గల్గి బ్రహ్మహత్యపాపము నొందెను.

దేవతలును దపోధను లగుఋషులును ఆయింద్రుని గంగాదిపుణ్యతీర్థంబుల నభిషేకించి పిమ్మట మంత్రపూతంబు లగుకలశజలంబుల స్నానముచేయించి యతని యశుచిత్వము నాఁకలిని విడిపించిరి. ౧౯

ఆదేవతలును ఋషులును ఇంద్రునిశరీరమునందుఁబుట్టిన యశుచిత్వము నాఁకలి నీదేశంబున విడిచి యంతట సంతసమునొందిరి. ౨౦

ప్రభువైనయింద్రుఁడు ఎప్పుడు తాను మలము నాఁకలి విడిచి పరిశుద్ధుం డయ్యెనో అప్పుడు చాలసంతసించి యీదేశమునకు శ్రేష్ఠమయిన వరంబొసంగెను. ౨౧

నాదేహంబునగల్గిన మలంబు నాఁకలిని ధరించిన యీదేశంబులు ధనధాన్యాదికంబులు వృద్ధినొంది నాదేహమును ఖండించుటం బట్టి మలదంబు లనియుం నాకరూశమును గ్రహించుటం బట్టి కరూశంబు లనియుం లోకంబునఁ బ్రసిద్ధివహింపఁగలవు. అని యింద్రుఁడు వరం బిచ్చెను. ౨౨

ధీమంతుఁడగు నింద్రుఁడు దేశమును బూజించినది చూచి దేవత లాయింద్రుని బాగుబాగని కొనియాడిరి. ౨౩

ఏతౌ జనపదౌ స్ఫీతౌ దీర్ఘకాలమరిందమ,
మలదాశ్చ కరూశాశ్చ ముదితౌ ధనధాన్యతః. ౨౪

కస్యచిత్త్వథ కాలస్య యక్షీ వై కామరూపిణీ,
బలం నాగసహస్రస్య ధారయంతీ తదా హ్యభూత్. ౨౫
తాటకానామ భద్రంతే భార్యా సుందస్య ధీమతః,
మారీచో రాక్షసః పుత్రో యస్యాశ్శక్రపరాక్రమః. ౨౬

వృత్తబాహుర్మహావీర్యో విపులాస్యతనుర్మహాన్,
రాక్షసో భైరవాకారో నిత్యం త్రాసయతే ప్రజాః. ౨౭

ఇమౌ జనపదౌ నిత్యం వినాశయతి రాఘవ,
మలదాంశ్చ కరూశాంశ్చ తాటకా దుష్టచారిణీ. ౨౮
సేయం పంథాన మావృత్య వసత్యధ్యర్ధయోజనే,
అతఏవ న గంతవ్యం తాటకాయా వనం యతః. ౨౯

స్వబాహుబలమాశ్రిత్య జహీమాం దుష్టచారిణమ్,
మన్నియోగాదిమం దేశం కురు నిష్కంటకం పునః. ౩౦
నహి కశ్చిదిమం దేశం శక్నోత్యాగంతు మీదృశమ్,
యక్షిణ్యా ఘోరయా రామ ఉత్సాదితమసహ్యయా. ౩౧

ఏతత్తే సర్వమాఖ్యాతం యథైతద్దారుణం వనమ్,
యక్ష్యా చోత్సాదితం సర్వమద్యాపి న నివర్తతే. ౩౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, చతుర్వింశస్సర్గః.

శత్రువులం జంపునట్టి రామఁడా! ఈ మలదంబులు కరూశంబులు నను దేశంబులు పెద్దకాలమువఱకు వృద్ధి నొంది ధనధాన్యంబులు సంతుష్టి నొంది యుండినవి. ౨౪

అంతఁ గొంతకాలము గడచినపిదపఁ గామరూపిణియును బుట్టినప్పుడే వెయ్యేనుఁగుల బలముగల్గియుండినదియును ధీమంతుం డగు సుందుని భార్యయుం నగు తాటక యనునొక్క యక్షస్త్రీ పుట్టినది; అవిదకు రాక్షసుఁడును ఇంద్రునితో సరివచ్చుపరాక్రమముగలవాఁడు నగు మారీచుండు కొడుకయ్యెను; నీకా తాటకామారీచులవలని భయంబు గలుగకుండుగాక. ౨౫,౨౬

మహాపరాక్రమశాలియగు నామారీచుఁడు గుండ్రంబు లగుబాహువులును విశాలంబయిన ముఖంబునుం గల్గి భయంకరాకారుండై యెల్లప్పుడుం బ్రజలను వేఁపించుచున్నాఁడు. ౨౭

రాముఁడా! దుష్టచారిణి యగు తాటక ఈమలద కరూశదేశంబుల నెల్లప్పుడును నాశనము సేయుచున్నది. ౨౮

ఆతాటక యిక్కడికి ఒకటిన్నఱ యామడదూరంబున మార్గము నడ్డగించి వసించుచున్నది: అదే తాటకావనము కావున నీమార్గంబున మనము పోరాదు. ౨౯

నీవు స్వబాహుబలంబు నాశ్రయించి దుష్టచారిణియగు నీతాటకం జంపుము; నాపంపున నీదేశమును మఱలఁ బట్టినట్లె నిరుపద్రవముగాఁ జేయుము.

రాముఁడా! ఎవ్వరికిని సహింపరాని భయంకరియగు నీతాటకచే నిర్జనముగాఁ జేయఁబడిన యిట్టిపుణ్యదేశమును బ్రవేశించుట కెవ్వండును సమర్థుఁడు గాఁడు. ౩౦

ఈవనము ఎట్లు భయంకరమైనదో ఎట్లు తాటకచేత విజనముగాఁ జేయఁబడినదో ఎట్లు ఇప్పటికిని అలాగే యున్నదో అవృత్తాంతమంతయు నీకుఁ జెప్పితి నని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౩౧

ఇది ఇరువదినాల్గవసర్గము.

## పంచవింశస్సర్గః

అథ తస్యాప్రమేయస్య మునే ర్వచన ముత్తమమ్,
శ్రుత్వా పురుషశార్దూలః ప్రత్యువాచ శుభాం గిరమ్. ౧
అల్పవీర్యా యదా యక్షా శ్శ్రూయంతే మునిపుంగవ,
కథ న్నాగసహస్రస్య ధారయత్యబలా బలమ్. ౨

విశ్వామిత్రోఽబ్రవీద్వాక్యం శృణు యేన బలోత్తరా,
వరదానకృతం వీర్యం ధారయత్యబలా బలమ్. ౩

పూర్వమాసీన్మహాయక్షస్సుకేతుర్నామ వీర్యవాన్,
అనపత్య శ్శుభాచార స్సచ తేపే మహాత్తపః. ౪

పితామహాస్తు సుప్రీత స్తస్య యక్షపతే స్తదా,
కన్యారత్నం దదౌ రామ తాటకా నామ నామతః. ౫
దదౌ నాగసహస్రస్య బలం చాస్యాః పితామహః,
నత్వేవ పుత్రం యక్షాయ దదౌ బ్రహ్మా మహాయశాః. ౬
తాంతు జాతాం వివర్ధంతీం రూపయౌవనశాలినీమ్,
ఝర్ఝపుత్రాయ సుందాయ దదౌ భార్యాం యశస్వినీమ్. ౭

కస్యచి త్త్వథ కాలస్య యక్షీ పుత్ర మజాయత,
మారీచం నామ దుర్ధర్షం యశ్శాపాద్రాక్షసోఽభవత్. ౮

సుందే తు నిహతే రామ సాఽగస్త్య మృషిసత్తమమ్,
తాటకా సహపుత్రేణ ప్రధర్షయితు మిచ్ఛతి. ౯
భక్షార్థం జాతసంరంభా గర్జంతీ సాభ్యధావత. ౯౫

## ఇరువదియైదవ సర్గము

అంత నప్రమేయం బగుప్రభావముగల విశ్వామిత్రుని యుత్తమంబగు మాట విని పురుషశ్రేష్ఠుండయిన రాముండు ఇట్లని మనోహరంబుగాఁ బలికెను.

మునిశ్రేష్ఠుఁడవైన విశ్వామిత్రుఁడా! యక్షు లల్పవీర్యులని ప్రసిద్ధము; అందు బలములేమిచే అబలయని చెప్పఁబడు స్త్రీకి, వెయ్యేనుంగులబలం బెట్లున్నది? అని రాముఁ డడిగెను. ౨

విశ్వామిత్రుండు చెప్పెను. తాటకకు బలము గలిగినందుకుం గలకారణంబు వినుము; ఆదిశకు వరదానంబునఁ బలంబు గల్గినది; కాఁబట్టి స్త్రీయైనను బలాఢ్యురాలుగా నున్నది. ౩

పూర్వము, పరాక్రమశాలియగు సుకేతుండను మహాయక్షుం డొకఁడు, మంచియాచారము గల్గి యనపత్యుండై యుండెను; వాఁడు సంతానార్థముగా గొప్పతపస్సు చేసెను. ౪

రాముఁడా! అప్పుడు బ్రహ్మదేవుండును బాల సంతసించి యాయక్షపతియగు సుకేతునకు తాటకయనెడు కొమార్తె నిచ్చెను. ౫

బ్రహ్మదేవుం డీతాటకకు వెయ్యేనుగులబలము సైతము నిచ్చెను; సుకేతునకుఁ గొడుకును మాత్రము బ్రహ్మదేవుం డీయనే లేదు. ౬

సుకేతుం డిట్లు పుట్టి పెరుఁగుచు సౌందర్యయౌవనంబుల నొప్పుచు మంచికీర్తిగలిగియున్న యాతాటకను ఝర్ఝపుత్రుండగు సుందున కిచ్చి పెండ్లి గావించెను. ౭

అంతఁ గొంతకాలము గడచినపిదప తాటకశాపంబువలన రాక్షసత్వంబుఁ బొందిన మారీచుం డనియెడు నొకపరాక్రమశాలియగు కుమారునిం గనెను. ౮

అగస్త్యునిచే సుందుఁడు చంపఁబడఁగానే తాటక మారీచునిం గూడి కోపించి ఋషిసత్తముండగు నగస్త్యుని భక్షింపఁగోరెను. ౯

ఆతాటక వేగముగలదై యఱచుచు నాయగస్త్యునిపైకిఁ బరుగెత్తెను.

ఆపతంతీం తు తాం దృష్ట్వా అగస్త్యో భగవానృషిః,
రాక్షసత్వం భజస్వేతి మారీచం వ్యాజహార సః. ౧౦౪
అగస్త్యః పరమక్రుద్ధస్తాటకామపి శప్తవాన్. ౧౧
పురుషాదీ మహాయక్షీ విరూపా వికృతాననా,
ఇదం రూపం విహాయాథ దారుణం రూప మస్తు తే. ౧౨

సైషా శాపకృతామర్షా తాటకా క్రోధమూర్ఛితా,
దేశముత్సాదయత్యేన మగస్త్యచరితం శుభమ్. ౧౩

ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమదారుణామ్,
గోబ్రాహ్మణ హితార్థాయ జహి దుష్టపరాక్రమామ్. ౧౪
న హ్యేనాం శాపసంస్పృష్టాం కశ్చిదుత్సహతే పుమాన్,
నిహంతుం త్రిషు లోకేషు త్వామృతే రఘునందన. ౧౫
న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ,
చాతుర్వర్ణ్యహితార్థాయ కర్తవ్యం రాజసూనునా. ౧౬

నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్,
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా. ౧౭

రాజ్యభారనియుక్తానా మేష ధర్మ స్సనాతనః,
అధర్మ్యాం జహి కాకుత్స్థ ధర్మో హ్యస్యా న విద్యతే. ౧౮

శ్రూయతే హి పురా శక్రో విరోచనసుతాం నృప,
పృథివీం హంతు మిచ్ఛంతీం మంథరామభ్యసూదయత్. ౧౯
విష్ణునాపి పురా రామ భృగుపత్నీ దృఢవ్రతా,

ఆతాటక పైకి వచ్చుటం జూచినంతనే భగవంతుండగు నాయగస్త్య మహర్షి రాక్షసుండవు గమ్మని మారీచుని శపించెను. ౧౦

అగస్త్యుండు చాలఁ గోపించి "నీ వీరూపమును విడిచి మనుష్య మాంసమును భక్షించుచు మహాయక్షివై వికృతంబగు శరీరంబును ముఖంబునుం గలిగియుండుము; ఇంకమీఁద నీకు భయంకరంబగు రూపము గలుగుఁ గాక." అని తాటకనుం గూడ శపించెను. ౧౧,౧౨

ఆతాటక శాపంబు సహింపక కోపంబు వహించి పూర్వం బగస్త్యుని యునికిపట్టయి యుండిన మంగళకరంబగు నీదేశంబునంతయుం నిర్జనముగాఁ జేయుచున్నది. ౧౩

రామఁడా! గోబ్రాహ్మణుల మేలుకోఱకు దురాచారయై పరమభయంకరయై దుస్సహమగు పరాక్రమముగలిగి యున్న యీతాటకం జంపుము.

రామఁడా! నీవు దక్క శాపంబుచేఁ గోపించియుండు నీతాటకం జంపుటకు మూఁడులోకంబులం దెవ్వండును శక్తుఁడు కాఁడు. ౧౪

రామఁడా! నీ వాఁడుదానిం జంపవలయునని జుగుప్స సేయవలదు. రాజపుత్త్రుం డగువాఁడు నాలుగువర్ణములకును హితమయిన కార్యము నవశ్యము సేయవలయుం. ౧౫

ధార్మికుండై ప్రజలరక్షించునట్టి రాజు ప్రజలరక్షింపవలసియుండుటం బట్టి క్రూరమైనదిగాని క్రూరముకానిదిగాని మహాపాపముగాని అపవాదము వచ్చునదిగాని యేది ప్రజలకుహితమో దాని నవశ్యము సేయవలయును.

ప్రజారక్షణనిమిత్తమై యేకార్యమైనను సేయుట రాజ్యభారమును వహించియుండువారికి ఎడతెగని ధర్మము; అధర్మములోనుండు నీతాటకం జంపుము; ఈతాటక కెంతమాత్రమును ధర్మములేదు. ౧౬

రామఁడా! పూర్వము విరోచనుని కూఁతురగు మంథర భూమిం జంపఁగోరినందున ఇంద్రుండు దానిం జంపెను; అని వినుచున్నారముగదా!

రామఁడా! పూర్వము ప్రపంచములో ఇంద్రుఁడె లేకపోవుఁగాక

అనింద్రం లోక మిచ్ఛంతీ కావ్యమాతా నిషూదితా. ౨౦
ఏతై శ్చాన్యైశ్చ బహుభీ రాజపుత్ర మహాత్మభిః,
అధర్మసహితా నార్యో హతాః పురుషసత్తమైః. ౨౧

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పఞ్చవింశస్సర్గః.

## షడ్వింశస్సర్గః

మునే ర్వచన మక్లీబం శ్రుత్వా నరవరాత్మజః,
రాఘవః ప్రాంజలిర్భూత్వా ప్రత్యువాచ దృఢవ్రతః. ౧
పితుర్వచననిర్దేశా త్పితుర్వచనగౌరవాత్,
వచనం కౌశికస్యేతి కర్తవ్య మవిశంకయా. ౨

అనుశిష్టోఽస్మ్యయోధ్యాయాం గురుమధ్యే మహాత్మనా,
పిత్రా దశరథేనాహం నావజ్ఞేయం హి తద్వచః. 3

సోఽహం పితుర్వచ శ్శ్రుత్వా శాసనాద్బ్రహ్మవాదినః,
కరిష్యామి న సందేహ స్తాటకావధ ముత్తమమ్. ౪

గోబ్రాహ్మణహితార్థాయ దేశస్యాస్య సుఖాయ చ,
తవ చైవాప్రమేయస్య వచనం కర్తు ముద్యతః. ౫
ఏవ ముక్త్వా ధనుర్మధ్యే బధ్వా ముష్టిమరిందమః,
జ్యాశబ్ద మకరో త్తీవ్రం దిశశ్శబ్దేన నాదయన్. ౬
తేన శబ్దేన విత్రస్తా స్తాటకావనవాసినః,
తాటకాచ సుసంక్రుద్ధా తేన శబ్దేన మోహితా. ౭

యని యింద్రుని జంపఁ గడంగుటంబట్టి శుక్రుని తల్లియగు భృగుమహర్షిభార్య విష్ణుదేవునిచేఁ జంపఁబడినది. ౨౦

ఇప్పుడు చెప్పఁబడినవారలు ఇంక నితరు లనేకులు మహాత్ములగు పురుష శ్రేష్ఠులు అధర్మములు చేయుస్త్రీలం జంపియున్నారు. ౨౧

ఇది ఇరువదియైదవ సర్గము.

---

## ఇరువదియాఱవ సర్గము

విశ్వామిత్రుఁడు చెప్పిన యర్థవంతమగు మాటవిని దృఢమైన వ్రతము గల రాజపుత్రుండగు రాముండు చేమోడ్పుగీలించి యిట్లని బదులుచెప్పెను.

తండ్రిగారి యాజ్ఞవలనను, తండ్రిగారి యాజ్ఞయందలి గౌరవంబు నను విశ్వామిత్రుం డాజ్ఞాపించినట్లు ఎంతమాత్రము సంశయ ముంచక చేయవలసినది. ౨

అయోధ్యానగరమునందు మహాత్ముండును దండ్రియునగు దశరథుండు వసిష్ఠాదిగురుమధ్యంబున "విశ్వామిత్రుండు సెప్పినట్లు చేయుము" అని సాకాజ్ఞాపించెను; ఆయనమాట నుల్లంఘింప నలవిగాదు గదా! ౩

ఇట్లు తండ్రియాజ్ఞను వినియున్నవాఁడు గావునఁ, దండ్రియాజ్ఞం బాలించుట నాకు ముఖ్యవ్రతం బగుటంజేసి బ్రహ్మవాదియగు విశ్వామిత్రుని యాజ్ఞంబట్టి తాటకం జంపెదను; సందియంబులేదు. ౪

గోబ్రాహ్మణులకు మేలు గల్గుటకును ఈదేశమునకు సుఖంబు సిద్ధించుట కొఱకును మహానుభావుండవగు నీపనుపు చేయుటకు సిద్ధుండనైతి. ౫

ఇట్లు చెప్పి శత్రువుల నణఁగఁద్రొక్కునట్టి రాముఁడు ధనుర్మధ్యంబు పిడికిటం బట్టి దిక్కుల నన్నింటిని ధ్వనింపఁజేయుచు టంకారంబు గావించెను.

ఆధ్వని విని తాటకావనమునం దుండువారలందఱు భయపడిరి; పరమకోపనయగు తాటకయును ఆశబ్దము విని సంభ్రాంతయైనది. ౭

తం శబ్దమభినిధ్యాయ రాక్షసీ క్రోధమూర్ఛితా,
శ్రుత్వాచాభ్యద్రవద్వేగా ద్యత శ్శబ్దో వినిస్సృతః. ౮
తాం దృష్ట్వా రాఘవః క్రుద్ధాం వికృతాం వికృతాననామ్,
ప్రమాణేనాతివృద్ధాం చ లక్ష్మణం సోఽభ్యభాషత. ౯

పశ్య లక్ష్మణ యక్షిణ్యా భైరవం దారుణం వపుః,
భిద్యేరన్ దర్శనాదస్యా భీరూణాం హృదయానిచ. ౧౦

ఏనాం పశ్య దురాధర్షాం మాయాబలసమన్వితామ్,
వినివృత్తాం కరోమ్యద్య హృతకర్ణాగ్రనాసికామ్. ౧౧
నహ్యేనా ముత్సహే హంతుం స్త్రీస్వభావేన రక్షితామ్,
వీర్యం చాస్యాగతిం చాపి హనిష్యామీతి మే మతిః. ౧౨

ఏవం బ్రువాణే రామే తు తాటకా క్రోధమూర్ఛితా,
ఉద్యమ్య బాహూ గర్జంతీ రామమేవాభ్యధావత. ౧౩
విశ్వామిత్రస్తు బ్రహ్మర్షి ర్హుంకారేణాభిభర్త్స్య తామ్.
స్వస్తి రాఘవయో రస్తు జయంచై వాభ్యభాషత. ౧౪

ఉద్ధూన్వానా రజో ఘోరం తాటకా రాఘవావుభౌ,
రజోమేఘేన మహతా ముహూర్తం సావ్యమోహయత్.
తతో మాయాం సమాస్థాయ శిలావర్షేణ రాఘవౌ,
అవాకిరత్సుమహతా తత శ్చుక్రోధ రాఘవః. ౧౫
శిలావర్షం మహత్తస్యా శ్శరవర్షేణ రాఘవః,
ప్రతిహత్యోపధావంత్యాః కరౌ చిచ్ఛేద పత్రిభిః. ౧౬
తత శ్ఛిన్నభుజాం శ్రాంతా మభ్యాశే పరిగర్జతీమ్,

ఆధ్వనిని విని కొంతదడ వాలోచించి రక్కసియగు తాటక పరమ కోపంబుపూని యాశబ్ద మెందుండివెడలెనో అచ్చటికివేగంబునఁ బరుగెత్తెను.

చూచుటలకు రోఁతపుట్టించు శరీరంబును వికృతంబయిన ముఖంబునుం గల్గి యత్యున్నతయై కోపంబునవచ్చు నాతాటకం జూచి రాముండు లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౯

లక్ష్మణుఁడా! ఈతాటకయొక్క భయంకరంబును వికృతంబునగు శరీరంబుం జూడుము; ఈతాటకం జూచినట్టయిన భీరువులహృదయంబులు పగిలిపోవును. ౧౦

ఎదిరింపఁగూడనిదియును మాయాబలంబుగలదియును నగు నీతాటక నిప్పుడు చెవులును ముక్కునుం గోసి పరాజయము నొందించెదను చూడుము.

ఈతాటక యాఁడుది గనుక నేను దీనిం జంపుటలేదు; దీనిచేతులును గాళ్లునుం గోసి పరాక్రమంబును గమనంబును లేకుండఁజేసెదను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౨

రాముం డీప్రకారము చెప్పుచుండఁగానే తాటక కోపంబు వహించి చేతులుపైకెత్తి గర్జించుచు లక్ష్మణుని తట్టుపోక రామునిపైకిఁ బరుగెత్తెను.

బ్రహ్మర్షియగు విశ్వామిత్రుండును తాటకను హుంకారంబున నదల్చి "రామలక్ష్మణులకు మంగళంబును జయంబునుం గల్గుఁగాక" అని యాశీర్వదించెను. ౧౪

ఆతాటక భయంకరముగాఁ బరాగంబుల వెదవల్లుచు నారామలక్ష్మణుల నిర్వురనాదుమ్ముచేఁగల్గిన యంధకారము చేఁ గొంతకాలంబు మోహపఱచెను.

అంతట నాతాటక మాయవహించి రామలక్ష్మణులమీఁద గొప్పఱాళ్ల వాన గురిపించెను; రాముఁ డంతఁ గోపంబు నొందెను. ౧౬

రాముం డాతాటక గురిపించిన ఱాళ్లవానను బాణవర్షముచే వారించితన పైకిఁ బరుగెత్తివచ్చుచున్న యాతాటకచేతులురెండును బాణంబుల నఱికెను.

అంత చేతులుదెగి యలసటనొంది సమీపంబున నఱచుచున్నయాతాటక

సౌమిత్రిరకరోత్క్రోధాద్ధృతకర్ణాగ్రనాసికామ్. ౧౮
కామరూపధరాసద్యః కృత్వా రూపాణ్యనేకశః,
అంతర్ధానం గతా యక్షీ మోహయంతీవ మాయయా. ౧౯
అశ్మవర్షం విముంచంతీ భైరవం విచచార హ. ౧౯½
తత స్తావశ్మవర్షేణ కీర్యమాణౌ సమంతతః,
దృష్ట్వా గాధిసుతశ్శ్రీమా నిదం వచనమబ్రవీత్. ౨౦½
అలం తే ఘృణయా రామ పాపైషా దుష్టచారిణీ,
యజ్ఞవిఘ్నకరీ యక్షీ పురా వర్ధతి మాయయా. ౨౧½

వధ్యతాం తావదేవైషా పురా సంధ్యా ప్రవర్తతే,
రక్షాంసి సంధ్యాకాలేషు దుర్ధర్షాణి భవంతి వై. ౨౨½

ఇత్యుక్తస్తు తదా యక్షీ మశ్మవృష్ట్యాభివర్షతీమ్,
దర్శయఞ్ శబ్దవేధిత్వం తాం రురోధ స సాయకైః. ౨౩½

సా రుద్ధా శరజాలేన మాయాబలసమన్వితా,
అభిదుద్రావ కాకుత్స్థం లక్ష్మణం చ వినేదుషీ. ౨౪½
తా మాపతంతీం వేగేన విక్రాంతా మశనీ మివ,
శరేణోరసి వివ్యాధ సా పపాత మమార చ. ౨౫½

తాం హతాం భీమసంకాశాం దృష్ట్వా సురపతి స్తదా,
సాధు సాధ్వితి కాకుత్స్థం సురాశ్చ సమపూజయన్. ౨౬½
ఉవాచ పరమప్రీత స్సహస్రాక్షః పురందరః,
సురాశ్చ సర్వే సంహృష్టా విశ్వామిత్ర మథాబ్రువన్. ౨౭½

కర్ణనాసికలను గోపంబున లక్ష్మణుండు కోసివేసెను.

ఆతాటక కామరూపిణి గావున నప్పుడు అనేకరూపములొందియుం మాయాబలంబున నంతర్ధానంబునొందియుం రాళ్లవానగురియించుచు మోహము గల్గునట్లు భయంకరముగా సంచరించెను. ౧౮,౧౯

అంత రాల్లుప్రక్కల రాళ్లవానం గప్పఁబడుచున్న రామలక్ష్మణులం జూచి శ్రీమంతుండగు విశ్వామిత్రుఁ డిట్లని చెప్పెను. ౨౦

రామఁడా! నీ వీతాటకయందు దయయుంచినది చాలును; ఈ తాటక పాపిష్ఠురాలు; దుర్మార్గురాలు; యాగంబులకు విఘ్నము సేయఁనది; మఱియుం నీతాటక సాయంకాలమైనంతట ఇంకం జాల మాయగలదియౌను. ౨౧

ముందుసాయంకాలము రాఁబోవుచున్నది; అంతలోనే యీ తాటకం జంపుము; సాయంకాలంబునందు రాక్షసుల నెదిరించుట కష్టము. అని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౨౨

విశ్వామిత్రుం డిట్లు చెప్పినంతటనే రాముం డప్పుడు ఎదిరి కనుపడక పోయినను అతని శబ్దమునే గుఱిగాఁబట్టి యతని పైఁబడునట్లు బాణమువేయుంట యందుఁ, దనకుంగల సామర్థ్యము చూపుట రాళ్లవానఁగురిపించుచున్న యా తాటకను బాణంబుల నిరోధించెను ౨౩

మాయాబలంబు గలయా తాటక బాణంబుల నిరోధింపంబడి రామ లక్ష్మణుల పైకిఁ బరుగెత్తెను. ౨౪

పరాక్రమించి పిడుగుంబోలె వేగంబునం బైకిఁ బఱతెంచుచున్న యా తాటక ఱొమ్మున రాముండు బాణంబునం గొట్టెను. అంత నది నేలం బడి ప్రాణంబులు విడిచెను. ౨౫

అప్పుడు భయంకరాకారయగు నా తాటక చంపఁబడుటంజూచి దేవేంద్రుండును దేవతలును బాగు బాగని రామునిం గొనియాడిరి. ౨౬

అంత సహస్రాక్షుండగు దేవేంద్రుండును దేవతలు నంతయును చాల సంతసించి విశ్వామిత్రునితో నిట్లని పల్కిరి. ౨౭

మునే కౌశిక భద్రం తే సేన్ద్రాస్సర్వే మరుద్గణాః,
తోషితాః కర్మణాఽనేన స్నేహం దర్శయ రాఘవే. ౨౮॥

ప్రజాపతేర్భృశాశ్వస్య పుత్రాన్ సత్యపరాక్రమాన్,
తపోబలభృతాన్ బ్రహ్మన్ రాఘవాయ నివేదయ. ౨౯॥
పాత్రభూతశ్చతే బ్రహ్మం స్తవానుగమనే ధృతః,
కర్తవ్యంచ మహత్కర్మ సురాణాం రాజసూనునా. ౩౦॥

ఏవ ముక్త్వా సురాస్సర్వే హృష్టా జగ్ముర్యథాగతమ్,
విశ్వామిత్రం పురస్కృత్య తత స్సన్ధ్యా ప్రవర్తతే. ౩౧॥
తతో మునివరః ప్రీత స్తాటకావధతోషితః,
మూర్ధ్ని రామ ముపాఘ్రాయ ఇదం వచన మబ్రవీత్. ౩౨॥
ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన,
శ్వః ప్రభాతే గమిష్యామ స్తదాశ్రమపదం మమ. ౩౩॥
విశ్వామిత్రవచః శ్రుత్వా హృష్టో దశరథాత్మజః,
ఉవాస రజనీం తత్ర తాటకాయా వనే సుఖమ్. ౩౪॥
ముక్తశాపం వనం తచ్చ తస్మిన్నేవ తదాహని,
రమణీయం విబభ్రాజ యథా చైత్రరథం వనమ్. ౩౫॥
నిహత్య తాం యక్షసుతాం స రామః
ప్రశస్యమాన స్సురసిద్ధసఙ్ఘైః,
ఉవాస తస్మి న్మునినా సహైవ
ప్రభాతవేళాం ప్రతిబోధ్యమానః. ౩౬॥

ఇతి శ్రీమద్బాలకాణ్డే షడ్వింశస్సర్గః.

విశ్వామిత్రుఁడా! నీకు మంగళమగుగాక! ఈతాటకంజంపుటచే దేవేంద్రుండు దేవతలు నందఱును సంతసించిరి; నీవు రామునియం దనుగ్రహంబు సేయుము. ౨౮

విశ్వామిత్రుఁడా! నీవు తపోబలంబున సంపాదించిన సత్యపరాక్రమంబులగు భృశాశ్వప్రజాపతికొడుకులైన యస్త్రంబుల రామునకుఁ జెప్పుము. ౨౯

విశ్వామిత్రుఁడా! ఈరాముఁడు నియతంబుగా నీయాజ్ఞాప్రకారము నడచువాఁడు కావున నీకుఁ బాత్రభూతుఁడు నగుచున్నాఁడు, మఱియు నీ రాజపుత్రుఁడగు రాముఁడు దేవతలకుగాను గొప్పకార్యము చేయవలసినదిగా నున్నది. అని చెప్పిరి. ౩౦

ఇట్లు చెప్పి దేవతలందఱును సంతసించి విశ్వామిత్రుంబూజించి వచ్చినట్లు పోయిరి; అంత సంధ్యాకాలంబు వచ్చినది. ౩౧

అంత మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుండు తాటకం జంపుటవలనసంతసంబొంది రాముని శిరంబున మూర్కొని యిట్లని చెప్పెను. ౩౨

శుభదర్శనుఁడ వగురాముఁడా! ఈరాత్రి యంతయు నీతాటకావనమందే యుందము; రేపు వేకువను నాయాశ్రమంబునకుఁ బోయెదము. ౩౩

విశ్వామిత్రునిమాట విని రాముండు సంతసించి రాత్రియంతయు నాతాటకావనంబున సుఖంబుగా నుండెను. ౩౪

ఆదినమునం దప్పుడే యావనంబు నుపద్రవంబులు వీడి చైత్రరథంబనెడు కుబేరుని యుద్యానవనంబునుంబోలె మనోహరమై యొప్పెను. ౩౫

రాముండా తాటకంజంపి దేవతలచేతను సిద్ధులచేతనుం గొనియాడంబడుచు విశ్వామిత్రునితోఁగూడ నావనంబున నుండెను. వేకువకాఁగానే విశ్వామిత్రునిచే మేలుకొలుపఁబడెను. ౩౬

ఇది ఇరువదియాఱవ సర్గము.

# సప్తవింశస్సర్గః.

అథ తాం రజనీ ముష్య విశ్వామిత్రో మహాయశాః,
ప్రహస్య రాఘవం వాక్య మువాచ మధురాక్షరమ్. ౧
పరితుష్టోఽస్మి భద్రం తే రాజపుత్ర మహాయశః,
ప్రీత్యాపరమయా యుక్తో దదామ్యస్త్రాణి సర్వశః. ౨

దేవాసురగణాన్వాపి సగంధర్వోరగానపి,
యై రమిత్రా న్ప్రసహ్యాజౌ వశీకృత్య జయిష్యసి. ౩
తాని దివ్యాని భద్రం తే దదామ్యస్త్రాణి సర్వశః. ౩౼
దండచక్రం మహద్దివ్యం తవ దాస్యామి రాఘవ. ౪

ధర్మచక్రం తతో వీర కాలచక్రం తథైవ చ,
విష్ణుచక్రం తథాత్యుగ్ర మైంద్రమస్త్రం తథైవచ. ౫
వజ్రమస్త్రం నరశ్రేష్ఠ శైవం శూలవరం తథా,
అస్త్రం బ్రహ్మశిరశ్చైవ ఐషీక మపి రాఘవ. ౬
దదామి తే మహాబాహో బ్రాహ్మ మస్త్ర మనుత్తమమ్. ౬౼
గదే ద్వే చైవ కాకుత్స్థ మోదకీ శిఖరీ ఉభే,
ప్రదీప్తే నరశార్దూల ప్రయచ్ఛామి నృపాత్మజ. ౭౼
ధర్మపాశ మహం రామ కాలపాశం తథైవచ,
పాశం వారుణమస్త్రం చ దదామ్యహమనుత్తమమ్. ౮౼
అశనీ ద్వేప్రయచ్ఛామి శుష్కార్ద్రే రఘునందన,
దదామి చాస్త్రం పైనాక మస్త్రం నారాయణం తథా. ౯౼
ఆగ్నేయ మస్త్రం దయితం శిఖరం నామ నామతః,

# ఇరువదియేడవ సర్గము



అంత నారాత్రియంతయుం నచ్చటనుండి మహాయశుండగు విశ్వామిత్రుఁడు చిఱునవ్వుఁ జేసి రామునితో నిట్లని మధురంబుగాఁ బలికెను. ౧

మహాయశుండవగు రాముఁడా! నేను సంతసించితి; నీకు మంగళమొదవుఁగాక; నేను బరమసంతోషంబు నొందితిం గావున నస్త్రంబుల నన్నింటిని నీ కిచ్చెదను. ౨

దేవతలురాక్షసులు గంధర్వులు నురగులుం జేరియొక్కపెట్టనెత్తివచ్చినను శత్రువుల నీయస్త్రంబుల యుద్ధంబునం జక్కడిచి జయింపఁగలవో అట్టి దివ్యంబులగు నస్త్రంబులనన్నింటిని నీకొసంగెదను; నీకు మంగళ మొదవుఁగాక.

రాముఁడా! నీకు గొప్పదియును శ్రేష్ఠంబునగు దండచక్రంబు నిచ్చెదను. ౪

వీరుండవు, పురుషశ్రేష్ఠుండవు, మహాబాహుండవగు రాముఁడా! నీకు ధర్మచక్రంబును గాలచక్రంబును అతిభయంకరంబగు విష్ణుచక్రంబును ఐంద్రాస్త్రంబును వజ్రాస్త్రంబును శైవంబగు శూలంబును బ్రహ్మశిరంబనెడి యస్త్రంబును ఐషీకంబును బ్రహ్మాస్త్రంబు నిచ్చెదను. ౫-౬½

పురుశ్రేష్ఠుండవగు రాముఁడా! మోదకి శిఖరి యనెడు రెండు మంచిగద లున్నవి; అగదలరెంటిని నీకిచ్చెదను. ౭½

రాముఁడా! నీకు ధర్మపాశంబును కాలపాశంబును వరుణపాశంబును వారుణాస్త్రంబు నిచ్చెదను. ౮½

రాముఁడా! నీకు శుష్కాశనిని ఆర్ద్రాశనిని పైనాకాస్త్రమును నారాయణాస్త్రమును ఇచ్చెదను. ౯½

అనఘుండవగు రాముఁడా! అగ్నిదేవునకుఁ బ్రియంబయిన శిఖరంబని

వాయవ్యం ప్రథనం నామ దదామి చ తవానఘ. ౧౦½
అస్త్రం హయశిరో నామ క్రౌంచ మస్త్రం తథైవచ,
శక్తిద్వయంచ కాకుత్స్థ దదామి తవ రాఘవ. ౧౧½

కంకాళం ముసలం ఘోరం కాపాల మథ కంకణమ్,
ధారయన్త్యసురా యాని దదామ్యేతాని సర్వశః. ౧౨½

వైద్యాధరం మహాస్త్రంచ నందనం నామ నామతః,
అసిరత్నం మహాబాహో దదామి చ నృపాత్మజ. ౧౩½

గాంధర్వ మస్త్రం దయితం మానవం నామ నామతః.
ప్రస్వాపన ప్రశమనే దద్మి సౌరంచ రాఘవ. ౧౪½

దర్పణం శోషణం చైవ సంతాపనవిలాపనే. ౧౫
మదనం చైవ దుర్ధర్షం కందర్పదయితం తథా,
పైశాచ మస్త్రం దయితం మోహనం నామ నామతః. ౧౬
ప్రతీచ్ఛ నరశార్ధూల రాజపుత్ర మహాయశః. ౧౬½

తామసం నరశార్దూల సౌమనంచ మహాబల. ౧౭
సంవర్ధంచైవ దుర్ధర్షం మౌసలంచ నృపాత్మజ,
సత్య మస్త్రం మహాబాహో తథా మాయాధరం పరమ్. ౧౮

ఘోరం తేజఃప్రభం నామ పరతేజోపకర్షణమ్,
సౌమ్యాస్త్రం శిశిరం నామ త్వాష్టు రస్త్రం సుదామనమ్. ౧౯
దారుణంచ భగస్యాపి శీతేషు మథ మానవమ్. ౧౯½

ఏతాన్ రామ మహాబాహో కామరూపాన్ మహాబలాన్,
గృహాణ పరమోదారాన్ క్షిప్రమేవ నృపాత్మజ. ౨౦½

యెడు నాగ్నేయాస్త్రంబును ప్రథనంబనెడువాయవ్యాస్త్రంబు నీకిచ్చెదను.

రాముఁడా! హయశిరస్సనెడియస్త్రంబును క్రౌంచాస్త్రంబును విష్ణు శక్తియు రుద్రశక్తియు ననెడుశక్తులరెంటిని నీకిచ్చెదను. ౧౧॥

రాక్షసులు ధరించునట్టి భయంకరమైన కంకాళము కాపాలము కంకణము అను ముసలముల నన్నింటి నిచ్చెదను. ౧౨॥

మహాబాహుండవగురాముఁడా! వైద్యాధరాస్త్రంబును నందనంబని యెడు శ్రేష్ఠంబగుకత్తిని నీకిచ్చెదను. ౧౩॥

రాముఁడా! గంధర్వులకుఁ బ్రియమైన మానవము ప్రస్వాపనము ప్రశమనము ననియెడు గాంధర్వాస్త్రంబులను సౌరాస్త్రంబును నీకిచ్చెదను.

పురుషశ్రేష్ఠుండవు మహాయశుండవగు రాముఁడా! దర్పణము శోషణము సంతాపనము విలాపనము దుర్ధర్షంబును మన్మథునకుఁ బ్రియంబునగు మదనము పిశాచదేవతాకం బగు మోహనము అను నీయస్త్రంబులం బ్రతిగ్రహింపుము. ౧౫, ౧౬॥

పురుషశ్రేష్ఠుండవు మహాబలుండవు మహాబాహుండవు నగు రాముఁడా! తామసము, సౌమనము, సంవర్తము, దుర్ధర్షంబగు మౌసలము, సత్యము, మాయాధరము, శత్రువుల తేజస్సును బోఁగొట్టునట్టి తేజఃప్రభంబు, చంద్ర దేవతాక మగుశిశిరము, త్వష్టృదేవతాక మగుసుదామనము, దారుణం బగు భగాస్త్రంబును మానవంబు ననునీయస్త్రంబులఁ బ్రతిగ్రహింపుము ౧౭-౧౯॥

రాజపుత్త్రుండవు మహాబాహుండవు నగు రాముఁడా! తమకు వలయు నట్టిరూపము ధరింపఁగలిగి మహాబలంబులై యన్నిటిని అతిశయించియుండు నీయస్త్రంబుల శీఘ్రముగాఁ దెలిసికొనుము. అని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. ౨౦॥

స్థితస్తు ప్రాఙ్ముఖో భూత్వా శుచి ర్మునివర స్తదా,
దదౌ రామాయ సుప్రీతో మన్త్రగ్రామ మనుత్తమమ్. ౨౧॥

సర్వసంగ్రహణం యేషాం దైవతైరపి దుర్లభమ్,
తా న్యస్త్రాణి తదా విప్రో రాఘవాయ న్యవేదయత్. ౨౨॥
జపతస్తు మునే స్తస్య విశ్వామిత్రస్య ధీమతః,
ఉపతస్థు ర్మహార్హాణి సర్వాణ్యస్త్రాణి రాఘవమ్. ౨౩॥

ఊచుశ్చ ముదితా స్సర్వే రామం ప్రాంజలయ స్తదా,
ఇమే స్మ పరమోదారాః కింకరా స్తవ రాఘవ. ౨౪॥
ప్రతిగృహ్యచ కాకుత్స్థ స్సమాలభ్య చ పాణినా,
మానసా మే భవిష్యధ్వ మితి తానభ్యచోదయత్. ౨౫॥

తతః ప్రీతమనా రామో విశ్వామిత్రం మహామునిమ్,
అభివాద్య మహాతేజా గమనాయోపచక్రమే. ౨౬॥

ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తవింశస్సర్గః.

---

## అష్టావింశస్సర్గః.

ప్రతిగృహ్య తతోఽస్త్రాణి ప్రహృష్టవదన శ్శుచిః,
గచ్ఛన్నేవచ కాకుత్స్థో విశ్వామిత్ర మథాబ్రవీత్. ౧
గృహీతాస్త్రోఽస్మి భగవ న్దురాధర్ష స్సురైరపి,
అస్త్రాణాం త్వహమిచ్ఛామి సంహారం మునిపుంగవ. ౨

ఏవం బ్రువతి కాకుత్స్థే విశ్వామిత్రో మహామునిః,

అప్పుడు మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు సంతసించి పరిశుద్ధుండై తూర్పుమొగముగా నిలిచి శ్రేష్ఠంబులగు నాయస్త్రమంత్రంబుల నన్నిటిని రామున కుపదేశించెను. ౨౧॥

ఏయస్త్రంబున నన్నింటిని దెలిసికొనుట దేవతలకు నశక్యమో ఆ యస్త్రంబుల నన్నింటిని అప్పుడు విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. ౨౨॥

బుద్ధిమంతుఁడగు నావిశ్వామిత్రమహాముని యయ్యస్త్రముల రామునకు వశ్యములుగాఁ జేయుటకు గొంతజపము సేయఁగానే శ్రేష్ఠములైన యస్త్రములన్నియుం రాముని సేవించినవి. ౨౩॥

ఆయస్త్రదేవతలందఱును సంతసించి చేతులుమొగిడ్చి "రాముఁడా! సర్వాతిశాయులమగు మేము నీకుఁబరిచారకులమైతి"మని రామునితోఁ జెప్పిరి.

రాముఁడు ఆయస్త్రదేవతలు సేయు సేవం బ్రతిగ్రహించి వారల హస్తంబున సంస్పృశించి "నామనస్సు ననుసరించుచు నుండుఁడు" అని వారల నాజ్ఞాపించెను. ౨౪॥

అంత మహాతేజుండగు రాముఁడు సంతసించి విశ్వామిత్రమహామునికి నమస్కరించి పయనమగుటకు యత్నించెను. ౨౫॥

ఇది ఇరువదిఏడవ సర్గము.

---

## ఇరువదియెనిమిదవ సర్గము

అంత రాముఁడు అస్త్రంబులఁ బ్రతిగ్రహించి సంతోషంబునొంది పరిశుద్ధుఁడై పయనముగాఁబోవుచు విశ్వామిత్రునితో నిట్లని చెప్పెను. ౧

భగవంతుఁడవు మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా! నేను అస్త్రంబులఁ దెలిసికొనినందున దేవతలకు బాధింపఁగూడనివాఁడనైతిని; తాము అస్త్రముల ప్రయోగమునుమాత్రము నా కుపదేశించితిరి; ఇప్పుడు ఉపసంహారము నుపదేశింపఁగోరెదను. అని రాముఁడు చెప్పెను. ౨

రాముఁ డిట్లడుగఁగానే సంతోషంబునొంది గొప్పవ్రతముల

సంహారం వ్యాజహారాథ ధృతిమాన్ సువ్రత శ్శుచిః. 3

సత్యవంతం సత్యకీర్తిం ధృష్టం రభసమేవచ,
ప్రతిహారతరం నామ పరాఙ్ముఖ మవాఙ్ముఖమ్. ౪
లక్షాక్షవిషమౌ చైవ దృఢనాభసునాభకౌ,
దశాక్ష శతవక్త్రౌ చ దశశీర్ష శతోదరౌ. ౫
పద్మనాభ మహానాభౌ దుందునాభ సునాభకౌ,
జ్యోతిషం కృశనం చైవ నైరాశ్య విమలౌ వుభౌ. ౬
యోగంధర హరిద్రౌచ దైత్యప్రశమనౌ తథా,
సార్చిర్మాలీ ధృతి ర్మాలీ వృత్తిమాన్ రుచిర స్తథా. ౭
పితృసౌమనసం చైవ విధూత మకరావుభౌ,
కరవీరకరం చైవ ధనధాన్యౌచ రాఘవ. ౮
కామరూపం కామరుచిం మోహమావరణం తథా,
జృంభకం సర్వనాభంచ సంతాన వరణౌతథా. ౯
భృశాశ్వతనయాన్ రామ భాస్వరాన్కామరూపిణః,
ప్రతీచ్ఛ మమ భద్రంతే పాత్రభూతోఽసిరాఘవ. ౧౦
బాఢమిత్యేవ కాకుత్ స్థః ప్రహృష్టేనాంతరాత్మనా. ౧౦½

దివ్యభాస్వరదేహాశ్చమూర్తిమంత స్సుఖప్రదాః. ౧౧
కేచిదంగారసదృశాః కేచి ద్ధూమోపమా స్తథా,
చంద్రార్కసదృశాః కేచిత్ప్రహ్వాంజలిపుటా స్తథా. ౧౨
రామం ప్రాంజలయో భూత్వాఽబ్రువన్ మధురభాషిణః,
ఇమే స్మ నరశార్దూల శాధి కిం కరవామ తే. ౧౩

నాచరించి పరిశుద్ధుండై యున్న విశ్వామిత్రమహాముని యుపసంహారమంత్రంబుల రామునకుఁ జెప్పెను. 3

రాముఁడా! సత్యవంతమునుఁ సత్యకీర్తిని ధృష్టమును రభసమును ప్రతిహారతరంబును పరాఙ్ముఖంబును అవాఙ్ముఖంబును లక్షాక్షమును విషయమును దృఢనాభమును సునాభమును దశాక్షమును శతవక్త్రమును దశశీర్షమును శతోదరమును పద్మనాభమును మహానాభమును దుందునాభమును సునాభకమును జ్యోతిషమును కృశనమును నైరాశ్యమును విమలమును యౌగంధరమును హారిద్రమును దైత్యమును ప్రశమనమును సార్చిర్మాలిని ధృతిని మాలిని వృత్తిమంతమును రుచిరమును పిత్ర్యసౌమనసమును విధూతమును మకరమును కరవీరకరమును ధనమును ధాన్యమును కామరూపమును కామరుచిని మోహమును ఆవరణమును జృంభకమును సర్వనాభమును సంతానమును వరణమును కామరూపులై ప్రకాశించునట్టి భృశాశ్వునికొడుకులైన యీయుపసంహారములను నిచ్చెదను ప్రతిగ్రహింపుము; నీకు మంగళమగుఁగాక! నీవు నాకుఁ బాత్రభూతుఁడవైతివి. అని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. ౪-౧౦

రాముఁడు సంతసించి "మంచిది" అనిచెప్పి యామంత్రంబులు ప్రతిగ్రహించెను. ౧౦౫

దివ్యంబులును దేదీప్యమానంబులును నగు దేహములుగల్గి మూర్తిమంతులై సుఖప్రదాతలై యుండు నామంత్రాధిష్ఠానదేవతలందఱును గొందఱు నిప్పువంటివారును గొందఱు పొగలై యుండువారును గొందఱు చంద్రసూర్యులను బోలువారును గొందఱు నమ్రములైన చేమోడ్పులుగలవారునుంగా వచ్చి చేతులు మొగిడ్చి "పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా! ఇదిగో యున్నాము; ఆజ్ఞాపింపుము; నీకేమి చేయవలయును" అని రామునితో మధురంబుగాఁ జెప్పిరి. ౧౧-౧౩

మానసాః కార్యకాలేషు సాహాయ్యం మే కరిష్యథ,
గమ్యతా మితి తా నాహ యథేష్టం రఘునందనః. ౧౪

అథ తే రామమామంత్ర్య కృత్వా చాపి ప్రదక్షిణమ్,
ఏవ మస్త్వితి కాకుత్స్థ ముక్త్వా జగ్ము ర్యథాగతమ్. ౧౫
సచ తాన్ రాఘవో జ్ఞాత్వా విశ్వామిత్రం మహామునిమ్,
గచ్ఛన్నే వాథ మధురం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౧౬
కిన్న్వేతన్మేఘసంకాశం పర్వతస్యావిదూరతః,
వృక్షషండమితో భాతి పరం కౌతూహలం హి మే. ౧౭
దర్శనీయం మృగాకీర్ణం మనోరమమతీవచ,
నానాప్రకారై శ్శకునై ర్వల్గునాదై రలంకృతమ్. ౧౮
నిస్సృతాస్స్మ మునిశ్రేష్ఠ కాంతారా ద్రోమహర్షణాత్. ౧౮౼

అనయా త్వవగచ్ఛామి దేశస్య సుఖవత్తయా,
సర్వం మే శంస భగవన్ కస్యాశ్రమపదం త్విదమ్. ౧౯౼

సంప్రాప్తా యత్ర తే పాపా బ్రహ్మఘ్నా దుష్టచారిణః. ౨౦
తవ యజ్ఞస్య విఘ్నాయ దురాత్మానో మహామునే,
భగవన్ తస్య కో దేశ స్స్యా యత్ర తవ యాజ్ఞికీ. ౨౧
రక్షితవ్యా క్రియాబ్రహ్మ న్మయా వధ్యాశ్చ రాక్షసాః. ౨౧౼

ఏతత్సర్వం మునిశ్రేష్ఠ శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో. ౨౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, అష్టావింశస్సర్గః.

"మీరలు కార్యముగల్గినపుడు నేను దలంచినప్పుడు వచ్చి నాకు సాహాయ్యము సేయుండు; ఇప్పుడు యథేష్టముగాఁ బొండు." అని రాముఁడు, ఆమంత్రాధిష్ఠానదేవతలతోఁ జెప్పెను. ౧౪

అంత నామంత్రాధిష్ఠానదేవతలు రాముని వీడుకొని ప్రదక్షిణించి "ఈప్రకారమే యగుఁగాక" యనిచెప్పి వచ్చినట్లు వెళ్లిరి. ౧౫

ఆరాముఁడును ఉపసంహారమంత్రంబుల నెఱింగి దారినడుచుచు మనోహరంబును స్పష్టంబునగు నొకమాట చెప్పెను. ౧౬

ఇచ్చట పర్వతమునకుఁ గొంచెము దూరములో మేఘమువలె దట్టమై దర్శనీయంబై మృగములుగల్గి మనోహరంబై మనోహరముగా ధ్వనించు నానా విధంబులగు పక్షులచే నలంకృతంబై యొక్క నొక్క వనము ప్రకాశించుచున్నది; ఈవనమేది? నాకుఁ జాలఁ గోర్కెయున్నది గావునఁ జెప్పవలయును. ౧౭

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! భయంకరమగుటచే గగుర్పాటు గల్గించునట్టి యాతాటకావనమును దాటితిమిగదా! ౧౮½

ఈప్రదేశమందు భయములేక సుఖముగా నుండుటచే నిది ఋష్యాశ్రమమనిమాత్రము తెలిసికొంటిని; ఈయాశ్రమ మెవ్వనిది? దీని నామూలాగ్రముగా నాకుఁ జెప్పుము. ౧౯½

మునిశ్రేష్ఠుండవు భగవంతుండవు నగువిశ్వామిత్రుఁడా! ఏయాశ్రమమందు నీవు సేయుయాగమునకు విఘ్నముగావించుటకై దురాత్ములును బాపస్వభావులును బ్రహ్మఘాతుకులును దుష్టాచారముగలవారునగు రాక్షసులు వత్తురో ఎచ్చట నీనారాక్షసులం జంపి నీయాగకార్యమును రక్షింపవలయునో ఆయాశ్రమ మెచ్చటనున్నది! ౨౦-౨౧½

మునిశ్రేష్ఠుండవు ప్రభువునగు విశ్వామిత్రుఁడా! దీనినంతయుం వినఁ గోరెదను. అని రాముఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౨౨

ఇది ఇరువదియొనిమిదవ సర్గము.

---

# ఏకోనత్రింశస్సర్గః

అథ తస్యాప్రమేయస్య తద్వనం పరిపృచ్ఛతః,
విశ్వామిత్రో మహాతేజా వ్యాఖ్యాతు ముపచక్రమే. ౧

ఇహ రామ మహాబాహో విష్ణు ర్దేవవరః ప్రభుః,
వర్షాణి సుబహూనీహ తథా యుగశతాని చ. ౨
తపశ్చరణయోగార్థ మువాస సుమహాతపాః. ౨½
ఏష పూర్వాశ్రమో రామ వామనస్య మహాత్మనః,
సిద్ధాశ్రమ ఇతి ఖ్యాత స్సిద్ధో హ్యత్ర మహాతపాః. ౩½

ఏతస్మిన్నేవ కాలే తు రాజా వైరోచని ర్బలిః. ౪
నిర్జిత్య దైవతగణా న్సేంద్రాంశ్చ సమరుద్గణాన్,
కారయామాస తద్రాజ్యం త్రిషు లోకేషు విశ్రుతః. ౫

బలేస్తు యజమానస్య దేవా స్సాగ్నిపురోగమాః,
సమాగమ్య స్వయంచైవ విష్ణు మూచు రిహాశ్రమే. ౬

బలి ర్వైరోచని ర్విష్ణో యజతే యజ్ఞముత్తమమ్,
అసమాప్తే క్రతౌ తస్మిన్ స్వకార్య మభిపద్యతామ్. ౭

యే చైన మభివర్తంతే యాచితార ఇతస్తతః,
యచ్చ యత్ర యథావచ్చ సర్వం తేభ్యః ప్రయచ్ఛతి. ౮

# ఇరువదితొమ్మిదవ సర్గము



అంత రాముఁడు నారాయణావతారరూపుఁడైనను మనుష్యత్వంబు నంజేసి తన మునుపటివృత్తాంతమును దెలియనట్లు అడుగఁగానే మహాతేజోం దగు విశ్వామిత్రుఁడు ఆయాశ్రమమును వివరించిచెప్ప నారంభించెను. ౧

మహాబాహుండ వగురాముఁడా! ఈవనమం దిచ్చట దేవశ్రేష్ఠుండును సమస్తలోకనాయకుండును మిక్కిలియుఁ దపస్వియుఁనగు విష్ణుదేవుఁడు పెక్కునూఱులయుగంబులు 'తపస్సు-యోగము' ఇవి సిద్ధించుటకై వాసముచేసెను. ౨½

రాముఁడా! నారాయణావతారరూపుండగు వామనుఁడు పూర్వము అవతరించుటకు మునుపు నారాయణుఁడుగా నున్నపుడును అవతరించిన పిమ్మటను కూడ వాసముచేసిన యాశ్రమ మిది. ఇచ్చట కాశ్యపుఁడు సిద్ధిని బొందినాఁడు. కావున నిది సిద్ధాశ్రమమని పేర్కొనంబడినది. ౩½

ఇట్లు విష్ణుదేవుఁ డిచ్చట తపస్సుసేయుచుండునపుడే ప్రహ్లాదపుత్రుం దగు విరోచనుని కొడుకైన బలిచక్రవర్తి నాయకగణములతోఁగూడిన దేవతలనందఱ నింద్రసహితులుగా జయించి ముల్లోకంబులందును ప్రసిద్ధి నొంది యాదేవతారాజ్యమగు స్వర్గమును పాలింపుచుండెను. ౪,౫

బలిచక్రవర్తి యాగముసేయుచుండఁగా దేవతలందఱును అగ్నిదేవుని ముందిడికొని తామె వచ్చి యీయాశ్రమమందుఁ దపస్సుసేయుచున్న విష్ణుదేవునితో నిట్లఁ జెప్పిరి. ౬

విష్ణుదేవుఁడా! విరోచనపుత్రుండగు బలిచక్రవర్తి యుత్తమంబైన యాగము సేయుచున్నాఁడు; ఆయాగము సమాప్తిఁబొందుటకు మునుపే మనకార్యమును సంపాదింపవలయును. ౭

ఇటు నటు పోవునారలెవ్వరు ఎప్పుడు నేదిని ఎంతమట్టుకు ఈబలిచక్రవర్తిని యాచించుచున్నారో వారలకు అప్పుడే దానినంతను ఇచ్చుచున్నాఁడు. ౮

స త్వం సురహితార్థాయ మాయాయోగ ముపాగతః,
వామనత్వం గతో విష్ణో కురు కల్యాణ ముత్తమమ్. ౯

ఏతస్మి న్నంతరే రామ కాశ్యపోఽగ్నిసమప్రభః,
అదిత్యా సహితో రామ దీప్యమాన ఇవౌజసా. ౧౦
దేవీసహాయో భగవా న్దివ్యం వర్షసహస్రకమ్,
వ్రతం సమాప్య వరదం తుష్టావ మధుసూదనమ్. ౧౧
తపోమయం తపోరాశిం తపోమూర్తిం తపాత్మకమ్,
తపసా త్వాం సుతప్తేన పశ్యామి పురుషోత్తమమ్. ౧౨

శరీరే తవ పశ్యామి జగత్సర్వ మిదం ప్రభో,
త్వ మనాది రనిర్దేశ్య స్త్వా మహం శరణం గతః. ౧౩

త మువాచ హరిః ప్రీతః కాశ్యపం ధూతకల్మషమ్,
వరం వరయ భద్రం తే వరార్హోఽసి మతో మమ. ౧౪

తచ్ఛ్రుత్వా వచనం తస్య మారీచః కాశ్యపోఽబ్రవీత్. ౧౫

అదిత్యా దేవతానాంచ మమచై వానుయాచతః,
వరం వరద సుప్రీతో దాతు మర్హసి సువ్రత. ౧౬

పుత్రత్వం గచ్ఛ భగవన్నదిత్యా మమ చానఘ, ౧౭
భ్రాతా భవ యవీయాం స్త్వం శక్రస్యాసురసూదన,
శోకార్తానాం తు దేవానాం సాహాయ్యం కర్తు మర్హసి. ౧౮
అయం సిద్ధాశ్రమో నామ ప్రసాదా త్తే భవిష్యతి,

విష్ణుదేవుఁడా! ముక్కంటకష్టంబులను మమ్ముఁదేర్చునట్టి మహాప్రభావుఁడవగు నీవు దేవతలకు మేలుగల్గుటకై మాయవహించి వామనుండవయి ఉత్తమంబగు మంగళం బొనగూర్పుము. అని దేవతలు చెప్పిరి. ౯

రాముఁడా! యీమధ్యమందు నిప్పువంటికాంతిగల భగవంతుం డగు కాశ్యపుండు అదితితోఁగూడి కాంతిచేఁ బ్రకాశింపుచు సహస్రదివ్యవర్షంబులు వ్రతంబులసల్పి తనకు వరంబొసంగుటకై పొడచూపిన విష్ణుదేవుని భార్యయునుం దాను నిట్లని స్తుతించెను. ౧౦,౧౧

నీవు తపోమయుండవు తపోరాశివి జ్ఞానస్వరూపుండవు నీకుఁ దపస్సే స్వభావంబు నీవు పురుషోత్తముండవు, అట్టి నిన్ను చక్కగా ననుష్ఠింపఁబడిన తపస్సుచేఁ జూచుచున్నాను. ౧౨

సమస్తలోకనాయకుండవయిన విష్ణుదేవుఁడా! నీశరీరమం దీజగత్తంతయుఁ గన్పడుచున్నది. నీవు పుట్టుకలేనివాఁడవు నిన్ను నిర్దేశింప నేరికినలవిగాదు; అట్టి నిన్ను నేను శరణుచొచ్చితిని అని కాశ్యపుఁడు స్తుతించెను. ౧౩

విష్ణుదేవుండును సంప్రీతుండై "వరము గోరుము, నీకు మంగళమగుఁగాక నేను వరమిచ్చుటకు సిద్ధమగువాఁడను" అని నిష్కల్మషుండగు కాశ్యపునితోఁ జెప్పెను. ౧౪

విష్ణుదేవునిమాట విని మరీచిమహామునికొడుకైన కాశ్యపుం డావిష్ణువుతో నిట్లని చెప్పెను. ౧౪½

సువ్రతుండవు వరప్రదుండవు నగువిష్ణుదేవుఁడా! నీవు సుప్రీతుండవయి నిన్ను యాచించుచున్న నాకును నాభార్యయయిన యదితికిని దేవతకును గూడ వరము నివ్వవలయును. ౧౫½

భగవంతుఁడా! నీవు అదితికిని నాకును గొడుకుగాఁ బుట్టుము; రాక్షసులం జంపునట్టి విష్ణుదేవుఁడా! నీవింద్రునకుఁ దమ్ముండవగుము; నీవు దుఃఖపీడితులగు దేవతలకు మాత్రము తప్పక సాహాయ్యము సేయవలయును. ౧౬,౧౭

దేవవిభుండవగు విష్ణుదేవుఁడా! నీయనుగ్రహంబున నావ్రతకార్యము

సిద్ధే కర్మణి దేవేశ ఉత్తిష్ఠ భగవన్నితః. ౧౮

అథ విష్ణు ర్మహాతేజా అదిత్యాం సమజాయత,
వామనం రూప మాస్థాయ వైరోచని ముపాగమత్. ౧౯
త్రీ న్క్రమా నథ భిక్షిత్వా ప్రతిగృహ్యాచ మానదః,
ఆక్రమ్య లోకా న్లోకాత్మా సర్వభూతహితే రతః. ౨౦
మహేన్ద్రాయ పునః ప్రాదా న్నియమ్య బలి మోజసా,
త్రైలోక్యం స మహాతేజా శ్చక్రే శక్రవశం పునః. ౨౧

తేనైష పూర్వ మాక్రాన్త ఆశ్రమ శ్శ్రమనాశనః,
మయాపి భక్త్యా తస్యైష వామనస్యోపభుజ్యతే. ౨౨

ఏత మాశ్రమ మాయాన్తి రాక్షసా విఘ్నకారిణః,
అత్రైవ పురుషవ్యాఘ్ర హన్తవ్యా దుష్టచారిణః. ౨౩
అద్య గచ్ఛామహే రామ సిద్ధాశ్రమ మనుత్తమమ్,
తదాశ్రమపదం తాత తవాప్యేత ద్యథా మమ. ౨౪

ప్రవిశన్నాశ్రమపదం వ్యరోచత మహామునిః,
శశీవ గతనీహారః పునర్వసుసమన్వితః. ౨౫

సఫలమై యీయాశ్రమము సిద్ధాశ్రమం బన పొగడొందఁగలదు;నీవు అవతరించుటకై యిచ్చటనుండి లెమ్ము. అని కాశ్యపుఁడు విష్ణుదేవునితోఁ జెప్పెను. ౧౮

అంత మహాప్రభావుఁడగు విష్ణుదేవుం డదితియందుఁ బుట్టి వామనరూపంబునొంది బలిచక్రవర్తియొద్దకుఁ బోయెను. ౧౯

అంత విష్ణుదేవుండు, తానందఱకు మానము నిచ్చువాఁడైనను, నిరభిమానుండై బలిచక్రవర్తినిమూఁడడుగుల నేలను యాచించి పుచ్చుకొని సమస్తలోకంబులకు సాక్షిభూతుండు గావున సర్వభూతములకును హితంబు గల్గుటకై సమస్తలోకంబుల నాక్రమించి రెండడుగులకే ముల్లోకంబులును సరిపోయినందున మూఁడవయడుగుకు బలిచక్రవర్తిని బంధించి త్రైలోక్యంబునంతయు మఱల దేవేంద్రున కొసంగెను; ఇట్లు మహాతేజుఁడగు నావిష్ణుదేవుండు మఱల త్రైలోక్యంబు నింద్రాధీనముగాఁ జేసెను. ౨౦,౨౧

ఆవామనుఁడు పూర్వము సంసారాశ్రమమునుబోఁగొట్టునట్టి యీయాశ్రమమందుండెను; నేను భక్తితో వామనునిదగు నీయాశ్రమమందు నివసించుచున్నాను. ౨౨

పురుషశ్రేష్ఠుఁడవగురామఁడా! విఘ్నము సేయు రాక్షసు లీయాశ్రమమునకే వచ్చెదరు; నీయాశ్రమమందే నీవాదుష్టులను జంపవలయును. ౨౩

రామఁడా! ఇప్పుడు శ్రేష్ఠమైనసిద్ధాశ్రమమును ప్రవేశించితిమి. తండ్రీ! అట్టి యీయాశ్రమము నాకెట్లు సొంతమో అలాగే నీకునుసొంతమే. ''నేనిప్పు డీయాశ్రమమందు తపము సేయుచుండుటం బట్టి యిది నాకు సొంతమైనది; నీవును రాముఁడుగా నవతరించుటకు మునుపు వామనావతారమందును అంతకు మునుపును, ఈయాశ్రమమందుఁ దపము సేయుచుండినందున నీకును సొంతమే (అని రహస్యము.) అని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౨౪

రామలక్ష్మణులం గూడి సంతోషంబున నాశ్రమంబుఁ బ్రవేశించుచున్న విశ్వామిత్రమహాముని మంచువిడిచి పునర్వసు నక్షత్రములంగూడియున్న చంద్రుఁడుంబోలెఁ బ్రకాశించెను. ౨౫

తం దృష్ట్వా మునయ స్సర్వే సిద్ధాశ్రమనివాసినః,
ఉత్పత్యోత్పత్య సహసా విశ్వామిత్ర మపూజయన్. ౨౬
యథార్హం చక్రిరే పూజాం విశ్వామిత్రాయ ధీమతే,
తథైవ రాజపుత్రాభ్యా మకుర్వ న్నతిథిక్రియామ్. ౨౭
ముహూర్త మథ విశ్రాన్తౌ రాజపుత్రౌ వరిందమౌ;
ప్రాంజలీ మునిశార్దూల మూచతూ రఘునందనౌ. ౨౮

అద్యైవ దీక్షాం ప్రవిశ భద్రం తే మునిపుంగవ,
సిద్ధాశ్రమోఽయం సిద్ధస్స్యా త్సత్య మస్తు వచ స్తవ. ౨౯

ఏవ ముక్తో మహాతేజా విశ్వామిత్రో మహా న్ఋషిః,
ప్రవివేశ తదా దీక్షాం నియతో నియతేంద్రియః. 3౦

*కుమారా వపి తాం రాత్రి ముషిత్వా సుసమాహితౌ,
ప్రభాతకాలే చోత్థాయ పూర్వాం సంధ్యాముపాస్య చ. 3౧
స్పృష్టోదకౌ శుచీ జప్యం సమాప్య నియమేనచ,
హుతాగ్నిహోత్ర మాసీనం విశ్వామిత్ర మవందతామ్. 3౨
ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకోనత్రింశస్సర్గః.

త్రింశస్సర్గః

అథతౌ దేశకాలజ్ఞౌ రాజపుత్రౌ వరిందమౌ,
దేశే కాలే చ వాక్యజ్ఞా వబ్రూతాం కౌశికం వచః. ౧

*'కుమారా వివ' అని మహేశ్వరతీర్థ పాఠము.

సిద్ధాశ్రమమందుండు మునులందఱును ఆవిశ్వామిత్రునింజూచి భక్త్యతిశయమునంజేసి వేగమునం బరుగెత్తివచ్చి యతనిం బూజించిరి. ౨౬

ఆమునులు ధీమంతుండగు విశ్వామిత్రునకు యథాయోగ్యముగాఁ బూజ గావించి యీలాగే రాజపుత్రులగు రామలక్ష్మణులకు నాతిథ్యముచేసిరి. ౨౭

అంత శత్రువుల నడంగఁద్రొక్కునట్టి రాచకొమరులగు రామలక్ష్మణులు కొంచెము అలసటఁదీర్చికొని చేతులుమోడ్చి మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రునితో నిట్లని చెప్పిరి. ౨౮

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! ఇప్పుడే దీక్షవహింపుము; నీకు మంగళమగుఁగాక: నీయాగము సిద్ధించుటంజేసి ఈసిద్ధాశ్రమము సార్థకమగు పేరుగలదియై సిద్ధినొందుఁగాక; నీమాట సత్యమగుఁగాక. అని రామలక్ష్మణులు చెప్పిరి. ౨౯

ఇట్లు రామలక్ష్మణులు చెప్పఁగానే అప్పుడు మహాప్రభావుండును ఇంద్రియనిగ్రహముగలవాఁడును నగు విశ్వామిత్రమహర్షి నియతుండై దీక్ష వహించెను. ౩౦

రామలక్ష్మణులును ఆరాత్రియంతయుఁ బరుండి సమాహితులై ప్రాతఃకాలంబున మేల్కొని స్నానముచేసి ప్రాతస్సంధ్యావందనము గావించి నియమంబున గాయత్రిని జపియించి కృతాగ్నికార్యుఁడై కూర్చుండియున్న విశ్వామిత్రుని నమస్కరించిరి. ౩౧, ౩౨

ఇది ఇరువదితొమ్మిదవసర్గము.

---

## ముప్పదియవ సర్గము

అంత దేశకాలంబు లెఱింగి మాటలాడం దెలిసినవారును శత్రువుల నడంగఁద్రొక్కఁ జాలినవారు నగు నారామలక్ష్మణులు ఉచితమగు దేశంబున సరియైన సమయముచూచి విశ్వామిత్రునితో నిట్లని చెప్పిరి. ౧

భగవ౯ శ్రోతు మిచ్ఛావో యస్మి౯ కాలే నిశాచరౌ,
సంరక్షణీయౌ తౌ బ్రహ్మన్నాతివర్తేత తత్క్షణమ్. ౨

ఏవం బ్రువాణౌ కాకుత్స్థౌ త్వరమాణౌ యుయుత్సయా,
సర్వే తే మునయః ప్రీతాః ప్రశశంసుర్నృపాత్మజౌ. ౩
అద్య ప్రభృతి షడ్రాత్రం రక్షతం రాఘవౌ యువామ్,
దీక్షాం గతో హ్యేష మునిః మౌనిత్వం చ గమిష్యతి. ౪

తౌ తు తద్వచనం శ్రుత్వా రాజపుత్రౌ యశస్వినౌ,
అనిద్రౌ షడహోరాత్రం తపోవన మరక్షతామ్. ౫
ఉపాసాం చక్రతు ర్వీరౌ యత్తౌ పరమధన్వినౌ,
రరక్షతు ర్మునివరం విశ్వామిత్ర మరిందమౌ. ౬

అథ కాలే గతే తస్మి౯ షష్ఠేఽహని సమాగతే,
సౌమిత్రి మబ్రవీద్రామో యత్తో భవ సమాహితః. ౭
రామస్యైవం బ్రువాణస్య త్వరితస్య యుయుత్సయా,
ప్రజజ్వాల తతో వేదిస్సోపాధ్యాయపురోహితా. ౮

సదర్భచమసస్రుక్కా ససమిత్కుసుమోచ్చయా,
విశ్వామిత్రేణ సహితా వేది ర్జజ్వాల సర్త్విజా. ౯

మంత్రవచ్చ యథాన్యాయం యజ్ఞోఽసౌ సంప్రవర్తతే,
ఆకాశే చ మహా౯ శబ్దః ప్రాదురాసీ ద్భయానకః. ౧౦
ఆవార్య గగనం మేఘో యథా ప్రావృషి నిర్గతః,

భగవంతుఁడవైన విశ్వామిత్రుఁడా! ఎప్పు డారాక్షసులం జంపవచ్చునో ఆనతియాఁబు వినఁగోరెదము; అది మాకుఁ దెలియక దాఁటిపోవుటకు మును పే చెప్పుము. అని రామలక్ష్మణులు చెప్పిరి. ౨

ఈప్రకారముచెప్పి యుద్ధమునకు నిచ్చచేత వేగిరపడుచున్నట్టి రామలక్ష్మణులం జూచి మునులు అందఱును సంతసించి యిట్లని చెప్పిరి. ౩

రామలక్ష్మణులారా! మీరలివ్వాడు మొదలుకొని ఆఱురాత్రులు రక్షింపవలయును; ఈవిశ్వామిత్రమహాముని దీక్షవహించి మౌనము నొందియున్నాఁడు కావున నితఁడు మాటలాడఁడు; అని మునులు చెప్పిరి. ౪

ఆమునులు చెప్పిన మాటను విని కీర్తిసంపన్నులగు రామలక్ష్మణులు అహోరాత్రములు నిద్రలేక తపోవనమును రక్షింపుచుండిరి. ౫

పరాక్రమశాలులగు రామలక్ష్మణులు దృఢంబగు విల్లు ధరియించి సన్నద్ధులై యుండిరి. ఇట్లు శత్రువులనడంగఁ ద్రొక్కఁజాలిన రామలక్ష్మణులు మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుని రక్షించిరి. ౬

అంతఁ గొన్ని దినములును గడచిపోఁగా ఆఱవదినము రాఁగానే రాముఁడు లక్ష్మణుం జూచి "నీవప్పటికి సిద్ధ సన్నద్ధుఁడవై యుండుము" అని చెప్పెను. ౭

యుద్ధమునకుఁ గుతుకముంగొని త్వరచేత రాముం డిట్లు చెప్పుచుండఁగానే ఋత్విజులతోను పురోహితులతోను గూడియున్న యాగవేదిక జ్వలించినది. ౮

దర్భలును దానపాత్రములును హోమపాత్రములును సమిధలును అలంకారార్థంబుగానుంచిన పుష్పములును గల్గి ఋత్విజులతోను విశ్వామిత్రునితోనుంగూడి యున్నయాగవేది జ్వలించినది. ౯

యాగంబంతయును మంత్రవత్తుగ యథాశాస్త్రముగా జరుగుచుండఁగా మింట భయంకరంబైనట్టి మహాధ్వని యొక్కటి గల్గినది. ౧౦

ఎట్లు వర్షాకాలమందు మేఘము ఆకాశంబు నావరించి వచ్చునో, అట్లు

తథా మాయాం వికుర్వాణౌ రాక్షసావభ్యధావతామ్. ౧౧
మారీచశ్చ సుబాహుశ్చ తయో రనుచరాశ్చయే,
ఆగమ్య భీమసంకాశౌ రుధిరౌఘ మవాసృజన్. ౧౨
సా తేన రుధిరౌఘేణ వేది ర్జజ్వాల మండితా,
సహసాఽభిద్రుతో రామస్తానపశ్య త్తతో దివి. ౧౩
తా వాపతంతౌ సహసా దృష్ట్వా రాజీవలోచనః,
లక్ష్మణం త్వభిసంప్రేక్ష్య రామో వచన మబ్రవీత్. ౧౪
పశ్య లక్ష్మణ దుర్వృత్తాన్ రాక్షసాన్ పిశితాశనాన్,
మానవాస్త్రసమాధూతా ననిలేన యథా ఘనాన్. ౧౫

మానవం పరమోదార మస్త్రం పరమభాస్వరమ్,
చిక్షేప పరమక్రుద్ధో మారీచోరసి రాఘవః. ౧౬
సతేన పరమాస్త్రేణ మానవేన సమాహితః,
సంపూర్ణం యోజనశతం క్షిప్తస్సాగరసంప్లవే. ౧౭

విచేతనం విఘూర్ణంతం శీతేషుబలతాడితమ్,
నిరస్తం దృశ్య మారీచం రామో లక్ష్మణమబ్రవీత్. ౧౮
పశ్య లక్ష్మణ శీతేషుం మానవం ధర్మసంహితమ్,
మోహయిత్వా నయత్యేనం నచ ప్రాణైర్వ్యయుజ్యత. ౧౯

ఇమా నపి వధిష్యామి నిర్ఘృణాన్ దుష్టచారిణః,
రాక్షసాన్ పాపకర్మస్థాన్ యజ్ఞఘ్నాన్ రుధిరాశనాన్. ౨౦

సంగృహ్యాస్త్రం తతో రామో దివ్యమాగ్నేయ మద్భుతమ్,

మారీచసుబాహువులు ఆకాశమంతయుఁ గ్రమ్మినమాయఁ జేయుచుఁ బరుగెత్తి వచ్చిరి. మారీచుండును సుబాహుండును వారి యనుచరులగు రాక్షసులును భయంకరులై వచ్చి నెత్తురు వెల్లువగా వర్షించిరి. ౧౨

ఆయాగవేది నెత్తుటివెల్లువం దోఁగి యుండుచుండినది; అంత రాముండు వేగంబున నభిముఖుండుగాఁ బరువెత్తి యాకాశమందు రాక్షసులం జూచెను. వేగంబున వచ్చుచున్న యామారీచసుబాహువులం గని కమలములవంటి కండ్లుగల రాముండు లక్ష్మణునిమాత్రము చూచి యిట్లని చెప్పెను. ౧౪

లక్ష్మణుఁడా! దురాచారులును మాంసాహారులు నగు నీరాక్షసులను వాయువుచే మేఘములువోలె మానవాస్త్రముచే పాఱఁద్రోలఁబడిన వారినిగాఁ జేసెదను; చూడుము. ౧౫

రాముండు మిక్కిలియుం గోపించి శ్రేష్ఠంబును బరమభాస్వరంబు నగు మానవాస్త్రంబును మారీచుని ఱొమ్ముంట వేసెను. ౧౬

ఆమారీచుం డెచ్చరిక గల్గియున్నను శ్రేష్ఠంబగు నమ్మానవాస్త్రము సముద్రతీరమున నవ్వల నీటిలో నూఱుయోజనంబులదూరంబున నతనిం బడఁద్రోసెను. ౧౭

మానవాస్త్రబలంబునం గొట్టఁబడి సముద్రజలంబుల బడి తెలివితప్పి తిరుగుడువడుచున్న మారీచునిం జూచి రాముఁడు లక్ష్మణునితో నిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! ధర్మసహితమగు నీమానవాస్త్రంబు చూడుము; ఈ మారీచుని తెలివితప్పించికొని పోవుచున్నది; మారీచునకుఁ బ్రాణహానిమాత్రము కల్గలేదు. ౧౯

ఎంతమాత్రము దయలేక దురాచారులై పాపకర్మంబులు సేయుచు యాగంబులఁ జెఱుపుచు రక్తాదులె యాహారముగాఁ గల్గియున్న యీరాక్షసులనుం జంపెదను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦

అంత రాముండు దివ్యంబగు నాగ్నేయాస్త్రంబెత్తి సుబాహుని

సుబాహూరసి చిక్షేప సవిద్ధః ప్రాపత ద్భువి. ౨౧

శేషాన్ వాయవ్యమాదాయ నిజఘాన మహాయశాః,
రాఘవః పరమోదారో మునీనాం ముద మావహన్. ౨౨

స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః,
ఋషిభిః పూజిత స్తత్ర యథేంద్రో విజయే పురా. ౨౩

అథ యజ్ఞే సమాప్తే తు విశ్వామిత్రో మహామునిః,
నిరీతికా దిశో దృష్ట్వా కాకుత్స్థ మిద మబ్రవీత్. ౨౪

కృతార్థోఽస్మి మహాబాహో కృతం గురువచ స్త్వయా,
సిద్ధాశ్రమ మిదం సత్యం కృతం రామ మహాయశః. ౨౫

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రింశస్సర్గః.

---

## ఏకత్రింశస్సర్గః

అథతాం రజనీం తత్ర కృతార్థౌ రామలక్ష్మణౌ,
ఊషతు ర్ముదితౌ వీరౌ ప్రహృష్టేనాంతరాత్మనా. ౧
ప్రభాతాయాం తు శర్వర్యాం కృతపౌర్వాహ్ణికక్రియౌ,
విశ్వామిత్ర మృషీం శ్చాన్యాన్ సహితా వభిజగ్మతుః. ౨
అభివాద్య మునిశ్రేష్ఠం జ్వలంత మివ పావకమ్,
ఊచతు ర్మధురోదారం వాక్యం మధురభాషిణౌ. ౩

ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ,
ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవావ కిమ్. ౪

ఱొమ్మునకు బాణము తాకునట్లు వేసెను; అందువలన సుబాహుండు నేలంబడి చచ్చెను.

మహాయశుండు పరమోదారుండు నగు రాముండు మునుల కందఱకు సంతోషంబు సేయుచు శేషించిన రాక్షసుల వాయవ్యాస్త్రంబునం గొట్టెను. ౨౨

ఇట్లు యాగంబులకు విఘ్నము గావించునట్టి రాక్షసులనందఱిం జంపిన రాముని ఋషులు పూర్వ మసురులు జయించినపుడు దేవేంద్రునిబోలెఁ బూజించిరి. ౨౩

అంత యాగము సమాప్తిఁ బొందఁగానే విశ్వామిత్ర మహాముని యెంత మాత్రము నుపద్రవము లేక శాంతంబులై యున్న దిక్కులం జూచి రామునితో నిట్లని చెప్పెను. ౨౪

మహాబాహుండవు గొప్పకీర్తిగలవాఁడవు నగు రాముఁడా! నీచేత నేను కృతార్థుఁడనైతిని; నీవు తండ్రి పనుపు గావించితివి; ఈసిద్ధాశ్రమము నీచేత సార్థకమగు పేరుగలదిగాఁ జేయఁబడినది. అని విశ్వామిత్రుఁడు చెప్పెను.

ఇది ముప్పదియవ సర్గము.

---

## ముప్పదియొకటవ సర్గము

అంతఁ బరాక్రమశాలులగు రామలక్ష్మణులు కృతార్థులై సంతోషంబున నారాత్రి యంతయు నా యాశ్రమంబున నుండిరి. ౧

తెల్లవాఱఁగానే రామలక్ష్మణు లిద్దఱును లేచి ప్రాతఃకాలకృత్యంబు లందీర్చుకొని విశ్వామిత్రుఁడు మొదలగు ఋషులయొద్దకు వెళ్లిరి. ౨

మనోహరముగా మాటలాడఁగలయట్టి రామలక్ష్మణులు అగ్నిహోత్రుని వలె వెలుఁగుచున్న విశ్వామిత్రుని నమస్కరించి మధురంబును గంభీరంబు నగు నొకమాట చెప్పిరి. ౩

మునిశ్రేష్ఠుఁడవైన విశ్వామిత్రుఁడా! ఇదిగో కింకరులము వచ్చి యున్నాము. మే మేమి చేయవలయు యథేష్టంబుగా నాజ్ఞాపింపుము. అని రామలక్ష్మణులు చెప్పిరి. ౪

ఏవముక్త్వా స్తతస్తాభ్యాం సర్వ ఏవ మహర్షయః,
విశ్వామిత్రం పురస్కృత్య రామం వచన మబ్రువన్. ౫

మైథిలస్య నరశ్రేష్ఠ జనకస్య భవిష్యతి,
యజ్ఞః పరమధర్మిష్ఠస్తస్య యాస్యామహే వయమ్. ౬

త్వం చైవ నరశార్దూల సహాస్మాభి ర్గమిష్యసి,
అద్భుతం ధనురత్నం చ తత్ర తద్ద్రష్టు మర్హసి. ౭

తద్ధి పూర్వం నరశ్రేష్ఠ దత్తం సదసి దైవతైః,
అప్రమేయబలం ఘోరం మఖే పరమభాస్వరమ్. ౮

నాస్య దేవా న గన్ధర్వా నాసురా న చ రాక్షసాః,
కర్తు మారోపణం శక్తా న కథంచన మానుషాః. ౯

ధనుష స్తస్య వీర్యం తు జిజ్ఞాసంతో మహీక్షితః,
న శేకు రారోపయితుం రాజపుత్రా మహాబలాః. ౧౦

తద్ధను ర్నరశార్దూల మైథిలస్య మహాత్మనః,
తత్ర ద్రక్ష్యసి కాకుత్స్థ యజ్ఞం చాద్భుతదర్శనమ్. ౧౧

తద్ధి యజ్ఞఫలం తేన మైథిలేనోత్తమం ధనుః,
యాచితం నరశార్దూల సునాభం సర్వదైవతైః. ౧౨

*ఆయాగభూతం నృపతే స్తస్య వేశ్మని రాఘవ,
అర్చితం వివిధై ర్గన్ధై ర్ధూపై శ్చాగరుగన్ధిభిః. ౧౩

---

* "అయాగభూతం" అని మహేశ్వరతీర్థ పాఠము.

ఆరామలక్ష్మణు లిట్లుచెప్పఁగానే మహర్షులందఱును, విశ్వామిత్రుని ముందిడుకొని రామునితో నిట్లని చెప్పిరి. ౬

పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా ! మిథిలాధిపతియగు జనకమహారాజు పరమధర్మిష్ఠంబగు నొకయాగము సేయ బోవుచున్నాఁడు; మే మాయాగమునకుఁ బోయెదము. ౭

రాముఁడా! నీవును మాతోఁ గూడవచ్చి యచ్చటి ప్రసిద్ధమై యాశ్చర్యకరమగు శివునివిల్లును సీతను జూడవలయును. ౮

రాముఁడా ! కొలతపెట్టరానిసారముగల్గి భయంకరంబై ప్రకాశించుచున్న యావిల్లు మున్ను యాగకాలమందు సదస్సున దేవతలచే నివ్వఁబడినది.

ఆవింటినారి నారోపించుటకు దేవతలుగాని గంధర్వులుగాని అసురులుగాని రాక్షసులుగాని శక్తులుగారు. ఇంక నెంత శ్రమపడినను మనుష్యులెట్లు శక్తు లగుదురు? ౯

రాజవంశమునందుఁ బుట్టినవారును మహాబలులు నగురాజులు ఆవింటి సారము తెలియఁగోరి తుదకు ఆరోపించుటకే సమర్థులు కారైరి. ౧౦

పురుషశ్రేష్ఠుండవైన రాముఁడా ! మహాత్ముండగు జనకమహారాజుదియైన యాధనుస్సును అతఁడు చేయు నద్భుతదర్శనం బగు యాగంబును జూడఁగలవు. ౧౧

మిథిలాధిపతియగు దేవరాతుఁడు తాను యాగముఁజేసినపుడు సమస్తదేవతల "యాగఫలముగా నా మంచిమధ్యప్రదేశముగల శ్రేష్ఠమైనధనుస్సు నిం"డని యాచింపఁగా నది యతనికి వచ్చినది. ౧౨

రాముఁడా ! ఆధనుస్సు జనకమహారాజగృహమందు నానావిధములగుగంధములచేతను అగరుధూపములచేతను బూజింపఁబడుచు ధనుస్సుల యుత్సవముసేయునపుడు ప్రధానముగాఁ బూజింపఁబడు ధనువుగా నున్నది. అని మునులు చెప్పిరి. ౧౩

ఏవ ముక్త్వా మునివరః ప్రస్థాన మకరో త్తదా,
సర్షి సంఘస్స కాకుత్స్థ ఆమన్త్ర్య వనదేవతాః. ౧౪
స్వస్తి వోఽస్తు గమిష్యామి సిద్ధస్సిద్ధాశ్రమాదహమ్,
ఉత్తరే జాహ్నవీతీరే హిమవంతం శిలోచ్చయమ్. ౧౫
ప్రదక్షిణం తతః కృత్వా సిద్ధాశ్రమ మనుత్తమమ్,
ఉత్తరాం దిశ ముద్దిశ్య ప్రస్థాతు ముపచక్రమే. ౧౬
తం ప్రయాంతం మునివర మన్వయాదనుసారిణామ్,
శకటీశతమాత్రంతు ప్రాయేణ బ్రహ్మవాదినామ్. ౧౭
మృగపక్షిగణాశ్చైవ సిద్ధాశ్రమనివాసినః,
అనుజగ్ముర్మహాత్మానం విశ్వామిత్రం మహామునిమ్. ౧౮
నివర్తయామాస తతః పక్షిసంఘాన్మృగానపి. ౧౮½

తే గత్వా దూర మధ్వానం లంబమానే దివాకరే,
వాసం చక్రుర్మునిగణాః శోణాకూలే సమాహితాః. ౧౯½
తేఽస్తంగతే దినకరే స్నాత్వా హుతహుతాశనాః,
విశ్వామిత్రం పురస్కృత్య నిషేదు రమితౌజసః. ౨౦½

రామోఽపి సహసౌమిత్రి ర్మునీం స్తా నభిపూజ్యచ,
అగ్రతో నిషసాదాథ విశ్వామిత్రస్య ధీమతః. ౨౧½
అథ రామో మహాతేజా విశ్వామిత్రం మహామునిమ్,
పప్రచ్ఛ నరశార్దూలః కౌతూహలసమన్వితః. ౨౨½
భగవన్ కోన్వయం దేశ స్సమృద్ధవనశోభితః,
శ్రోతుమిచ్ఛామి భద్రంతే వక్తుమర్హసి తత్త్వతః. ౨౩½

ఇట్లు చెప్పి మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు ఋషులను రామలక్ష్మణులను కూడి "మీకు మంగళ మగుఁగాక; నేను సిద్ధిఁబొందితిఁ గావున గంగానదియుత్తరతీరమందు హిమవత్పర్వతమునకుం బోయెదను" అని వన దేవతల వీడ్కొని పయనం బయ్యెను. ౧౪, ౧౫

అంత నా విశ్వామిత్రుఁడు శ్రేష్ఠమైన సిద్ధాశ్రమమునకుఁ బ్రదక్షిణముచేసి ఉత్తరపుదిక్కుఁగూర్చి వెళ్లుట కారంభించెను. ౧౬

ఉత్తరపుదిక్కుఁగూర్చి పోవుచున్న మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుని బ్రహ్మవాదులగు మునులు నూఱుబండ్లవఱకు వెంటఁబెట్టుకొని వెంబడించిరి.

సిద్ధాశ్రమమందుండు లేళ్లును పక్షులునుంగూడఁ బయనమైపోవుచుండు మహాత్ముఁడగు విశ్వామిత్రమహామునిని వెంబడించి పోయినవి. ౧౮

అంత నావిశ్వామిత్రుఁడు పక్షులను మృగంబులను వీడ్కొని మఱల సిద్ధాశ్రమంబునకుఁ బోవునట్లు మఱలించెను. ౧౮½

ఆమునులు చాలదూరముపోయి సూర్యుం డస్తమించునపుడు శోణనద మున్గట్టునందు ఎచ్చరికతో వాసము గావించిరి. ౧౯½

కొలంది లేని తేజముగల యామునులు స్నానముచేసి సూర్యుం డస్తమించిన పిమ్మట నగ్నిహోత్రమునందు హోమము చేసి విశ్వామిత్రునిఁ బురస్కరించుకొని కూర్చుండిరి. ౨౦½

రాముండును లక్ష్మణుండును ఆమునులం బూజించి నమస్కరించి ధీమంతుండగు విశ్వామిత్రుని యెదుటం గూర్చుండిరి. ౨౧½

అంత మహాతేజుండును పురుషశ్రేష్ఠుండు నగురాముండు కౌతూహలంబున విశ్వామిత్రమహామునిం జూచి యిట్లని యడిగెను. ౨౨½

భగవంతుఁడవైన విశ్వామిత్రుఁడా! సమృద్ధంబగు వనముచే నొప్పుచున్న యీ దేశం బెవ్వరిది? నేను వినఁగోరెదను; ఉన్న దున్నట్లు చెప్పవలయును అని యడిగెను. ౨౩½

చోదితో రామవాక్యేన కథయామాస సువ్రతః,
తస్య దేశస్య నిఖిలమృషిమధ్యే మహాతపాః. ౨౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకత్రింశస్సర్గః.

## ద్వాత్రింశస్సర్గః

బ్రహ్మయోనిర్మహానాసీత్కుశో నామ మహాతపాః,
అక్లిష్టవ్రతధర్మజ్ఞస్సజ్జనప్రతిపూజకః. ౧

స మహాత్మా కులీనాయాం యుక్తాయాం సుగుణోల్బణాన్,
వైదర్భ్యాం జనయామాస చతురస్సదృశాన్ సుతాన్.
కుశాంబం కుశనాభం చ అధూర్తరజసం వసుమ్. ౨౫

దీప్తియుక్తాన్మహోత్సాహాన్ క్షత్రధర్మచికీర్షయా,
తాన్ ఉవాచ కుశః పుత్రాన్ ధర్మిష్ఠాన్ సత్యవాదినః. ౩౫
క్రియతాం పాలనం పుత్రా ధర్మం ప్రాప్స్యథ పుష్కలమ్. ౪

ఋషేస్తు వచనం శ్రుత్వా చత్వారో లోకసమ్మతాః,
నివేశం చక్రిరే సర్వే పురాణాం నృవరాస్తదా. ౫

కుశాంబస్తు మహాతేజాః కౌశాంబీ మకరోత్పురీమ్,
కుశనాభస్తు ధర్మాత్మా పురం చక్రే మహోదయమ్. ౬

అ(అ)ధూర్తరజసో రామ ధర్మారణ్యం మహీపతిః,
చక్రే పురవరం రాజా వసుశ్చక్రే మహోదయమ్. ౭

మంచివ్రతములుగలవాఁడును మహాతపస్వియు నగు విశ్వామిత్రుఁడు రామవాక్యంబునఁ బ్రేరేపింపఁబడి ఋషిమధ్యంబున నా దేశవృత్తాంత మంతయుఁ జెప్పెను. ౨౪

ఇది ముప్పదియొకటవ సర్గము.

---

## ముప్పదిరెండవ సర్గము

మిక్కిలియుఁ దపముగల్గి దృఢవ్రతుండై ధర్మజ్ఞుండై మంచివారిఁ బూజించుచు కార్యాదుల నధికుండై యుండు కుశుండను బ్రహ్మపుత్రుం డొకఁడుండెను. ౧

మహాత్ముం డగు నాకుశునకు మంచికులమందుఁ బుట్టినదియుఁ భర్తకనుకూలయు నగు విదర్భరాజపుత్రియందు, గుణాధికులుఁ దండ్రికి సరివచ్చువారునగు కుశాంబుఁడుఁ గుశనాభుఁడు నధూర్తరజసుఁడు వసువు నను నల్వురు కొడుకులు పుట్టిరి. ౨-౩

కుశుఁడు ప్రజాపాలనము సేయుటకుఁగాను మహోత్సాహులై కాంతి గలిగి మిక్కిలిధార్మికులై సత్యవాదులైన కుమారులను గాంచి యిట్లని చెప్పెను.

కొడుకులారా! ప్రజలం బాలింపుఁడు; దానంజేసి పుష్కలంబైన ధర్మంబు నొందెదరు. అని కుశుండు కొడుకులతోఁ జెప్పెను. ౪

ఋషియగు కుశునిమాట విని నచే లోకసమ్మతులగు కొడుకులు నల్వురును ప్రజాపాలనం దాసక్తులై తమకు రాజధానులుగాఁ బట్టణముల నేర్పఱచుకొనిరి. ౫

మహాతేజుండగు కుశాంబుండు కౌశాంబి యనెడుపట్టణమును రాజధానిగాఁ జేసికొనెను; ధర్మాత్ముండగు కుశనాభుండు మహోదయంబను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. ౬

రాముఁడా! భూపతియగు నధూర్తరజసుఁడు ధర్మారణ్యమనుపట్టణమును రాజధానిగాఁ జేసికొనెను; వసుమహారాజు మహోదయంబగు గిరివ్రజమనుపట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. ౭

ఏషా వసుమతీ నామ వసోస్తస్య మహాత్మనః,
ఏతే శైలవరాః పంచ ప్రకాశంతే సమంతతః. ౮

సుమాగధీ నదీ రమ్యా మగధాన్ విశ్రుతా యయౌ,
పంచానాం శైలముఖ్యానాం మధ్యే మాలేవ శోభతే. ౯

సైషా హి మాగధీ రామ వసోస్తస్య మహాత్మనః,
పూర్వాభిచరితా రామ సుక్షేత్రా సస్యమాలినీ. ౧౦

కుశనాభస్తు రాజర్షిః కన్యాశతమనుత్తమమ్,
జనయామాస ధర్మాత్మా ఘృతాచ్యాం రఘునందన. ౧౧
తాస్తు యౌవనశాలిన్యో రూపవత్యస్స్వలంకృతాః,
ఉద్యానభూమిమాగమ్య ప్రావృషీవ శతహ్రదాః. ౧౨
గాయంత్యో నృత్యమానాశ్చ వాదయంత్యశ్చ సర్వశః,
ఆమోదం పరమం జగ్ముర్వరాభరణభూషితాః. ౧౩
అథ తాశ్చారుసర్వాంగ్యో రూపేణాప్రతిమా భువి,
ఉద్యానభూమిమాగమ్య తారా ఇవ ఘనాంతరే. ౧౪

తాస్సర్వగుణసంపన్నా రూపయౌవనసంయుతాః,
దృష్ట్వా సర్వాత్మకో వాయురిదం వచనమబ్రవీత్. ౧౫

అహం వః కామయే సర్వా భార్యా మమ భవిష్యథ,
మానుషస్త్యజ్యతాం భావో దీర్ఘమాయురవాప్స్యథ. ౧౬

రాముఁడా! ఇప్పుడు మనముండునది మహాత్ముఁడగు నావసుమహారాజుభూమి. ఈపర్వతంబు లైదు నీభూమిని జుట్టి ప్రకాశించుచున్నవి. (కనుకనే దీనికి "గిరివ్రజంబు" (పర్వతముల గుంపు) అనుపేరు గల్గినది.)

ప్రసిద్ధంబును రమణీయంబునై మగధదేశంబునఁ బుట్టిన యీశోణనది మగధదేశమునందుఁ బ్రవహించుచున్నది; ఈనది పర్వతముల అయిదింటి నడుమ పుష్పమాలికవలెఁ బ్రకాశించుచున్నది. ౯

రాముఁడా! అట్టి యీశోణానది మహాత్ముఁడగు నావసుమహారాజు దేశమందున్నది; ఇది తూర్పుదేశమునుండి పడమరకట్టుగాఁ బ్రవహించుచున్నది. దీనికట్టున నుండుభూములు చక్కఁగా ఫలించునవి; దీనికట్టునంతటను ఎప్పుడును పైరులు మెండుగా నుండును. ౧౦

రాముఁడా! ధర్మాత్ముండును రాజర్షియు నగుకుశనాభుండు ఘృతాచియందుఁ బరమసౌందర్యవతులైన నూర్వురఁగొమార్తెలం గనెను. ౧౧

మంచియౌవనంబును రూపంబునుం గల్గి పుష్పగంధంబులను శ్రేష్ఠంబులగు భూషణంబులనుం జక్కఁగా నలంకరింపఁబడి యొప్పుచున్న కుశనాభుని కొమార్తెలు నూర్వురును ఉద్యానవనమునకుఁ బోయి, వర్షాకాలమందలి మెఱుపులంబోలె నాడుచు నానావిధంబులుగాఁ బాడుచు నాడుచు వీణల వాయించుచు మిక్కిలిగా సంతోషము నొందిరి. ౧౨, ౧౩

సమస్తావయవంబులును సుందరంబులుగాఁ గల్గి రూపంబున భూలోకంబున సాటిలేక యొప్పుచున్న కుశనాభుని కూఁతురులు ఉద్యానవనమునకు వచ్చి తన్మధ్యమందుండి మేఘమధ్యమందలి నక్షత్రములంబోలెఁ బ్రకాశించుచుండిరి. ౧౪

సమస్తప్రదేశములయందును సంచరించుచుండువాయుదేవుండు సమస్తగుణసంపన్నలై రూపయౌవనంబులు గల్గి యొప్పుచున్న కుశనాభుని కూఁతురులం జూచి యిట్లని చెప్పెను. ౧౫

నేను మిమ్ములనందఱం జూచి కామించుచున్నాను; నాకు భార్యలుగా నుండుఁడు; మనుష్యునియం దనురాగ ముంచవలదు; దేవతనైన నాయం దను

చలం హి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః,
అక్షయ్యం యౌవనం ప్రాప్తా అమర్త్యాశ్చ భవిష్యథ. ౧౭

తస్య తద్వచనం శ్రుత్వా వాయోరక్లిష్టకర్మణః,
అపహాస్య తతో వాక్యం కన్యాశతమథాబ్రవీత్. ౧౮
అన్తశ్చరసి భూతానాం సర్వేషాం త్వం సురోత్తమ,
ప్రభావజ్ఞాః స్మ తే సర్వాః కిమస్మానవమన్యసే. ౧౯

కుశనాభసుతాస్సర్వాస్సమర్థాస్త్వాం సురోత్తమ,
స్థానాచ్చ్యావయితుం దేవం రక్షామస్తు తపో వయమ్. ౨౦

మా భూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్,
నావమన్యస్వ ధర్మేణ స్వయం వరముపాస్మహే. ౨౧

పితా హి ప్రభురస్మాకం పరమం దైవతం హి సః,
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి. ౨౨
తాసాం తద్వచనం శ్రుత్వా వాయుః పరమకోపనః,
ప్రవిశ్య సర్వగాత్రాణి బభఞ్జ భగవాన్ ప్రభుః. ౨౩
తాః కన్యా వాయునా భగ్నా వివిశుర్నృపతేర్గృహమ్,
ప్రాపతన్ భువి సంభ్రాన్తాస్సలజ్జాస్సాస్రలోచనాః. ౨౪
స చ తా దయితా దీనాః కన్యాః పరమశోభనాః,
దృష్ట్వా భగ్నాస్తదా రాజా సంభ్రాన్త ఇదమబ్రవీత్. ౨౫
కి మిదం కథ్యతాం పుత్ర్యః కో ధర్మ మవమన్యతే,

కుబ్జాః కేన కృతాస్సర్వా వేష్టంత్యో నాభిభాషత. ౨౬

ఏవం రాజా వినిశ్వస్య సమాధిం సందధే తతః. ౨౬½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్వాత్రింశస్సర్గః.

## త్రయస్త్రింశస్సర్గః

తస్య తద్వచనం శ్రుత్వా కుశనాభస్య ధీమతః,
శిరోభిశ్చరణౌ స్పృష్ట్వా కన్యాశత మభాషత. ౧

వాయుస్సర్వాత్మకో రాజన్ ప్రధర్షయితుమిచ్ఛతి,
అశుభం మార్గ మాస్థాయ న ధర్మం ప్రత్యవేక్షతే. ౨

పితృమత్యః స్మ భద్రం తే స్వచ్ఛందే న వయం స్థితాః,
పితరం నో వృణీష్వ త్వం యది నో దాస్యతే తవ. ౩

తేన పాపానుబంధేన వచనం న ప్రతీచ్ఛతా,
ఏవం బ్రువంత్యస్సర్వాస్స్మ వాయునా నిహతా భృశమ్. ౪

తాసాం తద్వచనం శ్రుత్వా రాజా పరమధార్మికః,
ప్రత్యువాచ మహాతేజాః కన్యాశత మనుత్తమమ్. ౫

క్షాంతం క్షమావతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతమ్,
ఐకమత్య ముపాగమ్య కులం చావేక్షితం మమ. ౬

అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా. ౬½

నాఁడు. ఎవ్వఁడు మిమ్ములనిట్లు కుబ్జలుగాఁ జేసెను? ఎందుకు బదులుచెప్పరు? అని కుశనాభుఁడు చెప్పెను. ౨౬

కుశనాభమహారాజిట్లు దుఃఖించి యంత మనస్సమాధానమునొందెను.

ఇది ముప్పదిరెండవసర్గము.

---

## ముప్పదిమూఁడవ సర్గము

ధీమంతుఁడగు నాకుశనాభుఁడు చెప్పిన యామాటలను విని యాకన్యలు నూర్వురును తమతల లతనియడుగులు సోఁకునట్లు ప్రణమిల్లి యిట్లని చెప్పిరి. ౧

నరేంద్రా! అన్నిటం దిరుగుచుండెడు వాయుదేవుండు మమ్ము ధర్షింపఁ గోరెను; అమంగళకరములని తలంపక మమ్ము బలాత్కరించుటకుం బూని ధర్మంబు నెంతమాత్రమును జూడఁడయ్యె. ౨

మాకుఁ దండ్రిగారున్నాఁడు కావున స్వాతంత్ర్యములేదు; నీవు మాతండ్రి నడుగుము; ఆతండు మమ్ము నీకిచ్చినట్లయిన మేము నీకు భార్యల మయ్యెదము; అని మేమతనికిఁ జెప్పితిమి. ౩

ఈప్రకారము చెప్పుచున్న మమ్మందఱ నావాయువు పాపం బనురగించుచుండై మామాట నంగీకరింపక యిట్లు కొట్టెను. అని కన్యలు కుశనాభునితోఁ జెప్పిరి. ౪

ఆకన్యలుచెప్పిన యామాటవిని మహాపరాక్రమశాలియగు నాకుశనాభుండు పరమధార్మికుండగుటం జేసి వాయువుపైఁ గోపంబు వహింపక, క్షమయే ముఖ్యంబని తలంచి యుత్తమలైన నూర్వురికన్యలకు నిట్లని బదులుచెప్పెను.

కూఁతులారా! ఓర్పుగలవారలు, తమ కెవ్వఁడైన నపరాధము చేసి నపుడు చేయవలసిన కార్యమంతయుఁ, క్షమించుటయే; ఇప్పుడు మీరు చేసిన కార్యము చాలగొప్పది; మీర లొకరితో నొకరు కలసికొని యొద్దిక నొంది, నాకులంబును గూడ రక్షించితిరి. ౫

“ఓర్పు” అనునది స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని భూషణము. ౬

దుష్కరం తచ్చ యత్ క్షాన్తం త్రిదశేషు విశేషతః,
యాదృశీ వః క్షమా పుత్ర్యస్సర్వాసా మవిశేషతః. ౭½

క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యంహి పుత్రికాః,
క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్. ౮½

విసృజ్య కన్యాః కాకుత్స్థ రాజా త్రిదశవిక్రమః. ౯
మన్త్రజ్ఞో మన్త్రయామాస ప్రదానం సహ మన్త్రిభిః,
దేశకాలౌ ప్రదానస్య సదృశే ప్రతిపాదనమ్. ౧౦
ఏతస్మిన్నేవ కాలేతు చూలీనామ మహాతపాః,
ఊర్ధ్వరేతా శ్శుభాచారో బ్రాహ్మం తప ఉపాగమత్. ౧౧
తప్యన్తం త మృషిం తత్ర గన్ధర్వీ పర్యుపాసతే,
సోమదా నామ భద్రం తే ఊర్మిళాతనయా తదా. ౧౨

సాచ తం ప్రణతా భూత్వా శుశ్రూషణపరాయణా,
ఉవాస కాలే ధర్మిష్ఠా తస్యా స్తుష్టోఽభవద్గురుః. ౧౩

స చ తాం కాలయోగేన ప్రోవాచ రఘునన్దన,
పరితుష్టోఽస్మి భద్రం తే కిం కరోమి తవ ప్రియమ్. ౧౪

పరితుష్టం మునిం జ్ఞాత్వా గన్ధర్వీ మధురస్వరా,

సాధారణముగా క్షమించుట యనునదియె కష్టసాధ్యము. అందు రూపైశ్వర్యాదులు గలదేవత లపరాధము చేసినపుడు వారిని క్షమించుట చాలఁగష్టము. అందును మీనూర్వురికిని ఏకరీతిగా నోర్వఁగలుగుట మరియుం దుర్లభము. అట్టి క్షమ మీకుఁ గల్గినది. ౯

కూఁతురులారా! దానంబునం గల్గుఫలము క్షమవలనఁ గల్గును. యాగంబులం గల్గునది క్షమవలనంగల్గును. సత్యంబునం గల్గునది క్షమవలనం గల్గును. కీర్తివలనం గల్గునది క్షమవలనఁ గలుగును. ధర్మంబునం గల్గునది క్షమవలనం గల్గును. జగత్తంతయుం క్షమచేతనే యున్నది. అని కుశనాభుఁడు కొమార్తెలకుఁ జెప్పెను. ౧౧

రాముఁడా! కొమార్తెలను బంపి దేవతాసమానంబగు పరాక్రమంబు గలవాఁడును, మంత్రజ్ఞుండు నగునాకుశనాభుఁడు కన్యాప్రదానమును గూర్చి ఈకన్యల నెచ్చట నెప్పు డెవ్వని కిచ్చునది; అని మంత్రులతో నాలోచించెను.

ఈకాలమందే మహాతపుండై యస్ఖలితవీర్యుండై మంచియాచారము గల్గి యుండు చూళియనునొకమహాముని వేదచోదితంబగు తపము చేయుచుండెను.

అప్పుడాచూళి తపముసేయుచుండఁగా ఊర్మిళకూఁతురైన సోమద యనుగంధర్వస్త్రీ యతనియొద్దకుఁ బోయి యతని సేవింపుచుండెను. రాముఁడా! నీకు మంగళమగుఁగాక. ౧౨

మిక్కిలి ధార్మికురాలగు నాసోమదయును ఆచూళిని నమస్కరించి యతని కెల్లప్పుడు శుశ్రూష సేయుచుండెను. అంతఁ గొంతకాలమునకు చూళి సంతోషంబు నొందెను. ౧౩

రాముఁడా! ఆచూళియును గాలయోగంబున నేను సంతుష్టుఁడనైతిని. నీకు మంగళమగుఁగాక! నీకు నేనేమి ప్రియము సేయువలయును. అని యాసోమదతోఁ జెప్పెను. ౧౪

చూళిని సంతసించినవానిఁగా నెఱింగి మనోహరంబైన కంఠస్వరము గల్గి చక్కఁగా మాటలాడుటకుఁ జాలినయాసోమద మిక్కిలియుం సంతసించి

ఉవాచ పరమప్రీతా వాక్యజ్ఞా వాక్యకోవిదమ్. ౧౫
*లక్ష్మ్యా సముదితో బ్రాహ్మ్యా బ్రహ్మభూతో మహాతపాః,
బ్రాహ్మేణ తపసా యుక్తం పుత్ర మిచ్ఛామి ధార్మిక. ౧౬

అపతిశ్చాస్మి భద్రం తే భార్యా చాస్మి న కస్యచిత్,
బ్రాహ్మేణోపగతాయాశ్చ దాతుమర్హసి మే సుతమ్. ౧౭

తస్యాః ప్రసన్నో బ్రహ్మర్షి ర్దదౌ పుత్రమనుత్తమమ్,
బ్రహ్మదత్త ఇతి ఖ్యాతం మానసం చూలినస్సుతమ్. ౧౮
స రాజా సౌమదేయస్తు పురీ మధ్యవసత్తదా,
కాంపిల్యాం పరయా లక్ష్మ్యా దేవరాజో యథా దివమ్. ౧౯

స బుద్ధిం కృతవాన్ రాజా కుశనాభ స్సుధార్మికః,
బ్రహ్మదత్తాయ కాకుత్స్థ దాతుం కన్యాశతం తదా. ౨౦
తమాహూయ మహాతేజా బ్రహ్మదత్తం మహీపతిః,
దదౌ కన్యాశతం రాజా సుప్రీతేనాంతరాత్మనా. ౨౧
యథాక్రమం తతః పాణిం జగ్రాహ రఘునందన,
బ్రహ్మదత్తో మహీపాల స్తాసాం దేవపతి ర్యథా. ౨౨
స్పృష్టమాత్రే తతః పాణౌ వికుబ్జా విగతజ్వరాః,
యుక్తాః పరమయా లక్ష్మ్యా బభుః కన్యాశతం తదా. ౨3
స దృష్ట్వా వాయునా ముక్తాః కుశనాభో మహీపతిః,
బభూవ పరమప్రీతో హర్షం లేభే పునః పునః. ౨౪

* "దీప్యసే పరయా లక్ష్మ్యా" అని పాఠాంతరము.

మాటలాడుటయందు సమర్థుఁడైన చూళితో నిట్లని చెప్పెను. ౧౫

ధార్మికుఁడవైన చూళి మహామునీ ! నీవు బ్రహ్మవర్చసముచేత నందఱను మించినవాఁడవు; (నీవు ఉత్కృష్టంబగు బ్రహ్మవర్చసముచేఁ బ్రకాశించుచున్నావు.) బ్రహ్మదేవునకు సరివచ్చువాఁడవు; మిక్కిలియుఁ దపస్సుకలవాఁడవు; నాకు బ్రాహ్మణశక్తితోఁ గూడినకొడుకు కావలయును. ౧౬

నేను బెనిమిటిలేనిదానను; నీకు మంగళమగుఁగాక; నేనెవ్వనినిం బెండ్లాడినదానను గాను; నిన్ను శరణుచొచ్చితిని; నాకుఁ దపోమహిమచేఁ గొడుకు నివ్వవలయును. అని సోమద చెప్పెను. ౧౭

బ్రహ్మర్షియగు చూళి ప్రసన్నుఁడై తనమానససంభుతుఁ బుట్టిన బ్రహ్మదత్తుఁడను నుత్తమపుత్త్రుని ఆసోమద కిచ్చెను. ౧౮

ఆకుశనాభుఁడు కన్యాదానమునుగుఱించి యాలోచించునపుడు సోమదకొడుకైన యాబ్రహ్మదత్తుఁడు సమస్తసంపదలంగూడి కాంపిల్యానగరమునందు స్వర్గమునందు దేవేంద్రుఁడుంబోలె వాసముసేయుచుండెను. ౧౯

రాముఁడా ! అప్పుడు మిక్కిలియుంధార్మికుండగు నాకుశనాభ మహారాజు కొమార్తెల నూర్వురిని బ్రహ్మదత్తుని కిచ్చునట్లు నిశ్చయము చేసెను. ౨౦

మహాతేజుండగు కుశనాభమహారాజు ఆబ్రహ్మదత్తునిం బిలిచి పరమప్రీతంబగు నంతఃకరణంబున వానికిఁ గొమార్తెల నూర్వుర నిచ్చెను. ౨౧

రాముఁడా ! అంత నైశ్వర్యంబున దేవేంద్రునింబోలిన బ్రహ్మదత్తమహారాజు వరుసగా నాకన్యలనందఱఁ బాణిగ్రహణముచేసి పెండ్లాడెను. ౨౨

అంత నాబ్రహ్మదత్తుఁడు హస్తముల నంటినమాత్రముననె యాపడుచులు నూర్వురును కుబ్జత్వము విడిచి యొంతమాత్రమును బాధలేనివారలై పరమకాంతిగల్గి ప్రకాశించిరి. ౨౩

వాయుబాధచే విడువఁబడిన తనకొమార్తెలం జూచి యాకుశనాభ మహారాజు మిక్కిలి సంతసించెను. మఱియు మాటిమాటికిని సంతోషము నొందుచుండెను. ౨౪

కృతోద్వాహంతు రాజానం బ్రహ్మదత్తం మహీపతిః,
సదారం ప్రేషయామాస సోపాధ్యాయగణం తదా. ౨౪
సోమదాఽపి సుసంహృష్టా పుత్రస్య సదృశీం క్రియామ్,
యథాన్యాయంచ గంధర్వీ స్నుషా స్తాః ప్రత్యనందత. ౨౬
స్పృష్ట్వా స్పృష్ట్వా చ తాః కన్యాః కుశనాభం ప్రశస్యచ. ౨౬
ఇతి శ్రీమద్బాలకాండే, త్రయస్త్రింశస్సర్గః.

---

## చతుస్త్రింశస్సర్గః

కృతోద్వాహే గతే తస్మిన్ బ్రహ్మదత్తే చ రాఘవ,
అపుత్రః పుత్రలాభాయ పౌత్రీ మిష్టి మకల్పయత్. ౧

ఇష్ట్యాంతు వర్తమానాయాం కుశనాభమహీపతిమ్,
ఉవాచ పరమోదారః కుశో బ్రహ్మసుత స్తదా. ౨

పుత్ర స్తే సదృశః పుత్ర భవిష్యతి సుధార్మికః,
గాధిం ప్రాప్స్యసి తేన త్వం కీర్తిం లోకే చ శాశ్వతీమ్. 3

ఏవ ముక్త్వా కుశో రామ కుశనాభం మహీపతిమ్,
జగామాకాశ మావిశ్య బ్రహ్మలోకం సనాతనమ్. ౪
కస్యచి త్త్వథ కాలస్య కుశనాభస్య ధీమతః,
జజ్ఞే పరమధర్మిష్ఠో గాధి రిత్యేవ నామతః. ౫

స పితా మమ కాకుత్స్థ గాధిః పరమధార్మికః,
కుశవంశప్రసూతోఽస్మి కౌశికో రఘునందన. ౬

అప్పుడు కుశనాభమహారాజు వివాహము కాఁగానే బ్రహ్మదత్తమహారాజును అతనిభార్యలను ఋత్విజులనుంగూడఁ గాంపిల్యానగరమున కంపెను.

గంధర్వస్త్రీయైన సోమదయును సంతోషంబున నాపదుచులను దాఁకి దాఁకి కుశనాభునిఁ బ్రశంసింపుచు తనకొడుకున కనురూపమైనవివాహమును దనకోడంద్రను జాల నభినందించెను. ౨౬-౭

ఇది ముప్పదిమూఁడవసర్గము.

---

## ముప్పదినాల్గవ సర్గము

రామచంద్రా! వివాహము చేసికొని బ్రహ్మదత్తుఁడుపోఁగానే కుశనాభుఁడు తనకు కొడుకు లేకుండుటంజేసి కొడుకు గల్గుటకై పుత్రప్రదంబగు పుత్రకామేష్టిని జేసెను. ౧

పుత్రకామేష్టి జరుగుచుండఁగా నప్పుడు అందఱను మించి యుండు బ్రహ్మపుత్రుండైన కుశుఁడు తనకొడుకైన కుశనాభమహారాజుంజూచి యిట్లని చెప్పెను. ౨

పుత్రుఁడా; మిక్కిలియు ధార్మికుండును గుణములచే నీకు సరివచ్చువాఁడునగు పుత్రుఁడు నీకుఁగలుగును; అతని పేరు "గాధ" యనంబడును; అతనిచే నీవు శాశ్వతంబగు యశంబును బొందఁగలవని కుశుఁడు చెప్పెను. ౩

ఈప్రకారము కుశనాభమహారాజుతోఁ జెప్పి కుశుఁ డాకాశమార్గంబున శాశ్వతమగు బ్రహ్మలోకమునకుఁ బోయెను. ౪

అంతఁ గొంతకాలము కడచిన పిదప బుద్ధిమంతుఁడగు కుశనాభునకు, కుశుఁడు చెప్పినట్లు గాధియనియే పేరుగల్గినపరమధార్మికుం డగునొకకొడుకు పుట్టెను. ౫

రామచంద్రా! పరమధార్మికుండగు నాగాధికి నేను బుట్టితిని; ఇట్లు కుశవంశమునఁ బుట్టితిఁ గాఁబట్టి కౌశికుఁడ నైతిని. ౬

పూర్వజా భగినీ చాపి మమ రాఘవ సువ్రతా,
నామ్నా సత్యవతీ నామ ఋచీకే ప్రతిపాదితా. ౭
సశరీరా గతా స్వర్గం భర్తార మనువర్తినీ,
కౌశికీ పరమోదారా ప్రవృత్తా చ మహానదీ. ౮
దివ్యా పుణ్యోదకా రమ్యా హిమవంతముపాశ్రితా,
లోకస్య హితకామార్థం ప్రవృత్తా భగినీ మమ. ౯

తతోఽహం హిమవత్పార్శ్వే వసామి నిరతస్సుఖమ్,
భగిన్యాం స్నేహసంయుక్తః కౌశిక్యాం రఘునందన. ౧౦

సా తు సత్యవతీ పుణ్యా సత్యే ధర్మే ప్రతిష్ఠితా,
పతివ్రతా మహాభాగా కౌశికీ సరితాం వరా. ౧౧
అహంహి నియమాద్రామ హిత్వా తాం సముపాగతః,
సిద్ధాశ్రమ మనుప్రాప్య సిద్ధోఽస్మి తవ తేజసా. ౧౨
ఏష రామ మమోత్పత్తిస్స్వస్య వంశస్య కీర్తితా,
దేశస్యచ మహాబాహో యన్మాం త్వం పరిపృచ్ఛసి. ౧౩

గతోఽర్ధరాత్రః కాకుత్స్థ కథాః కథయతో మమ,
నిద్రామభ్యేహి భద్రం తే మా భూద్విఘ్నోఽధ్వనీహ నః.

నిష్పందా స్తరవస్సర్వే నిలీనా మృగపక్షిణః,
నైశేన తమసా వ్యాప్తా దిశశ్చ రఘునందన. ౧౪
శనైర్వియుజ్యతే సంధ్యా నభో నేత్రైరివావృతమ్,
నక్షత్రతారాగహనం *జ్యోతిర్భి రవభాసతే. ౧౫

* "జ్యోతిర్భిరవభాస్యతే" మహేశ్వరతీర్థపాఠము.

రాముఁడా ! మంచివ్రతము లాచరించిన నాయక్క సత్యవతియను నది ఋచికుండనుఋషిని బెండ్లియైనది. ౭

ఆసత్యవతి భర్తను సేవింపుచుండి శరీరంబుతో స్వర్గంబు నొందినది; మఱియు నాబిడ పరమోత్కృష్టంబైన కౌశికియను మహానదిగాఁ బ్రవహించినది.

నాభగిని లోకమున కైహికాముష్మికంబులు సిద్ధించుటకై దివ్యయుఁ బరిశుద్ధంబగు జలము గల్గినదియుఁ రమణీయయు నగునదియై హిమవత్పర్వతము నాశ్రయించినది. ౯

రాముఁడా! కాఁబట్టి నేను భగినియగు కౌశికీనదియందలిస్నేహంబున మిక్కిలియాసక్తితో సుఖముగా హిమవత్పర్వతము దగ్గఱ కౌశికీతీరంబున వాసము సేయుచున్నాను. ౧౦

ఆసత్యవతి పరిశుద్ధయైనది; సత్యమును ధర్మమునుం గలది; పతివ్రత; పూజ్యయైనది; నదులలో మేటియై కౌశికియను పేరొందినది. ౧౧

రాముఁడా ! నేను యాగము సేయుటకై నాకౌశికీనదిని విడిచివచ్చి సిద్ధాశ్రమము చేరి యచ్చట నీపరాక్రమంబుచే సిద్ధుండనైతిని. ౧౨

మహాబాహుండవగు రాముఁడా ! నీవు నన్ను దేనిం జెప్పుమని యడిగితివో; ఆ నాయుత్పత్తిని నావంశోత్పత్తిని ఈదేశముయుత్పత్తిని దానినంతయు నీకుఁ జెప్పితిని. ౧౩

రాముఁడా ! నే నిట్లు కథలు చెప్పుచుండఁగా రాత్రిలోఁ గొంతసేపైనది; ఇంక నిదురింపుము; నీకు మంగళమగుఁగాక; మనకిచ్చో మార్గమునం దంతరాయము గల్గకుండుఁగాక. ౧౪

రాముఁడా! వృక్షము లన్నియుఁ బక్షిసంచారము లేకుండుటం జేసి కదలకున్నవి; మృగములును బక్షులును సంచారము మాని నిదురించినవి; దిక్కులన్నియుఁ జీఁకట్లు గ్రమ్మినవి. ౧౫

రాత్రి మెల్లఁగాఁ గడచినది; ఆకాశము నక్షత్రములచే నిండినదై జ్యోతిష్మంతములగు నేత్రములచే నిండియున్నట్లు ప్రకాశించుచున్నది. ౧౬

ఉత్తిష్ఠతి చ శీతాంశు శ్శశీ లోకతమోనుదః,
హ్లాదయన్ ప్రాణినాం లోకే మనాంసి ప్రభయా విభో ౧౭

నైశాని సర్వభూతాని ప్రచరంతి తత స్తతః,
యక్షరాక్షససంఘాశ్చ రౌద్రాశ్చ పిశితాశనాః. ౧౮

ఏవ ముక్త్వా మహాతేజా విరరామ మహామునిః,
సాధు సాధ్వితి తం సర్వే మునయో హ్యభ్యపూజయన్. ౧౯

కుశికానా మయం వంశో మహాన్ ధర్మపర స్తదా,
బ్రహ్మోపమా మహాత్మానః కుశవంశ్యా నరోత్తమాః. ౨౦

విశేషేణ భవానేవ విశ్వామిత్రో మహాయశాః,
కౌశికీ సరితాం శ్రేష్ఠా కులోద్యోతకరీ తవ. ౨౧

ఇతి తైర్మునిశార్దూలైః ప్రశ స్తః కుశికాత్మజః,
నిద్రా ముపాగమచ్ఛ్రీమాన్ శ్రీమాన స్తమివాంశుమాన్. ౨౨
రామోఽపి సహసౌమిత్రిః కించిదాగతవిస్మయః,
ప్రశస్య మునిశార్దూలం నిద్రాం సముపసేవతే. ౨౩

ఇతి శ్రీమద్బాలకాణ్డే, చతుస్త్రింశస్సర్గః.

---

## పంచత్రింశస్సర్గః

ఉపాస్య రాత్రిశేషం తు శోణాకూలే మహర్షిభిః,
నిశాయాం సుప్రభాతాయాం విశ్వామిత్రోఽభ్యభాషత. ౧

రామా! చల్లనికిరణములుకల్గి లోకంబునందలిచీఁకటిం బోఁగొట్టు చంద్రుఁడును లోకమునందు సమస్తప్రాణుల మనంబులకును సంతసము సేయుచు నుదయించుచున్నాఁడు. ౧౮

రాత్రియందు సంచరించునట్టి గుడ్లగూబలు మొదలగు జంతువులును, భయంకరులై మాంసమెయాహారముగాఁ గల్గియుండు యక్షులును రాక్షసులును అచ్చటచ్చట సంచరించుచున్నారని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను.

ఈ ప్రకారము చెప్పి మహాప్రభావుండగు విశ్వామిత్రమహాముని యూరకుండెను; అంత మునులందఱు విశ్వామిత్రుని "బాగుబాగు" అని కొనియాడిరి. ౧౯

కుశికులవంశము ఎల్లప్పుడునుం బూజ్యమును ధర్మిష్ఠమును నైనది; కుశునివంశంబులం బుట్టినపురుషశ్రేష్ఠులందఱు మహాత్ములు; బ్రహ్మదేవునకు సరివచ్చువారలు. ౨౦

అందు విశ్వామిత్రుండను పేరంబరఁగు నీవే యందఱికన్నను అధికమైన కీర్తికలవాఁడవు; నదీశ్రేష్ఠముగు కౌశికి నీకులమును మఱి యుం బ్రకాశింపఁ జేయుచున్నది. అని మునులు విశ్వామిత్రుని గొనియాడిరి. ౨౧

శ్రీమంతుండగు విశ్వామిత్రుం డిట్లు మునిశ్రేష్ఠులచేఁ గొనియాడంబడి శ్రీమంతుండగు సూర్యుం డస్తమించునట్లు నిదురవోయెను. ౨౨

రాముండును లక్ష్మణుండును నిద్రాపరవశులగుటం జేసి కొంచెముగా నాశ్చర్యమునొంది మార్గాయాసంబున బడలియున్నవారు కావునఁ జక్కఁగా నిదురించిరి. ౨౩

ఇది ముప్పదినాలవసర్గము.

---

## ముప్పదియైదవ సర్గము

విశ్వామిత్రుఁడు మిగిలినరాత్రికాలమంతయు శోణనదముగట్టునందు మహర్షులతోఁ గూడఁ బరుండియుండి తెల్లవాఱఁగానే యిట్లని చెప్పెను. ౧

సుప్రభాతా నిశా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే గమనాయాఽభిరోచయ. ౨

తచ్ఛ్రుత్వా వచనం తస్య కృత్వా పౌర్వాహ్ణికీం క్రియామ్,
గమనం రోచయామాస వాక్యం చేద మువాచహ. 3
అయం శోణశ్శుభజలోఽ గాధః పులినమండితః,
కతరేణ పథా బ్రహ్మన్ సంతరిష్యామహే వయమ్. ౪

ఏవముక్తస్తు రామేణ విశ్వామిత్రోఽబ్రవీదిదమ్,
ఏష పంథా మయోద్దిష్టో యేన యాంతి మహర్షయః. ౫

ఏవముక్తా మహర్షయో విశ్వామిత్రేణ ధీమతా,
పశ్యంతస్తే ప్రయాతా వై వనాని వివిధాని చ. ౬
తే గత్వా దూర మధ్వానం గతేఽర్ధదివసే తదా,
జాహ్నవీం సరితాం శ్రేష్ఠాం దదృశుర్మునిసేవితామ్. ౭
తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారససేవితామ్,
బభూవుర్ముదితాస్సర్వే మునయస్సహరాఘవాః. ౮
తస్యాస్తీరే తతశ్చక్రుస్త ఆవాసపరిగ్రహమ్. ౮౪
తతస్స్నాత్వా యథాన్యాయం సంతర్ప్య పితృదేవతాః. ౯
హుత్వా చైవాగ్నిహోత్రాణి ప్రాశ్య చామృతవద్ధవిః,
వివిశుర్జాహ్నవీతీరే శుచౌ ముదితమానసాః,
విశ్వామిత్రం మహాత్మానం పరివార్య సమంతతః. ౧౦౪

అథ తత్ర తదా రామో విశ్వామిత్రమథాబ్రవీత్. ౧౧

రాముఁడా! చక్కఁగా తెల్లవాఱినది; ప్రాతస్సంధ్యాకాలము ప్రవర్తించుచున్నది; లెమ్ములెమ్ము; నీకు మంగళమగుఁగాక; పయనంబగుట కాసక్తుఁడవగు మని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౨

రాముఁ డావిశ్వామిత్రునిమాట విని పూర్వాహ్ణమందుఁ జేయవలసిన కర్మంబులం జేసి పయనముకాఁదలంచినవాఁడై యిట్లని చెప్పెను. ౩

ఈశోణనదము మంచిజలము గలది; లోతులేనిది; ఇసుకదిన్నెలచే నలంకరింపఁబడినది ; విశ్వామిత్రుఁడా ! మనము దీని నేమార్గమున దాఁటుదమని రాముఁడు చెప్పెను. ౪

ఈప్రకారము రాముఁడు చెప్పఁగానే విశ్వామిత్రుఁడు "ఏమార్గంబున మునులు పోవుచున్నారో యామార్గంబున దాఁటవలెనని నాయభిప్రాయము" అని రామునితోఁ జెప్పెను. ౫

ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పఁగానే యామహర్షులు నానావిధంబులగు నరణ్యంబులం జూచుచుఁ బోయిరి. ౬

ఆమునులు చాలదూరము పోయి సగముదినము గడచినపిదప మునులచే సేవింపఁబడినదై నదులలో శ్రేష్ఠమైయుండు గంగానదిం జూచిరి. ౭

పవిత్రంబైన జలముగల్గి హంసలను బెగ్గురుపక్షులనుం గూడియున్న యా గంగానదిం జూచి మునులు రామలక్ష్మణులు సంతసించిరి ౮

అంతట నామునులా గంగానదిగట్టునందు నివాసము గావించిరి. ౮½

అంత నామునులు స్నానముచేసి యథాశాస్త్రముగాఁ బితృతర్పణము చేసి వైశ్వదేవము మొదలగు నగ్నిహోత్రకార్యములు నిర్వర్తించి హోమము సేయఁగా మిగిలిన యమృతమువంటి హవిస్సును భుజించి సంతుష్టులై పరిశుద్ధంబగు గంగానదిగట్టునందు మహాత్ముండగు విశ్వామిత్రునిఁ జుట్టునుం బరివేష్టించి కూర్చుండిరి. ౯-౧౦½

అంత నచ్చట నప్పు డారాముఁడు విశ్వామిత్రునిం జూచి యిట్లని యడిగెను. ౧౧

భగవన్ శ్రోతుమిచ్ఛామి గఙ్గాం త్రిపథగాం నదీమ్,
త్రైలోక్యం కథ మాక్రమ్య గతా నదనదీపతిమ్. ౧౨

చోదితో రామవాక్యేన విశ్వామిత్రో మహామునిః,
వృద్ధిం జన్మ చ గఙ్గాయా వక్తు మే వోపచక్రమే. ౧౩

శైలేన్ద్రో హిమవాన్ నామ ధాతూనామాకరో మహాన్,
తస్య కన్యాద్వయం రామ రూపేణాప్రతిమం భువి. ౧౪

యా మేరుదుహితా రామ తయోర్మాతా సుమధ్యమా,
నామ్నా మనోరమా నామ పత్నీ హిమవతః ప్రియా. ౧౫
తస్యాం గంగేయమభవజ్జ్యేష్ఠా హిమవతస్సుతా,
ఉమా నామ ద్వితీయాఽభూన్నామ్నా తస్యైవ రాఘవ. ౧౬
అథ జ్యేష్ఠాం సురాస్సర్వే దేవతార్థచికీర్షయా,
శైలేన్ద్రం వరయామాసుర్గఙ్గాం త్రిపథగాం నదీమ్. ౧౭
దదౌ ధర్మేణ హిమవాన్ తనయాం లోకపావనీమ్,
స్వచ్ఛన్దపథగాం గఙ్గాం త్రైలోక్యహితకామ్యయా. ౧౮

ప్రతిగృహ్య తతో దేవా స్త్రిలోకహితకారిణః,
గఙ్గామాదాయ తేఽగచ్ఛన్ కృతార్థేనాంతరాత్మనా. ౧౯
యా చాన్యా శైలదుహితా కన్యాఽఽసీద్రఘునన్దన,
ఉగ్రం సా వ్రత మాస్థాయ తప స్తేపే తపోధనా. ౨౦

భగవంతుఁడవైన విశ్వామిత్రుఁడా! మూఁడుమార్గములం బోవునట్టి గంగానదివృత్తాంతమును వినఁగోరెదను; గంగానది యెట్లు ముల్లోకంబుల నాక్రమించి సముద్రునింబొందినదో దానిం జెప్పుము. అని రాముఁ డడిగెను. ౧౨

మహామునియగు విశ్వామిత్రుం డిట్లు రామునిమాటచేఁ బ్రేరేపింపఁబడి గంగానది యెట్లు పుట్టినదో యెట్లభివృద్ధిఁబొందినదో యావృత్తాంతమంతయుఁ జెప్పం దొడంగెను. ౧౩

గైరికాదిధాతువులచే నిండినహిమవంతుఁ డనెడుపర్వతరాజు కలఁడు; ఆ హిమవంతునకు రూపంబున భూమియం దెచ్చటను బ్రతిలేనికొమార్తె లిద్దఱు కలరు. ౧౪

మేరుపర్వతపుత్రియై మంచినడుముగల్గి హిమవంతునకుఁ బ్రియపత్నియై యుండు మనోరమ యనునది యాయిద్దఱకును దల్లియైనది. ౧౫

ఆమనోరమయందు హిమవంతున కీగంగానది జ్యేష్ఠపుత్రిగాఁ బుట్టినది; అతనికే రెండవకొమార్తె ఉమయనునది పుట్టినది. ౧౬

అంత దేవతలందఱు దేవకార్యము సిద్ధించుటకై హిమవంతునియొద్దకుఁ బోయి త్రిపథగ యగుగంగానది నిమ్మని యడిగిరి. ౧౭

హిమవంతుఁడు ముల్లోకంబుల హితంబుఁగోరి యాచకులయాశ వ్యర్థము చేయఁ దగదనుధర్మం బవలంబించి లోకంబులఁ బరిశుద్ధములుగాఁ జేయు నదియుం యథేచ్ఛముగా సంచరించుటకుం జాలినదియు నగుతనకొమార్తెయైన గంగానదిని దేవతల కిచ్చెను. ౧౮

ముల్లోకంబులకును హితము సేయునట్టిదేవతలు హిమవంతుం డివ్వగాఁ బుచ్చుకొని గంగందీసికొని కృతార్థులై పోయిరి. ౧౯

రాముఁడా! పెండ్లిగాకయుండిన హిమవంతుని రెండవకూఁతురైన యుమయును తపస్సే ధనముగాఁ నెంచి భయంకరమగు నియమం బవలంబించి తపము జేసెను. ౨౦

ఉగ్రేణ తపసా యుక్తాం దదౌ శైలవరస్సుతామ్,
రుద్రాయాప్రతిరూపాయ ఉమాం లోకనమస్కృతామ్. ౨౧

ఏతే తే శైలరాజస్య సుతే లోకనమస్కృతే,
గంగా చ సరితాం శ్రేష్ఠా ఉమాదేవీ చ రాఘవ. ౨౨

ఏతత్తే సర్వమాఖ్యాతం యథా త్రిపథగా నదీ,
ఖం గతా ప్రథమం తాత గతిం గతిమతాం వర. ౨౩
సైషా సురనదీ రమ్యా శైలేంద్రస్య సుతా తదా,
సురలోకం సమారూఢా విపాపా జలవాహినీ. ౨౪

ఇతి శ్రీమద్బాలకాండే, పంచత్రింశస్సర్గః.

---

## షట్త్రింశస్సర్గః.

ఉక్తవాక్యే మునౌ తస్మిన్నుభౌ రాఘవలక్ష్మణౌ,
ప్రతినంద్య కథాం వీరావూచతు ర్మునిపుంగవమ్. ౧

ధర్మయుక్తమిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా,
దుహితుశ్శైలరాజస్య జ్యేష్ఠాయా వక్తుమర్హసి,
విస్తరం విస్తరజ్ఞోఽసి దివ్యమానుషసంభవమ్. ౨

త్రీన్ పథో హేతునా కేన ప్లావయేల్లోకపావనీ. ౩

కథం గంగా త్రిపథగా విశ్రుతా సరిదుత్తమా,
త్రిషు లోకేషు ధర్మజ్ఞ కర్మభిః కైస్సమన్వితా. ౪

తథా బ్రువతి కాకుత్స్థే విశ్వామిత్రస్తపోధనః,
నిఖిలేన కథాం సర్వామృషిమధ్యే న్యవేదయత్. ౫

హిమవంతుఁడు లోకంబులచే నమస్కరింపఁబడినదై భయంకరమగు తపముసేయుచున్న తనకూఁతురగు నుమాదేవిని సౌందర్యముగల శివున కొసంగెను. ౨౧

రాముఁడా! నదులలో శ్రేష్ఠయైనగంగయును, శివునిభార్యయైన యుమయును లోకములచే నమస్కరింపఁబడుచున్నట్టి వీరలిర్వురును హిమవంతుని కూఁతురులు. ౨౨

సుందరమైన నడకగలవారిలో శ్రేష్ఠుఁడవైన రాముఁడా! గంగానది యెట్లు మొదట నాకాశమునొందినదో ఆవృత్తాంతమంతయును నీకుఁజెప్పితిని.

అప్పుడు మనోహరయై పాపములేక యెల్లప్పుడును నీళ్లుగలిగి పాఱుచుండు హిమవంతునికూఁతురైన గంగ దేవతానదియై దేవలోకము నొందినది.

ఇది ముప్పదియైదవసర్గము.

---

## ముప్పదియాఱవ సర్గము

ఆవిశ్వామిత్రుం డిట్లుచెప్పఁగానే పరాక్రమశాలులగు రామలక్ష్మణు లిర్వురు నాకథను శ్లాఘించి మునిశ్రేష్ఠుండగు నావిశ్వామిత్రుం జూచి యిట్లని చెప్పిరి. ౧

విశ్వామిత్రుఁడా! ధర్మిష్ఠంబును శ్రేష్ఠంబునగు హిమవంతుని పెద్ద కూఁతురైన గంగానదివృత్తాంత మింతమాత్రము చెప్పితివి; ఇంక నాగంగను స్వర్గములోను భూమిలోనుం గల్గిన వృత్తాంతమంతయుం సవిస్తరముగాఁ జెప్ప వలయుం; నీ విట్టికథలు సవిస్తరముగా నెఱుంగుదువు. ౨

ఏ కారణముచేత లోకపావనియగు గంగానది మూఁడుమార్గంబులు గల్గి ప్రవహించినది? 3

ధర్మంబుల నెఱింగిన విశ్వామిత్రుఁడా! త్రిపథగయైన గంగానది ఎట్లు ఏకార్యములుచేసి ముల్లోకంబులందును నదీశ్రేష్ఠయై ప్రసిద్ధినొందినది? ఈవృత్తాంతమంతయుం నాకుఁ జెప్పుమని రాముఁడు చెప్పెను. ౪

రాముం డట్లుచెప్పఁగానే తపోధనుం డగువిశ్వామిత్రుఁడు గంగానది కథ యంతయును సాకల్యంబుగా ఋషులనడుమఁ జెప్పెను. ౫

పురా రామ కృతోద్వాహో నీలకంఠో మహాతపాః,
దృష్ట్వా చ స్పృహయా దేవీం మైథునాయోపచక్రమే. ౬

శితికంఠస్య దేవస్య దివ్యం వర్షశతం గతమ్,
న చాపి తనయో రామ తస్యామాసీత్పరంతప. ౭

తతో దేవాః *సముద్విగ్నాః పితామహపురోగమాః,
యదిహోత్పద్యతే భూతం కస్తత్ప్రతి సహిష్యతే. ౮
అభిగమ్య సురాస్సర్వే ప్రణిపత్యేదమబ్రువన్. ౮½
దేవదేవ మహాదేవ లోకస్యాస్య హితే రత,
సురాణాం ప్రణిపాతేన ప్రసాదం కర్తుమర్హసి. ౯½

న లోకా ధారయిష్యంతి తవ తేజస్సురోత్తమ,
బ్రాహ్మేణ తపసా యుక్తో దేవ్యా సహ తపశ్చర ౧౦½

త్రైలోక్యహితకామార్థం తేజస్తేజసి ధారయ. ౧౧

దేవతానాం వచశ్శ్రుత్వా సర్వలోకమహేశ్వరః,
బాఢమిత్యబ్రవీత్సర్వాన్ పునశ్చేదమువాచ హ. ౧౨
ధారయిష్యామ్యహం తేజస్తేజస్యేవ సహోమయా,
త్రిదశాః పృథివీ చైవ నిర్వాణమధిగచ్ఛతు. ౧౩

యదిదం క్షుభితం స్థానాన్మమ తేజో హ్యనుత్తమమ్,
ధారయిష్యతి కస్తన్మే బ్రువంతు సురసత్తమాః. ౧౪

*"భయోద్విగ్నాః" అని మహేశ్వరతీర్థపాఠము.

రాముఁడా! మునుపు అధికంబగు తపముగల నీలకంఠుఁడైన శివుండు వివాహముచేసికొని భార్యయైన పార్వతింజూచి యాసగొని సంభోగముసేయ నారంభించెను. ౬

శత్రువులం దవింపఁజేయు రాముఁడా! శివుం డిట్లు క్రీడింపుచుండఁగానే దివ్యసంవత్సరంబులు నూఱు గడచినవి; అప్పుడును బార్వతియందుఁ గొడుకు పుట్టలేదు. ౭

అంత బ్రహ్మదేవుఁడు మున్నుగాఁగల దేవతలు "ఈపార్వతియందుఁ బుట్టుభూతము నెవ్వఁడు సహింపఁగలం" డని భయంబు నొందిరి. ౮

దేవతలందఱు శివునియొద్దకుఁబోయి నమస్కరించి యిట్లని చెప్పిరి. ౮½

లోకహితంబునం దాసక్తుఁడవు దేవతలకును దేవుఁడవు నగుశివుఁడా! దేవతలమైన మేమందఱము నీకు నమస్కారము చేసెదము: నీవు మాయందు ననుగ్రహము సేయవలయును. ౯½

దేవతాశ్రేష్ఠుఁడ వగుశివుఁడా! నీతేజస్సునంబుట్టిన పుత్రుని లోకంబులు ధరింపలేవు! కావున నీవు వేదోక్తంబగు యోగంబవలంబించి పార్వతీదేవిం గూడి తపం బాచరింపుము. ౧౦½

మూఁడులోకంబులకును మేలు గల్గుటకై రేతస్సును దేహంబునందె ధరింపుము! విడువవలదని దేవతలు చెప్పిరి. ౧౧

దేవతలమాట విని సమస్తలోకంబులకును మహేశ్వరుండగు శివుండు "మంచిది" అని చెప్పి మఱల నాదేవతల నందఱంజూచి యిట్లని పలికెను. ౧౨

నేను శరీరమందే రేతస్సును ధరించెదను; అలాగే పార్వతియును శరీరమందే శోణితమును ధరింపఁగలదు; దేవతలును సమస్తలోకంబులును సౌఖ్యంబు నొందెదుగాక. ౧౩

అయితే ఇప్పుడు రేతస్సుందు స్థానంబునుండి జాఱిన శ్రేష్ఠమయిన నారేతస్సు నెవ్వఁడు ధరింపనోపును? దేవతలు నాకు నిది చెప్పవలయునని శివుండు చెప్పెను. ౧౪

ఏవముక్తాస్సురాస్సర్వే ప్రత్యూచుర్వృషభధ్వజమ్,
యత్తేజః క్షుభితం హ్యద్య తద్ధరా ధారయిష్యతి. ౧౫
ఏవముక్తస్సురపతిః ప్రముమోచ మహీతలే,
తేజసా పృథివీ యేన వ్యాప్తా సగిరికాననా. ౧౬

తతో దేవాః పునరిదమూచుశ్చాథ హుతాశనమ్,
ప్రవిశ త్వం మహాతేజో రౌద్రం వాయుసమన్వితః. ౧౭

తదగ్నినా పునర్వ్యాప్తం సంజాతశ్శ్వేతపర్వతః,
దివ్యం శరవణం చైవ పావకాదిత్యసన్నిభమ్. ౧౮
యత్ర జాతో మహాతేజాః కార్త్తికేయోఽగ్నిసంభవః. ౧౮½

అథోమాం చ శివం చైవ దేవాస్సర్షిగణాస్తదా,
పూజయామాసురత్యర్థం సుప్రీతమనసస్తతః. ౧౯½
అథ శైలసుతా రామ త్రిదశానిదమబ్రవీత్,
సమన్యురశపత్సర్వాన్ క్రోధసంరక్తలోచనా. ౨౦½
యస్మాన్నివారితా చైవ సంగతిః పుత్రకామ్యయా,
అపత్యం స్వేషు దారేషు తస్మాన్నోత్పాదయిష్యథ. ౨౧½
అద్య ప్రభృతి యుష్మాకమప్రజాస్సంతు పత్నయః, ౨౨

ఏవముక్త్వా సురాన్సర్వాన్ శశాప పృథివీమపి. ౨౨½

అవనే నైకరూపా త్వం బహుభార్యా భవిష్యసి. ౨౩
న చ పుత్రకృతాం ప్రీతిం మత్క్రోధకలుషీకృతా,

ఇట్లు శివుఁడు చెప్పఁగా దేవతలందఱును "జలించిన రేతస్సును భూమి ధరింపఁగలదు" అని శివునితోఁ జెప్పిరి. ౧౫

దేవతలకుఁ బ్రభువైనశివుండు దేవతలమాట విని రేతస్సును భూమిమీఁద విడిచెను. ఆరేతస్సు పర్వతములతో నరణ్యములతోనుం గూడియున్న భూమియంతయుం వ్యాపించెను. ౧౬

అంత నారేతస్సు భూమియంతయుం వ్యాపించినందున భయపడి దేవత లగ్నిదేవునింజూచి "నీవు వాయువుంగూడి యీశివరేతస్సును బ్రవేశించుము." అని మాటిమాటికిఁ జెప్పిరి. ౧౭

ఆరేతస్సు అగ్నిదేవునిచే వ్యాపింపఁబడినదై శ్వేతపర్వతముగా నైనది. అంత నిప్పతోను సూర్యునితోను సమానమైన దివ్యమగు తెల్లువనమైనది. ఆ తెల్లువనమునందే మహాతేజుండగు కుమారస్వామి పుట్టెను. అతనికిఁ గృత్తికలు పాలిచ్చి పెంచినందున గార్తికేయుండని పేరుగల్గెను. అగ్నిదేవునిచే ధరింపఁబడినందున నతం డగ్నిపుత్రుం డనంబడెను. ౧౮

అంత నప్పుడు దేవతలును ఋషులును మిక్కిలియుం సంతసించి పార్వతీపరమేశ్వరుల నధికముగాఁ బూజించిరి. ౧౯

రాముఁడా! అంతఁ బార్వతీదేవి కోపించి యెఱ్ఱనికండ్లతో దేవతల నందఱను శపించెను. ౨౦

మీరు పుత్రేచ్ఛచేఁ జేయఁబడుచున్న సంభోగమును నిలిపించితిరి. కావున మీకు స్వభార్యలయందు సంతానము కలుగదు. ౨౧

ఇదిమొదలు మీభార్యలకు సంతానము లేక పోవుఁగాక యని పార్వతి దేవతల శపించెను.

ఆపార్వతి యీప్రకారము దేవతల శపియించి భూమినిగూడ శపించెను. ౨౨

ఓభూమీ! నీవు నానావిధరూపములు గల్గి బహురాజులకు భార్యవు కాఁగలవు. దుష్టబుద్ధిగల భూమీ! నీవు నాకుఁ గొడుకుగల్గుట కిచ్చగింపకుండు

ప్రాప్స్యసి త్వం సుదుర్మేధే మమ పుత్రమనిచ్ఛతీ. ౨౪

తాన్ సర్వాన్ వ్రీళితాన్ దృష్ట్వా సురాన్ సురపతి స్తదా,
గమనాయోపచక్రామ దిశం వరుణపాలితామ్. ౨౫
స గత్వా తప ఆతిష్ఠత్పార్శ్వే తస్యోత్తరే*గిరౌ,
హిమవత్ప్రభవే శృంగే దేవ్యా సహ మహేశ్వరః. ౨౬

ఏష తే విస్తరో రామ శైలపుత్ర్యా నివేదితః,
గంగాయాః ప్రభవం చైవ శృణు మే సహలక్ష్మణః. ౨౭

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షట్త్రింశస్సర్గః.

## సప్తత్రింశస్సర్గః

తప్యమానే తపో దేవే దేవాస్సర్షిగణాః పురా,
సేనాపతిమభీప్సంతః పితామహముపాగమన్. ౧
తతోఽబ్రువన్ సురాస్సర్వే భగవంతం పితామహమ్,
ప్రణిపత్య సురాస్సర్వే సేంద్రాస్సాగ్నిపురోగమాః. ౨
యో నస్సేనాపతిర్దేవ దత్తో భగవతా పురా,
తపః పరమమాస్థాయ తప్యతే స్మ సహోమయా. ౩

యదత్రానంతరం కార్యం లోకానాం హితకామ్యయా,
సంవిధత్స్వ విధానజ్ఞ త్వం హి నః పరమా గతిః, ౪

దేవతానాం వచశ్శ్రుత్వా సర్వలోకపితామహః,

* "గిరేః" అని గోవిందరాజపాఠము.

టంజేసి శాపంబున నీవెప్పుడును గొడుకువలనం గల్గుసంతోషంబు నొంద లేవని భూమిని శపించెను. ౨౩,౨౪

ఆదేవత లందఱు సిగ్గుఁబొందియుండుటం జూచి దేవతలకుఁ బ్రభువైన శివుండప్పుడు వరుణపాలితం బగుపశ్చిమదిక్కునకుఁ బోయెను. ౨౫

ఆమహేశ్వరుండుపోయి యుత్తరపుదిక్కున నుండు హిమవత్పర్వతము నందు, ఆపర్వతముపార్శ్వమునందుండు నొకశిఖరంబునఁ బార్వతీదేవితోఁ దపము సేయ నారంభించెను. ౨౬

రామునఁడా! నీకీప్రకారము పార్వతీదేవికథను వివరముగాఁ జెప్పితిని. ఇంక గంగానదివలన గుమారస్వామి పుట్టినవృత్తాంతము సెప్పెద లక్ష్మణునితోఁ గూడ వినుము. (అని మహేశ్వరతీర్థాభిప్రాయము). ఇంక గంగానదీప్రభావ ము సెప్పెద లక్ష్మణునితోఁ గూడ వినుము. (అని గోవిందరాజాభిప్రాయము.)

ఇది ముప్పదియాఱవ సర్గము.

---

## ముప్పదియేడవ సర్గము

ఇట్లు శివుఁడు తపస్సు సేయుచుండఁగా దేవతలును ఋషులును సేనా పతినిగోరి బ్రహ్మదేవునియొద్దకుఁ బోయిరి. ౧

అంత నగ్ని మున్నుగాఁగల దేవతలందఱును దేవేంద్రునిం గూడి బ్రహ్మదేవునకు నమస్కరించి యిట్లని చెప్పిరి. ౨

బ్రహ్మదేవుఁడా! భగవంతుండ వగు నీవు మునుపు మాకెవ్వని సేనా నాయకునిగా నిచ్చితివో; ఆరుద్రుండిపుడు పార్వతీదేవింగూడి పరమం బయిన తపము సేయుచున్నాఁడు. ౩

ఉపాయజ్ఞుండవగు బ్రహ్మదేవుఁడా! యీవిషయంబునం దిఁక నేమి సేయవలయునో లోకంబులకు మేలు గలుటకై దానిదాని నాలోచింపుము. మాకుఁ బరమగతివి నీవెకదా! అని దేవతలు బ్రహ్మదేవునితోఁ జెప్పిరి. ౪

దేవతలమాట విని సమస్తలోకంబులకును బితామహుండగు బ్రహ్మ దేవుఁడు మధురంబులగు మాటలచేనోదార్చుచు దేవతలంజూచియిట్లనిచెప్పెను.

సాంత్వయన్మధురై ర్వాక్యై స్త్రిదశానిదమబ్రవీత్. ౫
శైలపుత్ర్యా యదుక్తం తన్న ప్రజాస్యథ పత్నిషు,
తస్యా వచనమక్లిష్టం సత్యమేతన్న సంశయః. ౬

ఇయమాకాశగా గంగా యస్యాం పుత్రం హుతాశనః,
జనయిష్యతి దేవానాం సేనాపతిమరిందమమ్. ౭
జ్యేష్ఠా శైలేంద్రదుహితా మానయిష్యతి తత్సుతమ్,
ఉమాయా స్తద్బహుమతం భవిష్యతి న సంశయః. ౮

తచ్ఛ్రుత్వా వచనం తస్య కృతార్థా రఘునందన,
ప్రణిపత్య సురాస్సర్వే పితామహమపూజయన్. ౯
తే గత్వా పర్వతం రామ కైలాసం ధాతుమండితమ్,
అగ్నిం నియోజయామాసుః పుత్రార్థం సర్వదేవతాః. ౧౦
దేవకార్య మిదం దేవ సంవిధత్స్వ హుతాశన,
శైలపుత్ర్యాం మహాతేజో గంగాయాం తేజ ఉత్సృజ. ౧౧

దేవతానాం ప్రతిజ్ఞాయ గంగామభ్యేత్య పావకః,
గర్భం ధారయ వై దేవి దేవతానామిదం ప్రియమ్. ౧౨
తస్య తద్వచనం శ్రుత్వా దివ్యం రూపమధారయత్,
దృష్ట్వా తన్మహిమానం స సమంతాదవకీర్యత. ౧౩

సమంతత స్తదా దేవీమభ్యషించత పావకః,
సర్వస్రోతాంసి పూర్ణాని గంగాయా రఘునందన. ౧౪

తమువాచ తతో గంగా సర్వదేవపురోహితమ్,

పార్వతీదేవి మిమ్ము శపించినందువలన మీరలు భార్యలయందు సంతానము గలిగింపలేరు; పార్వతీదేవిమాట వ్యర్థము కానేరదు; నేను జెప్పినది సత్యము. ఇందు సందియము లేదు. ౬

ఇదిగో! ఆకాశమందుఁ దిరుగుగంగానది దీనియం దగ్నిదేవుఁడు శత్రుల నడఁగఁద్రొక్కఁజాలిన దేవసేనాపతియగు కొడుకును బుట్టింపఁ గలఁడు. ౭

హిమవంతుని జ్యేష్ఠపుత్రియగు గంగానది యాయగ్నిదేవునిచే నుంచఁబడినగర్భమును బహుమానపూర్వకముగా ధరింపఁగలదు. అట్లుకూడ ధరించుట పార్వతికిని మిక్కిలి యిష్టముగా నుండునని బ్రహ్మదేవుఁడు దేవతలకుఁజెప్పెను.

రాముఁడా! దేవతలందఱు నాబ్రహ్మదేవునిమాట విని కృతార్థులై యాబ్రహ్మదేవుని నమస్కరించిరి. ౮

రాముఁడా! ఆదేవతలందఱు ధాతువులచే నిండియుండు కైలాసపర్వతమునకుఁబోయి కొడుకుఁ బుట్టింపుమని యగ్నిదేవు నాజ్ఞాపించిరి. ౧౦

అగ్నిహోత్రుఁడా! నీవీదేవకార్యమును జేయుము; హిమవంతుని కొమార్తెయగు గంగయందు నీవు ధరించియుండు శివునిరేతస్సును విడువుమని దేవత లాజ్ఞాపించిరి. ౧౧

అగ్నిదేవుఁడు దేవతలమాట నంగీకరించి గంగయొద్దకుఁబోయి "నీవు గర్భమును ధరింపుము. ఇది దేవతలకుఁ బ్రియము" అని చెప్పెను. ౧౨

ఆయగ్నిదేవుండు చెప్పినమాటవిని గంగానది నదీరూపమును విడిచి దివ్యమైన స్త్రీరూపమును ధరించెను. అగ్నియు నాగంగసౌందర్యాతిశయమును జూచి కామంబున సర్వావయవంబులవలనను రేతస్సును విడిచెను. ౧౩

రాముఁడా! అప్పు డగ్నిహోత్రుఁడు గంగను అవయవములందంతటను రేతస్సు వ్యాపించునట్లు దడిపెను: అంత గంగానదియింద్రియము లన్నియు రేతస్సుచే నిండినవి. ౧౪

అంత గంగాదేవి ఆరేతస్సువేఁడిమిచే దహింపఁబడి మిక్కిలి దుఃఖము

అశక్తా ధారణే దేవ తవ తేజస్సముద్ధతమ్. ౧౫
దహ్యమానాగ్నినా తేన సంప్రవ్యథితచేతనా. ౧౫½

అథాబ్రవీదిదం గంగాం సర్వదేవహుతాశనః,
ఇహ హైమవతే పాదే గర్భోఽయం సన్నివేశ్యతామ్. ౧౬½

శ్రుత్వా త్వగ్నివచో గంగా తం గర్భమతిభాస్వరమ్,
ఉత్ససర్జ మహాతేజస్స్రోతోభ్యో హి తదాఽనఘ. ౧౭½

యదస్యా నిర్గతం తస్మాత్తప్తజాంబూనదప్రభమ్,
కాంచనం ధరణీం ప్రాప్తం హిరణ్యమమలం శుభమ్. ౧౮½

తామ్రం కార్ష్ణాయసం చైవ తైక్ష్ణ్యాదేవాభ్యజాయత,
మలం తస్యాభవత్తత్ర త్రపుసీసకమేవ చ. ౧౯½
తదేతద్ధరణీం ప్రాప్య నానాధాతురవర్ధత. ౨౦

నిక్షిప్తమాత్రే గర్భేతు తేజోభిరభిరంజితమ్,
సర్వం పర్వతసన్నద్ధం సౌవర్ణమభవద్వనమ్. ౨౧
జాతరూపమితి ఖ్యాతం తదాప్రభృతి రాఘవ,
సువర్ణం పురుషవ్యాఘ్ర హుతాశనసమప్రభమ్. ౨౨

తృణవృక్షలతాగుల్మం సర్వం భవతి కాంచనమ్. ౨౨½

తం కుమారం తతో జాతం సేంద్రాస్సహ మరుద్గణాః,

పొంది "అగ్నిదేవుఁడా! నీరేతస్సు అప్పటప్పటికి వృద్ధిఁబొందుచున్నది. నేను దాని ధరింపనోపను" అని సమస్తదేవతలకును బురోహితుండగు నగ్ని దేవునితోఁ జెప్పెను. ౧౪,౧౫

అంత సమస్తదేవతలం గూర్చి హుతంబగుదాని భుజించునట్టి యగ్ని దేవుఁడు "హిమవత్పర్వత పాదమం దీగర్భము నుంచుము" అని గంగతోఁ జెప్పెను. ౧౬

మహాతేజుఁడవు నిష్పాపుఁడవు నగు రాముఁడా! గంగానది యగ్ని మాట విని యప్పుడు పరమభాస్వరంబగు నాగర్భంబు నింద్రియములవలన విసర్జించెను. ౧౭

ఆ గంగనుండి బయలువెడలిన రేతస్సు భూమిమీఁదఁ బడుటవలనఁ గరఁగింపఁబడి పరిశుద్ధమై యుండు బంగారమువంటి బంగారమును నిర్మలమును మాంగళకరమునగు వెండియును బుట్టినవి. ౧౮

అక్కడ ఆరేతస్సు క్షారమువలన రాగియు నల్లని యినుమును బుట్టినవి; ఆరేతస్సు మలము తగరముగాను సీసముగాను అయినవి. ౧౯

ఇట్లు గంగచే విడువఁబడినయా రేతస్సు భూమిమీఁద నానావిధము లగు ధాతువులై వృద్ధిఁబొందినవి. ౨౦

గంగ గర్భము నుంచిన మాత్రముననే శ్వేతపర్వతమునగల [illegible] రెల్లుపొదమాత్రముగ దాని కాంతులచే వ్యాపింపఁబడి సువర్ణమయమైనది. ౨౧

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అప్పుడు బంగారము పుట్టినది కాఁబట్టి అదిమొదలు నిప్పుతో సరివచ్చుకాంతిగలశ్రేష్ఠమైన బంగారము "జాతరూపము (పుట్టినరూపముగలది)" అని పేర్కొనఁబడినది. ౨౨

ఆవనమందలి తృణములును వృక్షములును దీఁగెలును పొదలును అన్నియును బంగారమైనవి. ౨౩

గంగగర్భమును విడువఁగాఁ బుట్టినకుమారుని ఇంద్రుఁడుమున్నగు దేవ

క్షీరసంభావనార్థాయ కృత్తికాస్సమయోజయన్. ౨౩॥

తాః క్షీరం జాతమాత్రస్య కృత్వా సమయముత్తమమ్,
దదుః పుత్రోఽయమస్మాకం సర్వాసామితి నిశ్చితాః. ౨౪॥

తతస్తు దేవతాస్సర్వాః కార్తికేయ ఇతి బ్రువన్,
పుత్రస్త్రైలోక్యవిఖ్యాతో భవిష్యతి న సంశయః. ౨౫॥
తేషాం తద్వచనం శ్రుత్వా స్కన్నం గర్భపరిస్రవే,
స్నాపయన్ పరయా లక్ష్మ్యా దీప్యమానం యథానలమ్. ౨౬॥

స్కన్ద ఇత్యబ్రువన్ దేవాస్స్కన్నం గర్భపరిస్రవాత్,
కార్తికేయం మహాభాగం కాకుత్స్థ జ్వలనోపమమ్. ౨౭॥

ప్రాదుర్భూతం తతః క్షీరం కృత్తికానామనుత్తమమ్,
షణ్ణాం షడాననో భూత్వా జగ్రాహ స్తనజం పయః. ౨౮॥
గృహీత్వా క్షీరమేకాహ్నా సుకుమారవపుస్తదా,
అజయత్స్వేన వీర్యేణ దైత్యసేనాగణాన్ విభుః. ౨౯॥

సురసేనాగణపతిం తతస్తమతులద్యుతిమ్,
అభ్యషిఞ్చన్ సురగణాస్సమేత్యాగ్నిపురోగమాః. ౩౦॥
ఏష తే రామ గంగాయా విస్తరోఽభిహితో మయా,
కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్యస్తథైవ చ. ౩౧॥

భక్తశ్చ యః కార్తికేయే కాకుత్స్థ భువి మానవః,

తలు కృత్తికలందఱుం గూడి యొక్కటిగాఁ బాలిచ్చి పెంచుదురని కృత్తికలతోఁ జెప్పిరి. ౨౩॥

ఆకృత్తికలు "ఈశిశువు మాకందఱకును బుత్రుండయ్యెడి" నని దేవతల ముందఱ శ్రేష్ఠమైన సంకేతముచేసికొని పుట్టినట్టుగానే యున్నట్టి యాశిశువునకుఁ బాలిచ్చిరి. ౨౪॥

అంత దేవతలందఱు "ఈకుమారుఁడు కార్తికేయుండని ముల్లోకంబులందునుం బ్రసిద్ధుఁడు కాఁగలఁడు; సందియములేదు" అని చెప్పిరి. ౨౫॥

ఆదేవతలమాట విని యాకృత్తికలు గర్భస్రావమగుచుండఁగా నేలంబడి యగ్నిహోత్రుఁడుం బోలె నధికంబగుకాంతిచేఁ బ్రకాశించుచున్న యాశిశువును స్నానముచేయించిరి. ౨౬॥

రామఁడా! దేవతలు మహాభాగుండును నిప్పుతో సరివచ్చువాఁడు నగు కృత్తికలకొడుకు గర్భస్రావంబునం బడినవాఁడు కావున నతనికి స్కందుండని పేరిడిరి. ౨౭॥

స్నానముచేయించినంతటఁ గృత్తికల స్తనంబులందుఁ బాలుపుట్టినది; ఆశిశువును ఆఱుముఖములవాఁడయి యాఱ్వురికృత్తికలయు స్తన్యమును ద్రాగెను.

అంత నాకుమారుండు ఒక్కదినంబు స్తన్యంబుత్రాగఁ ద్రాగి కోమలంబగు దేహముగలవాఁడైనను బరమేశ్వరపుత్రుం డగుటం జేసి తానును లోకవిభుండు కావున తనపరాక్రమంబుననె రాక్షససేనాసమూహాంబుల జయించెను.

అంత నగ్నిమున్నగుదేవతలందఱువచ్చి సరిలేనికాంతిం గ్రాలుచున్న యాకుమారుని దేవసేనల కన్నింటికి నధిపతిగా నభిషేకించిరి. ౩౦॥

రామఁడా! నీకు నేను ధన్యంబును బుణ్యమునగు గంగానదికి స్వర్గమందు జరిగినవృత్తాంతమును అలాగే ధన్యముఁ బుణ్యమునగు కుమారస్వామి యుత్పత్తియుం జెప్పితిని. ౩౧॥

రామఁడా! భూమియం దే మనుష్యుఁడు కుమారస్వామియందు భక్తి గలిగియుండునో; అతం డిచ్చట దీర్ఘాయుస్సు గలిగి పుత్రపౌత్రులం గూడి

ఆయుష్మాన్ పుత్రపౌత్రైశ్చ స్కన్దసాలోక్యతాం వ్రజేత్.

ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తత్రింశస్సర్గః



## అష్టత్రింశస్సర్గః.

తాం కథాం కౌశికో రామే నివేద్య కుశికాత్మజః,
పునరేవాపరం వాక్యం కాకుత్స్థమిదమబ్రవీత్. ౧
అయోధ్యాధిపతిశ్శూరః పూర్వమాసీన్నరాధిపః,
సగరో నామ ధర్మాత్మా ప్రజాకామస్స చాప్రజః. ౨

వైదర్భదుహితా రామ కేశినీ నామ నామతః,
జ్యేష్ఠా సగరపత్నీ సా ధర్మిష్ఠా సత్యవాదినీ. ౩
అరిష్టనేమేర్దుహితా రూపేణాప్రతిమా భువి,
ద్వితీయా సగరస్యాసీత్పత్నీ సుమతిసంజ్ఞితా. ౪
తాభ్యాం సహ తదా రాజా పత్నీభ్యాం తప్తవాంస్తపః,
హిమవన్తం సమాసాద్య భృగుప్రస్రవణే గిరౌ. ౫
అథ వర్షశతే పూర్ణే తపసాఽఽరాధితో మునిః,
సగరాయ వరం ప్రాదాద్భృగుస్సత్యవతాం వరః. ౬

అపత్యలాభస్సుమహాన్ భవిష్యతి తవానఘ,
కీర్తిం చాప్రతిమాం లోకే ప్రాప్స్యసే పురుషర్షభ. ౭

ఏకా జనయితా తాత పుత్రం వంశకరం తవ,
షష్టిః పుత్రసహస్రాణి అపరా జనయిష్యతి. ౮

యుండి యంతంబునఁ గుమారస్వామిలోకంబు నొందు నని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను.

ఇది ముప్పదిఏడవసర్గము.

---

## ముప్పదియెనిమిదవ సర్గము

గాధి కుమారుండగు విశ్వామిత్రుఁడు ఆకథను రామునకుఁ జెప్పి సుఖల రామునిఁగూరిచి యీమాటలు జెప్పెను. ౧

పూర్వము స్వధర్మమును ఎంతమాత్రము తప్పులేక ధర్మాత్ముఁడై యయోధ్యకు రాజైయుండు సగరుండనియెడు రాజొకఁడుండెను; అతఁడు సంతానములేనివాఁడగుటం జేసి సంతానముఁ గోరుచుండెను. ౨

కేశినియనెడు విదర్భరాజుకొమార్తె యొకతె యుండెను; మిక్కిలి ధార్మికురాలును సత్యవాదినియుఁగు నాకేశిని సగరునకు జ్యేష్ఠభార్యయైనది. 3

భూమియందెక్కుడగు సౌందర్యంబున సరిలేని సుమతియను కశ్యపుని కొమార్తె సగరునకు రెండవభార్య యయ్యెను. ౪

అప్పుడా సగరచక్రవర్తి ఆభార్యలంగూడి హిమవత్పర్వతముఁ జేరి యందు భృగుప్రస్రవణంబను నొక్కకొండయందుఁ దపంబు చేసెను. ౫

అంత సగరుఁ డిట్లు నూఱుసంవత్సరములు దపము సేసినపిమ్మట సత్యవంతులలో శ్రేష్ఠుఁడగు భృగుమహాముని తపంబునకు సంతోషించి సగరునకు వరం బొసంగెను. ౬

పాపరహితుండవగు సగరుఁడా! నీకెక్క మిక్కిలి యధికముగా సంతానముగల్గును; పురుషశ్రేష్ఠుఁడవైన సగరుఁడా! నీ వీలోకంబునందు సరిలేని యశంబును బొందఁగలవు. ౭

నాయనా! నీభార్యలలోనొకతె వంశకరుండగు నొకకొడుకును గనఁగలదు; రెండవభార్య వంశకరులు గానట్టి యఱువదివేలపుత్రులను గనఁగలదు. అని వరము నిచ్చెను. ౮

భాషమాణం మహాత్మానం రాజపుత్ర్యౌ ప్రసాద్య తమ్,
ఊచతుః పరమప్రీతే కృతాంజలిపుటే తదా. ౯

ఏకః కస్యాస్సుతో బ్రహ్మన్ కా బహూన్ జనయిష్యతి,
శ్రోతుమిచ్ఛావహే బ్రహ్మన్ సత్యమస్తు వచస్తవ. ౧౦

తయోస్తద్వచనం శ్రుత్వా భృగుః పరమధార్మికః,
ఉవాచ పరమాం వాణీం స్వచ్ఛందోఽత్ర విధీయతామ్. ౧౧

ఏకో వంశకరో వాస్తు బహవో వా మహాబలాః,
కీర్తిమంతో మహోత్సాహాః కా వా కం వరమిచ్ఛతి. ౧౨

మునేస్తు వచనం శ్రుత్వా కేశినీ రఘునందన,
పుత్రం వంశకరం రామ జగ్రాహ నృపసన్నిధౌ. ౧౩

షష్టిః పుత్రసహస్రాణి సుపర్ణభగినీ తదా,
మహోత్సాహాన్ కీర్తిమతో జగ్రాహ సుమతిస్సుతాన్. ౧౪

ప్రదక్షిణమృషిం కృత్వా శిరసాఽభిప్రణమ్య చ,
జగామ స్వపురం రాజా సభార్యో రఘునందన. ౧౫

అథ కాలే గతే తస్మిన్ జ్యేష్ఠా పుత్రం వ్యజాయత,
అసమంజ ఇతి ఖ్యాతం కేశినీ సగరాత్మజమ్. ౧౬

సుమతిస్తు నరవ్యాఘ్ర గర్భతుంబం వ్యజాయత,
షష్టిః పుత్రసహస్రాణి తుంబభేదాద్వినిస్సృతాః. ౧౭

ఘృతపూర్ణేషు కుంభేషు ధాత్ర్యస్తాన్ సమవర్ధయన్,

ఇట్లు చెప్పుచున్నమహాత్ముం డగు నాభృగుమహర్షిని సంతోషపఱిచి కేశినియుం సుమతియును మిక్కిలి సంతసించి చేమోడ్పుగీలించి యిట్లని చెప్పిరి.

బ్రాహ్మణుండవైన భృగుమహామునీ! ఎవ్వతె కొకకొడుకు పుట్టును? ఎవ్వతె కఱువదివేవురు కొడుకులు గల్గుదురు? దీనిని మేము వినఁగోరెదము. నీ విట్లు చెప్పెదవో అట్లె అగుఁగాక; మాకది యిష్టమని చెప్పిరి. ౧౦

ఆ కేశినీసుమతులమాటను విని పరమధార్మికుండగు భృగుమహర్షి వారలం జూచి "మీరు స్వేచ్ఛగా నేర్పాటుచేసికొనుఁడు; ఎవతె వంశకరుండగు నొకకొడుకె కావలయునని కోరునో దానికట్టికలుగును; ఎవతె మహాబలులును కీర్తిగలవారును అధికమైన యుత్సాహముగలవారునగు వంశకరులు మాత్రము కానట్టి యఱువదివేవురుఁ గొడుకులఁ గోరునో దానికట్లె యఱువదివేవురును గల్గుదురు; మీలో నెవ్వతె కేవరము కావలయును? దానిం జెప్పుఁ"డని యుత్కృష్టం బగుమాట చెప్పెను. ౧౧,౧౨

రఘునందనుండవగు రాముఁడా! భృగుమహామునిమాట వినినంతనె పెద్దభార్యయైన కేశిని సగరునిసన్నిధానంబున వంశకరుండగు పుత్రుంగోరెను.

అప్పుడు గరుత్మంతుని తోఁబుట్టువగు సుమతి మహోత్సాహులును కీర్తిగలవారునగు నఱువదివేవురఁ గొడుకులం గోరెను. ౧౪

రాముఁడా! సగరచక్రవర్తి భార్యలంగూడి యాభృగుమహర్షికిఁ బ్రదక్షిణనమస్కారంబులు చేసి తనపట్టణంబునకుఁ బోయెను. ౧౫

అంత గర్భధారణకాలమగు తొమ్మిదిమాసములును గడవఁగానే సగరుని పెద్దభార్యయగు కేశిని యసమంజుఁ డను పేరం బ్రసిద్ధుఁడైనపుత్రునింగనెను.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! రెండవభార్యయైన సుమతికిని సొరకాయవలెనుండు గర్భపిండ మొకటి పుట్టినది; ఆపిండమును భేదింపఁగానే యందుండి అఱువదివేవురుకొడుకు లుద్భవించిరి. ౧౭

దాదు లాశిశువుల నేతిచేనిండినకుండలం దుంచి పెంచిరి; అంత దీర్ఘ

కాలేన మహతా సర్వే యౌవనం ప్రతిపేదిరే. ౧౮
అథ దీర్ఘేణ కాలేన రూపయౌవనశాలినః,
షష్టిః పుత్రసహస్రాణి సగరస్యాభవంస్తదా. ౧౯
స చ జ్యేష్ఠో నరశ్రేష్ఠ సగరస్యాత్మసంభవః,
బాలాన్ గృహీత్వా తు జలే సరయ్వా రఘునందన. ౨౦
ప్రక్షిప్య ప్రహసన్నిత్యం మజ్జతస్తాన్ సమీక్ష్య వై. ౨౦½
ఏవం పాపసమాచార స్సజ్జనప్రతిబాధకః,
పౌరాణామహితే యుక్తః పుత్రో నిర్వాసితః పురాత్. ౨౧½

తస్య పుత్రోఽంశుమాన్నామ అసమంజస్య వీర్యవాన్,
సమ్మతస్సర్వలోకస్య సర్వస్యాపి ప్రియంవదః. ౨౨½

తతః కాలేన మహతా మతిస్సమభిజాయత,
సగరస్య నరశ్రేష్ఠ యజేయమితి నిశ్చితా. ౨౩½
స కృత్వా నిశ్చయం రామ సోపాధ్యాయగణస్తదా,
యజ్ఞకర్మణి వేదజ్ఞో యష్టుం సముపచక్రమే. ౨౪½

ఇతి శ్రీమద్బాలకాండే, అష్టత్రింశస్సర్గః.

---

## ఏకోనచత్వారింశస్సర్గః

విశ్వామిత్రవచశ్శ్రుత్వా కథాంతే రఘునందనః,
ఉవాచ పరమప్రీతో మునిం దీప్తమివానలమ్. ౧

శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమామ్,

కాలంబున వారందఱు యౌవనంబు నొందిరి. ౧౮

అంత దీర్ఘకాలంబునకు సగరునికొడుకు లఱువదివేవురును సౌందర్య మును యౌవనంబును గల్గి ప్రకాశించిరి. ౧౯

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! సగరుని జ్యేష్ఠపుత్త్రుఁడు ఎల్లప్పుడును బిల్లవాండ్రం బట్టి సరయూనదిజలంబులం బడఁద్రోసి వార లాజలంబుల మునుంగుటంజూచి నవ్వుచుండెను ౨౦ ౨౦౼

ఇట్లు పాపిష్ఠుంబగు నడతగల్గి మంచివారి బాధించుచుఁ బట్టణవాసులకు వారి కనిష్టము సేయుచున్న యసమంజుని సగరుఁడు పట్టణంబునుండి వెడలఁ గొట్టెను. ౨౧౼

ఆయసమంజునకు బరాక్రమశాలియు సమస్తజనులకు సమ్మతుండును ఎల్లరకుఁ బ్రియంబుగా మాటలాడువాఁడునగు నంశుమంతుండనుపుత్త్రుం డొకఁ డుండెను. ౨౨౼

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అంత దీర్ఘకాలము గడచిన పిదప సగరునకు "యాగము సేయువలయు"నని నిశ్చితంబగు తలంపుగల్గినది ౨౩౼

రాముఁడా! అప్పుడు వేదవేదార్థంబుల నెఱింగిన యాసగరుఁడు ఋత్విజులంగూడి యాగకార్యంబుగుఱించి యేర్పాటుచేసి యాగంబు సేయ నారంభించెనని విశ్వామిత్త్రుఁడు రామునకుఁ జెప్పెను. ౨౪౼

ఇది ముప్పదియెనిమిదవసర్గము.



## ముప్పదితొమ్మిదవ సర్గము

రాముండు విశ్వామిత్త్రునిమాట విని తుదను "సగరుఁడు యాగము నారంభించె" ననుమాటను వినినంతనె మిక్కిలి సంతోషమునొంది చక్కఁగా మండి నిలిచియున్న యగ్నిహోత్త్రునిం బోలె వెలుంగు విశ్వామిత్త్రునిం జూచి యిట్లని చెప్పెను. ౧

బ్రాహ్మణుఁడ వైన విశ్వామిత్త్రుఁడా! నీకు మంగళ మగుఁగాక; నా

పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్. ౨

విశ్వామిత్రస్తు కాకుత్స్థమువాచ ప్రహసన్నివ. ౨½

శ్రూయతాం విస్తరో రామ సగరస్య మహాత్మనః. ౩
శంకరశ్వశురో నామ హిమవానచలోత్తమః,
వింధ్యపర్వతమాసాద్య నిరీక్షేతే పరస్పరమ్. ౪

తయోర్మధ్యే ప్రవృత్తోఽభూద్యజ్ఞస్స పురుషోత్తమ,
స హి దేశో నరవ్యాఘ్ర ప్రశస్తో యజ్ఞకర్మణి. ౫

తస్యాశ్వచర్యాం కాకుత్స్థ దృఢధన్వా మహారథః,
అంశుమానకరోత్తాత సగరస్య మతే స్థితః. ౬

తస్య పర్వణి తం యజ్ఞం యజమానస్య వాసవః,
రాక్షసీం తనుమాస్థాయ యజ్ఞీయాశ్వమపాహరత్. ౭

హ్రియమాణేతు కాకుత్స్థ తస్మిన్నశ్వే మహాత్మనః,
ఉపాధ్యాయగణాస్సర్వే యజమానమథాబ్రువన్. ౮
అయం పర్వణి వేగేన యజ్ఞీయాశ్వోఽపనీయతే,
హర్తారం జహి కాకుత్స్థహయశ్చైవోపనీయతామ్. ౯

యజ్ఞచ్ఛిద్రం భవత్యేతత్సర్వేషామశివాయ నః,
తత్తథా క్రియతాం రాజన్ యథాఽచ్ఛిద్రః క్రతుర్భవేత్.

కూటస్థుఁడగు సగరచక్రవర్తి యాగం బెట్లుచేసెను? నే నీకథను వివరముగా వినఁగోరెదను. ౧

విశ్వామిత్రుండును "ఇతఁడు నేను జెప్పఁదలంచినదానినే యడిగెను; ఇతఁడు సర్వజ్ఞుఁడైనను దానెఱుంగనివాఁడు వోలె నభినయించుచున్నాఁడు" అని నవ్వుచు రాముని జూచి యిట్లని చెప్పెను. ౨

రాముఁడా! మహాత్ముండగు సగరునికథయంతయుం జెప్పెద; వినుము. 3

శివునిమామయైన హిమవంతుండను పర్వతశ్రేష్ఠము వింధ్యపర్వతము దగ్గఱియున్నది; ఆపర్వతములు రెండును మిక్కిలి యున్నతములై యౌన్నందునఁ బరస్పరము చూచుచున్నట్లున్నవి. ౪

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఆవింధ్యహిమవత్పర్వతముల నడుమనుండుదేశము యాగములు సేయుటకుఁ బ్రశస్తమైనది. కావున నాసగరుని యాగము ఆరెండు పర్వతములనడుమ జరిగినది. ౫

రాముఁడా! దృఢంబగుధనుస్సు ధరించి తన్నును సారథిని గుఱ్ఱంబులను గాపాడుకొనుచుఁ బహునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోఁజాలిన యంశుమంతుఁడు సగరునాజ్ఞ ననుసరించుచు నాయశ్వమును రక్షణార్థమై వెంబడించెను. ౬

ఇంద్రుఁడు రాక్షసవేషముదాల్చి యుక్థ్యము (ఇది యాగములో నొకభాగము) సేయుకాలమందు అశ్వమేధయాగము సేయు సగరుని యాగీయాశ్వము నపహరించెను. ౭

రాముఁడా! మహాత్ముండగు సగరుని యాగీయాశ్వం బపహరింపఁబడుచుండఁగానే ఋత్విజులందఱు దానిం జూచి సగరునితో నిట్లని చెప్పిరి. ౮

మనము ఉక్థ్యము సేయుచుండునపు డీయాగీయాశ్వము వేగంబున నపహరింపఁబడినది; కావున నపహరించినవానిం జంపి మఱల నాగుఱ్ఱమును దీసికొనిరమ్ము. ౯

ఇప్పుడు యాగమునందుఁ గలిగిన యీతప్పువలన మనకందఱకును కీడు గల్గును; కావున రాజా! ఈయాగం బెట్టపరాధములేక చక్కఁబడునో ఆప్రకారము సేయుమని ఋత్విజులు సగరునకుం జెప్పిరి. ౧౦

ఉపాధ్యాయవచశ్శ్రుత్వా తస్మిన్ సదసి పార్థివః,
షష్టిం పుత్రసహస్రాణి వాక్యమేతదువాచ హ. ౧౧
గతిం పుత్రా న పశ్యామి రక్షసాం పురుషర్షభాః,
మంత్రపూతైర్మహాభాగైరాస్థితో హి మహాక్రతుః. ౧౨

తద్గచ్ఛత విచిన్వధ్వం పుత్రకా భద్ర మస్తు వః,
సముద్రమాలినీం సర్వాం పృథివీమనుగచ్ఛత. ౧౩

ఏకైకయోజనం పుత్రా విస్తారమధిగచ్ఛత. ౧౩½

యావత్తురగసందర్శస్తావత్ఖనత మేదినీమ్,
తం చైవ హయహర్తారం మార్గమాణా మమాజ్ఞయా. ౧౪½
దీక్షితః పౌత్రసహితస్సోపాధ్యాయగణో హ్యహమ్,
ఇహ స్థాస్యామి భద్రం వో యావత్తురగదర్శనమ్. ౧౫½

ఇత్యుక్తా హృష్టమనసో రాజపుత్రా మహాబలాః,
జగ్ముర్మహీతలం రామ పితుర్వచనయంత్రితాః. ౧౬½
యోజనాయామవిస్తారమేకైకో ధరణీతలమ్,
బిభిదుః పురుషవ్యాఘ్రా వజ్రస్పర్శసమైర్భుజైః. ౧౭½

శూలైరశనికల్పైశ్చ హలైశ్చాపి సుదారుణైః,
భిద్యమానా వసుమతీ ననాద రఘునందన. ౧౮½

నాగానాం వధ్యమానానామసురాణాం చ రాఘవ,
రాక్షసానాం చ దుర్ధర్షస్సత్త్వానాం నినదోఽభవత్. ౧౯½

ఋత్విజులమాటవిని సగరచక్రవర్తి ఆయాగసదస్సునందుఁ దనకొడుకుల నఱువదివేవురంజూచి యీమాట చెప్పెను. ౧౧

పురుషశ్రేష్ఠుల రగుకొడుకులారా! ఈయశ్వమేధయాగము మంత్రజ్ఞులగు భాగ్యులైనఋత్విజులచేత ననుష్ఠింపఁబడుచున్నది. కావున రాక్షసుల కవకాశం బెంతమాత్రము నాకగుపడలేదు. ౧౨

కొడుకులారా! గుఱ్ఱము నపహరించినవారు పీరని మన మెఱుఁగము. కావున మీరుపోయి వెదకుఁడు; మీకు మంగళమగుఁగాక; సముద్రమధ్యమం దున్నట్టి భూమియంతయుఁ దిరిగి వెదకుఁడు. ౧౩

కొడుకులారా! మీర లొక్కొక్కఁ డొకయొకఁడుగా భూమియంతయుఁ దిరుగుఁడు. ౧౩½

మీరలు నాయాజ్ఞచొప్పున గుఱ్ఱము నపహరించినవాని వెదకుచు గుఱ్ఱ మగుపడువఱకు నేలం ద్రవ్వుఁడు. ౧౪½

నేను యాగదీక్షవహించి యున్నాను గావున మనుమండగు నంశుమంతునింగూడి ఋత్విజులతోఁగూడ నీయజ్ఞవాటమందే గుఱ్ఱముఁజూచుపర్యంత ముండెదను; మీకు మంగళమగుఁగాకని సగరుఁడు కొడుకులంజూచి చెప్పెను.

రాముఁడా! మహాబలులగు రాచకొమరులు సగరునిమాట విని సంతసించి తండ్రిమాటకు బద్ధులై భూమియందు వెదకఁబోయిరి. ౧౬½

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఆయఱువదివేవురు రాజపుత్రులును ఒక్కొక్కఁడు ఒక యోజనము నిడుపును, ఒకయోజనము వెడల్పునుం గలభూమి వంతున వజ్రములంబోలెఁగఠినంబులగునఖములచే భూమియంతయుఁ ద్రవ్విరి.

రాముఁడా! వారలు భూమియంతయు వజ్రాయుధమునుం బోని శూలములచేతను అతిభయంకరంబులగు నాగళ్లచేతనుం బగుల్పఁగా నే గొప్పధ్వని గలిగినది. ౧౭½

రాముఁడా! సర్పములు నసురులు రాక్షసులు మఱియుం నితరజంతువులును వారలచే నలఁగఁగొట్టఁబడి యార్చుచుండఁగా నాధ్వని విన నశక్యమైనది.

యోజనానాం సహస్రాణి షష్టిం తు రఘునందన,
బిభిదుర్ధరణీం వీరా రసాతలమనుత్తమమ్. ౨౦౫
ఏవం పర్వతసంబాధం జంబూద్వీపం నృపాత్మజాః,
ఖనంతో నరశార్దూల సర్వతః పరిచక్రముః. ౨౧౫
తతో దేవాస్సగంధర్వాస్సాసురాస్సహపన్నగాః,
సంభ్రాంతమనసస్సర్వే పితామహముపాగమన్. ౨౨౫
తే ప్రసాద్య మహాత్మానం విషణ్ణవదనాస్తదా,
ఊచుః పరమసంత్రస్తాః పితామహమిదం వచః. ౨౩౫
భగవన్ పృథివీ సర్వా ఖన్యతే సగరాత్మజైః,
బహవశ్చ మహాత్మానో హన్యంతే తలవాసినః. ౨౪౫
అయం *యజ్ఞహనోఽస్మాక మనేనాశ్వోఽపనీయతే,
ఇతి తే సర్వభూతాని నిఘ్నంతి సగరాత్మజాః. ౨౫౫

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకోనచత్వారింశస్సర్గః.

---

## చత్వారింశస్సర్గః

దేవతానాం వచశ్శ్రుత్వా భగవాన్వై పితామహః,
ప్రత్యువాచ సుసంత్రస్తాన్ కృతాంతబలమోహితాన్. ౧
యస్యేయం వసుధా కృత్స్నా వాసుదేవస్య ధీమతః,
కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరామ్. ౨
తస్య కోపాగ్నినా దగ్ధా భవిష్యంతి నృపాత్మజాః. ౨౫
పృథివ్యాశ్చాపి నిర్భేదో దృష్ట ఏవ సనాతనః,
సగరస్య చ పుత్రాణాం వినాశోఽదీర్ఘజీవినామ్. ౩౫

---

* "యజ్ఞహారోఽస్మాకం" అని పాఠాంతరము.

రాముఁడా! పరాక్రమశాలులగు నాసగరునికొడుకులు అఱువదివేల యోజనముల భూమిని బాతాళమగునట్లు త్రవ్విరి. ౨౦౺

రాముఁడా! ఆసగరునికొడుకులు ఇట్లు పర్వతములచే నిండియుండు జంబూద్వీపంబును ద్రవ్వుచు నంతటను దిరిగిరి. ౨౧౺

అంత దేవతలును గంధర్వులు నసురులును బన్నగంబులు నందఱును సంభ్రాంతులై బ్రహ్మదేవుని యొద్దకుఁ బోయిరి. ౨౨౺

ఆదేవతలు మహాత్ముఁడగు బ్రహ్మదేవుని సంతోషపఱిచి పరమదుఃఖితులై మిక్కిలియు భయపడినవారలై యిట్లని చెప్పిరి. ౨౩౺

భగవంతుఁడవైన బ్రహ్మదేవుఁడా! సగరునికొడుకులు భూమియంతయుఁ ద్రవ్వుచున్నారు: పాతాళమందున్న మహాత్ములననేకులం జంపుచున్నారు.

"ఇతఁడే యాగమును జెఱచినపాపాత్ముఁడు; ఇతఁడే మా యాగాశ్వంబు నపహరించినాఁడు;" అని చెప్పుచు సమస్తప్రాణులను జంపుచున్నారని దేవతలు బ్రహ్మదేవునితోఁ జెప్పిరి. ౨౫౺

ఇది ముప్పదితొమ్మిదవ సర్గము,

---

## నలువదవ సర్గము

భగవంతుఁడగు బ్రహ్మదేవుండు దేవతలమాటవిని మిక్కిలి భయముఁ జెంది సగరపుత్రులు సేయుం జనవాశంబున (దైవబలంబున) మోహితులైయున్న దేవతలం జూచి యిట్లని చెప్పెను. ౧

ఈభూమియంతయు నేవిష్ణుదేవునిదో ఏదేవుఁడు కపిలరూపము ధరించి యీభూమి నెల్లప్పుడు ధరించుచున్నాఁడో ఆట్టికపిలరూపధారియగు విష్ణుదేవునికోపంబున సగరపుత్రులందఱు దహింపఁ బడఁగలరు. ౨, ౨౺

భూమిం ద్రవ్వుటయుం అల్పాయుష్కులైన సగరపుత్రులచావును, ఇవి యవశ్యకము కాఁదగినవని నిశ్చయింపఁబడియె యున్నవని బ్రహ్మదేవుఁడు దేవతలకుఁ జెప్పెను. ౩౺

పితామహవచశ్శ్రుత్వా త్రయస్త్రింశదరిందమ,
దేవాః పరమసంహృష్టాః పునర్జగ్ముర్యథాగతమ్. ౪½

సగరస్య చ పుత్త్రాణాం ప్రాదురాసీన్మహాత్మనామ్,
పృథివ్యాం భిద్యమానాయాం నిర్ఘాతసమనిస్స్వనః. ౫½
తతో భిత్త్వా మహీం సర్వే కృత్వాచాభిప్రదక్షిణమ్,
సహితాస్సగరాస్సర్వే పితరం వాక్యమబ్రువన్. ౬½
పరిక్రాంతా మహీ సర్వా సత్త్వవంతశ్చ సూదితాః. ౭
దేవదానవరక్షాంసి పిశాచోరగకిన్నరాః,
న చ పశ్యామహేఽశ్వం తమశ్వహర్తారమేవ చ. ౮
కిం కరిష్యామ భద్రం తే బుద్ధిరత్ర విచార్యతామ్. ౮½
తేషాం తద్వచనం శ్రుత్వా పుత్త్రాణాం రాజసత్తమః,
సమన్యురబ్రవీద్వాక్యం సగరో రఘునందన. ౯½
భూయః ఖనత భద్రం వో నిర్భిద్య వసుధాతలమ్,
అశ్వహర్తారమాసాద్య కృతార్థాశ్చ నివర్తథ. ౧౦½

పితుర్వచనమాసాద్య సగరస్య మహాత్మనః,
షష్టిః పుత్త్రసహస్రాణి రసాతలమభిద్రవన్. ౧౧½
ఖన్యమానే తతస్తస్మిన్ దదృశుః పర్వతోపమమ్,
దిశాగజం విరూపాక్షం ధారయంతం మహీతలమ్. ౧౨½
సపర్వతవనాం కృత్స్నాం పృథివీం రఘునందన,
శిరసా ధారయామాస విరూపాక్షో మహాగజః. ౧౩½
యదా పర్వణి కాకుత్స్థ విశ్రమార్థం మహాగజః,
ఖేదాచ్చాలయతే శీర్షం భూమికంపస్తదా భవేత్. ౧౪½

శత్రువుల నడంగఁ ద్రొక్కంజాలిన రాముఁడా! అష్టవసువులు నేకాదశరుద్రులు ద్వాదశాదిత్యులు నశ్వినులిద్దఱు వీరు మొదలగు దేవతలందఱు బ్రహ్మదేవునిమాట విని మిక్కిలి సంతసించి మఱల వచ్చినట్టుగా వెళ్లిరి. ౪॥

మహాత్ములైన సగరపుత్రులు భూమిం ద్రవ్వుచుండఁగా వారిచేటు సూచింపుచుఁ బిడుగుంబోని యొకశబ్దంబు పుట్టినది. ౫॥

అంత నాసగరపుత్రులు భూమిం ద్రవ్వి చుట్టుందిరిగి గుఱ్ఱముగానక యందఱుం గూడికొని తండ్రియొద్దకుఁబోయి యిట్లని చెప్పిరి. ౬॥

మేము భూమినంతయుఁ జుట్టితిమి; బలశాలులగు దేవతలదానవుల రాక్షసులఁ బిశాచంబుల సర్పంబులఁ గిన్నరులఁ జెక్కం ద్రుంచితిమి! ఆ గుఱ్ఱముగాని యాగుఱ్ఱపుదొంగగాని మాకగపడలేదు; ఏమి సేయుదుము? ఈ విషయమున నుపాయ మాలోచింపుము. ౭,౮॥

రాముఁడా! కొడుకులు చెప్పినమాట విని రాజశ్రేష్ఠుఁడగు సగరుఁడు కోపించి కొడుకులంజూచి యిట్లని చెప్పెను. ౯॥

మీకు మంగళమగుఁగాక; మీరలు మఱల భూతలము భేదించి త్రవ్వుఁడు; గుఱ్ఱమును, గుఱ్ఱమునపహరించిన వానిని బట్టికొని కృతార్థులై మఱల రండని సగరుఁడు కొడుకులకుఁ జెప్పెను. ౧౦॥

తండ్రియైన మహాత్ముండగు సగరునియాజ్ఞ విని అఱువదివేవురుకొడుకులును భూమితలమును గూర్చి పరువిడిరి. ౧౧॥

అంత, నాసగరపుత్రులు నాభూమిం ద్రవ్వుచుఁ బర్వతంబునకుసాటియై భూమండలమును మోయుచున్న విరూపాక్షంబను దిగ్గజముం జూచిరి. ౧౨॥

రాముఁడా! విరూపాక్షంబను మహాగజము పర్వతములు వనములును గూడియున్న భూమినంతను శిరంబునం బెట్టికొని మోయుచున్నది. ౧౩॥

రాముఁడా! విరూపాక్ష మెప్పుడు శ్రమచేత నలసటదీర్చుకొనుటకై తలగదలించునో అప్పుడు భూకంపము కలుగును. ౧౪॥

తం తే ప్రదక్షిణం కృత్వా దిశాపాలం మహాగజమ్,
మానయన్తో హి తే రామ జగ్ముర్భిత్త్వా రసాతలమ్. ౧౫½
తతః పూర్వాం దిశం భిత్త్వా దక్షిణాం బిభిదుః పునః. ౧౬

దక్షిణస్యామపి దిశి దదృశుస్తే మహాగజమ్,
మహాపద్మం మహాత్మానం సుమహాపర్వతోపమమ్. ౧౭
శిరసా ధారయన్తం తే విస్మయం జగ్మురుత్తమమ్. ౧౭½
తతః ప్రదక్షిణం కృత్వా సగరస్య మహాత్మనః,
షష్టిః పుత్రసహస్రాణి పశ్చిమాం బిభిదుర్దిశమ్. ౧౮½
పశ్చిమాయామపి దిశి మహాన్తమచలోపమమ్,
దిశాగజం సౌమనసం దదృశుస్తే మహాబలాః. ౧౯½
తం తే ప్రదక్షిణం కృత్వా పృష్ట్వా చాపి నిరామయమ్,
ఖనన్తస్సముపక్రాన్తా దిశం హైమవతీం తతః. ౨౦½

ఉత్తరస్యాం రఘుశ్రేష్ఠ దదృశుర్హిమపాండరమ్,
భద్రం భద్రేణ వపుషా ధారయన్తం మహీమిమామ్. ౨౧½

సమాలభ్య తతస్సర్వే కృత్వా చైనం ప్రదక్షిణమ్,
షష్టిః పుత్రసహస్రాణి బిభిదుర్వసుధాతలమ్. ౨౨½
తతః ప్రాగుత్తరాం గత్వా సాగరాః ప్రథితాం దిశమ్,
రోషాదభ్యఖనన్ సర్వే పృథివీం సగరాత్మజాః. ౨౩½
తే తు సర్వే మహాత్మానో భీమవేగా మహాబలాః. ౨౪
దదృశుః కపిలం తత్ర వాసుదేవం సనాతనమ్,
హయం చ తస్య దేవస్య చరన్తమవిదూరతః. ౨౫

రాముఁడా! ఆసగరునికొడుకులు, దిక్పాలకంబైన యావిరూపాక్షం
బును ప్రదక్షిణపూర్వకంబుగాఁ బూజించుచు భూమి భేదించికొనిపోయిరి.

ఆసగరునికొడుకులు తూర్పుదిక్కునందలి భూమినిభేదించి యంత
దక్షిణపుదిక్కునందలి భూమిం ద్రవ్విరి. ౧౬

ఆసగరపుత్రులు దక్షిణపుదిక్కునందును పూజ్యంబగు స్వభావముగల్గి
పర్వతంబునకు సాటిసేయుందగి శిరంబున భూమిని మోయుచున్న మహాపద్మం
బను దిగ్గజముం జూచి, మిక్కిలిగా నాశ్చర్యంబు నొందిరి. ౧౭,౧౮॥

అంత మహాత్ముండగు సగరునికొడుకు లఱువదివేవురు నామహాపద్మం
బునకుఁ బ్రదక్షిణంబుచేసి పడమటిదిక్కునందలి భూమిం ద్రవ్విరి. ౧౯॥

మహాబలులగు నాసగరపుత్రులు పడమటిదిక్కునందును బూజ్యమై
కొండంతటి యాకారము గల్గియుండు సౌమనసంబను దిగ్గజమును జూచిరి.

ఆసగరపుత్రులు ఆసౌమనసంబను దిగ్గజంబునకుఁ బ్రదక్షిణంబుచేసి
యారోగ్యంబడిగి యాపిమ్మటఁ ద్రవ్వుచుఁబోయి, హిమవత్పర్వతంబున్న
యుత్తరపు దిక్కును ద్రవ్వ నారంభించిరి. ౨౦॥

రాముఁడా! ఆసగరపుత్రులు ఉత్తరపుదిక్కునందును నాగశశరంబగు
దేహంబున భూమిని వహించుచు మంచువలెఁ దెల్లగానుండు భద్రంబను
దిగ్గజంబును జూచిరి. ౨౧॥

ఆసగరునికొడుకు లఱువదివేవురందఱును భద్రంబనుదిగ్గజమును గౌర
వార్థము దాఁకి ప్రదక్షిణించి యటుపిమ్మట మఱల భూమిని ద్రవ్విరి. ౨౨॥

అంత సగరపుత్రులు ప్రసిద్ధమైన యీశానదిశకుఁబోయి కోపమున
భూమియంతయుఁ ద్రవ్విరి. ౨౩॥

రాముఁడా! గొప్పశరీరంబులును భయంకరంబగు వేగంబునుం గల్గి
మహాబలులై యుండు నాసగరపుత్రులందఱును ఈశానదిశయందు కపిలరూప
ము వహించియున్న సనాతనుం డగువిష్ణుదేవుని నతని సమీపంబునం దిరుగు

ప్రహర్షమతులం ప్రాప్తాస్సర్వే తే రఘునందన. ౨౫
తే తం హయహరం జ్ఞాత్వా క్రోధపర్యాకులేక్షణాః. ౨౬
ఖనిత్రలాంగలధరా నానావృక్షశిలాధరాః,
అభ్యధావంత సంక్రుద్ధా స్తిష్ఠ తిష్ఠేతి చాబ్రువన్. ౨౭

అస్మాకం త్వం హి తురగం యజ్ఞియం హృతవానసి,
దుర్మేధ స్త్వం హి సంప్రాప్తాన్ విద్ధి నస్సగరాత్మజాన్. ౨౮
శ్రుత్వా తు వచనం తేషాం కపిలో రఘునందన,
రోషేణ మహతాఽఽవిష్టో హుంకారమకరో త్తదా. ౨౯
తత స్తేనాప్రమేయేన కపిలేన మహాత్మనా,
భస్మరాశీకృతాస్సర్వే కాకుత్స్థ సగరాత్మజాః. ౩౦
ఇతి శ్రీమద్బాలకాణ్డే, చత్వారింశస్సర్గః.

---

ఏకచత్వారింశస్సర్గః

పుత్రాంశ్చిరగతాన్ జ్ఞాత్వా సగరో రఘునందన,
నప్తారమబ్రవీద్రాజా దీప్యమానం స్వతేజసా. ౧

శూరశ్చ కృతవిద్యశ్చ పూర్వై స్తుల్యోఽసి తేజసా,
పితౄణాం గతిమన్విచ్ఛ యేన చాశ్వోఽపహారితః. ౨

అంతర్భౌమాని సత్త్వాని వీర్యవంతి మహాంతి చ,
తేషాం త్వం ప్రతిఘాతార్థం సాస్త్రం గృహ్ణీష్వ కార్ముకమ్. ౩
అభివాద్యాభివాద్యాం స్త్వం హత్వా విఘ్నకరానపి,
సిద్ధార్థస్సన్నివర్తస్వ మమ యజ్ఞస్య పారగః. ౪

చున్న గుఱ్ఱంబునుం జూచి, సరిలేని సంతోషంబు నొందిరి. ౨౪, ౨౫

ఆసగరపుత్రులు ఆకపిలుని గుఱ్ఱపుదొంగగాఁ దలంచి మిక్కిలియుఁ గుపితులై కోపంబునం గలతపడిన కండ్లుగల్గి గడ్డపాఱలను నాఁగలులను నానా విధంబులగు వృక్షంబులను శాఖలం జేకొని నిలు నిలు అని యదల్చుచు నాకపిలునిపైకిఁ బరుగెత్తిపోయిరి. ౨౬, ౨౭

నీవు మాయాగీయమగు గుఱ్ఱము నపహరించితివి; దుర్బుద్ధీ! మేము సగరపుత్రులము. వచ్చియున్నా మనియెఱుంగు మని కపిలునిం జూచి చెప్పిరి. ౨౮

రాముఁడా! ఆసగరపుత్రులమాటను వినినంత నా కపిలుఁడు మిక్కిలియుఁ గోపంబునొంది హుంకారము చేసెను. ౨౯

రాముఁడా! అంతఁ గొలఁతలేని ప్రభావముగల మహాత్ముండగు నాకపిలునిచే సగరుకొడుకు లందఱు బూడిదరాసులుగాఁ జేయఁబడిరి. ౩౦

ఇది నలువదవసర్గము.

---

## నలువదొకటవ సర్గము

రాముఁడా! సగరచక్రవర్తి తనకొడుకులు బహుకాలమువఱకు రాకపోవుటం జూచి నిజతేజంబునఁ బ్రకాశించుచున్న తనమనుమఁడైన యంశుమంతునితో నిట్లని చెప్పెను. ౧

నీవు శూరుఁడవు, అస్త్రవిద్యలం దెలిసినవాఁడవు, పరాక్రమంబునఁ బూర్వరాజులను సరివచ్చువాఁడవు, నీవుపోయి నీమంత్రులను గుఱ్ఱము నపహరించిన వానిని వెదకుము. ౨

భూమికి లోపలనుండు జంతువులు చాల బరాక్రమముగలవి, గొప్పవి; నీవు వానింజంపుటకు ఖడ్గమును ధనుస్సును దీసికొనుము. ౩

నీవు నమస్కరింపఁదగినవారిని నమస్కరింపుచు విఘ్నముసేయువారలను గుఱ్ఱము నపహరించినవానిని జంపి కృతార్థుఁడవై నాయాగమును సమాప్తినొందించువాఁడవై మఱలి రమ్మని సగరుఁ డంశుమంతునకుఁ జెప్పెను.

ఏవముక్తోఽంశుమాన్ సమ్యక్సగరేణ మహాత్మనా,
ధనురాదాయ ఖడ్గం చ జగామ లఘువిక్రమః. ౫
స ఖాతం పితృభిర్మార్గమంతర్భౌమం మహాత్మభిః,
ప్రాపద్యత నరశ్రేష్ఠ తేన రాజ్ఞాఽభిచోదితః. ౬

దైత్యదానవరక్షోభిః పిశాచపతగోరగైః,
పూజ్యమానం మహాతేజా దిశాగజమపశ్యత. ౭

స తం ప్రదక్షిణం కృత్వా పృష్ట్వా చాపి నిరామయమ్,
పితౄన్ స పరిపప్రచ్ఛ వాజిహర్తారమేవ చ. ౮

దిశాగజస్తు తచ్ఛ్రుత్వా ప్రత్యాహాంశుమతో వచః,
ఆసమంజ కృతార్థస్త్వం సహాశ్వశ్శీఘ్రమేష్యసి. ౯

తస్య తద్వచనం శ్రుత్వా సర్వానేవ దిశాగజాన్,
యథాక్రమం యథాన్యాయం ప్రష్టుం సముపచక్రమే. ౧౦

తైశ్చ సర్వైర్దిశాపాలైర్వాక్యజ్ఞైర్వాక్యకోవిదైః,
పూజితస్సహయశ్చైవ గంతాసీత్యభిచోదితః. ౧౧

తేషాం తద్వచనం శ్రుత్వా జగామ లఘువిక్రమః,
భస్మరాశీకృతా యత్ర పితరస్తస్య సాగరాః. ౧౨

స దుఃఖవశమాపన్నస్త్వసమంజసుతస్తదా,
చుక్రోశ పరమార్తస్తు వధాత్తేషాం సుదుఃఖితః. ౧3

ఈ ప్రకారము మహాత్ముండగు సగరచక్రవర్తి లెస్సఁగా నాజ్ఞాపించిన నంశుమంతుండు ధనువును ఖడ్గంబునుధరించి చులుకనగా నడుచుచుఁబోయెను.

పురుషశ్రేష్ఠుఁడవైన రామా! ఆయంశుమంతుండు ఇట్లు సగరునిచేఁ బ్రేరేపింపఁబడి మహాత్ములగు తనతండ్రులు భూమికిలోపలఁ ద్రవ్విన మార్గమును బట్టిపోయెను. ౬

మహాపరాక్రమశాలియగు నంశుమంతుండు దైత్యులచేతను దానవులచేతను రాక్షసులచేతను పిశాచములచేతను పక్షులచేతను సర్పములచేతనుం బూజింపఁబడుచున్న దిగ్గజమునుం జూచెను. ౭

ఆయంశుమంతుఁడు ఆదిగ్గజమునకుఁ బ్రదక్షిణము జేసి "యారోగ్యమా" అనియడిగి "మాతండ్రు లెచ్చట నున్నారు? గుఱ్ఱపుదొంగ యెచ్చట నున్నాఁడు?" అని యడిగెను. ౮

దిగ్గజము ను ఆయంశుమంతుఁడు చెప్పినమాట విని యంశుమంతునిం జూచి "అంశుమంతుఁడా! నీవు కృతార్థుఁడవై గుఱ్ఱముంగూడి శీఘ్రముగాఁ బోఁగలవు." అని చెప్పెను. ౯

ఆదిగ్గజము చెప్పినమాటవిని యంశుమంతుండు అట్లె దిగ్గజంబులనన్నింటిని వరుసగాఁ జూచి యథావిధిగఁ బూజించి తనతండ్రులను గుఱ్ఱపుదొంగనుం గూర్చి యడిగెను. ౧౦

ఇతరులు చెప్పుమాటల యభిప్రాయమెఱింగి యుక్తముగా మాటలాడం జాలిన యాదిగ్గజంబు లన్నియును నంశుమంతునిం బూజించి "నీవు గుఱ్ఱముం గూడియే పోఁగలవు" అని యాశీర్వదించి వీడ్కొనినవి. ౧౧

ఆదిగ్గజములు చెప్పినమాట విని యంశుమంతుఁడు శీఘ్రముగా నడిచి తనతండ్రులైన సగరపుత్రులు బూడిదరాసులుగాఁ జేయఁబడి పడియున్న ప్రదేశమునకుఁ బోయెను. ౧౨

తండ్రులైన సగరపుత్రు లిదివఱకెంత వెదకినప్పటికి నగపడకుండుటచే నింతకుమునుపే యతిదుఃఖమునకు లోఁబడియున్న యసమంజపుత్రుండగు నంశు

యజ్ఞియం చ హయం తత్ర చరన్తమవిదూరతః,
దదర్శ పురుషవ్యాఘ్రో దుఃఖశోకసమన్వితః. ౧౪
స తేషాం రాజపుత్రాణాం కర్తుకామో జలక్రియామ్,
సలిలార్థీ మహాతేజా న చాపశ్యజ్జలాశయమ్. ౧౫
విసార్య నిపుణాం దృష్టిం తతోఽపశ్యత్ఖగాధిపమ్,
పితౄణాం మాతులం రామ సుపర్ణమనిలోపమమ్. ౧౬

స చైనమబ్రవీద్వాక్యం వైనతేయో మహాబలః. ౧౬½

మా శుచః పురుషవ్యాఘ్ర వధోఽయం లోకసమ్మతః. ౧౭

కపిలేనాప్రమేయేన దగ్ధా హీమే మహాబలాః,
సలిలం నార్హసి ప్రాజ్ఞ దాతుమేషాం హి లౌకికమ్. ౧౮

గఙ్గా హిమవతో జ్యేష్ఠా దుహితా పురుషర్షభ,
తస్యాం కురు మహాబాహో పితౄణాం తు జలక్రియామ్. ౧౯

భస్మరాశీకృతానేతాన్ ప్లావయేల్లోకపావనీ,
తయా క్లిన్నమిదం భస్మ గఙ్గయా లోకకాన్తయా. ౨౦
షష్టిం పుత్రసహస్రాణి స్వర్గలోకం నయిష్యతి. ౨౦½

గచ్ఛ చాశ్వం మహాభాగ తం గృహ్య పురుషర్షభ,
యజ్ఞం పైతామహం వీర సంవర్తయితుమర్హసి. ౨౧½

మంతుండు తనతండ్రులైన సగరపుత్రులు చచ్చి పడియుండుటం జూచి యినుమడిగా దుఃఖమునొంది మిక్కిలియు నార్తుండై యేడ్చెను. ౧౩

పురుషశ్రేష్ఠుండగు నంశుమంతుం డిట్లు దుఃఖమునొంది యేడ్చుచు నచ్చటనే సమీపమందుఁ దిరుగుచున్న యాగార్హంబగు గుఱ్ఱమునుం జూచెను.

ఆయంశుమంతుఁడు సగరపుత్రులకుఁ దర్పణము సేయఁగోరి జలము కావలసి యెంత వెదకినను అతనికి ఒక్కకొలనైన నగపడలేదు. ౧౪

రామునా! ఆయంశుమంతుఁడు చాలదూరమువఱకు చక్కఁగాఁ జూచి కొలనుంగానక యటుపిమ్మట వేగంబున వాయుదేవునకు సరివచ్చువాఁడై తనతండ్రులకు మేనమామయైన పక్షిరాజగు గరుత్మంతునిం జూచెను. ౧౬

మహాబలుండును వినతాపుత్రుండునగు నాగరుత్మంతుఁడును అంశుమంతునిం జూచి యిట్లని చెప్పెను. ౧౬౪

పురుషశ్రేష్ఠుండవగు నంశుమంతుఁడా! వీరలచావు లోకంబున కన్నింటికి సమ్మతంబైనది కావున నీవు దుఃఖింపవలదు. ౧౭

మహాబలవంతులగు నీసగరపుత్రులు కొలతకురాని ప్రభావంబుగల కపిలమహామునిచే దహింపఁబడినారు. నీవాసర్వధర్మంబుల నెఱింగినవాఁడవు. వీరికి లౌకికజలముచేఁ దర్పణము సేయందగదు. ౧౮

పురుషశ్రేష్ఠుండవు మహాబాహుండవు నగునంశుమంతుఁడా! హిమవంతుని పెద్దకూఁతురు గంగయని యొకనదియున్నది; నీవు తండ్రులకు జలతర్పణమును దప్పక యానదియందే చేయవలయును. ౧౯

లోకపావనంబగు గంగానది బూడిదరాసులుగాఁ జేయఁబడియున్న వీరలం దడుపునేని లోకంబులకంతయుఁ బ్రియమైన గంగానదిచేతఁ దడుపంబడిన యాబూడిద సగరునికొడుకుల నటువది వేవురను స్వర్గలోకంబు నొందించును. ౨౦, ౨౦౪

పురుషశ్రేష్ఠుండవగు నంశుమంతుఁడా! నీవు మహాభాగ్యశాలివి (కనుకనే నీకు గుఱ్ఱమైనను దొరకినది); ఈగుఱ్ఱమును దీసికొని సగరునియొద్దకుఁ

సుపర్ణవచనం శ్రుత్వా సోఽంశుమానతివీర్యవాన్,
త్వరితం హయమాదాయ పునరాయాన్మహాయశాః. ౨౨

తతో రాజానమాసాద్య దీక్షితం రఘునందనః,
న్యవేదయద్యథావృత్తం సుపర్ణవచనం తథా. ౨౩

తచ్ఛ్రుత్వా ఘోరసంకాశం వాక్యమంశుమతో నృపః,
యజ్ఞం నిర్వర్తయామాస యథాకల్పం యథావిధి. ౨౪
స్వపురం చాగమచ్ఛ్రీమానిష్టయజ్ఞో మహీపతిః,
గంగాయాశ్చాగమే రాజా నిశ్చయం నాధ్యగచ్ఛత. ౨౫

అకృత్వా నిశ్చయం రాజా కాలేన మహతా మహాన్,
త్రింశద్వర్షసహస్రాణి రాజ్యం కృత్వా దివం గతః. ౨౬

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకచత్వారింశ స్సర్గః.

---

## ద్విచత్వారింశస్సర్గః

కాలధర్మం గతే రామ సగరే ప్రకృతీజనాః,
రాజానం రోచయామాసురంశుమంతం సుధార్మికమ్. ౧
స రాజా సుమహానాసీదంశుమాన్ రఘునందన,
తస్య పుత్రో మహానాసీద్దిలీప ఇతి విశ్రుతః. ౨

బోమ్ము; నీవు వీరుఁడవు (కావున నశ్వమేధయాగమును నిర్వహింపవలయును.) సగరుఁడు నీయంగయాగమును బూర్తినొందింపు మని గరుత్మంతుఁ డంశుమంతు నకుఁ జెప్పెను. ౧౦౫

గరుత్మంతుఁడు చెప్పినమాటవిని యతిపరాక్రమశాలియును మిక్కిలి కీర్తిగలవాఁడు నగు నాయంశుమంతుఁడు శీఘ్రముగా గుఱ్ఱమును తీసికొని మఱల సగరునియొద్దకు వచ్చెను. ౨౦౫

రాముఁడా! అంత నాయంశుమంతుఁడు దీక్షవహించియున్న సగరుని యొద్దకుఁబోయి తండ్రులవృత్తాంతమును గరుత్మంతుఁడు చెప్పిన మాటను జెప్పెను. ౨౩౫

సగరచక్రవర్తి భయంకరమైన యంశుమంతునిమాట విని యాగ మును యథాక్రమముగా యథాశాస్త్రముగాఁ బూర్తిచేసెను. ౨౪౫

శ్రీమంతుండగు సగరచక్రవర్తి యాగము ముగిసినవెనుకఁ దనపట్టణ ముఁజేరెను; అతనికి గంగానదిం దెచ్చుట కుపాయం బెంతవిచారించినను దెలియనేలేదు. ౨౫౫

పూజ్యుండగు సగరచక్రవర్తి గంగానదిం దెచ్చుటయందే యుపాయ మును జేయుకయె ముప్పదివేలేండ్లు రాజ్యంబుచేసి దీర్ఘకాలంబునకు దేవ లోకము నొందెను. ౨౬౫

ఇది నలువదొకటవ సర్గము.



## నలువది రెండవసర్గము

రాముఁడా! సగరచక్రవర్తి మరణము నొందఁగానే మంత్రులు మిక్కిలియు ధార్మికుఁడగు నంశుమంతుని రాజుగాఁ గోరిరి. ౧

రాముఁడా! ఆయంశుమంతుఁడు మిగులఁ బూజ్యుఁడైన రాజుగా నుండెను; అతనికి దిలీపుఁ డను నొక కొనియాడందగిన కొడుకుండెను. ౨

తస్మిన్ రాజ్యం సమావేశ్య దిలీపే రఘునందన,
హిమవచ్ఛిఖరే పుణ్యే తపస్తేపే సుదారుణమ్. ౩

ద్వాత్రింశచ్చ సహస్రాణి వర్షాణి సుమహాయశాః,
తపోవనం గతో రామ స్వర్గం లేభే తపోధనః. ౪

దిలీపస్తు మహాతేజాశ్శ్రుత్వా పైతామహం వధమ్,
దుఃఖోపహతయా బుద్ధ్యా నిశ్చయం నాధ్యగచ్ఛత. ౫

కథం గంగావతరణం కథం తేషాం జలక్రియా,
తారయేయం కథం చైనానితి చింతాపరోఽభవత్. ౬

తస్య చింతయతో నిత్యం ధర్మేణ విదితాత్మనః,
పుత్రో భగీరథో నామ జజ్ఞే పరమధార్మికః. ౭

దిలీపస్తు మహాతేజా యజ్ఞైర్బహుభిరిష్టవాన్,
త్రింశద్వర్షసహస్రాణి రాజా రాజ్యమకారయత్. ౮
అగత్వా నిశ్చయం రాజా తేషాముద్ధరణం ప్రతి,
వ్యాధినా నరశార్దూల కాలధర్మముపేయివాన్. ౯
ఇంద్రలోకం గతో రాజా స్వార్జితేనైవ కర్మణా,
రాజ్యే భగీరథం పుత్రమభిషిచ్య నరర్షభః. ౧౦
భగీరథస్తు రాజర్షిర్ధార్మికో రఘునందన,
అనపత్యో మహాతేజాః ప్రజాకామస్స చాప్రజః. ౧౧

రాముఁడా! ఆయంశుమంతుఁడు తనకొడుకైన దిలీపునకు రాజ్యము నప్పగించి పవిత్రంబగు హిమవత్పర్వతము శిఖరముఁ జేరి గంగానది దెచ్చుటకై గొప్పతపము చేసెను. ౩

మిగులఁ గీర్తిశాలియగు నాయంశుమంతుండు రాజ్యభోగంబులం దాసక్తి విడిచి తపస్సె ధనముగా నెంచి ముప్పదిరెండు వేలేండ్లు తపము చేసి పిదప స్వర్గము నొందెను. ౪

అధికమైన పరాక్రమముగల దిలీపుఁడును, తాతలచావును విని "మా తండ్రి యతిదుష్కరంబగు తపస్సు చేసినప్పటికిని గంగానది లభింపఁదయ్యె; మఱి యేయుపాయంబున నొందవచ్చును" అని దుఃఖాతిశయంబున బుద్ధి కొట్టువడియున్నందున గంగానదిం దెచ్చుటకుం దగునుపాయంబు దెలియఁడయ్యె.

ఆదిలీపుఁడు "ఎట్లు గంగానదిం దెత్తును? ఎట్లు తాతలకు జలతర్పణము సేయుదును? వీరల నెట్లు తరింపఁజేయుదును" అని యెల్లప్పుడుఁ జింతించుచునే యుండెను. ౬

పరమాత్మస్వరూపమెఱింగినవాఁడై యీప్రకార మెల్లప్పుడు ధర్మబుద్ధిచే నాలోచించుచున్న యాదిలీపునకు భగీరథుండను పరమధార్మికుఁడైన కొడుకు పుట్టెను. ౭

మిక్కిలియుఁ బరాక్రమముగల దిలీపమహారాజును అనేకయాగములు జేసి దేవతలనారాధించెను; ముప్పదివేలేండ్లు దొరతనము చేసెను. ౮

పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా! దిలీపమహారాజు తనతాతల నుద్ధరింప నుపాయంబు దెలియకయే రోగముచే మరణము నొందెను. ౯

పురుషశ్రేష్ఠుఁడగు దిలీపుఁడు రాజ్యమందుఁ దనకొడుకగు భగీరథుని నియమించి తాను సంపాదించిన పుణ్యంబుచే స్వర్గము నొందెను. ౧౦

రాముఁడా! ధార్మికుఁడును మిక్కిలియుఁ బరాక్రమశాలియుం రాజర్షియునగు భగీరథుండు సంతానములేనివాఁడు కావునసంతానముఁగోరుచుండెను. ఆభగీరథుఁడు తనకు సంతానములేనందున రాజ్యభారమును మంత్రులయం

మంత్రిష్వాధాయ తద్రాజ్యం గంగావతరణే రతః. ౧౧౪
స తపో దీర్ఘమాతిష్ఠద్గోకర్ణే రఘునందన,
ఊర్ధ్వబాహుః పంచతపా మాసాహారో జితేంద్రియః. ౧౨౪

తస్య వర్షసహస్రాణి ఘోరే తపసి తిష్ఠతః. ౧౩
అతీతాని మహాబాహో తస్య రాజ్ఞో మహాత్మనః,
సుప్రీతో భగవాన్ బ్రహ్మా ప్రజానాం పతిరీశ్వరః. ౧౪

తతస్సురగణైస్సార్ధముపాగమ్య పితామహః,
భగీరథం మహాత్మానం తప్యమానమథాబ్రవీత్. ౧౫
భగీరథ మహాభాగ ప్రీతస్తేఽహం జనేశ్వర,
తపసా చ సుతప్తేన వరం వరయ సువ్రత. ౧౬
తమువాచ మహాతేజాస్సర్వలోకపితామహమ్,
భగీరథో మహాభాగః కృతాంజలిరుపస్థితః. ౧౭

యది మే భగవన్ ప్రీతో యద్యస్తి తపసః ఫలమ్,
సగరస్యాత్మజాస్సర్వే మత్తస్సలిలమాప్నుయుః. ౧౮

గంగాయాస్సలిలక్లిన్నే భస్మన్యేషాం మహాత్మనామ్,
స్వర్గం గచ్ఛేయురత్యంతం సర్వే మే ప్రపితామహాః. ౧౯
దేయా చ సంతతిర్దేవ నావసీదేత్కులం చ నః,
ఇక్ష్వాకూణాం కులే దేవ ఏష మేఽస్తు వరః పరః. ౨౦

ఉక్తవాక్యం తు రాజానం సర్వలోకపితామహః,
ప్రత్యువాచ శుభాం వాణీం మధురాం మధురాక్షరామ్. ౨౧

నుంచి గంగను భూమికిఁ దెచ్చుటయం దాసక్తుఁడై యుండెను. ౧౧,౧౧౫

రాముఁడా! ఆభగీరథుఁడు గోకర్ణక్షేత్రముఁజేరి చేతులు పైకెత్తి పంచాగ్నులనడుమనుండి మాసమున కొక్కమాటు భుజించుచు జితేంద్రియుండై దీర్ఘకాలము తపస్సుచేసెను. ౧౨౫

మహాబాహుండగు రాముఁడా! ఆభంగీరథుఁడు భయంకరమగు తపస్సు సేయుచుండఁగాఁ బెక్కువేలేండ్లు గడచినవి; అంత మహాత్ముండగు నాభగీరథుని విషయమై ప్రజల కధిపతియును లోకనాయకుండును భగవంతుండు నైన బ్రహ్మదేవుండు సంతోషము నొందెను. ౧౩, ౧౪

అంత బ్రహ్మదేవుండు దేవతలతోఁ గూడ వచ్చి తపస్సుచేయుచున్న మహాత్ముండగు భగీరథునిం జూచి యిట్లని చెప్పెను. ౧౫

మహాభాగుండవగు భగీరథ మహారాజా! నీవుచేసిన గొప్పతపంబునకు నేను సంతసించితి; నీకేమి కావలయును? కోరుమని బ్రహ్మదేవుఁడు చెప్పెను.

అధికమైన పరాక్రమముగలవాఁడును మహాభాగ్యశాలియునగు భగీరథుఁడు చేతులుమోడ్చి యెదుట నిలుచుండి సమస్తలోకంబులకుఁ బితామహుండైన బ్రహ్మదేవునితో నిట్లని చెప్పెను. ౧౬

భగవంతుఁడవైన బ్రహ్మదేవుఁడా! నీవు సంతసించితివేని నేను జేసిన తపస్సు సఫలంబగునేని నేను సగరుని కొడుకుల కందఱకు జలతర్పణము సేయంజాలుదును. ౧౭

మహాత్ములగు నీసగరపుత్రుల దేహభస్మము గంగానదీజలమునం దడుపఁబడెనేని నామున్తాతలైన సగరపుత్రులందఱు అక్షయమైనస్వర్గము నొందుదురు;

బ్రహ్మదేవుఁడా! ఇక్ష్వాకువంశంబునందె సంతానంబు కలుగవలెను. దానంజేసి మావంశము శాశ్వతముగా నుండును; ఇది నారెండవకోరిక యని భగీరథుఁడు బ్రహ్మదేవునితోఁ జెప్పెను. ౨౦

సమస్తలోకంబులకును బితామహుండగు బ్రహ్మదేవుండును ఇట్లు వరములుగోరిన భగీరథుం జూచి మంగళకరమై మనోహరంబైన యర్థంబును మనోహరములైన శబ్దములును గల్గియుండు నొకమాటను జెప్పెను. ౨౧

మనోరథో మహానేష భగీరథ మహారథ,
ఏవం భవతు భద్రం తే ఇక్ష్వాకుకులవర్ధన. ౨౨

ఇయం హైమవతీ గఙ్గా జ్యేష్ఠా హిమవతస్సుతా,
తాం వై ధారయితుం శక్తో హర స్తత్ర నియుజ్యతామ్. ౨౩
గఙ్గాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి,
తాం వై ధారయితుం వీర నాన్యం పశ్యామి శూలినః. ౨౪

తమేవముక్త్వా రాజానం గఙ్గాం చాభాష్య లోకకృత్,
జగామ త్రిదివం దేవస్సహ దేవై ర్మరుద్గణైః. ౨౫

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్విచత్వారింశస్సర్గః.

---

త్రిచత్వారింశస్సర్గః

దేవదేవే గతే తస్మిన్ సోఽఙ్గుష్ఠాగ్రనిపీడితామ్,
కృత్వా వసుమతీం రామ సంవత్సరముపాసత. ౧

అథ సంవత్సరే పూర్ణే సర్వలోకనమస్కృతః,
ఉమాపతిః పశుపతీ రాజానమిదమబ్రవీత్. ౨
ప్రీత స్తేఽహం నరశ్రేష్ఠ కరిష్యామి తవ ప్రియమ్,
శిరసా ధారయిష్యామి శైలరాజసుతామహమ్. ౩

తతో హైమవతీ జ్యేష్ఠా సర్వలోకనమస్కృతా,
తదా సాతిమహద్రూపం కృత్వా వేగం చ దుస్సహమ్. ౪
ఆకాశాదపతద్రామ శివే శివశిరస్యుత. ౪౫

మహారథుండవగు భగీరథుఁడా! నీవడిగిన మొదటివరము దుర్లభమైనది! అయినను నీకోర్కె యీడేఱును; నీవిక్ష్వాకువంశమును వృద్ధిఁబొందింపఁ గలవాఁడవు! నీకు మంగళమగుఁగాక ౨౨

ఈగంగానది హిమవంతునకుఁ బుట్టినది; ఇది యతని పెద్దకూఁతురు; అట్టి దీనింగూడ ధరించుటకుం జాలినశివుని నాకార్యమునకై ప్రార్థింపుము. ౨౩

భగీరథుఁడా! నీవు భూపతివి (కావున భూమిమేలును నీవు చూడవలయును) గంగానది యాకాశమునుండి పడినప్పటి పాటును భూమి సహింపలేదు; నీవు పరాక్రమశాలివి (అయినను) శివుఁడుతప్ప నితరుఁ డెవ్వండును ఆ గంగానదిని ధరింపలేఁడని బ్రహ్మదేవుఁడు భగీరథునకుఁ జెప్పెను. ౨౪

లోకకర్తయైన బ్రహ్మదేవుఁడు భగీరథునితో నిట్లుచెప్పి గంగంజూచి "నీవు భగీరథుండు కోరినప్పుడతనివెంటం బొ"మ్మని వచించి దేవతలను వాయుసమూహంబులనుంగూడి స్వర్గమునకుఁ బోయెను. ౨౫

ఇది నలువదిరెండవ సర్గము.

---

నలువదిమూఁడవ సర్గము

దేవదేవుఁడగు బ్రహ్మదేవుఁడు పోయినపిమ్మట భగీరథుఁడు భూమిమీఁదఁ గాలిబొటనవ్రేలినిం బెట్టి నిలిచి సంవత్సరకాలము శివునింగూర్చి తపస్సు చేసెను. ౧

సంవత్సరము నిండఁగానే సమస్తలోకములచే నమస్కృతుండును పార్వతీపతియు నగు శివుఁడు భగీరథునింజూచి యిట్లని చెప్పెను. ౨

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా! నీకుఁ బ్రీతుండనైతి; నీయభీష్టంబు నెఱవేర్చెదను; పర్వతరాజైన హిమవంతునికూమార్తెయగు గంగను శిరస్సున ధరించెదనని శివుఁడు చెప్పెను. ౩

అంత సర్వలోకనమస్కృతయగు నాహిమవంతుని పెద్దకూఁతురైన గంగానది గొప్పయాకారమువహించి సహింపఁగూడని వేగంబుతోని ఆకాశమునుండి మంగళకరంబగు శివునిశిరస్సుపైఁ బడెను. ౪, ౫

అచింతయచ్చ సా దేవీ గంగా పరమదుర్ధరా,
విశామ్యహం హి పాతాళం స్రోతసా గృహ్య శంకరమ్. ౫½
తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధస్తు భగవాన్ హరః,
తిరోభావయితుం బుద్ధిం చక్రే త్రిణయనస్తదా. ౬½
సా తస్మిన్ పతితా పుణ్యా పుణ్యే రుద్రస్య మూర్ధని,
హిమవత్ప్రతిమే రామ జటామండలగహ్వరే. ౭½
సా కథంచిన్మహీం గంతుం నాశక్నోద్యత్నమాస్థితా,
నైవ నిర్గమనం లేభే జటామండలమోహితా. ౮½

తత్రైవాబంభ్రమద్దేవీ సంవత్సరగణాన్ బహూన్,
తామపశ్యన్ పునస్తత్ర తపః పరమమాస్థితః. ౯½

అనేన తోషితశ్చాభూదత్యర్థం రఘునందన,
విససర్జ తతో గంగాం హరో బిందుసరః ప్రతి. ౧౦½

తస్యాం విసృజ్యమానాయాం సప్త స్రోతాంసి జజ్ఞిరే. ౧౧
హ్లాదినీ పావనీ చైవ నలినీ చ తథాఽపరా,
తిస్రః ప్రాచీం దిశం జగ్ము ర్గంగాశ్శివజలాశ్శుభాః. ౧౨
సుచక్షుశ్చైవ సీతా చ సింధుశ్చైవ మహానదీ,
తిస్రస్త్వేతా దిశం జగ్ముః ప్రతీచీంతు శుభోదకాః. ౧౩
సప్తమీ చాన్వగాత్తాసాం భగీరథమథో నృపమ్. ౧౩½
భగీరథోఽపి రాజర్షి ర్దివ్యం స్యందనమాస్థితః,
ప్రాయాదగ్రే మహాతేజా గంగా తం చాప్యనువ్రజత్. ౧౪½
గగనాచ్ఛంకరశిరస్తతో ధరణి మాశ్రితా,

ఎంతమాత్రము ధరింపనలవిగాని యాగంగాదేవియును "ఈశివునిఁ ప్రవాహంబునం దీసికొని పాతాళంబు చొచ్చెదను" అని యాలోచించెను.

త్రినేత్రుండును భగవంతుండునగు శివుండు ఆగంగానదిగర్వం బెఱింగి, కోపించి యాగంగ మఱుఁగుపడునట్లు సేయందలంచెను. ౬½

రాముఁడా! పవిత్రయగు నాగంగానది జటాసమూహమే గుహాగా గల్గి హిమవద్గిరియుం బోలియున్న పవిత్రంబగు శివుని శిరస్సునంబడెను. ౭½

ఆగంగానది ఎన్నిప్రయత్నములు చేసినను భూమి చేరలేకపోయెను. శివునిజటామండలమందుఁ జిక్కుపడియున్నందున బయలువెడలుటయును కాకపోయెను. ౮½

గంగానది యిట్లు శివునిజటామండలమందే పెక్కుసంవత్సరములు తిరుగుచుండెను; అంత భగీరథుండు గంగానదిం గానక మఱల నచ్చటఁ బరమంబగు తపస్సు జేసెను. ౯½

రాముఁడా! భగీరథుఁడు తపస్సుచే శివుని మిక్కిలియు సంతోషపఱచెను; అంత శివుండు బిందుసరస్సను బ్రహ్మనిర్మితంబగు నొకసరస్సునందు గంగను విడిచెను. ౧౦

ఆగంగను విడువఁగానే ఏడుప్రవాహములు గల్గినవి. ౧౧

హ్లాదినియుఁ బావనియు నళినియునను నీమూఁడుగంగలు మంగళకరంబగుజలము గలిగి మంగళకరములై తూర్పుదిక్కునఁ బ్రవహించినవి. ౧౨

సుచక్షువు సీత మహానదియగుసింధువు-మంగళకరములయిన యుదకము గల యీమూఁడుగంగలును బశ్చిమదిక్కునఁ బ్రవహించినవి. ౧౩

అంత వానిలో నేడవగంగ భగీరథమహారాజును వెంబడించెను. ౧౩½

మహాతేజుండును రాజర్షియునగుభగీరథుండు దివ్యంబగు రథం బెక్కి ముందు నడచిపోయెను; గంగ యతనివెనుకం దగిలిపోయెను. ౧౪½

గంగానది యాకాశమునుండి శివునిశిరస్సుపైఁబడినది. అందుండిభూమి

వ్యసర్పత జలం తత్ర తీవ్రశబ్దపురస్కృతమ్. ౧౫॥

మత్స్యకచ్ఛపసంఘైశ్చ శింశుమారగణైస్తదా,
పతద్భిః పతితైశ్చాన్యైర్వ్యరోచత వసుంధరా. ౧౬॥

తతో దేవర్షిగంధర్వా యక్షాస్సిద్ధగణాస్తదా,
వ్యలోకయంత తే తత్ర గగనాద్గాం గతాం తథా. ౧౭॥
విమానైర్నగరాకారైర్హయైర్గజవరైస్తదా,
పారిప్లవగతైశ్చాపి దేవతాస్తత్ర విష్ఠితాః. ౧౮॥
తదద్భుతతమం లోకే గంగాపతనముత్తమమ్,
దిదృక్షవో దేవగణాస్సమీయురమితౌజసః. ౧౯॥
సంపతద్భిస్సురగణైస్తేషాం చాభరణౌజసా,
శతాదిత్యమివాభాతి గగనం గతతోయదమ్. ౨౦॥

శింశుమారోరగగణైర్మీనైరపి చ చంచలైః,
విద్యుద్భిరివ విక్షిప్తమాకాశమభవత్తదా. ౨౧॥
పాండరైస్సలిలోత్పీడైః కీర్యమాణైస్సహస్రధా,
శారదాభ్రైరివాకీర్ణం గగనం హంససంప్లవైః. ౨౨॥

క్వచిద్ద్రుతతరం యాతి కుటిలం క్వచిదాయతమ్,
వినతం క్వచిదుద్ధూతం క్వచిద్యాతి శనైశ్శనైః. ౨౩॥

సలిలేనైవ సలిలం క్వచిదభ్యాహతం పునః,
ముహురూర్ధ్వముఖం గత్వా పపాత వసుధాతలమ్. ౨౪॥

పైఁబడెను; అట్లు పైనుండి క్రిందఁబడుటచే జలము నధికముగా ధ్వనికలిగి ప్రవహించినది. ౧౫

అప్పుడు గుంపులుగుంపులుగాఁ బడుచున్న మత్స్యములు తాఁబేళ్లు మొసళ్లు వీనిచేతను మరికొన్ని నట్లు పడినట్టి యితరజంతుఘలచేతను భూమి ప్రకాశించినది. ౧౬

అంత నప్పుడాకాశమునను దేవతలును ఋషులును యక్షులును సిద్ధులును [illegible] ఆకాశమునుండి భూమింబడిన గంగానదిం జూచిరి. ౧౭

అప్పుడు [illegible] దేవతలు సంభ్రమయుక్తులై [illegible] విమానములను గుఱ్ఱములను మంచి [illegible] [illegible]. ౧౮

[illegible] మితంబగు తేజస్సుగల దేవతలు [illegible] కంబునంతయు ఆశ్చర్యకరంబును శ్రేష్ఠంబునగు నాగంగావతరణమును జూడఁగోరి యచ్చట చేరిరి. ౧౯

మేఘములులేక నిర్మలముగా నున్న యాకాశము గంగావతరణముచూడ వచ్చిన దేవతల శరీరకాంతులచేతను వారియాభరణకాంతులచేతను నూర్గురు సూర్యులు [illegible] ప్రకాశించెను. ౨౦

అప్పుడాకాశమున [illegible] మొసళ్లు [illegible] మత్స్యములును గల్గి మెఱుపులు గల్గినదానివలెఁ బ్రకాశించినది. ౨౧

ఆకాశము [illegible] అనేకవిధములుగా బ్రసరించుచున్న తెల్లని నురుఁగలును హంసపక్షులగుంపులును గల్గి శరత్కాలమునందలి తెల్లని మేఘములతోఁ గూడియున్నట్లొప్పెను. ౨౨

గంగానది పల్లపునేలలలో మిక్కిలియు వడిగను మిట్టపల్లములలో వంకరగను చదరపునేలలో శీఘ్రముగను పల్లములలో లోనికిదిగినట్లును పెద్దతాయి మొదలగువాని తాఁకుడుగల్గినపు డూర్ధ్వముఖముగను ఉన్నతభూములలో మెల్లమెల్లగను బాఱినది. ౨౩

ఒక్కచోఁ బలుమాఱులు జలము గాలిచేఁ బైకెగయు తరంగములచేఁ గొట్టఁబడి యూర్ధ్వముఖముగా వెళ్లి మఱల నేలపైఁబడినది. ౨౪

త చ్ఛంకరశిరోభ్రష్టం భ్రష్టం భూమితలే పున,
వ్యరోచత తదా తోయం నిర్మలం గతకల్మషమ్. ౨౪

తత్ర దేవర్షిగంధర్వా వసుధాతలవాసినః,
భవాంగపతితం తోయం పవిత్రమితి పస్పృశుః. ౨౫

శాపాత్ప్రపతితా యేచ గగనాద్వసుధాతలమ్,
కృత్వా తత్రాభిషేకం తే బభూవుర్గతకల్మషాః. ౨౬

ధూతపాపాః పునస్తేన తోయేనాథ సుభాస్వతా,
పునరాకాశమావిశ్య స్వాన్ లోకాన్ ప్రతిపేదిరే. ౨౭
ముముదే ముదితో లోక స్తేన తోయేన భాస్వతా,
కృతాభిషేకో గంగాయాం బభూవ విగతక్లమః. ౨౮

భగీరథోఽపి రాజర్షి ర్దివ్యం స్యందనమాస్థితః,
ప్రాయాదగ్రే మహాతేజా గంగా తం పృష్ఠతోఽన్వగాత్ ౩౦
దేవాస్సర్షిగణాస్సర్వే దైత్యదానవరాక్షసాః. ౩౧
గంధర్వయక్షప్రవరాస్సకిన్నరమహోరగాః,
సర్వాశ్చాప్సరసో రామ భగీరథరథానుగామ్. ౩౨
గంగామన్వగమన్ ప్రీతాస్సర్వే జలచరాశ్చ యే. ౩౨
యతో భగీరథో రాజా తతో గంగా యశస్వినీ,
జగామ సరితాం శ్రేష్ఠా సర్వపాపప్రణాశినీ. ౩౩
**తతో హి యజమానస్య జహ్నోరద్భుతకర్మణః,**
**గంగా** సంప్లావయామాస యజ్ఞవాటం మహాత్మనః. ౩౪

శివునిశిరస్సునంబడి యాపై భూమిపైఁబడిన యాగంగానదిజలము అప్పుడు నిర్మలమై స్నానము సేయువారిపాపములఁ బోఁగొట్టునదిగాఁ ప్రకాశించెను. ౨౫½

ఆకాశమందుండు దేవతలును ఋషులును గంధర్వులును భూమియందు వాసము చేయుచుండు జనులును "ఈశ్వరదేహమునుండి పవిత్రమైనజలము పావన" మని స్పృశించిరి (లేక స్నానముచేసిరి) ౨౬½

ఎవరు శాపంబునంజేసి స్వస్థానంబగు నాకాశంబునుండి భూమిపైఁ బడిరో వా రాగంగానదిజలమునందు స్నానముచేసి పాపములచే విముక్తులై శుద్ధులైరి. ౨౭½

వారలు ఆగంగాజలంబునుపయోగించి పాపవిముక్తులై యాకాశ మార్గంబునఁ దమతమ లోకంబుల నొందిరి. ౨౮

ప్రకాశమానంబగు నాగంగాజలము జూచి జనము మాటిమాటికి సంత సించినది; మఱియును నాగంగయందు స్నానము చేసి యలసటవీడి సుఖము నొందినది. ౨౯½

మహాపరాక్రమశాలియగు రాజర్షియైన భగీరథుండు దివ్యమైనరథం బెక్కి ముందుపటఁ బోవుచుండెను; గంగానది యతని దారిని వెంబడించెను.

రాముఁడా! దేవతలు ఋషులు దైత్యులు దానవులు రాక్షసులు గంధ ర్వులు యక్షులు కిన్నరులు నురగములు నప్సరసలు నందఱును సంతోషంబు నొంది భగీరథుని రథమును వెంబడించుచున్న గంగానదిని వెంబడించిరి. అట్లు జలచరజంతువులన్నియును వెంబడించినవి. 3౧,3౨

భగీరథమహారాజు జేదారిని వెళ్ళెనో మంచికీర్తిగలిగి నదులలో మేటియై సమస్తపాపములం బోఁగొట్టు నదియై యున్నగంగానదియు నాదారినే వెళ్ళెను.

అంత గంగానది యాశ్చర్యకరములగు కార్యములు సేయుచుండఁగా యజ్ఞము సేయుచున్న మహాత్ముండగు జహ్నుమహాముని యాగమును సేయుచుండఁగా నతనియాగశాలయంతయు నీళ్ల తో ముంచెను. 3౪½

తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధో యజ్వా తు రాఘవ,
ఆపిబచ్చ జలం సర్వం గఙ్గాయాః పరమాద్భుతమ్. ౩౫½
తతో దేవాస్సగన్ధర్వా ఋషయశ్చ సువిస్మితాః. ౩౬
పూజయన్తి మహాత్మానం జహ్నుం పురుషసత్తమమ్,
గఙ్గాం చాపి నయన్తి స్మ దుహితృత్వే మహాత్మనః. ౩౭
తతస్తుష్టో మహాతేజాశ్శ్రోత్రాభ్యామసృజత్ప్రభుః,
తస్మాజ్జహ్నుసుతా గఙ్గా ప్రోచ్యతే జాహ్నవీతి చ. ౩౮

జగామ చ పునర్గఙ్గా భగీరథరథానుగా,
సాగరం చాపి సమ్ప్రాప్తా సా సరిత్ప్రవరా తదా. ౩౯
రసాతలముపాగచ్ఛత్సిద్ధ్యర్థం తస్య కర్మణః. ౩౯½
భగీరథోఽపి రాజర్షిర్గఙ్గామాదాయ యత్నతః,
పితామహాన్ భస్మకృతానపశ్యద్దీనచేతనః. ౪౦½
అథ తద్భస్మనాం రాశిం గఙ్గాసలిలముత్తమమ్,
ప్లావయద్ధూతపాప్మానస్స్వర్గం ప్రాప్తా రఘూత్తమ. ౪౧½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రిచత్వారింశస్సర్గః.

---

## చతుశ్చత్వారింశస్సర్గః

స గత్వా సాగరం రాజా గఙ్గయాఽనుగతస్తదా,
ప్రవివేశ తలం భూమేర్యత్ర తే భస్మసాత్కృతాః, ౧

భస్మస్యథాఽఽప్లుతే రామ గఙ్గాయాస్సలిలేన వై,
సర్వలోకప్రభుర్బ్రహ్మా రాజానమిదమబ్రవీత్. ౨

రాముఁడా! యాగముసేయుచున్న జహ్నువు ఆగంగానది గర్వం బెఱింగి కోపించి అత్యాశ్చర్యకరంబుగ గంగానది జలంబంతయుఁ ద్రావెను. ౩౫½

అంత దేవతలును గంధర్వులును ఋషులును మిక్కిలి యాశ్చర్యము నొంది మహాత్ముండును ఋషిశ్రేష్ఠుండును నగు జహ్నునింబూజించి గంగానది నతనికిఁ గొమార్తెనుగా నియమించిరి. ౩౬,౩౭

మహాప్రభావుండగు జహ్నువు తనకుగంగ కొమార్తె యగుటకు సంతసించి గంగను మరల చెవులనుండి బైటికి విడిచెను. అందువలన గంగానది జాహ్నవి యనియును బిలువంబడుచున్నది. ౩౮

గంగానదియును మరల భగీరథుని రథమును వెంబడించుచు వెళ్లినది; అప్పుడు నదులలో మేటియైన యాగంగానది సముద్రమునొంది యట్లు భగీరథుని కార్యము సిద్ధించుటకై పాతాళమునకుఁ బోయెను. ౩౯,౩౯½

రాజర్షి యగు భగీరథుఁడును మహాయత్నంబున గంగం దోడ్కొని మసఖుంబున బూడిదెగాఁ జేయఁబడియున్న తాతలం జూచెను. ౪౦½

రాముఁడా! అంతశ్రేష్ఠమయిన యాగంగానదిజలము బూడిదరాశిని నీళ్లతో ముంచెను; అంత నా సగరపుత్రులు నిష్పాపులై స్వర్గమునొందిరి ౪౧½

ఇది నలువదిమూఁడవ సర్గము.

---

## నలువదినాలవ సర్గము

అప్పుడా భగీరథుఁడు గంగను వెంటఁబెట్టుకొని సాగరంబునకుఁ బోయి యట్లు భూమినుండి సగరునికొడుకులు బూడిదగాఁ జేయఁబడియున్న పాతాళముఁ బ్రవేశించెను. ౧

రాముఁడా! అంత గంగాజలంబు సగరునికొడుకుల దేహభస్మముపైఁ బ్రవహింపఁగానే సమస్తలోకనాయకుండగు బ్రహ్మదేవుఁడు భగీరథునిం జూచి యిట్లని చెప్పెను. ౨

తారితా నరశార్దూల దివం యాతాశ్చ దేవవత్,
షష్టిః పుత్రసహస్రాణి సగరస్య మహాత్మనః. 3
సాగరస్య జలం లోకే యావత్స్థాస్యతి పార్థివ,
సగరస్యాత్మజాస్తావత్స్వర్గే స్థాస్యంతి దేవవత్. ౪
ఇయం చ దుహితా జ్యేష్ఠా తవ గంగా భవిష్యతి,
త్వత్కృతేన చ నామ్నాఽథ లోకే స్థాస్యతి విశ్రుతా. ౫
గంగా త్రిపథగా రాజన్ దివ్యా భాగీరథీతి చ,
త్రీన్ పథో భావయంతీతి తతస్త్రిపథగా స్మృతా. ౬

పితామహానాం సర్వేషాం త్వమత్ర మనుజాధిప,
కురుష్వ సలిలం రాజన్ ప్రతిజ్ఞామపవర్జయ. ౭
పూర్వకేణ హి తే రాజంస్తేనాతియశసా తదా,
ధర్మిణాం ప్రవరేణాపి నైష ప్రాప్తో మనోరథః. ౮
తథైవాంశుమతా తాత లోకేఽప్రతిమతేజసా,
గంగాం ప్రార్థయతాఽఽనేతుం ప్రతిజ్ఞా నాపవర్జితా. ౯

రాజర్షిణా గుణవతా మహర్షిసమతేజసా,
మత్తుల్యతపసా చైవ క్షత్రధర్మస్థితేన చ. ౧౦
దిలీపేన మహాభాగ తవ పిత్రాఽతితేజసా,
పునర్న శంకితాఽఽనేతుం గంగాం ప్రార్థయతాఽనఘ. ౧౧

సా త్వయా సమతిక్రాంతా ప్రతిజ్ఞా పురుషర్షభ,
ప్రాప్తోఽసి పరమం లోకే యశః పరమసమ్మతమ్. ౧౨

పురుషశ్రేష్ఠుండవైన భగీరథుఁడా ! మహాత్ముండగు సగరుని కొడుకు లఱువదివేవురును నీచేఁ దరింపఁబడి దేవతలుంబోలె స్వర్గంబు నొందిరి. 3

భగీరథుఁడా ! సముద్రజలం బెంతవఱకు లోకంబునందుండునో అంత వఱకు సగరునికొడుకులందఱు దేవతలుంబోలె స్వర్గంబున నుండఁగలరు. ౪

ఈగంగయును నీకు పెద్దకూఁతురుగా నుండఁగలదు; నీవు తండ్రిగా నుండుటంగల్గిన పేర నీలోకంబునం బ్రసిద్ధినొందఁగలదు. ౫

భగీరథుఁడా! స్వర్గమునందుఁబుట్టిన యీగంగానది త్రిపథగయనియుం భాగీరథి యనియుఁ బ్రసిద్ధినొందఁగలదు. స్వర్గము భూమి పాతాళము అను మూఁడు మార్గంబులఁ బ్రవహించినది కావున "త్రిపథగ" యని చెప్పఁబడినది. ౬

భగీరథుఁడా! నీవీ గంగాజలమందు నీతాతలయిన సగరపుత్రుల కందఱకును జలతర్పణము నీయుము. నీ ప్రతినను సమాప్తినొందించుకొనుము. ౭

భగీరథుఁడా ! మిక్కిలియుఁ గీర్తిగల్గి ధార్మికులలో శ్రేష్ఠుఁడైన నీ పూర్వికుఁడగు సగరుఁడును ఈమనోరథంబు నొందలేఁడయ్యె. ౮

నాయనా! లోకమందంతటను సరిలేని పరాక్రమముగల్గి గంగానదిం గొనివచ్చుటకుఁ బ్రార్థించుచున్న యంశుమంతుఁడును బ్రతిజ్ఞను జెల్లింపలేఁడయ్యె. ౯

మహాభాగ్యశాలివి పాపరహితుండవు నగుభగీరథుఁడా ! రాజర్షియై గుణవంతుండై మహర్షికి సరివచ్చుప్రభావముగలవాఁడై నావలెనే మహాతపస్వియునై క్షత్రియధర్మనిష్ఠుండును మహాపరాక్రమశాలియునై గంగానదిం దెచ్చుటకుఁ బ్రార్థించుచుండిన నీతండ్రియగు దిలీపుఁడు నీప్రతిజ్ఞగుఱించి విచారమైనఁ జేయఁడయ్యె. ౧౦ ౧౧

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా ! పూర్వులు లెవ్వరును జెల్లింపలేని ప్రతిజ్ఞను నీవు చెల్లించితివి ! లోకంబున శ్రేష్ఠంబై మిక్కిలియుఁ గొనియాఁడందగు యశంబు నొందితివి. ౧౨

యచ్చ గంగావతరణం త్వయా కృతమరిందమ,
అనేన చ భవాన్ ప్రాప్తో ధర్మస్యాయతనం మహత్. ౧౩
ప్లావయస్వ త్వమాత్మానం నరోత్తమ సదోచితే,
సలిలే పురుషవ్యాఘ్ర శుచిః పుణ్యఫలో భవ. ౧౪

పితామహానాం సర్వేషాం కురుష్వ సలిలక్రియామ్,
స్వస్తితేఽస్తు గమిష్యామి స్వం లోకం గమ్యతాం నృప. ౧౫

ఇత్యేవముక్త్వా దేవేశస్సర్వలోకపితామహః,
యథాగతం తథాఽగచ్ఛద్దేవలోకం మహాయశాః. ౧౬
భగీరథోఽపి రాజర్షిః కృత్వా సలిలముత్తమమ్,
యథాక్రమం యథాన్యాయం సాగరాణాం మహాయశాః. ౧౭
కృతోదకశ్శుచీ రాజా స్వపురం ప్రవివేశ హ,
సమృద్ధార్థో రఘుశ్రేష్ఠ స్వరాజ్యం ప్రశశాస హ. ౧౮
ప్రముమోద చ లోకస్తం నృపమాసాద్య రాఘవ,
నష్టశోకస్సమృద్ధార్థో బభూవ విగతజ్వరః. ౧౯
ఏష తే రామ గంగాయా విస్తరోఽభిహితో మయా,
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే సంధ్యాకాలోఽతివర్తతే. ౨౦
ధన్యం యశస్యమాయుష్యం పుత్ర్యం స్వర్గ్యమతీవ చ,
యశ్శ్రావయతి విప్రేషు క్షత్రియేష్వితరేషు చ, ౨౧
ప్రీయంతే పితరస్తస్య ప్రీయంతే దైవతాని చ. ౨౧½

ఇదమాఖ్యానమవ్యగ్రో గంగావతరణం శుభమ్. ౨౨
యశ్శృణోతి చ కాకుత్స్థ సర్వాన్ కామానవాప్నుయాత్,

శత్రువుల నడంగం ద్రొక్కం జాలిన భగీరథుఁడా ! నీవిప్పుడు చేసిన గంగావతరణంబునను నీకు పూజ్యంబగుధర్మ ప్రతిష్ఠ గల్గినది. ౧౩

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా ! సముద్రమునకెల్లఁగాక యెల్లప్పుడును స్నానయోగ్యమైన యీగంగాజలమందు స్నానము సేయుము! దానం జేసి నీకుఁ బరిశుద్ధియును బుణ్యంబును గల్గును. ౧౪

భగీరథుఁడా ! నీతాతల కందఱకును జలతర్పణమును చేయుము, నీకు మంగళమగుఁగాక; నేను నాలోకమునకుఁ బోయెదను. నీవును బొమ్ము. అని బ్రహ్మదేవుఁడు భగీరథునితోఁ జెప్పెను. ౧౫

అని యిట్లు భగీరథునకుఁ జెప్పి గొప్పకీర్తిగల్గి దేవతలకును బ్రభువై సమస్తలోకంబులకును తాతయైన బ్రహ్మదేవుఁడు దేవలోకంబునకుఁ బోయెను.

రాముఁడా ! మహాయశస్వియు రాజర్షియు నగుభగీరథుండు సగరుని కొడుకులకు వరుసగా యథాశాస్త్రముగా జలతర్పణము చేసి యంతః దనపట్టణమునకుఁ బోయి సమృద్ధంబుగా సంపదగల్గి రాజ్యము పాలించెను. ౧౭.౧౮

రాముఁడా! జను లాభగీరథుఁడు రాజగుటఁ జేసి చాలసంతసించి, మఱి రోగ దుఃఖములేక సంపూర్ణమైనసంపదగల్గి పీడలేమియు లేక సుఖముగా నుండిరి.

రాముఁడా ? నీ కీ గంగానదికథావివరము చెప్పినాఁడను; నీకు మంగళమగుఁగాక; ఇంక సంధ్యాకాలము రావచ్చినది; ఇంక నడుగవలదు. ౨౦

బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాని యితర జాతీయుఁడు గాని యెవ్వఁడు ధనమును యశస్సును దీర్ఘాయుస్సును కొడుకులను స్వర్గము నిచ్చునట్టి యీ గంగావతరణోపాఖ్యానమును వినిపించునో యతని పితృదేవతలును దేవతలు నందఱును సంతోషింతురు. ౨౧,౨౨

రాముఁడా! ఎవ్వఁడు మనసునిలిపి మంగళకరంబగు నీగంగావతరణ చరిత్రంబు వినునో యతఁడు యన్నికోర్కులం బడయును; అతనిపాపంబు లన్నియు నశించుచుండును; అతని కాయుస్సును గీర్తియుం వృద్ధినొందును; అని

సర్వే పాపాః ప్రణశ్యంతి ఆయుః కీర్తిశ్చ వర్ధతే. ౨౩

ఇతి శ్రీమద్బాలకాణ్డే, చతుశ్చత్వారింశస్సర్గః.

---

## పంచచత్వారింశస్సర్గః

విశ్వామిత్రవచశ్శ్రుత్వా రాఘవస్సహలక్ష్మణః,
విస్మయం పరమం గత్వా విశ్వామిత్రమథాబ్రవీత్. ౧
అత్యద్భుతమిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా,
గంగావతరణం పుణ్యం సాగరస్యాపి పూరణమ్. ౨

తస్య సా శర్వరీ సర్వా సహ సౌమిత్రిణా తదా,
జగామ చింతయానస్య విశ్వామిత్రకథాం శుభామ్. ౩
తతః ప్రభాతే విమలే విశ్వామిత్రం మహామునిమ్,
ఉవాచ రాఘవో వాక్యం కృతాహ్నికమరిందమః. ౪

గతా భగవతీ రాత్రిశ్శ్రోతవ్యం పరమం శ్రుతమ్,
క్షణభూతేవ నౌ రాత్రిస్సంవృత్తేయం మహాతపః. ౫
ఇమాం చింతయతస్సర్వాం నిఖిలేన కథాం తవ. ౫½
తరామ సరితాం శ్రేష్ఠాం పుణ్యాం త్రిపథగాం నదీమ్. ౬
నౌరేషా హి సుఖాస్తీర్ణా ఋషీణాం పుణ్యకర్మణామ్,
భగవంతమిహ ప్రాప్తం జ్ఞాత్వా త్వరితమాగతా. ౭
తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
సంతారం కారయామాస సర్షిసంఘస్సరాఘవః. ౮
ఉత్తరం తీరమాసాద్య సంపూజ్యర్షిగణం తదా,
గంగాకూలే నివిష్టాస్తే విశాలాం దదృశుః పురీమ్. ౯

విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. ౨౨,౨౩

ఇది నలువదినాలవసర్గము.

---

## నలువదియైదవ సర్గము

రాముండు లక్ష్మణునితోఁ గూడ విశ్వామిత్రుఁడు చెప్పినదాని విని మిక్కిలియు నాశ్చర్యపడి విశ్వామిత్రునితో నిట్లని చెప్పెను. ౧

విశ్వామిత్రుఁడా! అత్యాశ్చర్యకరమును బరమంబును బావనంబు నగు నీగంగావతరణంబును సముద్రంబు వృద్ధిఁబొందించుటయు మాకుఁ జెప్పితి వని రాముఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను ౨

అప్పుడు లక్ష్మణునితోఁగూడ రాముఁడు విశ్వామిత్రుఁడు చెప్పినకథను గుఱించి తలపోయుచుండఁగనే యారాత్రి యంతఁ గడచినది. ౩

అంత నిర్మలముగ సూర్యోదయము కాఁగానే విశ్వామిత్రుఁ డాహ్నికకృత్యంబు నిర్వర్తించినపిదప నతనిఁ జూచి శత్రువుల నడంగంద్రొక్కఁ జాలినరాముఁ డిట్లని చెప్పెను. ౪

అధికమైన తపస్సుగల విశ్వామిత్రుఁడా! పూజ్యమైనరాత్రి గడచినది; ముఖ్యముగా వినవలసినదాని వింటిమి, నీవు చెప్పినకథ నంతయు ధ్యానించుచున్న మాకీరాత్రి క్షణప్రాయమైనది. ౫, ౬

సుఖముగఁ గల్గునట్లు ఆస్తరణముఁగల్గి పవిత్రంబులగు కర్మములు సేయు ఋషులకుం దగినయోడ మీరు వచ్చియుండుట దెలిసి తేఁబడియున్నది, మనము దీనిచే నదులకన్నిటికిని మేటియై పవిత్రయైన గంగానదిని దాఁటుదము.

మహాత్ముండగు రాముండు చెప్పినమాటను విని విశ్వామిత్రుఁడు ఋషులను రామలక్ష్మణులనుం గూడి గంగానదిని దాఁటెను. ౮

ఇట్లు గంగానది యుత్తరపుగట్టుచేరి దారి నంపవచ్చిన ఋషులం బూజించి యావిశ్వామిత్ర రామలక్ష్మణులు గంగాతీరమందుండి విశాలయను పట్టణముఁ జూచిరి. ౯

తతో మునివరస్తూర్ణం జగామ సహ రాఘవః,
విశాలాం నగరీం రమ్యాం దివ్యాం స్వర్గోపమాం తదా. ౧౦

అథ రామో మహాప్రాజ్ఞో విశ్వామిత్రం మహామునిమ్,
పప్రచ్ఛ ప్రాంజలిర్భూత్వా విశాలాముత్తమాం పురీమ్. ౧౧
కతరో రాజవంశోఽయం విశాలాయాం మహామునే,
శ్రోతుమిచ్ఛామి భద్రంతే పరం కౌతూహలం హి మే. ౧౨

తస్య తద్వచనం శ్రుత్వా రామస్య మునిపుంగవః,
ఆఖ్యాతుం తత్సమారేభే విశాలస్య పురాతనమ్. ౧౩

శ్రూయతాం రామ శక్రస్య కథాం కథయతశ్శుభామ్,
అస్మిన్ దేశే తు యద్వృత్తం తదపి శృణు రాఘవ. ౧౪
పూర్వం కృతయుగే రామ దితేః పుత్రా మహాబలాః,
అదితేశ్చ మహాభాగ వీర్యవంతస్సుధార్మికాః. ౧౫

తతస్తేషాం నరశ్రేష్ఠ బుద్ధిరాసీన్మహాత్మనామ్,
అమరా అజరాశ్చైవ కథం స్యామ నిరామయాః. ౧౬
తేషాం చింతయతాం రామ బుద్ధిరాసీన్మహాత్మనామ్,
క్షీరోదమథనం కృత్వా రసం ప్రాప్స్యామ తత్ర వై. ౧౭
తతో నిశ్చిత్య మథనం యోక్త్రం కృత్వాచ వాసుకిమ్,
మంథానం మందరం కృత్వా మమంథురమితౌజసః. ౧౮

అథ వర్షసహస్రేణ యోక్త్రసర్పశిరాంసి చ,
వమంత్యతివిషం తత్ర దదంశుర్దశనైశ్శిలాః, ౧౯

అంత నప్పుడు మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులం గూడి మనోహరమై శ్రేష్ఠమై స్వర్గంబునకు సరివచ్చుచున్న విశాలనగరికిఁ బోయెను. ౧౦

అంతఁ బండితులలో శ్రేష్ఠుఁడగు రాముండు చేమోడ్పుగీలించి విశ్వామిత్రమహామునిం జూచి శ్రేష్ఠంబగు విశాలనగరిని గుఱించి యడిగెను. ౧౧

విశ్వామిత్రుఁడా! విశాలనగరియందున్న రాజులవంశ మెట్టిది? నేను దాని వినఁగోరుచున్నాను; నాకు గౌతూహలము గలుగుచున్నది అని రాముఁడు విశ్వామిత్రు నడిగెను. ౧౨

ఆరాముఁడు చెప్పిన మాటవిని మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు విశాలానగరమును నిర్మించిన విశాలుమహారాజు పురాతనచరిత్రము చెప్ప నారంభించెను. ౧౩

రాముఁడా! నేను ఇంద్రునికిఁ జెప్పెదను వినుము; ఈదేశమం దేమి జరిగెనో దానిని వినుము ౧౪

మహాభాగుండవగు రాముఁడా! పూర్వము కృతయుగమునందు దితి కొడుకులు గొప్పబలముగలవారు. కాకుత్స్థనందనా! అదితికొడుకులు మహాపరాక్రమము గలిగి ధర్మాచరణము చేయుచుండిరి. ౧౫

అంత మహాత్ములగు నాదితికొడుకులకును నదితికొడుకులకును 'మేమేమిచేసిన చావు ముసలితనము రోగములేక యుండుదుము' అను యాలోచన కల్గినది.

రాముఁడా! ఇట్లాలోచించుచున్న మహాత్ములగు వారలకు "పాలసముద్రమును జిలికి యమృతంబు నొందెదము" అని బుద్ధి కల్గినది. ౧౭

అంతఁ గొలందిలేని బలంబుఁగల యాదేవాసురులు చిలుకవలెనని నిశ్చయించి వాసుకిని త్రాడుగాఁ జేర్పఱిచికొని మందరపర్వతమును గవ్వముగాఁ జేసికొని చిలికిరి. ౧౮

అంతఁ జిలుకఁగా వేయిసంవత్సరములకుఁ ద్రాడుగానున్న వాసుకితలలు భయంకరంబగు విషంబుఁ గ్రక్కుచు మందరపర్వతము ఱాళ్లను దంతములచేఁ గొఱికినవి. ౧౯

ఉత్పపాతాగ్నిసంకాశం హాలాహలమహావిషమ్,
తేన దగ్ధం జగత్సర్వం సదేవాసురమానుషమ్. ౨౦
అథ దేవా మహాదేవం శంకరం శరణార్థినః,
జగ్ముః పశుపతిం రుద్రం త్రాహి త్రాహీతి తుష్టువుః. ౨౧

ఏవముక్తస్తతో దేవైర్దేవదేవేశ్వరః ప్రభుః. ౨౧½

ప్రాదురాసీత్తతోఽత్రైవ శఙ్ఖచక్రధరో హరిః. ౨౨
ఉవాచైనం స్మితం కృత్వా రుద్రం శూలభృతం హరిః. ౨౨½

దైవతైర్మథ్యమానే తు యత్పూర్వం సముపస్థితమ్. ౨౩
త్వదీయం హి సురశ్రేష్ఠ సురాణామగ్రజోఽసి యత్,
అగ్రపూజామిమాం మత్వా గృహాణేదం విషం ప్రభో. ౨౪

ఇత్యుక్త్వా చ సురశ్రేష్ఠస్తత్రైవాంతరధీయత. ౨౪½
దేవతానాం భయం దృష్ట్వా శ్రుత్వా వాక్యం తు శార్ఙ్గిణః,
హాలాహలవిషం ఘోరం స జగ్రాహామృతోపమమ్. ౨౫½
దేవాన్ విసృజ్య దేవేశో జగామ భగవాన్ హరః. ౨౬

తతో దేవాస్సురాస్సర్వే మమంథూ రఘునందన. ౨౬½

ప్రవివేశాథ పాతాళం మంథానః పర్వతోఽనఘ. ౨౭

తతో దేవాస్సగంధర్వాస్తుష్టువుర్మధుసూదనమ్. ౨౭½

నిప్పువలె సరివచ్చు హాలాహలంబను మహావిషంబు పుట్టినది! దేవాసుర మనుష్యులతోఁ గూడిన ప్రపంచమంతయు దానిచే దహింపఁబడినది. ౨౦

అంతట దేవతలు రక్షకునింగోరి ముఖ్యప్రభుండగు నీశ్వరుని యొద్దకుఁ బోయి పశుపతియైన యాయీశ్వరుని "మమ్ముల రక్షింపుము రక్షింపుము" అని ప్రస్తుతించిరి. ౨౧

అంత లోకనాయకుండును దేవేంద్రునకును ప్రభువునైన యాయీశ్వరుని జూచి దేవత లిట్లని చెప్పిరి. ౨౧½

అంత నచ్చోట శంఖచక్రధారియగు విష్ణువును వచ్చెను ౨౨

విష్ణుదేవుఁడును చిఱునగవు నవ్వి శూలాయుధమును ధరించునట్టి యీశ్వరునితో నిట్లని చెప్పెను. ౨౨½

దేవతాశ్రేష్ఠుండవగు నీశ్వరుఁడా! నీవు దేవతలకందఱకును మొదటి వాఁడవు; కాఁబట్టి సముద్రమథనమందు మొదటఁ బుట్టినది నీభాగము; నీవు దీని నగ్రపూజగా నెంచి విషంబు గ్రహింపు మని విష్ణువు మొదలగు దేవతలు శివునితోఁ జెప్పిరి. ౨౩,౨౪

శ్రీమహావిష్ణు వీప్రకారము పలికి యంతర్ధానమయ్యెను. ౨౪½

ఈశ్వరుండు దేవతలకుం గల్గిన భయమును విష్ణుదేవుండు చెప్పిన యర్థంబును దలపోసి భయంకరమగు హాలాహలంబు నమృతంబునట్లు ద్రావెను. ౨౫½

దేవతలకును ప్రభువై సమస్తశక్తులను గల్గిన యీశ్వరుండు దేవతల వీడ్కొని స్వస్థానంబునకుఁ బోయెను. ౨౬

రాముఁడా! అంత దేవాసురు లందఱును పాలసముద్రంబు చిలుక నారంభించిరి. ౨౬½

పాపరహితుండవగు రాముఁడా! అంతఁ గవ్వముగానున్న మందరపర్వతము సముద్రములో మునిఁగి పాతాళలోకము చేరినది. ౨౭

అంత దేవతలు గంధర్వులును విష్ణుదేవు నిట్లని ప్రస్తుతించిరి. ౨౭½

త్వం గతిస్సర్వభూతానాం విశేషేణ దివౌకసామ్,
పాలయాస్మాన్ మహాబాహో గిరిముద్ధర్తుమర్హసి. ౨౮

ఇతి శ్రుత్వా హృషీకేశః కామఠం రూపమాస్థితః,
పర్వతం పృష్ఠతః కృత్వా శిశ్యే తత్రోదధౌ హరిః. ౨౯

పర్వతాగ్రం తు లోకాత్మా హస్తేనాక్రమ్య కేశవః,
దేవానాం మధ్యతస్స్థిత్వా మమన్థ పురుషోత్తమః. ౩౦

అథ వర్షసహస్రేణ సదణ్డస్సకమణ్డలుః,
పూర్వం ధన్వన్తరిర్నామ అప్సరాశ్చ సువర్చసః. ౩౧
అప్సు నిర్మథనాదేవ రసస్తస్మాద్వరస్త్రియః,
ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్. ౩౨
షష్టిః కోట్యోఽభవంస్తాసామప్సరాణాం సువర్చసామ్,
అసంఖ్యేయాస్తు కాకుత్స్థ యాస్తాసాం పరిచారికాః. ౩౩
న తాస్స్మ పరిగృహ్ణన్తి సర్వే తే దేవదానవాః,
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వాస్సాధారణాస్స్మృతాః. ౩౪
వరుణస్య తతః కన్యా వారుణీ రఘునన్దన,
ఉత్పపాత మహాభాగా మార్గమాణా పరిగ్రహమ్. ౩౫

దితేః పుత్రా న తాం రామ జగృహుర్వరుణాత్మజామ్,
అదితేస్తు సుతా వీర జగృహుస్తామనిన్దితామ్. ౩౬
అసురాస్తేన దైతేయాస్సురాస్తేనాదితేస్సుతాః,
హృష్టాః ప్రముదితాశ్చాసన్ వారుణీగ్రహణాత్సురాః. ౩౭

మహాబాహుండవగు విష్ణుదేవుఁడా! నీవె సమస్తప్రాణులకును అందు విశేషముగా దేవతలకును గతివి. మమ్ములను రక్షింపుము; సముద్రములో మునిఁగి యున్న మందరపర్వతమును లేవనెత్తుము. అని స్తుతించిరి. ౨౮

ఇట్లు దేవతలు చేయు ప్రార్థనను విని యింద్రియంబులకుఁ బ్రభువైన విష్ణుదేవుఁడు తాఁబేలురూపము వహించి మందరపర్వతమును వీఁపుపై నుంచికొని సముద్రమందు శయనించెను. ౨౯

సమస్తలోకంబులఁ దనశరీరమందు ధరించి యున్న పురుషశ్రేష్ఠుండగు విష్ణుదేవుండు చేతులు పైకెత్తి జాచి మందరపర్వతంబు శిఖరమును బట్టుకొని దేవతలనడుమఁ దానును జిలికెను. ౩౦

అంత వేయిసంవత్సరము లయినవెనుక మొదట దండకమండలువులతో ధన్వంతరియును మంచివర్చస్సుగల యప్సరసలును బుట్టిరి. ౩౧

రాముఁడా! పాలయందు చిలుకుటచే రసమొకటి పుట్టినది. ఆరసమునుండి స్త్రీలు పుట్టిరి; కావున వీర లప్సరస లనఁబడిరి. ౩౨

పుట్టి మంచికాంతిగల యప్సరస యువతికోట్లు గల్గిరి; వారలకు పనికత్తెలు లెక్కలేక జన్మించిరి. ౩౩

దేవదానవులలో నెవ్వరు నాయప్సరసలం బెండ్లాడరైరి! అట్లెవ్వరును బెండ్లాడకుండుటం జేసి యాయప్సరస లందఱును వేశ్యలని చెప్పఁబడిరి. ౩౪

రాముఁడా! అంత సముద్రాధిదేవతయగువరుణుని కొమార్తెయు మహాభాగ్యురాలునగు సురాధిదేవతయైన వారుణి యనునది తన్నుఁ బెండ్లాడువారి వెదకుచు సముద్రమునుండి బయలువెడలినది. ౩౫

పరాక్రమశాలివయిన రాముఁడా! రాక్షసులెవ్వరును ఆవారుణిని గ్రహింపరైరి; దేవతలుమాత్రము నిందింపఁబడని యావారుణిం బరిగ్రహించిరి. వారుణిని గ్రహింపకుండుటం జేసి దైత్యు లసురులయిరి! వారుణిం బరిగ్రహించుటవలన దేవతలు సురలయిరి; మరియు దేవతలు వారుణిం గ్రహించుటవలన గుఱుపాటుగలిగి మిక్కిలియు సంతసంబునం బొదలిరి. ౩౬

ఉచ్చైశ్శ్రవా హయశ్రేష్ఠో మణిరత్నం చ కౌస్తుభమ్,
ఉదతిష్ఠన్నరశ్రేష్ఠ తథైవామృతముత్తమమ్. ౩౮

అథ తస్య కృతే రామ మహానాసీత్కులక్షయః,
అదితేస్తు తతః పుత్రా దితేః పుత్రానసూదయన్. ౩౯
ఏకతోఽభ్యాగమన్ సర్వే హ్యసురా రాక్షసైస్సహ,
యుద్ధమాసీన్మహాఘోరం వీర త్రైలోక్యమోహనమ్. ౪౦

యదా క్షయం గతం సర్వం తదా విష్ణుర్మహాబలః,
అమృతం సోఽహరత్తూర్ణం మాయామాస్థాయ మోహినీమ్.

యే గతాభిముఖం విష్ణుమక్షయం పురుషోత్తమమ్,
*సంపిష్టాస్తే తదా యుద్ధే విష్ణునా ప్రభవిష్ణునా. ౪౨

అదితేరాత్మజా వీరా దితేః పుత్రాన్నిజఘ్నిరే,
తస్మిన్ ఘోరే మహాయుద్ధే దైతేయాదిత్యయోర్భృశమ్.
నిహత్య దితిపుత్రాంశ్చ రాజ్యం ప్రాప్య పురందరః,
శశాస ముదితో లోకాన్ సర్షిసంఘాన్ సచారణాన్. ౪౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పంచచత్వారింశస్సర్గః.

---

షట్చత్వారింశస్సర్గః

**హతేషు** తేషు పుత్రేషు దితిః పరమదుఃఖితా,
**మారీచం** కాశ్యపం రామ భర్తారమిదమబ్రవీత్. ౧

---

*సంవిష్టాస్తే అని పాఠాంతరము

పురుషశ్రేష్ఠుండవగు రామా! గుఱ్ఱములలో శ్రేష్ఠంబగు నుచ్చైశ్శ్రవమును మణిశ్రేష్ఠంబగు కౌస్తుభంబును అట్లుత్తమంబగు నమృతమును సముద్రమునుండి పైకి వెడలినది. 3౯వ

రాముఁడా! అంత నాయమృతమునకై దేవతలు దైత్యులును చాల నశించిరి: దేవతలు దైత్యుల ననేకులఁ జంపిరి. 3౯వ

పరాక్రమశాలివైన రాముఁడా! దైత్యులును రాక్షసులును బలమెచ్చుటకై యొకటిగాఁ జేరిరి; అప్పుడు వారలకందఱకును ముల్లోకంబులకు మోహంబు గల్గించునదియును భయంకరంబునగు యుద్ధమైనది. ౪౦వ

అంతయు నాశమునొందునట్లు కాఁగానే మహాబలుఁడగు విష్ణుదేవుఁడు మోహజనకంబగు మోహినీరూపంబును మాయచేఁ గైకొని శీఘ్రముగా నమృతము నపహరించెను. ౪౧వ

ఎవ్వ రాయుద్ధమునందు అక్షయుండును బురుషశ్రేష్ఠుండునగు విష్ణుదేవున కెదురునడచిరో ఆ రాక్షసులు లోకనాయకుండగు నావిష్ణుదేవునిచేఁ జూర్ణముగాఁ జేయఁబడిరి. ౪౨వ

దైత్యులకును దేవతలకును గలిగిన భయంకరమైన యాగొప్పయుద్ధమునందుఁ బరాక్రమశాలులగు దేవతలు దైత్యులం జంపిరి. ౪3వ

ఇంద్రుండు దైత్యులం జంపి రాజ్యంబు నమృతంబునుంబొంది సంతుష్టుండై మహర్షిచారణాదులతోడం గూడిన సమస్తలోకంబులం బాలించెను.

ఇది నలువదియైదవసర్గము.

---

## నలువదియాఱవ సర్గము

తన కొడుకులందఱుఁ జావఁగానే దితి మిక్కిలియు దుఃఖమునొంది మరీచికొడుకును దన పెనిమిటియు నగు కాశ్యపునింజూచి యిట్లని చెప్పెను. ౧

హతపుత్రాఽస్మి భగవం స్తవ పుత్రైర్మహాబలైః,
శక్రహంతారమిచ్ఛామి పుత్రం దీర్ఘతపోర్జితమ్. ౨

సాఽహం తపశ్చరిష్యామి గర్భం మే దాతుమర్హసి,
ఈశ్వరం శక్రహంతారం త్వమనుజ్ఞాతుమర్హసి. ౩

తస్యా స్తద్వచనం శ్రుత్వా మారీచః కాశ్యప స్తదా,
ప్రత్యువాచ మహాతేజా దితిం పరమదుఃఖితామ్. ౪

ఏవం భవతు భద్రం తే శుచిర్భవ తపోధనే,
జనయిష్యసి పుత్రం త్వం శక్రహంతారమాహవే. ౫

పూర్ణే వర్షసహస్రే తు శుచిర్యది భవిష్యసి,
పుత్రం త్రైలోక్యభర్తారం మత్త స్త్వం జనయిష్యసి. ౬

ఏవముక్త్వా మహాతేజాః పాణినా స మమార్జ తామ్,
సమాలభ్య తతస్స్వస్తీత్యుక్త్వా స తపసే యయౌ. ౭

గతే తస్మిన్నరశ్రేష్ఠ దితిః పరమహర్షితా,
కుశప్లవనమాసాద్య తప స్తేపే సుదారుణమ్. ౮

తప స్తస్యాం హి కుర్వంత్యాం పరిచర్యాం చకార హ,
సహస్రాక్షో నరశ్రేష్ఠ పరయా గుణసంపదా. ౯

అగ్నిం కుశాన్ కాష్ఠమపః ఫలం మూలం తథైవచ,
న్యవేదయత్సహస్రాక్షో యచ్చాన్యదపి కాంక్షితమ్. ౧౦

భగవంతుఁడా! అధికబలముగల నీకొడుకులు నాకొడుకుల నందఱిం జంపిరి; దీర్ఘకాలంబు చేయఁబడిన తపంబునంజేసి దార్ఢ్యంబుగలిగి యింద్రునిం జంపెడు కొడుకును బడయఁగోరెదను. ౨

అట్లు మాతపుత్ర నగు నేను తపంబు సల్పెదను; నాకు లోకనాయకుండు నింద్రునిం జంపువాఁడు నగుకొడుకు గల్గున ట్లనుగ్రహింపుము; నాకనుజ్ఞ యిమ్మని దితి కాశ్యపునితోఁ జెప్పెను. ౩

ఆ దితి చెప్పినమాటను విని యప్పుడు మహాప్రభావుండును మరీచి పుత్రుండు నగు కాశ్యపుఁడు మిక్కిలియుం దుఃఖపడుచున్న దితింజూచి యిట్లని చెప్పెను. ౪

అట్లయగుఁగాక; తపస్సే ధనముగాఁగల దితీ! నీకు మంగళమగుఁగాక! కొడుకు గలుగునంతవఱకుఁ బరిశుద్ధురాలవుగ నుండుము! నీకు యుద్ధమునం దింద్రునింజంపునట్టి కొడుకుపుట్టును. ౫

నీవు పరిశుద్ధిగలిగి యుందువేని వేయిసంవత్సరములు కాఁగానే నావలన నీకు ముల్లోకంబులఁ బాలింపఁజాలిన పుత్రుండు పుట్టునని కాశ్యపుఁడు దితికిఁ జెప్పెను. ౬

ఇట్లుచెప్పి మహాప్రభావుఁడగు కాశ్యపుం డాదితిని తనహస్తముచే స్పృశించి దేహమంతయుఁ దడవి యంత "నీకు మంగళమగుఁగాక" యని యాశీర్వదించి తపంబుసేయఁ బోయెను. ౭

పురుషశ్రేష్ఠుండ వగు రాముఁడా! ఆకాశ్యపుఁడు పోఁగానే తనకుం గోరినట్లు కొడుకుపుట్టుట కుపాయంబు దెలియుటంజేసి చాలసంతసంబంది కుశప్లవనంబుచేరి భయంకరంబగు తపముచేసెను. ౮

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఆదితి తపస్సుచేయ నారంభింపం గానే సహస్రాక్షుండగు దేవేంద్రుండు తనగుణాతిశయము చూపుచు నాదితికి సేవఁ జేసెను. ౯

సహస్రాక్షుండగు దేవేంద్రుండు దితికి అగ్నిని దర్భలను సమిధలను ఉదకమును ఫలములను కందమూలములను మరియుం నింకను ఏమికోరునో వాని నన్నింటిని సమర్పించుచుఁ బరిచర్యఁ జేయుచుండెను. ౧౦

గాత్రసంవాహనైశ్చైవ శ్రమాపనయనైస్తథా,
శక్రస్సర్వేషు కాలేషు దితిం పరిచచార హ. ౧౧
అథ వర్షసహస్రే తు దశోనే రఘునందన,
దితిః పరమసంప్రీతా సహస్రాక్షమథాబ్రవీత్. ౧౨

యాచితేన సురశ్రేష్ఠ తవ పిత్రా మహాత్మనా,
వరో వర్షసహస్రాంతే దత్తో మమ సుతం ప్రతి. ౧౩

తపశ్చరంత్యా వర్షాణి దశ వీర్యవతాం వర,
అవశిష్టాని భద్రంతే భ్రాతరం ద్రక్ష్యసే తతః. ౧౪

తమహం త్వత్కృతే పుత్ర సమాధాస్యే జయోత్సుకమ్,
త్రైలోక్యవిజయం పుత్ర సహ భోక్ష్యసి విజ్వరః. ౧౫

ఏవముక్త్వా దితిశ్శక్రం ప్రాప్తే మధ్యం దివాకరే,
నిద్రయాఽపహృతా దేవీ పాదౌ కృత్వాఽథ శీర్షతః. ౧౬
దృష్ట్వా తామశుచిం శక్రః పాదతః కృతమూర్ధజామ్,
శిరస్థానే కృతౌ పాదౌ జహాస చ ముమోద చ. ౧౭

తస్యాశ్శరీరవివరం వివేశ చ పురందరః,
గర్భం చ సప్తధా రామ బిభేద పరమాత్మవాన్. ౧౮
భిద్యమానస్తతో గర్భో వజ్రేణ శతపర్వణా,
రురోద సుస్వరం రామ తతో దితిరబుధ్యత. ౧౯
మా రుదో మా రుద శ్చేతి గర్భం శక్రోఽభ్యభాషత,
బిభేద చ మహాతేజా రుదంతమపి వాసవః. ౨౦

దేవేంద్రుఁడు దితికి ఒళ్లొత్తుచు విసనకఱ్ఱలచే విసరి యలసటదీర్చుచు సమస్తకాలంబులందును బరిచర్య చేయుచుండెను. ౧౧

రాముఁడా! అంత వేయిసంవత్సరములకును బదేండ్లు కొఱఁతపడి యుండఁగానే దితి మిక్కుటముగ సంతోషంబొంది సహస్రాక్షుఁడగు దేవేంద్రుం జూచి యిట్లని చెప్పెను. ౧౨

దేవతలలో శ్రేష్ఠుఁడవగు దేవేంద్రుఁడా! మహాత్ముండగు నీతండ్రి నాచే యాచింపఁబడినవాఁడై వేయిసంవత్సరములయిన పిదప నాకుఁ గొడుకు గల్గునట్లు వరంబొసంగెను. ౧౩

పరాక్రమముగలవారలలో శ్రేష్ఠుఁడవైన యింద్రుఁడా! నేనట్లు తపస్సు సేయఁగా నిప్పటికిఁ బదిసంవత్సరములు మిగిలియున్నవి; నీకు మంగళమగుఁగాక; ఆపైని తమ్మునిం జూడఁగలవు. ౧౪

కుమారుఁడా! జయింప నుద్యమించు నాకొడుకును నీకుఁ గా నేను సమాధానపఱచెదను. నీవు దుఃఖములేక యతనితోఁగూడి ముల్లోకంబుల జయింపఁ గలవని దితి దేవేంద్రునకుఁ జెప్పెను. ౧౫

దితిదేవి యిట్లు దేవేంద్రునకుఁ జెప్పి పగలు రెండుజాములు ఉప్పుడు పాన్పునందుఁ దలకట్టుగాఁ బాదము లుంచుకొని నిద్రించినది. ౧౬

దేవేంద్రుఁడు తలవైపున పాదములును పాదములవైపున తలవెండ్రుకలను వైచికొని పరుండి నిద్రించు నపరిశుద్ధురాలైన దితిని జూచి ధర్మచ్యుతికి నవ్వి సమయము దొరకుటకు సంతోషించెను. ౧౭

రాముఁడా! పరమధైర్యశాలి యగు దేవేంద్రుండు ఆ దితియోనిం బ్రవేశించి గర్భంబునం దున్నశిశువును ఏడుతునుకలుగా ఖండించెను. ౧౮

రాముఁడా! ఇంద్రుండు నూఱంచులుగల వజ్రముచే శిశువును ఖండింపఁగా నాశిశువు మంచిస్వరధ్వనితో నేడ్చెను; అంత దితి మేలుకొనెను.

ఇంద్రుండు శిశువుంజూచి "ఏడువకుము ఏడువకుము" అని చెప్పెను; ఆశిశు వేడ్చుచున్నను మహాతేజుం డగునింద్రుండు దాని ఖండించెను. ౨౦

న హంతవ్యో న హంతవ్య ఇత్యేవం దితిరబ్రవీత్,
నిష్పపాత తతశ్శక్రో మాతుర్వచనగౌరవాత్. ౨౧
ప్రాంజలిర్వజ్రసహితో దితిం శక్రోఽభ్యభాషత. ౨౧½

అశుచిర్దేవి సుప్తాఽసి పాదయోః కృతమూర్ధజా. ౨౨
తదంతరమహం లబ్ధ్వా శక్ర హంతారమాహవే,
అభిదం సప్తధా దేవి తస్మే త్వం క్షంతుమర్హసి. ౨౩

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షట్చత్వారింశస్సర్గః.

---

సప్తచత్వారింశస్సర్గః

సప్తధా తు కృతే గర్భే దితిః పరమదుఃఖితా,
సహస్రాక్షం దురాధర్షం వాక్యం సానునయాఽబ్రవీత్. ౧

మమాపరాధాద్గర్భోఽయం సప్తధా విఫలీకృతః,
నాపరాధోఽస్తి దేవేశ తవాత్ర వలసూదన. ౨

ప్రియం తు కర్తుమిచ్ఛామి మమ గర్భవిపర్యయే,
మరుతాం సప్త సప్తానాం స్థానపాలా భవంత్విమే. 3

వాతస్కంధా ఇమే సప్త చరంతు దివి పుత్రక,
మారుతా ఇతి విఖ్యాతా దివ్యరూపా మమాత్మజాః. ౪

బ్రహ్మలోకం చరత్వేక ఇంద్రలోకం తథాఽపరః,

అప్పుడు దితి "చంపకు చంపకు" మని చెప్పెను; అంత నింద్రుండు తల్లిమాట గౌరవించి గర్భమునుండి వెడలివచ్చెను. ౨౧

వజ్రధరుండగు దేవేంద్రుండు చేమోడ్పుగేలించి దితింజూచి యిట్లని చెప్పెను. ౨౧౫

తల్లీ! నీవు అపరిశుద్ధురాలవై కాళ్లతట్టు తలవెండ్రుకలుంచికొని నిద్రించితివి; కావున నాకప్పు డవకాశము గలుగుటంజేసి యుద్ధమునందు నన్నుజంప నోపునట్టి యీశిశువు నేడు తుండంబులుగా ఖండించితి; తల్లీ! నేను జేసినదాని క్షమింపుమని యింద్రుండు దితితోఁ జెప్పెను. ౨౨, ౨౩

నలువదియాఱవసర్గము.

---

## నలువదియేడవ సర్గము

ఇట్లేడుతుండంబులుగా గర్భంబు ఖండింపఁబడఁగానే దితి పరమదుఃఖంబునొంది యంతకుఁ గొంత యూఱడిల్లి సహస్రాక్షుండు కావునఁ దనపై నేరంబులేకుండఁ గార్యము చేసికొని యుండుటంజేసి యెదిరింపఁగూడదని యింద్రునింజూచి యిట్లని చెప్పెను. ౧

వలాసురునిజంపిన దేవేంద్రుఁడా! నాతప్పువలననే యీగర్భము ఏడు తుంటలుగాఁ జేయఁబడి యిట్లు వ్యర్థమయినది; ఈవిషయమందు నీ తప్పేమియుం లేదు. ౨

నాగర్భ మట్లుచెడిపోయిన విషయమై నీవు నాకొక ప్రియముసేయవలెను; ఈతుండము లేడును ఆవహ ప్రవహ సంవహోద్వహ వివహ పరివహ పరావహంబు లనెడు సప్తమారుతంబుల లోకపాలకులుగా నయ్యెడుఁగాక.

కుమారుఁడా! నాకొడుకు లీయేడ్గురును మారుతములని పిలువఁబడుచు దివ్యరూపంబుగలిగి వాయుస్కంధంబుల కధిదేవతలై స్వర్గంబునం జరింతురుగాక. ౪

ఒకఁడు బ్రహ్మలోకమందు సంచరించుఁగాక. మఱియొకం డింద్రలోక

దివి వాయురితి ఖ్యాతస్తృతీయోఽపి మహాయశాః. ౫

చత్వారస్తు సురశ్రేష్ఠ దిశో వై తవ శాసనాత్,
సంచరిష్యంతు భద్రంతే దేవభూతా మమాత్మజాః. ౬
త్వత్కృతేనైవ నామ్నా చ మారుతా ఇతి విశ్రుతాః. ౬½

తస్యాస్తద్వచనం శ్రుత్వా సహస్రాక్షః పురందరః,
ఉవాచ ప్రాంజలిర్వాక్యం దితిం వలనిషూదనః. ౭½
సర్వమేతద్యథోక్తం తే భవిష్యతి న సంశయః,
విచరిష్యంతి భద్రం తే దేవభూతాస్తవాత్మజాః. ౮½

ఏవం తౌ నిశ్చయం కృత్వా మాతాపుత్రౌ తపోవనే,
జగ్మతుస్త్రిదివం రామ కృతార్థావితి నశ్శ్రుతమ్. ౯½
ఏష దేశస్స కాకుత్స్థ మహేంద్రాధ్యుషితః పురా,
దితిం యత్ర తపస్సిద్ధామేవం పరిచచార సః. ౧౦½
ఇక్ష్వాకోస్తు నరవ్యాఘ్ర పుత్రః పరమధార్మికః,
అలంబుసాయాముత్పన్నో విశాల ఇతి విశ్రుతః. ౧౧½
తేన చాసీదిహ స్థానే విశాలేతి పురీ కృతా. ౧౨
విశాలస్య సుతో రామ హేమచంద్రో మహాబలః,
సుచంద్ర ఇతి విఖ్యాతో హేమచంద్రాదనంతరః. ౧౩
సుచంద్రతనయో రామ ధూమ్రాశ్వ ఇతి విశ్రుతః,
ధూమ్రాశ్వతనయశ్చాపి సృంజయస్సమపద్యత. ౧౪
సృంజయస్య సుతశ్శ్రీమాన్ సహదేవః ప్రతాపవాన్,
కుశాశ్వస్సహదేవస్య పుత్రః పరమధార్మికః. ౧౫

మునం దిరుగుచుండుఁగాక. మూఁడవవాఁడును మహాయశుండై వాయువను పేర నంతరిక్షమునం దిరుగులాడుఁగాక. ౫

దేవతాశ్రేష్ఠుండవగు నింద్రుఁడా! నా కొడుకులు మిగిలిన నల్గురును నీయాజ్ఞం జేసి 'దేవత్వమునొంది నీవు 'మారుదః మారుదః' (ఏడ్వకు మేడ్వకుము) అని పలుకుటవలనం గలిగిన 'మారుతులు' అనుపేరం బ్రసిద్ధులై దిక్కులందు సంచరింతు రని దితి యింద్రునితోఁ జెప్పెను. ౬, ౬½

దితిచెప్పినమాటను విని వలాసురుంజంపిన సహస్రాక్షుండగు నింద్రుఁడు చేమోడ్పుగీలించి దితింజూచి యిట్లని చెప్పెను. ౭½

ఇదంతయు నీవు చెప్పినట్లే సెకు జరుగంగలదు; సందియపడకుము. నీకు మంగళము గలుగుఁగాక; నీకొడుకు లందఱు దేవత్వముగలిగి సంచరింపఁగలరని యింద్రుఁడు దితితో ననెను. ౮½

రాముఁడా! తల్లియును గొడుకు నిట్లు తపోవనమందు నిశ్చయించుకొని కృతార్థులై స్వర్గమునకుఁ బోయిరని మేము వినియున్నాము. ౯½

రాముఁడా! మను వింద్రుం డెచ్చటినుండి దపస్సిద్ధయగు దితికిఁ బరిచర్యచేసెనో; అకుశప్లవనమె యిది; ఇప్పుడు విశాలాపురియను పేరునొందినది.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఇక్ష్వాకువునకు విశాలుండనెడు పరమధార్మికుండగు పుత్త్రుం డలంబుసయందు జనించెను. ౧౧½

ఆవిశాలుండే యిచ్చట విశాలయను నీపట్టణమును నిర్మించెను. ౧౨

రాముఁడా! విశాలునకు మహాబలుండగు హేమచంద్రుండు పుట్టెను; హేమచంద్రునకు సుచంద్రుండు కలిగెను. ౧౩

రాముఁడా! సుచంద్రునకు ధూమ్రాశ్వుం డని ప్రసిద్ధుండైన కొడుకు జనించెను; ధూమ్రాశ్వునకు సృంజయుం డనువాఁడు పుట్టెను. ౧౪

సృంజయునకు సంపదయుఁ బరాక్రమముఁగలుంగల సహదేవుండను కొడుకు జన్మించెను; సహదేవునకుఁ బరమధార్మికుం డగుకుశాశ్వుం డనువాఁడు కలిగెను. ౧౫

కుశాశ్వస్య మహాతేజాః సోమదత్తః ప్రతాపవాన్,
సోమదత్తస్య పుత్రస్తు కాకుత్స్థ ఇతి విశ్రుతః. ౧౬
తస్య పుత్రో మహాతేజాః సంప్రత్యేష పురీమిమామ్,
ఆవసత్యమరప్రఖ్యస్సుమతిర్నామ దుర్జయః. ౧౭
ఇక్ష్వాకోస్తు ప్రసాదేన సర్వే వైశాలికా నృపాః,
దీర్ఘాయుషో మహాత్మానో వీర్యవంతస్సుధార్మికాః. ౧౮
ఇహాద్య రజనీం రామ సుఖం వత్స్యామహే వయమ్,
శ్వః ప్రభాతే నరశ్రేష్ఠ జనకం ద్రష్టుమర్హసి. ౧౯

సుమతిస్తు మహాతేజా విశ్వామిత్రముపాగతమ్,
శ్రుత్వా నరవరశ్రేష్ఠః ప్రత్యుద్గచ్ఛన్మహాయశాః. ౨౦
పూజాం చ పరమాం కృత్వా సోపాధ్యాయస్సబాంధవః,
ప్రాంజలిః కుశలం పృష్ట్వా విశ్వామిత్రమథాబ్రవీత్. ౨౧
ధన్యోస్మ్యనుగృహీతోస్మి యస్య మే విషయం మునిః,
సంప్రాప్తో దర్శనం చైవ నాస్తి ధన్యతరో మయా. ౨౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తచత్వారింశస్సర్గః.



అష్టచత్వారింశస్సర్గః

పృష్ట్వా తు కుశలం తత్ర పరస్పరసమాగమే,
కథాంతే సుమతిర్వాక్యం వ్యాజహార మహామునిమ్. ౧
ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ,
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ. ౨
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ,

కుశాశ్వునకు మహాతేజుండును బరాక్రమశాలియునగు సోమదత్తుండను పుత్త్రుండు కల్గెను; సోమదత్తునకుఁ గాకుత్స్థుండను కుమారుఁడు జనించెను. ౧౬

ఆకాకుత్స్థునికొడుకు మహాపరాక్రమశాలి దేవసమానుఁడు జయింపఁ గూడనివాఁడు నగు సుమతి యిప్పుడీ విశాలాపట్టణమందు వసించుచున్నాఁడు.

విశాలానగరాధిపతులగు రాజులందఱు ఇక్ష్వాకుప్రసాదంబునం జేసి దీర్ఘాయువును ధైర్యంబును వీర్యంబునుం గల్గి ధార్మికులై యుందురు. ౧౮

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! మన మిచ్చట నీరాత్రి యంతయు సుఖముగా నుండుదము; రేపు ప్రాతఃకాలంబున జనకుం జూడఁ బోవచ్చునని విశ్వామిత్త్రుఁడు రామునకుఁ జెప్పెను. ౧౯

రాజశ్రేష్ఠుండును మహాపరాక్రమశాలియును గొప్పకీర్తిగలవాఁడునగు సుమతి విశ్వామిత్త్రమహాముని వచ్చియున్నవాఁడని విని యెదుర్కొనెను ౨౦

సుమతి ఋత్విజులును బంధువులనుం గూడి చక్కఁగాఁ బూజించి చేతులు మోడ్చి క్షేమంబడిగి విశ్వామిత్త్రుం గూర్చి యిట్లని చెప్పెను. ౨౧

విశ్వామిత్త్రమహాముని నాదేశంబునకు వచ్చి నాకు దర్శనమిచ్చినందున నేను చాలఁబుణ్యవంతుఁడనైతి. నాయందలి యనుగ్రహంబు స్థిరమైనది నాతో సరియగు పుణ్యవంతుం డెవ్వండును లేఁడనిసుమతి విశ్వామిత్త్రునితోఁ జెప్పెను.

ఇది నలువదియేడవసర్గము.



## నలువదియెనిమిదవ సర్గము

అట్లు ఒండొరులు కలసినపిదప క్షేమంబడిగి యామాట ముగిసినంతనె సుమతి విశ్వామిత్త్రమహామునితో నిట్లని చెప్పెను. ౧

విశ్వామిత్త్రమహాముని! నీకు మంగళమగుఁగాక; యీకుమారులిద్దఱు విష్ణుదేవునింబోని పరాక్రమంబుగలిగి గజసింహశార్దూలవృషభంబులరీతినడుచుచు ఖడ్గమ్ము నమ్ములపొదియును ధనువును ధరియించి తామరరేకులుంబోలె

అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ. 3
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ,
కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే. ౪

భూషయన్తావిమం దేశం చన్ద్రసూర్యావివామ్బరమ్,
పరస్పరస్య సదృశౌ ప్రమాణేఙ్గితచేష్టితైః. ౫
కిమర్థంచ మునిశ్రేష్ఠ సమ్ప్రాప్తౌ దుర్గమే పథి,
వరాయుధధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. ౬
తస్య తద్వచనం శ్రుత్వా యథావృత్తం న్యవేదయత్,
సిద్ధాశ్రమనివాసం చ రాక్షసానాం వధం తథా. ౭

విశ్వామిత్రవచశ్శ్రుత్వా రాజా పరమహర్షితః,
అతిథీ పరమౌ ప్రాప్తౌ పుత్రౌ దశరథస్య తౌ. ౮
పూజయామాస విధివత్సత్కారార్హౌ మహాబలౌ. ౮½
తతః పరమసత్కారం సుమతేః ప్రాప్య రాఘవౌ,
ఉష్య తత్ర నిశామేకాం జగ్మతుర్మిథిలాం తతః. ౯½
తాం దృష్ట్వా మునయస్సర్వే జనకస్య పురీం శుభామ్,
సాధు సాధ్వితి శంసన్తో మిథిలాం సమపూజయన్. ౧౦½

మిథిలోపవనే శూన్యమాశ్రమం దృశ్య రాఘవః,
పురాణం నిర్జనం రమ్యం పప్రచ్ఛ మునిపుఙ్గవమ్. ౧౧½

శ్రీమదాశ్రమసంకాశం కిన్న్విదం మునివర్జితమ్,

విశాలంబులగు కండ్లుగలవారలై "సౌందర్యంబున నశ్వినులో" అనియెన్నందగి కొంచెముకొంచెముగా సమీపించుచున్న యౌవనంబు గలిగి తమయిచ్చచొప్పున దేవలోకంబునుండి భూమి కేతెంచిన 'యమరులో' యన నొప్పుచున్నవారు; వీరలు కాలినడకచే నిచటికెట్లునడిచివచ్చిరి? ఎందుకో అెవ్వనినిమిత్తమువచ్చిరి?

వీరలు! దేహప్రమాణమునను ఇంగితాకారములనుఒకరినొకరు సొమ్ము చు ఆకాశమును చంద్రసూర్యులంబోలె నీదేశము నలంకరించుచున్నారు. ౫

మంచి సూరగంధముల ధరించి వరాక్రమశాలులగు వీరలు ఎవ్వరికిని జొరరానిమార్గమున నేలవచ్చిరి; దీనినానయు విన్నదున్నట్లు వినఁగోరెదను. ౬

సుమతి చెప్పినమాటవిని విశ్వామిత్రుండు తాను సిద్ధాశ్రమమందుండు టయు విఘ్నము సేయవచ్చినరాక్షసులు రామలక్ష్మణులచేఁ జచ్చుటయుమిథిలకుఁ జనకు యాగముఁ జూడఁబోవుటయు నివిమొదలుగా నడచినవృత్తాంతములం జెప్పెను. ౭

విశ్వామిత్రునిమాటవిని సుమతి మిగుల సంతసంబంది పూజార్హులును మహాబలులును శ్రేష్ఠులైనయతిథులునగు దాదశరథకుమారులయిన రామలక్ష్మణు లను యథాశాస్త్రముగఁ బూజించెను. ౮,౮౪

అంత రామలక్ష్మణులు సుమతి చేసినపరమంబగు పూజను స్వీకరించి యచ్చట నొకరాత్రియుండి వేకువనులేచి మిథిలకుఁగూర్చి పోయిరి. ౯౪

మునులందఱును ఆరామలక్ష్మణవిశ్వామిత్రులంజూచి "ఇట్టివారువచ్చుట వలన మిథిలానగరి యెంతోపుణ్యముచేసి యుండవలయును" అని మంగళకరం బగు జనకునిపట్టణమైన మిథిలను గొనియాడిరి. ౧౦౪

రాముండు మిథిలకుఁ జేరంగటనుండు వనంబునందుఁ బురాతనంబును జనంబులుఁ బర్ణశాలలును లేనిదియును మనోహరమునగు నొకయాశ్రమంబు చూచి మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రు నిట్లని యడిగెను. ౧౧౪

భగవంతుడవైన విశ్వామిత్రుఁడా! ఇది యాశ్రమమువలె నగపడు చున్నది; ఇందు మునులెవ్వరును గానఁబడరు; ఇది యెద్ది? ఇది ప్రాచీనముగా

శ్రోతుమిచ్ఛామి భగవన్ కస్యాయం పూర్వ ఆశ్రమః. ౧౨॥
తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం వాక్యం వాక్యవిశారదః,
ప్రత్యువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః. ౧౩॥
హంత తే కథయిష్యామి శృణు తత్త్వేన రాఘవ,
యస్యేదమాశ్రమపదం శప్తం కోపాన్మహాత్మనా. ౧౪॥

గౌతమస్య నరశ్రేష్ఠ పూర్వమాసీన్మహాత్మనః,
ఆశ్రమో దివ్యసంకాశస్సురైరపి సుపూజితః. ౧౫॥

స చేహ తప ఆతిష్ఠదహల్యాసహితః పురా,
వర్షపూగాననేకాంశ్చ రాజపుత్ర మహాయశః. ౧౬॥
తస్యాంతరం విదిత్వా తు సహస్రాక్షశ్శచీపతిః,
మునివేషధరోఽహల్యామిదం వచనమబ్రవీత్. ౧౭॥
ఋతుకాలం ప్రతీక్షంతే నార్థినస్సుసమాహితే,
సంగమం త్వహమిచ్ఛామి త్వయా సహ సుమధ్యమే. ౧౮॥

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన,
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్. ౧౯॥

అథాబ్రవీన్నరశ్రేష్ఠ కృతార్థేనాంతరాత్మనా. ౨౦

కృతార్థాఽస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో,

నున్నది; ఇది యెవ్వనియాశ్రమము! నేను వినఁగోరెదనని రాముండు డడిగెను.

రాముండు చెప్పినమాటనువిని మాటలుచెప్పుటయందుసమర్థుండగు మహాప్రభావుండునగు విశ్వామిత్రమహాముని యిట్లని బదులుచెప్పెను. ౧౩ ౪

రాముఁడా! (అహల్యను దరింపఁజేయుకాలము సమీపించెను గావున) సంతోషము! ఈయాశ్రమమెవ్వనిదో; ఎవ్వని చేసిది కోపంబునశపింపఁబడెనో; ఆమహాపురుషుని సరిగాఁజెప్పెదను; వినుము. ౧౪ ౪

పురుషశ్రేష్ఠుండవయిన రాముఁడా! మునుపిది మహాత్ముండగు గౌతముని యాశ్రమమై యాశ్రమములలో శ్రేష్ఠమై దేవతలచేతను బూజింపబడు చుండినది. ౧౫ ౪

గొప్పకీర్తిగల రాజపుత్రుండవగు రాముఁడా! మున్ను గౌతముం డిచట నహల్యంగూడి పెక్కువత్సరంబులు తపంబు చేసెను. ౧౬ ౪

సహస్రాక్షుం డగు దేవేంద్రుండు ఆగౌతముండు లేకుండుట నెఱింగి గౌతముని యట్లు వేషంబుధరించి యహల్యంజూచి యిట్లని చెప్పెను. ౧౭ ౪

బ్రహ్మదేవుని చేతఁ జక్కఁగా నిర్మింపఁబడిన యతిసుందరి యగుదానా! కాముకులు ఇచ్ఛచొప్పునం గ్రీడింతురుగాని ఋతుకాలము నెదురుచూడరు; మంచి నడుముగల యహల్యా! నేను నీతోటిసంగమమ్మాత్రమే కోరుచున్నాను. (నాకు నీయందుఁ బుత్రోత్పత్తి యక్కఱలేదు. కావున ఋతుకాలము నెదురుచూడవలసినపనిలేదు.) అని యింద్రుం డహల్యతోఁజెప్పెను ౧౮ ౪

రాముఁడా! దుర్బుద్ధి యగు నాయహల్య "ఇంద్రుండు గౌతమవేషముఁ బూని వచ్చియున్నాఁడని యెఱింగియు" దేవతాప్రభుండగు నింద్రునియందలి బహుమానంబునం జేసి సమ్మతించెను. ౧౯ ౪

పురుషశ్రేష్ఠుండగు రాముఁడా! అట్లుక్రీడించిన వెనుక నాయహల్య కృతకృత్యురాలై యింద్రునిఁజూచి యిట్లని చెప్పెను. ౨౦

లోకనాయకుండవు దేవతాశ్రేష్ఠుండవగు దేవేంద్రుఁడా! నేను కృతార్థురాలనైతిని; నీవిచ్చటనుండి శీఘ్రముగఁబొమ్ము; నీవు దేవేశ్వరుఁడవు మానము

ఆత్మానం మాం చ దేవేశ సర్వథా రక్ష మానద. ౨౧

ఇంద్రస్తు ప్రహసన్ వాక్యమహల్యామిదమబ్రవీత్,
సుశ్రోణి పరితుష్టోఽస్మి గమిష్యామి యథాగతమ్. ౨౨

ఏవం సంగమ్య తు తయా నిశ్చక్రామోటజాత్తతః,
స సంభ్రమాత్త్వరన్ రామ శంకితో గౌతమం ప్రతి. ౨౩
గౌతమం స దదర్శాథ ప్రవిశంతం మహామునిమ్,
దేవదానవదుర్ధర్షం తపోబలసమన్వితమ్. ౨౪
తీర్థోదకపరిక్లిన్నం దీప్యమానమివానలమ్,
గృహీతసమిధం తత్ర సకుశం మునిపుంగవం. ౨౫
దృష్ట్వా సురపతిస్త్రస్తో వివర్ణవదనోఽభవత్. ౨౫½

అథ దృష్ట్వా సహస్రాక్షం మునివేషధరం మునిః,
దుర్వృత్తం వృత్తసంపన్నో రోషాద్వచనమబ్రవీత్. ౨౬½
మమ రూపం సమాస్థాయ కృతవానసి దుర్మతే,
అకర్తవ్యమిదం తస్మాద్విఫలస్త్వం భవిష్యసి. ౨౭½
గౌతమేనైవముక్తస్య సరోషేణ మహాత్మనా,
పేతతుర్వృషణౌ భూమౌ సహస్రాక్షస్య తత్క్షణాత్. ౨౮½
తథా శప్త్వా స వై శక్రమహల్యామపి శప్తవాన్. ౨౯

ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి. ౨౯½
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ,
అదృశ్యా సర్వభూతానామాశ్రమేఽస్మిన్నివత్స్యసి. ౩౦½

నిచ్చువాఁడవు నిన్నును నన్నును ఎల్లప్పుడు రక్షించుకొను మని యహల్య యింద్రునితోఁ జెప్పెను. ౨౧

ఇంద్రుండును నవ్వుచు ఆహల్యం జూచి మంచిపిఱుందులుగల సుందరి వగు నహల్యా! నేను సంతుష్టుండ నైతిని; వచ్చినదారిని బోయెదనని యింద్రుం డహల్యతోఁ జెప్పెను. ౨౨

ఇంద్రుం డిట్లహల్యతోఁ గ్రీడించి యంత భయంబునఁ గౌతముండు వచ్చునేమోయని శంకించుచు వేగిరముగాఁ బర్ణశాలనుండి బయలు వెడలెను. ౨౩

అంత నా యాశ్రమమందు దేవతలకును దానవులకును ధర్షింపఁగూడని వాఁడును తపోబలంబుతోఁ గూడినవాఁడునగు గౌతమమహాముని నదీతీర్థమందు స్నానము చేసి మండుచున్ననిప్పువలె నొప్పుచు సమిధలను దర్భలను గ్రహించి యప్పుడు ప్రవేశింపఁగా నతని దేవేంద్రుండు చూచెను. ౨౪,౨౫

గౌతముంజూడఁగానే దేవేంద్రుని మొగంబు భయముచేత వెల్లఁ బాఱెను. ౨౫½

అంత సదాచారసంపన్నుం డగు గౌతముండు మునివేషముధరించి దురాచారముగానుండిన యింద్రునిఁ జూచి రుష్టుండై యిట్లని చెప్పెను. ౨౬½

దుర్బుద్ధీ! నా రూపముధరించి చేయరాని యిట్టిపని జేసితివి; కాఁబట్టి నీవృషణములు దునిసిపడుఁగాక అని గౌతముం డింద్రునితో ననెను. ౨౭½

ఇట్లు మహాత్ముండగు గౌతముండు కోపంబునం జెప్పఁగానే దేవేంద్రుని వృషణంబు లాక్షణమే నేలంబడినవి. ౨౮½

ఆగౌతముం డట్లు దేవేంద్రుని శపించి యహల్యనుం గూడ నిట్లని శపించెను. ౨౯

నీవీయాశ్రమమందుఁ బెక్కువేలేండ్లు వాసముసేయుదువు. ౨౯½

నీవీయాశ్రమమందు వాయుభక్షణము సేయుచు ఆహారము విడిచి తపంబు గావింపుచు భస్మంబునందుండి సమస్తప్రాణులకును గాన్పింపని దానవై యుండఁగలవు. ౩౦½

యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః,
ఆగమిష్యతి దుర్ధర్షస్తదా పూతా భవిష్యసి. 3౧

తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా,
మత్సకాశే ముదా యుక్తా స్వం వపుర్ధారయిష్యసి. 3౨

ఏవముక్త్వా మహాతేజా గౌతమో దుష్టచారిణీమ్. 33
ఇమమాశ్రమముత్సృజ్య సిద్ధచారణసేవితే,
హిమవచ్ఛిఖరే పుణ్యే తపస్తేపే మహాతపాః. 3౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, అష్టచత్వారింశస్సర్గః.

---

ఏకోనపంచాశస్సర్గః.

అఫలస్తు తతశ్శక్రో దేవానగ్నిపురోగమాన్,
అబ్రవీత్త్రస్తవదనస్సర్షిసంఘాన్ సచారణాన్. ౧

కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః,
క్రోధముత్పాద్య హి మయా సురకార్యమిదం కృతమ్. ౨
అఫలోఽస్మి కృతస్తేన క్రోధాత్సా చ నిరాకృతా,
శాపమోక్షేణ మహతా తపోఽస్యాపహృతం మయా. 3

తస్మాత్సురవరాస్సర్వే సర్షిసంఘాస్సచారణాః,
సురసాహ్యకరం సర్వే సఫలం కర్తుమర్హథ. ౪

శతక్రతోర్వచశ్శ్రుత్వా దేవాస్సాగ్నిపురోగమాః,
పితృదేవానుపేత్యాహుస్సహ సర్వైర్మరుద్గణైః. ౫

ఎప్పుడు దుర్ధర్షుండును దశరథుని పుత్త్రుండునగు రామునడు మఱి యెవ్వరును లేనందున భయంకరంబగు నీయాశ్రమంబునకు వచ్చునో: అప్పుడు నీవు పరిశుద్ధవయ్యెదవు. 3౧౪

దురాచారముగల యహల్యా! ఆరాముని కతిథిసత్కారముచేసి దానిచే లోభమోహంబులు వీడి నాయొకుట సంతోషంబున మరల నీదగు రూపంబు దాల్పఁగలవని గౌతముం డహల్యను శపియించెను. 3౨౪

అధికమయినతపస్సును బ్రభావంబునుంగలగౌతముండు దురాచారము గావించిన యహల్య నిట్లు శపించి యీయాశ్రమంబు విడిచి సిద్ధులు చారణులు మొదలగువారిచే సేవింపఁబడినదియై పుణ్యంబైన హిమవత్పర్వతము శిఖరమందుఁ దపంబు గావించెను. 33, 3౮

ఇది నలువదియొనిమిదవ సర్గము.

---

## నలువదితొమ్మిదవ సర్గము

అంత దేవేంద్రుండు తనవృషణములు పోఁగొట్టుకొని భయంబున దైన్యంబునొందిన ముఖంబుతో ఋషులను జారణులను అగ్నిమున్నగు దేవతలనుం జూచి యిట్లని చెప్పెను. ౧

నేను మహాత్ముండగు గౌతమునకుఁ గోపముపుట్టించి తపోవిఘ్నముచేసి దేవతాకార్యమును జేసినవాఁడనైతిని. ౨

ఆగౌతముండు కోపంబున నన్ను వృషణములు లేనివానింగా జేసి యహల్యనుఁ బరిత్యజించెను; ఇట్లు గొప్పశాపం బొసంగుటంజేసి యతని తపంబు తఱుఁగుటవలన నే నతనితపస్సు నపహరించినవాఁడనైతిని. 3

అందువలన దేవతలారా! మీరందఱు ఋషులను జారణులనుంగూడి మీకు సాహాయ్యముచేసిన నాకు వృషణంబులు గల్గునట్లు చేయవలయుంసని యింద్రుండు దేవతలతోఁ జెప్పెను. ౮

ఇంద్రుండు చెప్పినమాట విని అగ్నిమున్నగు దేవతలు సమస్తవాయువులంగూడి పితృదేవతలయొద్దకుఁ బోయి యిట్లని చెప్పిరి. ౫

అయం మేషస్సవృషణశ్శక్రో హ్యవృషణః కృతః,
మేషస్య వృషణౌ గృహ్య శక్రాయాఽఽశు ప్రయచ్ఛత. ౬

అఫలస్తు కృతో మేషః పరాం తుష్టిం ప్రదాస్యతి,
భవతాం హర్షణార్థాయ యేచ దాస్యంతి మానవాః. ౭

అగ్నేస్తు వచనం శ్రుత్వా పితృదేవాస్సమాగతాః,
ఉత్పాట్య మేషవృషణౌ సహస్రాక్షే న్యవేశయన్. ౮

తదాప్రభృతి కాకుత్స్థ పితృదేవాస్సమాగతాః,
అఫలాన్ భుంజతే మేషాన్ ఫలైస్తేషామయోజయన్. ౯

ఇంద్రస్తు మేషవృషణస్తదాప్రభృతి రాఘవ,
గౌతమస్య ప్రభావేన తపసశ్చ మహాత్మనః. ౧౦
తదాగచ్ఛ మహాతేజ ఆశ్రమం పుణ్యకర్మణః,
తారయైనాం మహాభాగామహల్యాం దేవరూపిణీమ్. ౧౧

విశ్వామిత్రవచశ్శ్రుత్వా రాఘవస్సహలక్ష్మణః,
విశ్వామిత్రం పురస్కృత్య తమాశ్రమమథావిశత్. ౧౨
దదర్శ చ మహాభాగాం తపసా ద్యోతితప్రభామ్,
లోకైరపి సమాగమ్య దుర్నిరీక్ష్యాం సురాసురైః. ౧౩
ప్రయత్నాన్నిర్మితాం ధాత్రా దివ్యాం మాయామయీమివ,
సతుషారావృతాం సాభ్రాం పూర్ణచంద్రప్రభామివ. ౧౪
మధ్యేఽంభసో దురాధర్షాం దీప్తాం సూర్యప్రభామివ. ౧౪½

మీకు యాగమందు భాగార్థముగాఁ గల్పితంబగు నీమేషంబు వృషణములు గలది; ఇంద్రునివృషణములు పోయినవి; కాఁబట్టి ఈమేషము వృషణములందీసి త్వరగా నింద్రున కిచ్చివేయుఁడు. ౬

ఈమేషము వృషణములులేనిదిగాఁ జేయఁబడినను మీకధికమైనసంతోషము సేయును; మిమ్ముల సంతోషపెట్టుటకై దీనినిచ్చువారును మీకధికమైన సంతోషము చేసినవార లగుదు రని దేవతలు చెప్పిరి. ౭

అగ్నిమున్నగు దేవతలమాటవిని హవిర్భాగమును గ్రహించుటకై యాగభూమికి వచ్చియున్న పితృదేవతలు మేష వృషణంబులం బెఱికి ఇంద్రున కిచ్చిరి. ౮

రాముఁడా! అది మొదలు పితృదేవతలు హవిర్భాగార్థమువచ్చి వృషణములులేని మేషముల భుజించెదరు; అయిన నవియొసంగువారికి వృషణములుగల మేషముల నొసంగినఫలము నిచ్చెదరు. ౯

రాముఁడా! అది మొదలు మహాత్ముండగు గౌతముని తపోమహిమచేత దేవేంద్రుండు మాత్రము మేషవృషణుం డయ్యెను. ౧౦

మహాప్రభావుండగు రాముఁడా! నీవే యహల్యాశాపమును బోఁగొట్టఁదగినవాఁడవు కావున పుణ్యకర్ముండగు గౌతమముని యాశ్రమమునకురమ్ము. మహాభాగురాలును దేవతలవంటి రూపముగలదియు నగు నీయహల్యకు శాపవిముక్తిం జేయుమని విశ్వామిత్రుఁడు రామునకుం జెప్పెను. ౧౧

విశ్వామిత్రమహాముని చెప్పినదివిని రాముండు లక్ష్మణుంగూడి విశ్వామిత్రు ముందిడికొని యాగౌతమాశ్రమముఁ బ్రవేశించెను. ౧౨

రాముఁడు మహాభాగ్యురాలును తపంబుచే రెట్టించినకాంతిగలిగి మనుష్యులుగాని దేవతలుగాని యసురులుగాని సమీపమునకుఁబోయి చూడ నలవిగాకుండునదియును బ్రహ్మదేవునిచే మహోద్యోగంబున నిర్మింపఁబడి దివ్యరూపంబున మాయామయి యని యెన్నందగియుండునదియు తీఁగెలలోఁ బువ్వంబులలో మఱుఁగుపడియుండుటం జేసి మేఘంబు లిట్టిటు దిరుగఁగా మంచునం గప్పఁబడియుండు నిండుచందురు మేనికాంతియుంబోలెఁ గన్పట్టుచు సౌమ్య

సా హి గౌతమవాక్యేన దుర్నిరీక్ష్యా బభూవ హ,
త్రయాణామపి లోకానాం యావద్రామస్య దర్శనమ్. ౧౫½
శాపస్యాంతముపాగమ్య తేషాం దర్శనమాగతా. ౧౬

రాఘవౌ తు తత స్తస్యాః పాదౌ జగృహతు స్తదా. ౧౬½
స్మరంతీ గౌతమవచః ప్రతిజగ్రాహ సా చ తౌ. ౧౭

పాద్యమర్ఘ్యం తథాఽఽతిథ్యం చకార సుసమాహితా,
ప్రతిజగ్రాహ కాకుత్స్థో విధిదృష్టేన కర్మణా. ౧౮
పుష్పవృష్టిర్మహత్యాసీద్దేవదుందుభినిస్స్వనైః,
గంధర్వాప్సరసాం చైవ మహానాసీత్సమాగమః. ౧౯
సాధు సాధ్వితి దేవాస్తామహల్యాం సమపూజయన్,
తపోబలవిశుద్ధాంగీం గౌతమస్య వశానుగామ్. ౨౦
గౌతమోఽపి మహాతేజా అహల్యాసహితస్సుఖీ,
రామం సంపూజ్య విధివ త్తప స్తేపే మహాతపాః. ౨౧

రామోఽపి పరమాం పూజాం గౌతమస్య మహామునేః,
సకాశాద్విధివత్ప్రాప్య జగామ మిథిలాం తతః. ౨౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకోనపంచాశస్సర్గః.

పై మీఁద నలవిగాకుండుటవలన జలమధ్యంబునం బ్రతిబింబించిన సూర్య కాంతియుం బోలెఁ బ్రకాశించుచున్న యాయహల్యం జూచెను. ౧౩,౧౪

ఆయహల్య గౌతమవాక్యంబున రామదర్శన మగునంతపఱకును ముల్లోకంబులనుండువారికి నదృశ్యయై యుండెను. ౧౫

ఇప్పుడు శాపముతీఱినది కాఁబట్టి అహల్య యందఱకును గన్పడు చున్నది. ౧౬

అంత నప్పుడు రామలక్ష్మణు లాయహల్యపాదములకు నమస్కరించిరి.

అహల్యయును గౌతముఁడు "రాముఁ డీయాశ్రమమునకు రాగా నే నీవు శాపముక్త వగుదువు. మఱియు నతని కాతిథ్యమిచ్చుటంజేసి పరిశుద్ధ వగుదువు" అని తనతోఁ జెప్పినమాటను దలంచి రామలక్ష్మణులం బూజించుటకై ప్రతిగ్రహించెను. ౧౭

అహల్య మిక్కిలియు నెచ్చరికతోఁ బాద్యమునర్ఘ్యమును నాతిథ్యమును రామున కొసంగెను; రాముఁడును వానిని యథావిధిగఁ బ్రతిగ్రహించెను.

అప్పుడు దేవతలు భేరులు వాయించిరి; పూలవాన గురిసినది; గంధర్వులు నప్సరసలును ఆటపాటలు గావించిరి. ౧౮

దేవతలు తపోబలంబునఁ బరిశుద్ధయై గౌతమునిశాసనంబునకు లోఁబడి యున్న యాయహల్యంజూచి "లెస్సలెస్స" అని కొనియాడిరి. ౨౦

మహాతపస్వియు మహాప్రభావుండునగు గౌతమమహామునియును రామాగమనము విని యచ్చటికివచ్చి యహల్యంగూడి సుఖియై యథావిధిని రామునిం బూజించి తపంబు గావించుచుండెను. ౨౧

రాముండును గౌతమమహామునిచేసిన గొప్పపూజను యథావిధిగఁ బ్రతిగ్రహించి యామిథిలకుఁ బోయెను. ౨౨

ఇది నలువదితొమ్మిదవసర్గము.

---

## పఞ్చాశస్సర్గః.

తతః ప్రాగుత్తరాం గత్వా రామస్సౌమిత్రిణా సహ,
విశ్వామిత్రం పురస్కృత్య యజ్ఞవాటముపాగమత్. ౧
రామస్తు మునిశార్దూలమువాచ సహలక్ష్మణః. ౧½

సాధ్వీ యజ్ఞసమృద్ధిర్హి జనకస్య మహాత్మనః. ౨
బహూనీహ సహస్రాణి నానాదేశనివాసినామ్,
బ్రాహ్మణానాం మహాభాగ వేదాధ్యయనశాలినామ్. ౩
ఋషివాటాశ్చ దృశ్యంతే శకటీశతసంకులాః. ౩½

దేశో విధీయతాం బ్రహ్మన్ యత్ర వత్స్యామహే వయమ్. ౪

రామస్య వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః,
నివేశమకరోద్దేశే వివిక్తే సలిలాయుతే. ౫
విశ్వామిత్రమనుప్రాప్తం శ్రుత్వా స నృపతిస్తదా,
శతానందం పురస్కృత్య పురోహితమనిందితమ్. ౬
ప్రత్యుజ్జగామ సహసా వినయేన సమన్వితః. ౬½
ఋత్విజోఽపి మహాత్మానస్త్వర్ఘ్యమాదాయ సత్వరమ్,
విశ్వామిత్రాయ ధర్మేణ దదుర్మంత్రపురస్కృతమ్. ౭½
ప్రతిగృహ్య చ తాం పూజాం జనకస్య మహాత్మనః,
పప్రచ్ఛ కుశలం రాజ్ఞో యజ్ఞస్య చ నిరామయమ్. ౮½

స తాంశ్చాపి మునీన్ పృష్ట్వా సోపాధ్యాయపురోధసః,
యథాన్యాయం తతస్సర్వైస్సమాగచ్ఛత్ప్రహృష్టవత్. ౯½

## ఏబదియవ సర్గము

రాముండు లక్ష్మణుంగూడి యీశానదిశనుగూర్చి వెళ్లి విశ్వామిత్రు ముందిడుకొని జనకునియాగశాలం బ్రవేశించెను. ౧

రాముండును లక్ష్మణుండును మునిశ్రేష్ఠుం డగువిశ్వామిత్రుం జూచి యిట్లని చెప్పిరి. ౧½

మహాత్ముండగు జనకునియాగసంభారసామగ్రి చాలఁజక్కఁగా నున్నది. మహాభాగుండవగు విశ్వామిత్రుఁడా! ఈయాగశాలయందు నానా దేశ వాసులును వేదముల నధ్యయనించినవారు నగుబ్రాహ్మణోత్తములు పెక్కు వేలమంది యున్నారు; లెక్కలేనిబండ్లు నిలిపియుండుటంజేసి యిఱుకుగల్గియుండు ఋషిస్థానములును గనుపడుచున్నది. ౩,౩½

బ్రాహ్మణుఁడవైన విశ్వామిత్రుఁడా! మనమెచ్చట నివసింపవచ్చునో; అట్టిప్రదేశము నేర్పఱుచుము. అని రామలక్ష్మణులు విశ్వామిత్రునకుఁ జెప్పిరి.

రాముఁడు చెప్పినదివిని విశ్వామిత్రమహాముని జనసమ్మర్దము లేనందునఁ బరిశుద్ధమును సమీపమందు జలముగల్గినదియు నగుస్థానమందు విడిది చేసెను.

ఆ జనకమహారా జప్పుడు విశ్వామిత్రుండు వచ్చియున్నాఁ డని విని అనిందితుండును బురోహితుండునగు శతానందు ముందిడుకొని వినయంబున శీఘ్రముగా విశ్వామిత్రు నెదుర్కొనెను. ౬,౬½

జనకునిఋత్విజులు మహాత్ములగువారు వేగముగాఁ బూజాద్రవ్యము గొనివచ్చి ధర్మపద్ధతిని సమంత్రకంబుగా విశ్వామిత్రున కొసంగిరి. ౭½

విశ్వామిత్రుండు మహాత్ముం డగుజనకుండు చేసినపూజం బ్రతిగ్రహించి జనకుంజూచి "నీవు క్షేమమా? నీయాగము నిర్విఘ్నముగ జరుగుచున్నదా!" అని యడిగెను; ౮½

విశ్వామిత్రుండు ఋత్విజులు పురోహితుఁడును మొదలగు వాము నులనుం గ్రమంబునఁ గుశలంబడిగి యాతనందఱితోఁగూడ సంతోషంబున నుండెను. ౯½

అథ రాజా మునిశ్రేష్ఠం కృతాంజలిరభాషత,
ఆసనే భగవానాస్తాం సహైభిర్మునిపుంగవైః, ౧౦½

జనకస్య వచశ్శ్రుత్వా నిషసాద మహామునిః, ౧౧
పురోధా ఋత్విజశ్చైవ రాజా చ సహమంత్రిభిః. ౧౧½

ఆసనేషు యథాన్యాయముపవిష్టాన్ సమంతతః,
దృష్ట్వా స నృపతిస్తత్ర విశ్వామిత్రమథాబ్రవీత్. ౧౨½
అద్య యజ్ఞసమృద్ధిర్మే సఫలా దైవతైః కృతా,
అద్య యజ్ఞఫలం ప్రాప్తం భగవద్దర్శనాన్మయా. ౧౩½

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుంగవ,
యజ్ఞోపసదనం బ్రహ్మన్ ప్రాప్తోఽసి మునిభిస్సహ. ౧౪½

ద్వాదశాహంతు బ్రహ్మర్షే శేషమాహుర్మనీషిణః,
తతో భాగార్థినో దేవాన్ ద్రష్టుమర్హసి కౌశిక. ౧౫½

ఇత్యుక్త్వా మునిశార్దూలం ప్రహృష్టవదనస్తదా,
పునస్తం పరిపప్రచ్ఛ ప్రాంజలిః ప్రణతో నృపః. ౧౬½

ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ. ౧౭
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ,
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ. ౧౮
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ,
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ. ౧౯

అంత జనకమహారాజు చేతులు మొగిడ్చి మునిశ్రేష్ఠుం డగు విశ్వామిత్రుంజూచి "భగవంతుండవగు నీవీమునివర్యులతోఁ గూడ నాసనంబునం గూర్చుండుము" అని చెప్పెను. ౧౦½

జనకుండు చెప్పినదివిని విశ్వామిత్రమహాముని కూర్చుండెను. ౧౧

అంతఁ బురోహితుం డగు శతానందుండును ఋత్విజు లగు మును లును గూర్చుండిరి; మంత్రులతో జనకుండును గూర్చుండెను. ౧౧½

అంత నాజనకుండు ఆసనంబులఁ గ్రమంబుగాఁ గూర్చుండిన మునుల నందఱంగని యందు విశ్వామిత్రుంజూచి యిట్లని చెప్పెను. ౧౨½

నేను సమగ్రముగాఁ జేసిన యాగముల ఫలం బిప్పుడు దేవతలు నా కొసంగిరి; ఇప్పుడు నేను భగవంతుఁ డగు నిన్నుఁ జూచుటవలన యాగఫలంబు నొందితి. ౧౩½

మునిశ్రేష్ఠుం డగు విశ్వామిత్రుఁడా! నీవు మునులతోఁగూడ నాయాగ శాలకు వచ్చుటంజేసి నేనుపుణ్యవంతుండనైతిని; నాయందలి యనుగ్రహంబు తెల్లఁబడినది. ౧౪½

బ్రహ్మర్షివగు విశ్వామిత్రుఁడా! ఇంక పండ్రెండుదినములె యాగపూర్తికి మిగిలినవని పండితులు చెప్పుచున్నారు; నీవంతవఱకుండియాగమైనిహవిర్భాగముకు గోరవచ్చినదేవతలు జూడవలయును. అని విశ్వామిత్రునకుఁ జెప్పెను.

జనకుండట్లు మునిశ్రేష్ఠుం డగువిశ్వామిత్రునితోఁ జెప్పి సంతోషంబు నొంది చేతులు మొగిడ్చి నమస్కరించి మరల నావిశ్వామిత్రునింజూచి యిట్లని యడిగెను. ౧౫½

విశ్వామిత్రమహామునీ! నీకు మంగళము గలుగుఁగాక; ఈకుమారు లిద్దఱు విష్ణుదేవునింబోని పరాక్రమంబుగలిగి గజసింహశార్దూల వృషభంబుల రీతి నడుచుచు ఖడ్గము నమ్ములపొదియు ధనువును ధరియించి తామరరేకు లంబోలె విశాలంబు లగు కండ్లుగలవారలై సౌందర్యంబున "నశ్వినులు" యని చెప్పందగి కొంచెము కొంచెముగా సమీపించుచున్న యౌవనంబును గలిగి తమయిచ్ఛచొప్పున దేవలోకంబునుండి భూలోకంబున కేతెంచిన

కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే. ౧౯½

వరాయుధధరౌ వీరౌ కస్య పుత్రౌ మహామునే. ౨౦

భూషయంతావిమం దేశం చంద్రసూర్యావివాంబరమ్,
పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితైః. ౨౧
కాకపక్షధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. ౨౧½

తస్య తద్వచనం శ్రుత్వా జనకస్య మహాత్మనః,
న్యవేదయన్మహాత్మానౌ పుత్రౌ దశరథస్య తౌ. ౨౨½

సిద్ధాశ్రమనివాసం చ రాక్షసానాం వధం తథా. ౨౩
తచ్చాగమనమవ్యగ్రం విశాలాయాశ్చ దర్శనమ్,
అహల్యాదర్శనం చైవ గౌతమేన సమాగమమ్. ౨౪
మహాధనుషి జిజ్ఞాసాం కర్తుమాగమనం తథా,
ఏతత్సర్వం మహాతేజా జనకాయ మహాత్మనే. ౨౫
నివేద్య విరరామాథ విశ్వామిత్రో మహామునిః. ౨౫½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పఞ్చాశస్సర్గః.

ఏకపఞ్చాశస్సర్గః.

తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రస్య ధీమతః,
హృష్టరోమా మహాతేజాశ్శతానందో మహాతపాః. ౧
గౌతమస్య సుతో జ్యేష్ఠస్తపసా ద్యోతితప్రభః,
రామసందర్శనా దేవ పరం విస్మయమాగతః. ౨

"యమరులో" యన నొప్పుచున్నవారు; వీరలు కాలినడకచే నిచటికెట్లు నడచివచ్చిరి? ఎందుకొఱ కెవ్వనినిమిత్తము వచ్చిరి. ౧౮-౧౯½

విశ్వామిత్రమహామునీ! వీరలు శ్రేష్ఠములగు నాయుధముల ధరించి పరాక్రమశాలులై యున్నవారు; వీర లెవ్వనికొడుకులు? ౨౦

వీరలు దేహప్రమాణమునను ఇంగితాకారములను ఒకరికొకరు సరి వచ్చుచు పిల్లజుట్టుగలిగి పరాక్రమశాలులై యాకాశంబును జంద్రసూర్యు లుంబోలె నీయాగశాల నలంకరించుచున్నారు; కావున వీరివృత్తాంతమును ఉన్నదున్నట్లు విననగోరెద నని జనకుండు విశ్వామిత్రు నడిగెను. ౨౧,౨౧½

విశ్వామిత్రుండు మహాత్ముం డగు జనకమహారాజుమాట విని "వీరలు మహాత్ములు దశరథమహారాజు కొడుకులు" అని రామలక్ష్మణుల నతనికిఁ దెల్పెను. ౨౨½

మహాప్రభావుం డగు విశ్వామిత్రమహాముని రామలక్ష్మణులు తనతో సిద్ధాశ్రమమునకు వచ్చుటయు నచ్చట రాక్షసులంజంపుటయు రాక్షసులు వ్యాపించియుండు నరణ్యమార్గంబున నిర్భయంబుగ వచ్చుటయు విశాలానగరిం జూచుటయు అహల్యను జూచుటయు గౌతమునిఁ గనుంగొనుటయు జనకు నింటనుండు శివధనుస్సెంతటిదో పరీక్షింప మిథిలకే తెంచుటయు నీవృత్తాంత మంతయు సవిస్తరంబుగా మహాత్ముండగు జనకునకుం దెల్పి యంతనూరకుండెను.

ఇది యేబదియవసర్గము.

---

## ఏబదియొకటవ సర్గము

బుద్ధిమంతుండగు విశ్వామిత్రుఁడు చెప్పినదివిని, గౌతమునిజ్యేష్ఠకుమారుండును తపంబున రెట్టించిన దేహకాంతిగలవాఁడును మహాప్రభావుండును అధికమైనతపంబును గలవాఁడునగు శతానందుండు గగుర్పాటునొంది యతి మానుషుండగు రామునింజూచినమాత్రనే మిక్కిలియు నాశ్చర్యంబునొందెను.

స తౌ నిషణ్ణౌ సంప్రేక్ష్య సుఖాసీనౌ నృపాత్మజౌ,
శతానందో మునిశ్రేష్ఠం విశ్వామిత్రమథాబ్రవీత్. 3
అపి తే మునిశార్దూల మమ మాతా యశస్వినీ,
దర్శితా రాజపుత్రాయ తపో దీర్ఘముపాగతా. ౪
అపి రామే మహాతేజా మమ మాతా యశస్వినీ,
వన్యైరుపాహరత్పూజాం పూజార్హే సర్వదేహినామ్. ౫

అపి రామాయ కథితం యథా వృత్తం పురాతనమ్,
మమ మాతుర్మహాతేజో దైవేన దురనుష్ఠితమ్. ౬
అపి కౌశిక భద్రం తే గురుణా మమ సంగతా,
మమ మాతా మునిశ్రేష్ఠ రామసందర్శనాదితః. ౭

అపి మే గురుణా రామః పూజితః కుశికాత్మజ,
ఇహాగతో మహాతేజాః పూజాం ప్రాప్తో మహాత్మనః. ౮

అపి శాంతేన మనసా గురుర్మే కుశికాత్మజ,
ఇహాఽగతేన రామేణ ప్రయతేనాభివాదితః. ౯

తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రో మహామునిః,
ప్రత్యువాచ శతానందం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. ౧౦

నాతిక్రాంతం మునిశ్రేష్ఠ యత్కర్తవ్యం కృతం మయా,
సంగతా మునినా పత్నీ భార్గవేణేవ రేణుకా. ౧౧

తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రస్య భాషితమ్,
శతానందో మహాతేజా రామం వచనమబ్రవీత్. ౧౨

అశతానందుండు సుఖంబుగాఁ గూర్చుండియున్న రాచకొమరులగు రామలక్ష్మణులంజూచి మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రునితో నిట్లని చెప్పెను. ౩

మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా! నీవు దీర్ఘతపస్సు చేసినదియుం యశస్వినియుం నాతల్లియునైన యహల్యను రామునకుఁ జూపితివా? ౪

మహాప్రభావయును యశస్వినియునగు నాతల్లియైనయహల్య సమస్త ప్రాణులకును బూజనీయుఁడైన రామునకు వనంబునం గల ద్రవ్యంబులచేఁ బూజచేసెనా? ౫

అధికమైన ప్రభావముఁగల విశ్వామిత్రుఁడా! మాతల్లికి విధిబలంబున సంభవించిన మునుపటికీడు జరిగినది జరిగినట్టుగా రామునకుఁ జెప్పితివా! ౬

మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా! నీకు మంగళము కలుగుఁగాక; రామునిం జూచుట ఆతని కాతిథ్యంబొసంగుట వీనిచేత మాతల్లియగు నహల్య నాతండ్రియైన గౌతమునిం గూడినదా? ౭

విశ్వామిత్రుఁడా! నాతండ్రియైన గౌతముఁడు రామునిఁ బూజించెనా? మహాత్ముఁడగు నీ ముందు హిమవత్పర్వతమునుండి యిచ్చటికి వచ్చిన గౌతమునిం బూజించినాఁడా? ౮

విశ్వామిత్రుఁడా! మాయాశ్రమమునకు వచ్చిన పరిశుద్ధుఁడగు నీ రాముఁడు శాంతాంగుఁడునంబున మాతండ్రియగు గౌతమునకు నమస్కారము చేసినాఁడా? అని శతానందుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౯

శతానందుఁడు చెప్పిన యీమాటవిని చక్కఁగాఁ మాటలాడుటయందు నేర్పరియగు విశ్వామిత్రమహాముని మాటలయందుఁ బండితుఁడగు శతానందున కిట్లని బదులు చెప్పెను. ౧౦

మునిశ్రేష్ఠుఁడవగు శతానందుఁడా! నేనేమియును విడువలేదు; ఏదిసేయవలయునో దానినే సేసితిని; రేణుక జమదగ్నిని గూడినట్లు అహల్య గౌతమముని గూడినది. ౧౧

విశ్వామిత్రుఁడు చెప్పిన స్పష్టమైనమాటను విని మహాతేజుఁడగుశతానందుఁడు రామునిజూచి యిట్లని చెప్పెను. ౧౨

స్వాగతం తే నరశ్రేష్ఠ దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ,
విశ్వామిత్రం పురస్కృత్య మహర్షిమపరాజితమ్. ౧౩

అచిన్త్యకర్మా తపసా బ్రహ్మర్షి రతులప్రభః,
విశ్వామిత్రో మహాతేజా వేత్స్యేనం పరమాం గతిమ్. ౧౪

నాస్తి ధన్యతరో రామ త్వత్తోఽన్యో భువి కశ్చన,
గోప్తా కుశికపుత్రస్తే యేన తప్తం మహాత్తపః. ౧౫

శ్రూయతాం చాభిధాస్యామి కౌశికస్య మహాత్మనః,
యథా బలం యథా వృత్తం తన్మే నిగదతః శృణు. ౧౬
రాజాభూదేష ధర్మాత్మా దీర్ఘకాలమరిందమః,
ధర్మజ్ఞః కృతవిద్యశ్చ ప్రజానాం చ హితే రతః. ౧౭

ప్రజాపతిసుతశ్చాసీత్కుశో నామ మహీపతిః,
కుశస్య పుత్రో బలవాన్ కుశనాభస్సుధార్మికః. ౧౮
కుశనాభసుతస్త్వాసీద్గాధిరిత్యేవ విశ్రుతః,
గాధేః పుత్రో మహాతేజా విశ్వామిత్రో మహామునిః. ౧౯
విశ్వామిత్రో మహాతేజాః పాలయామాస మేదినీమ్,
బహువర్షసహస్రాణి రాజా రాజ్యమకారయత్. ౨౦
కదాచిత్తు మహాతేజా యోజయిత్వా వరూథినీమ్,
అక్షౌహిణీపరివృతః పరిచక్రామ మేదినీమ్. ౨౧
నగరాణి సరాష్ట్రాణి సరితశ్చ తథా గిరీన్,
ఆశ్రమాన్ క్రమశో రామ విచరన్నాజగామ హ. ౨౨

పురుషశ్రేష్ఠుఁడ వగు రాముఁడా! నీకు స్వాగత మగుఁగాక; ఎచ్చటను ప్రతిహతముకాని మహిమగల విశ్వామిత్రుని బురస్కరించుకొని దైవయోగంబున నిచ్చటికి వచ్చితివి. ౧౩

ఈవిశ్వామిత్రుఁడు అచింత్యములగు కార్యంబులను జేసినవాఁడు; తపంబు సల్పి బ్రహ్మర్షి యయ్యె; ఇతనికంటె కెచ్చటను సరియైనది లేదు; మహాప్రభావుఁడు; ఇతఁడు పరమగతియని నీ వెఱుఁగుదువు. ౧౪

రాముఁడా! ఘోరతపంబును గావించినవిశ్వామిత్రుఁడు నీకు రక్షకుఁడు గానున్నాఁడు కావున, లోకంబున నీకన్న మఱియెవ్వఁడును బుణ్యవంతుఁడు లేఁడు. ౧౫

వినుము; మహాత్ముఁ డగువిశ్వామిత్రుని వలనను చరిత్రమును ఎట్టిదో చెప్పెదను; దానినంతయును వినుము. ౧౬

ఈవిశ్వామిత్రుఁడు ధర్మస్వభావుఁడై శత్రువుల నణంగద్రొక్కుచు ధర్మంబుల నెఱింగి విద్వాంసుల జేర్చి ప్రజలనేలుఁగోరుచు రాజుగా బహుకాలము భూమిఁ బాలించుచుండెను. ౧౭

బ్రహ్మపుత్రుండగు కుశుఁడనువాఁడు రాజుండెను; ఆకుశునికి బలవంతుఁడును ధర్మాత్ముఁడు నగు కుశనాభుఁ డనుకొడుకు గల్గెను. ౧౮

కుశనాభునికొడుకు గాధియని ప్రసిద్ధిపొందియుండెను; ఆ గాధికి మహాతేజుఁ డగువిశ్వామిత్రమహాముని కల్గెను. ౧౯

అధికంబగు పరాక్రమంబుగల విశ్వామిత్రుఁడు భూమిని బాలింపుచుండెను; ఇతఁడు పెక్కువేలేండ్లు దొరతనము చేసెను. ౨౦

ఒకానొకప్పుడు మహాతేజుఁడగు విశ్వామిత్రుఁడు చతురంగబలంబు గూర్చి యక్షౌహిణీసైన్యముతోఁ గూడి భూమియంతయుఁ దిరిగెను. ౨౧

రాముఁడా! ఈవిశ్వామిత్రుడును దేశములు బట్టణములు నదులు బర్వతములు నాశ్రమములు మొదలగువానియందుఁ గ్రమముగాఁ దిరుగుచు నానావిధంబులగు వృక్షములును బలుదెఱఁగులగు మృగంబులును గలిగి సిద్ధులచేతను

వసిష్ఠస్యాశ్రమపదం నానావృక్షసమాకులమ్,
నానామృగగణాకీర్ణం సిద్ధచారణసేవితమ్. ౨౩
దేవదానవగన్ధర్వైః కిన్నరైరుపశోభితమ్,
ప్రశాంతహరిణాకీర్ణం ద్విజసంఘనిషేవితమ్. ౨౪
బ్రహ్మర్షిగణసంకీర్ణం దేవర్షిగణసేవితమ్,
తపశ్చరణసంసిద్ధైరగ్నికల్పైర్మహాత్మభిః. ౨౫
అబ్భక్షైర్వాయుభక్షైశ్చ శీర్ణపర్ణాశనైస్తథా,
ఫలమూలాశనైర్దాంతైర్జితరోషైర్జితేంద్రియైః. ౨౬
ఋషిభిర్వాలఖిల్యైశ్చ జపహోమపరాయణైః,
అన్యైర్వైఖానసైశ్చైవ సమన్తాదుపశోభితమ్. ౨౭
వసిష్ఠస్యాశ్రమపదం బ్రహ్మలోకమివాపరమ్,
దదర్శ జయతాంశ్రేష్ఠో విశ్వామిత్రో మహాబలః. ౨౮
ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకపఞ్చాశస్సర్గః.

---

ద్విపఞ్చాశస్సర్గః

స దృష్ట్వా పరమప్రీతో విశ్వామిత్రో మహాబలః,
ప్రణతో వినయాద్వీరో వసిష్ఠం జపతాంవరమ్. ౧

స్వాగతం తవ చేత్యుక్తో వసిష్ఠేన మహాత్మనా. ౧౪

ఆసనం చాస్య భగవాన్ వసిష్ఠో వ్యాదిదేశహ. ౨
ఉపవిష్టాయ చ తదా విశ్వామిత్రాయ ధీమతే,
యథాన్యాయం మునివరః ఫలమూలముపాహరత్. ౩

చారణులచేతను దేవదానవగంధర్వులచేతను కిన్నరులచేతను సేవింపఁబడిన మనుష్యులలో మెదిగినజింకలును బక్షిసమూహంబులును గల్గి బ్రహ్మర్షులచేతను దేవర్షులచేతను మఱియుఁ దపస్సిద్ధినొందినవారును నిప్పువంటివారును మహాత్ములును జలమె యాహారముగాఁగలవారును వాయువు దినువారును నేలరాలిన యాకుల భక్షించువారును ఫలంబుల మూలంబుల మెసవువారును ఇంద్రియనిగ్రహము గలవారును కోపములేనివారు నగు ఋషులచేతను ఎల్లప్పుడును జపహోమంబుల విడువక చేయుచుండు వాలఖిల్యులచేతను ఇంక నితరులగు వైఖానసులు మొదలగువారిచేతను శోభితం బైయుండు వసిష్ఠాశ్రంబుగకుఁ బోయెను. ౨౨-౨౭

శూరులలో శ్రేష్ఠుఁడును మహాబలుఁడు నగువిశ్వామిత్రుడును రెండవ బ్రహ్మలోక మనందగియుండు వసిష్ఠాశ్రమపదంబును జూచెను. ౨౮

ఇది యేబదియొకటవ సర్గము.

---

## ఏబదిరెండవ సర్గము

మహాబలుఁడును పరాక్రమశాలియుఁ నగునావిశ్వామిత్రుఁడు మునులలోపల శ్రేష్ఠుఁ డగువసిష్ఠమహర్షి నిజూచి వినయంబుగలవాఁడు కావున నమస్కరించెను. ౧

మహాత్ముఁడగు వసిష్ఠుఁడు విశ్వామిత్రునిజూచి "నీకును నీపరివారమునకును స్వాగతంబగుఁ గాక" అని చెప్పెను. ౧౪

భగవంతుఁ డగువసిష్ఠుఁ డీవిశ్వామిత్రున కాసనంబును ఇప్పించెను. ౨

అప్పుడు మునిశ్రేష్ఠుఁ డగువసిష్ఠుఁడు ఆసనంబునఁ గూర్చుండిన బుద్ధిమంతుఁడగు విశ్వామిత్రునకు యథాశాస్త్రంబుగా ఫలమూలంబుల సమర్పించెను.

ప్రతిగృహ్య తు తాం పూజాం వసిష్ఠాద్రాజసత్తమః,
తపోగ్నిహోత్రశిష్యేషు కుశలం పర్యపృచ్ఛత. ౪
విశ్వామిత్రో మహాతేజా వనస్పతిగణే తథా. ౪౫

సర్వత్ర కుశలం చాహ వసిష్ఠో రాజసత్తమమ్. ౫

సుఖోపవిష్టం రాజానం విశ్వామిత్రం మహాతపాః,
పప్రచ్ఛ జపతాంశ్రేష్ఠో వసిష్ఠో బ్రహ్మణస్సుతః. ౬

కచ్చిత్తే కుశలం రాజన్ కచ్చిద్ధర్మేణ రంజయన్,
ప్రజాః పాలయసే వీర రాజవృత్తేన ధార్మిక. ౭

కచ్చిత్తే సంభృతా భృత్యాః కచ్చిత్తిష్ఠంతి శాసనే,
కచ్చిత్తే విజితాస్సర్వే రిపవో రిపుసూదన. ౮

కచ్చిద్బలేషు కోశేషు మిత్రేషు చ పరంతప,
కుశలం తే నరవ్యాఘ్ర పుత్రపౌత్రే తవానఘ. ౯

సర్వత్ర కుశలం రాజా వసిష్ఠం ప్రత్యుదాహరత్,
విశ్వామిత్రో మహాతేజా వసిష్ఠం వినయాన్వితః. ౧౦
కృత్వోభౌ సుచిరం కాలం ధర్మిష్ఠౌ తాః కథాః శుభాః,
ముదా పరమయా యుక్తౌ ప్రీయేతాం తౌ పరస్పరం. ౧౧
తతో వసిష్ఠో భగవాన్ కథాంతే రఘునందన,
విశ్వామిత్రమిదం వాక్యమువాచ ప్రహసన్నివ. ౧౨

రాజశ్రేష్ఠుఁడును మహావీరుఁడు నగువిశ్వామిత్రుఁడు వసిష్ఠుఁడు చేసిన పూజను బ్రతిగ్రహించి తపస్సు నిర్విఘ్నముగా జరుగుచున్నదా? అట్లే హోత్రములును క్రమముగ జరుగుచున్నవా? శిష్యులు క్షేమముగ నున్నారా? వృక్షములు చక్కఁగాఁ బెరుఁగుచున్నవా? అని యడిగెను. ౩, ౪

వసిష్ఠుఁడు "మీరడిగినవన్నియు క్షేమముననే యున్నవి" అని విశ్వామిత్రునకుఁ జెప్పెను. ౫

మహాతపశ్శాలియును మునిశ్రేష్ఠుఁడును బ్రహ్మకుమారుఁడు నగువసిష్ఠుఁడు విశ్వామిత్రమహారాజు సుఖముగాఁ గూర్చుండిన పిదప నతని నిట్లని యడిగెను. ౬

నరేంద్రా విశ్వామిత్రా పరాక్రమశాలీ! నీకు మంగళమేనా? ధర్మముచేఁ బ్రజల రంజింపుచు రాజవృత్తములగు న్యాయార్జనవృద్ధి రక్షాసత్పాత్రదానంబులుగలిగి పాలించెదవా? ౭

శత్రువులను జంపునట్టి విశ్వామిత్రుఁడా! నీవు నీభృత్యులను జక్కఁగాఁ బోషించుచున్నావా? వారు నీకుఁ జెప్పినట్టు వినుచున్నారా? నీవు శత్రువుల నందఱను జయించినావా? ౮

శత్రువులను దమింపఁజేయువాఁడవు పాపరహితుఁడవు పురుషశ్రేష్ఠుఁడవు నగువిశ్వామిత్రుఁడా! నీ చతురంగబలంబులకును బొక్కసములకును స్నేహితులకును గొడుకులకును మనుమలకును క్షేమమా; అని వసిష్ఠుఁడు విశ్వామిత్రు నడిగెను. ౯

మహాతేజుఁ డగు విశ్వామిత్రమహారాజు శ్రేష్ఠుఁడగువసిష్ఠునకును "అన్నియును క్షేమముగనే యున్నవి" అని చెప్పెను. ౧౦

ధార్మికులగు నావసిష్ఠవిశ్వామిత్రు లిర్వురును మిక్కిలియు సంతోషంబున బహుకాలముపఱకు పరస్పరకుశలప్రశ్నలఁ గురించినమాటలు చెప్పుకొని పరస్పరము సంతోషపఱచికొనిరి. ౧౧

రామఁడా! కుశలంబడిగిన వెనుక భగవంతుఁడగు వసిష్ఠుఁడు ప్రసన్నముఖుఁడై విశ్వామిత్రునిజూచి యిట్లని చెప్పెను. ౧౨

ఆతిథ్యం కర్తుమిచ్ఛామి బలస్యాస్య మహాబల,
తవ చైవాప్రమేయస్య యథార్హం సంప్రతీచ్ఛ మే. ౧౩

సత్క్రియాం తు భవానేతాం ప్రతీచ్ఛతు మయోద్యతామ్,
రాజా త్వమతిథిశ్రేష్ఠః పూజనీయః ప్రయత్నతః. ౧౪

ఏవముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహామతిః,
కృతమిత్యబ్రవీద్రాజా ప్రియవాక్యేన మే త్వయా. ౧౫

ఫలమూలేన భగవన్ విద్యతే యత్తవాశ్రమే,
పాద్యేనాచమనీయేన భగవద్దర్శనేన చ. ౧౬
సర్వథా చ మహాప్రాజ్ఞ పూజార్హేణ సుపూజితః,
గమిష్యామి నమస్తేఽస్తు మైత్రేణేక్షస్వ చక్షుషా. ౧౭

ఏవం బ్రువంతం రాజానం వసిష్ఠః పునరేవ హి,
న్యమంత్రయత ధర్మాత్మా పునః పునరుదారధీః. ౧౮

బాఢమిత్యేవ గాధేయో వసిష్ఠం ప్రత్యువాచ హ,
యథాప్రియం భగవతస్తథాస్తు మునిపుంగవ. ౧౯

ఏవముక్తో మహాతేజా వసిష్ఠో జపతాం వరః,
ఆజుహావ తతః ప్రీతః కల్మాషీం ధూతకల్మషః. ౨౦

ఏహ్యేహి శబలే క్షిప్రం శృణు చాపి వచో మమ,
సబలస్యాస్య రాజర్షేః కర్తుం వ్యవసితోఽస్మ్యహమ్. ౨౧

మహాబలుఁడవగు విశ్వామిత్రుఁడా! ఈసైన్యంబునకును అప్రమేయుఁడ వగు నీకును యథాయోగ్యముగ నతిథిపూజచేయఁ గోరెదను; నాప్రార్థన నంగీకరింపుము. ౧౩

నీవు నేఁజేయఁదలఁచిన యాతిథ్యము నంగీకరింపుము; నీవు అధిపుండవు అతిథిశ్రేష్ఠుఁడవు; కావునఁ బ్రయత్నంబున నిను బూజింపవలయు నని వసిష్ఠుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౧౪

బుద్ధిమంతుఁ డగువిశ్వామిత్రమహారాజు; వసిష్ఠుఁడు చెప్పినది విని నీవు "ఆతిథ్యముచేసెద" నని చెప్పిన ప్రియవచనముచేతనే నా కాతిథ్యము చేయఁబడినది. ౧౫

భగవంతుఁడవు మహాపండితుఁడవునగు వసిష్ఠుఁడా! నీయాశ్రమమందు దొరకునట్టి ఫలమూలంబులను, పాద్యంబు నాచమనీయంబు భగవంతుఁడ వగు నీదర్శనంబు నీవన్నియు నాకొసంగి నాచేఁ బూజింపఁదగిన నీవు నాకన్ని విధంబులఁ బూజ చక్కఁగాఁ జేసితివి; నేను బోయెదను; నీకు నమస్కారము; నన్ను స్నేహముతోఁ జూడుమని విశ్వామిత్రుఁడు వసిష్ఠునకుఁ జెప్పెను.

ఇట్లు విశ్వామిత్రుఁడు బదులుచెప్పుచున్నప్పటికిని ధర్మాత్ముఁడును బుద్ధిమంతుఁడు నగు వసిష్ఠుఁ డతని మాటిమాటికి "భోజనమునకు నిలువవలె" నని చెప్పి నిర్బంధించెను. ౧౮

గాధికొడుకైన విశ్వామిత్రుఁడు "మునిశ్రేష్ఠుఁడ వగువసిష్ఠుఁడా! మంచిది; భగవంతుఁడ వగు నీ కెట్లిష్టమో అట్లు కానిమ్ము" అని వసిష్ఠునితోఁ జెప్పెను. ౧౯

మహాతేజుఁడును మునిశ్రేష్ఠుఁడును పాపములఁ బోఁగొట్టువాఁడునగు వసిష్ఠుఁడు విశ్వామిత్రునిమాట విని సంతసించి చిత్రవర్ణం బగు దేహంబుగల కామధేనువును బిలిచెను. ౨౦

చిత్రవర్ణంబగు దేహముగల కామధేనువా! శీఘ్రముగా రమ్ము; రమ్ము; నామాట వినుము; నేను రాజర్షి యగు నీవిశ్వామిత్రునకును ఇతనిసైన్యమున

భోజనేన మహార్హేణ సత్కారం సంవిధత్స్వ మే. ౨౧

యస్య యస్య యథాకామం షడ్రసేష్వభిపూజితమ్,
తత్సర్వం కామధుక్క్షిప్రమభివర్ష కృతే మమ. ౨౨
రసేనాన్నేన పానేన లేహ్యచోష్యేణ సంయుతమ్,
అన్నానాం నిచయం సర్వం సృజస్వ శబళే త్వర. ౨౩

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్విపఞ్చాశస్సర్గః.

---

త్రిపఞ్చాశస్సర్గః

ఏవముక్తా వసిష్ఠేన శబళా శత్రుసూదన,
విదధే కామధుక్కామాన్యస్య యస్య యథేప్సితమ్. ౧
ఇక్షూన్మధూంస్తథా లాజాన్మైరేయాంశ్చ వరాసవాన్,
పానాని చ మహార్హాణి భక్ష్యాంశ్చోచ్చావచాంస్తథా. ౨

ఉష్ణాఢ్యస్యౌదనస్యాత్ర రాశయః పర్వతోపమాః,
మృష్టాన్నాని చ సూపాశ్చ దధికుల్యాస్తథైవ చ. ౩
నానాస్వాదురసానాం చ షాడబానాం తథైవ చ,
భాజనాని సుపూర్ణాని గౌడాని చ సహస్రశః. ౪

సర్వమాసీత్సుసంతుష్టం హృష్టపుష్టజనాయుతమ్,
విశ్వామిత్రబలం రామ వసిష్ఠేనాభితర్పితమ్. ౫

విశ్వామిత్రోऽపి రాజర్షిర్హృష్టః పుష్టస్తదాభవత్,

కును శ్రేష్ఠంబగు భోజనం బిడి సత్కారము సేయఁగోరినాను; నీవు నాకు గావలయు ద్రవ్యంబుల సంపాదింపుము. ౨౦,౨౧½

కోరినవానినెల్లఁ బితుకు కామధేనువా ! ఆఱురసములయందును ఎవ్వని కేది యిష్టమో దానినంతయుం వానికి నాకుఁగా సృజించి యొసఁగుము. ౨౨½

కామధేనువా ! రసాయనములను, భక్ష్యంబులును, పానీయంబులును, లేహ్యంబులను తేనెమొదలగునవియుం బీల్చందగు వెఱుఁగుమొదలయినవి యుంనుగూడిన యన్నంబులరాశిని సృజింపుము ; శీఘ్రముగా సృజింపుము. అని వసిష్ఠుఁడు కామధేనువున కాజ్ఞాపించెను. ౨౩½

ఇది యేబదిరెండవ సర్గము.

---

## ఏబదిమూఁడవ సర్గము.

శత్రువులను జంపఁబుట్టి రాముఁడా ! వసిష్ఠుఁ డిట్లు ప్రార్థింపఁగానే కామధేనువు ఎవ్వఁ డెట్లుకోరెనో వానికట్లే యన్నింటిని సమకూర్చెను ౧

అప్పుడు కామధేనువు చెఱకులను, తేనెలను, పేలాలను, మంచిపాత్రంబుల నుంచఁబడిన మైరేయంబులను మద్యంబులను శ్రేష్ఠములయిన పానకాదిపేయ ద్రవ్యంబులను మఱియు నానావిధంబు లగు పిండివంటలను నిర్మించెను. ౨

ఇట్లు వసిష్ఠాశ్రమమునఁ గల కొండలబోలు వేడియన్నపురాసులను పాయసంబు మొదలగు మృష్టాన్నంబులును సూపంబులును పెఱుఁగుటేఱులును పలుదెఱంగులుగా రుచ్యంబు లగునట్లు షడ్రసంబులను జేయఁబడిన షాడబంబులను భక్ష్యంబుల నించినపాత్రములను మఱియు బెల్లముతోఁ జేసిన భక్ష్యంబులును వేనవేలుగాఁ గాన్పించినవి. ౩, ౪

రాముఁడా ! ఇట్లు వసిష్ఠుఁడు తృప్తినొందునట్లు సేయఁగా విశ్వామిత్రుని సేనయందలి జనులందఱును మిక్కిలియుం సంతసంబును దేహపుష్టియు నొందిరి. ౫

అప్పుడు రాజర్షియగు విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁడుసేసిన యాదరమునకు సంతసించి యాభోజనంబుచేఁ దృప్తినొందెను. ౫½

సాంతఃపురవరో రాజా సబ్రాహ్మణపురోహితః,
సామాత్యో మంత్రిసహితస్సభృత్యః పూజిత స్తదా. ౬॥

యుక్తః పరమహర్షేణ వసిష్ఠమిదమబ్రవీత్ ౭

పూజితోఽహం త్వయా బ్రహ్మన్ పూజార్హేణ సుసత్కృతః,
శ్రూయతామభిధాస్యామి వాక్యం వాక్యవిశారద. ౮

గవాం శతసహస్రేణ దీయతాం శబళా మమ. ౮॥
రత్నం హి భగవన్నేతద్రత్నహారీ చ పార్థివః,
తస్మాన్మే శబళాం దేహి మమైషా ధర్మతో ద్విజ. ౯॥

ఏవముక్తస్తు భగవాన్వసిష్ఠో మునిసత్తమః,
విశ్వామిత్రేణ ధర్మాత్మా ప్రత్యువాచ మహీపతిమ్. ౧౦॥
నాహం శతసహస్రేణ నాపి కోటిశతైర్గవామ్,
రాజన్ దాస్యామి శబళాం రాశిభీరజతస్య చ. ౧౧॥
న పరిత్యాగమర్హేయం మత్సకాశాదరిందమ. ౧౨

శాశ్వతీ శబళా మహ్యం కీర్తిరాత్మవతో యథా. ౧౨॥

అస్యాం హవ్యం చ కవ్యం చ ప్రాణయాత్రా తథైవచ,
ఆయత్తమగ్నిహోత్రం చ బలిర్హోమ స్తథైవ చ. ౧౩॥

స్వాహాకారవషట్కారౌ విద్యాశ్చ వివిధా స్తథా,
ఆయత్తమత్ర రాజర్షే సర్వమేతన్న సంశయః. ౧౪॥

అప్పుడు విశ్వామిత్రమహారాజును అతనియంతఃపురస్త్రీలును బ్రాహ్మణులును పురోహితులును అమాత్యులును మంత్రులును నౌకరులు నందఱును పూజింపఁబడిరి. ౬౫

విశ్వామిత్రుఁడు మిక్కిలియుఁ సంతోషంబు నొంది వసిష్ఠమహర్షిని జూచి యిట్లని చెప్పెను. ౭

బ్రాహ్మణుఁడవైన వసిష్ఠుఁడా! నీవు మాచేఁ బూజింపఁదగినవాఁడవు. అట్టినీవు నన్ను చక్కఁగా సమ్మానించి పూజించితివి. నీవు మాటలాడుటయందు సమర్థుఁడవు; నేనొకమాట చెప్పెదను; వినుము. ౮

లక్షగోవులు దీసికొని యీకామధేనువు నాకిమ్ము. ౮౫

భగవంతుఁడవగు వసిష్ఠుఁడా! ఈకామధేనువు రత్నము,రత్నములన్నియుం రాజుసొమ్ము; కాఁబట్టి దీని నాకిమ్ము; ధర్మంబు జూడఁగా నిది రాజయిన నాదియేగాని బ్రాహ్మణుఁడ వగు నీది కాదు. ౯౫

భగవంతుఁడును మునిశ్రేష్ఠుఁడును ధార్మికుఁడు నగు వసిష్ఠుఁడు విశ్వామిత్రుఁడు చెప్పినమాట విని యతనితో నిట్లని చెప్పెను. ౧౦౫

విశ్వామిత్రమహారాజా! లక్షగోవు లిచ్చినను పెక్కు నూఱుకోట్లు గోవులిచ్చినను వెండిరాసు లిచ్చినను నేను కామధేనువు నివ్వను. ౧౧౫

శత్రువుల నడఁగఁ ద్రొక్కఁజాలిన విశ్వామిత్రుఁడా! ఈకామధేనువు నాసమీపముననే యుండవలసినదిగాని విడువఁదగినది కాదు. ౧౨

ధైర్యము గలవానికిఁ గీర్తివలె నాకీకామధేను వెప్పటికి స్థిరముగా నుండునది. ౧౨౫

దేవతలకుఁగాని పితరులకుఁగాని సమర్పింపఁదగినదియును నాయాహారమును అగ్నిహోత్రమును భూతబలియును దర్శపూర్ణమాసాది హోమములును ఈకామధేనువువలననే యగుచున్నవి. ౧౩౫

రాజర్షి వగు విశ్వామిత్రుఁడా! "స్వాహా వషట్"అను మంత్రములును నానావిధము లయినవిద్యలును ఇవన్నియుం ఈకామధేనువువలననె యగుచున్నవి. ఇందును సందేహము లేదు. ౧౪౫

సర్వస్వమేతత్సత్యేన మమ తుష్టికరీ సదా. ౧౪

కారణై ర్బహుభీ రాజన్న దాస్యే శబలాం తవ. ౧౫॥

వసిష్ఠేనైవ ముక్తస్తు విశ్వామిత్రో ఽబ్రవీ త్తతః.
సంరబ్ధతరమత్యర్థం వాక్యం వాక్యవిశారదః. ౧౬॥

హైరణ్యకక్ష్యాగ్రైవేయాన్ సువర్ణాంకుశభూషితాన్,
దదామి కుంజరాం స్తేషాం సహస్రాణి చతుర్దశ. ౧౭॥
హైరణ్యానాం రథానాం చ శ్వేతాశ్వానాం చతుర్యుజాం,
దదామి తే శతాన్యష్టౌ కింకిణీకవిభూషితాన్. ౧౮॥
హయానాం దేశజాతానాం కులజానాం మహౌజసామ్,
సహస్రమేకం దశ చ దదామి తవ సువ్రత. ౧౯॥
నానావర్ణవిభక్తానాం వయస్థానాం తథైవ చ,
దదామ్యేకాం గవాం కోటిం శబలా దీయతాం మమ. ౨౦॥
యావదిచ్ఛసి రత్నం వా హిరణ్యం వా ద్విజోత్తమ,
తావద్దదామి తత్సర్వం శబలా దీయతాం మమ. ౨౧॥

ఏవముక్తస్తు భగవాన్ విశ్వామిత్రేణ ధీమతా,
న దాస్యామీతి శబలాం ప్రాహ రాజన్ కథంచన. ౨౨॥
ఏతదేవ హి మే రత్నమేతదేవ హి మే ధనమ్,
ఏతదేవ హి సర్వస్వమేతదేవ హి జీవితమ్. ౨౩॥
దర్శశ్చ పూర్ణమాసశ్చ యజ్ఞాశ్చైవాప్తదక్షిణాః,
ఏతదేవ హి మే రాజన్ వివిధాశ్చ క్రియా స్తథా. ౨౪॥

సత్యముగాఁ జెప్పెదను. ఇదియే సర్వస్వమును నా కెల్లప్పుడును సంతోషము సేయుచున్నది. ౧౫

విశ్వామిత్రుఁడా! పెక్కు కారణము లున్నవి గాన నేను నీకుఁ గామధేనువు నివ్వనని వసిష్ఠమహాముని విశ్వామిత్రునకుఁ జెప్పెను. ౧౫½

ఇట్లు వసిష్ఠుఁడు చెప్పినమాట విని మాటలయందుఁ బండితుఁడగు విశ్వామిత్రుఁడు మిక్కుటంబగు కోపముతో నర్థవంతంబయిన యొకమాట చెప్పెను. ౧౬½

బంగారుతోఁ జేయఁబడిన నడుమునఁ గట్టెడు మొకులును గంఠంబునఁ గట్టెడు మొకులును గలిగి పసిండియంకుశంబుల నలంకృతంబులై యుండు నేనుఁగులు పదునాలుగువేలు నిచ్చెదను. ౧౭½

సువర్ణమయములయి నాలుగేసి తెల్లగుఱ్ఱములుకట్టి చిఱుగంటల నలంకృతంబులయియుండు రథంబు లెనిమిదివంద లిచ్చెదను. ౧౮½

మంచివ్రతంబులుగల వసిష్ఠుఁడా! మంచిదేశముల మంచికులంబులం బుట్టి గొప్పబలంబుగల గుఱ్ఱంబులు పదునొకండువేలు నీకిచ్చెదను. ౧౯½

నానావిధంబులగు వర్ణంబులు గలిగి లేఁతవయస్సులో నుండునట్టి గోవు లొకకోటి యిచ్చెదను; నాకుఁ గామధేనువు నిమ్ము. ౨౦½

బ్రాహ్మణశ్రేష్ఠుఁడ వగువసిష్ఠుఁడా! నీవు రత్నములయినను బంగారమునైనను ఎంతగోరెదవో అవన్నియు నీ కిచ్చెదను, ఈకామధేనువును నాకిమ్మని విశ్వామిత్రుఁడు వసిష్ఠునితోఁ జెప్పెను. ౨౧½

భగవంతుఁ డగువసిష్ఠుఁడు బుద్ధిమంతుఁడయిన విశ్వామిత్రుఁడు చెప్పిన మాట విని "రాజా! ఏలాగైనను కామధేనువు నివ్వను" అని చెప్పెను. ౨౨½

నాకు రత్నమును ధనమును సర్వస్వమును ప్రాణమును ఈకామధేనువేను. ౨౩½

విశ్వామిత్రుఁడా! నాకు దర్శయును బూర్ణయును యాగదక్షిణలును మఱియు నానావిధక్రియలును ఈకామధేనువే. ౨౪½

అదోమూలాః క్రియాస్సర్వా మమ రాజన్న సంశయః. ౨౫

బహునా కిం ప్రలాపేన న దాస్యే కామదోహినీమ్. ౨౫½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రిపఞ్చాశస్సర్గః.

---

## చ తుః ప ఞ్చా శ స్స ర్గః

కామధేనుం వసిష్ఠోఽపి యదా న త్యజతే మునిః,
తదాస్య శబళాం రామ విశ్వామిత్రోఽన్వకర్షత. ౧
నీయమానాతు శబళా రామ రాజ్ఞా మహాత్మనా,
దుఃఖితా చింతయామాస రుదంతీ శోకకర్శితా. ౨
పరిత్యక్తా వసిష్ఠేన కిమహం సుమహాత్మనః,
యాహం రాజభటైర్దీనా హ్రియేయం భృశదుఃఖితా. 3

కిం మయాఽపకృతం తస్య మహర్షేర్భావితాత్మనః,
యన్మామనాగసం భక్తామిష్టాం త్యజతి ధార్మికః. ౪

ఇతి సా చింతయిత్వా తు వినిశ్శ్వస్య పునఃపునః,
నిర్ధూయ తాం స్తదా భృత్యాన్ శతశశ్శత్రుసూదన. ౫
జగామానిలవేగేన పాదమూలం మహాత్మనః. ౫½

శబళా సా రుదంతీ చ క్రోశంతీ చేదమబ్రవీత్,
వసిష్ఠస్యాగ్రతస్స్థిత్వా మేఘదుందుభిరావిణీ. ౬½
భగవన్ కిం పరిత్యక్తా త్వయాహం బ్రహ్మణస్సుత,

విశ్వామిత్రుఁడా ! నేను జేయుంసత్కర్మముల కన్నింటికిని ఈకామ ధేనువే మూలము; ఇందు సందియంబు లేదు. ౨౪

ఉపయోగములేనిమాటల నధికముగా వాదనేల? కోరినవాని నన్నింటిని బితుకునట్టి యీ కామధేనువు నివ్వనని వసిష్ఠుండు విశ్వామిత్రునితోఁ జెప్పెను.

ఇది యేబదిమూఁడవసర్గము.

---

## యేబదినాలవ సర్గము

ఇట్లు వసిష్ఠమహాముని కామధేనువును విడువకుండుటను జూచి విశ్వామిత్రుఁడు వసిష్ఠుని కామధేనువును బలాత్కారముగా నీడ్చెను. ౧

రాముఁడా ! కామధేనువు మహాత్ముం డగువిశ్వామిత్రుచే నీడ్వఁబడి వగవున గుందుచు రోదనంబుసేయుచు నిటని చింతించెను. ౨

మిక్కిలియుం దుఃఖము జెంది భయపడియున్న విశ్వామిత్రునిభటులు బలాత్కారముగాఁ గొనిపోవుచున్నారు; మహాత్ముం డగువసిష్ఠుండు నన్ను విడిచినాయేమి ? ౩

ధార్మికుఁ డగువసిష్ఠుఁడు నిరపరాధినియును భక్తురాలునుఁ బ్రియయుంగూం నగునన్ను విడుచునంతటి యపకారము ఆత్మవేత్త యగువసిష్ఠున కేమి చేసితినని చింతించెను. ౪

శత్రువులను జంపునట్టిరాముఁడా ! ఆకామధేను విట్లు చింతించి మాటికి మాటికి నిట్టూర్పునిగుడించుచు ఒక్కొకమాటు నూఱునూఱుమందినిగా నా భటులనందఱ విదలించి వాయువేగంబున మహాత్ముఁ డగువసిష్ఠుని పాదమూలంబును జేరెను. ౫

ఆకామధేనువు వసిష్ఠునిముందట నిలిచి యేడ్చుచు మేఘదుందుభులును బోలె నఱచుచు ఇట్లని చెప్పెను. ౬

బ్రహ్మపుత్రుండవు భగవంతుండవు నగువసిష్ఠుఁడా! నీవు నన్ను విడిచి

యస్మాద్రాజభృతా మాం హి నయంతే త్వత్సకాశతః. ౭౫

ఏవముక్తస్తు బ్రహ్మర్షిరిదం వచనమబ్రవీత్. ౮

శోకసంతప్తహృదయాం స్వసారమివ దుఃఖితామ్,
నత్వాం త్యజామి శబలే నాపి మేఽపకృతం త్వయా. ౯
ఏష త్వాం నయతే రాజా బలాన్మత్తో మహాబలః,
నహి తుల్యం బలం మహ్యం రాజాత్వద్య విశేషతః. ౧౦
బలీ రాజా క్షత్రియశ్చ పృథివ్యాః పతిరేవచ. ౧౦౫

ఇయమక్షౌహిణీ పూర్ణా సవాజిరథసంకులా,
హస్తిధ్వజసమాకీర్ణా తేనాసౌ బలవత్తరః. ౧౧౫

ఏవముక్తా వసిష్ఠేన ప్రత్యువాచ వినీతవత్,
వచనం వచనజ్ఞా సా బ్రహ్మర్షిమమితప్రభమ్. ౧౨౫

న బలం క్షత్రియస్యాహుర్బ్రాహ్మణో బలవత్తరః,
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరమ్. ౧౩౫

అప్రమేయబలం తుభ్యం న త్వయా బలవత్తరః,
విశ్వామిత్రో మహావీర్యస్తేజస్తవ దురాసదమ్. ౧౪౫

నియుఙ్క్ష్వ మాం మహాభాగ త్వద్బ్రహ్మబలసంభృతామ్,

నావాయేమి! నన్నేల యీరాజభటులు నీసమీపమునుండి యీడ్చికొనిపోయెద రని కామధేనువు వసిష్ఠునితోఁ జెప్పెను. ౨౫

బ్రహ్మర్షి యగు వసిష్ఠుఁడు కామధేనువుచెప్పినమాట విని యిట్లని బదులు చెప్పెను. ౧

ఓకామధేనువా! దుఃఖముచేఁ దపింపఁబడుచున్న మనస్సుగల్గి తోఁబుట్టువువలె నేడ్చుచున్న నిన్ను నే విడువఁజాలను. మహాబలవంతుఁడగు నీవిశ్వామిత్రమహారాజు, నాసమీపమునుండి నిన్ను బలాత్కారముగాఁ దీసికొనిపోవుచున్నాఁడు. నా కారాజుతో సరియైన సేనాబలము లేదు. తపోబలముచే నిగ్రహించుటకుఁ బరిపాలించునట్టి రాజు గానున్నాఁడు. మఱియుం నిప్పుడే యాతిథ్య మిచ్చితి గావున జంపఁగూడదు. ఇంతియెగాక పృథ్వీపతిని జంపిన మహాపాతక మని కామధేనువుతో వసిష్ఠమహర్షి చెప్పెను. ౯, ౧౦౫

ఓకామధేనువా! యేనుఁగులయందు కట్టఁబడిన ధ్వజములచే సంకీర్ణమై గుఱ్ఱములు కట్టఁబడిన రథములచే వ్యాప్తమైయున్న యీ విశ్వామిత్రమహారాజుయొక్క సేన సంపూర్ణముగా నున్నది. కావున నావిశ్వామిత్రుఁడు మిక్కిలి బలముగలవాఁడై యున్నాఁడని వసిష్ఠమహాముని కామధేనువుతోఁ జెప్పెను. ౧౧౫

వచనస్వారస్యముదెలిసిన యాకామధేనువు వసిష్ఠమహామునిచే నిట్లు చెప్పఁబడి వినీతయై యమితతేజస్సుగల యావసిష్ఠమహర్షి నింగూర్చి యుత్తరముఁ జెప్పెను. ౧౨౫

బ్రాహ్మణుఁడవగు నోవసిష్ఠమహామునీ! క్షత్రియునియొక్క బల మల్ప బలము. బ్రాహ్మణుఁడు మిగుల బలముగలవాఁడు. బ్రాహ్మణునిబలము క్షత్రియుని బలమునకన్నను శ్రేష్ఠంబు నధికబలిష్ఠంబు నని పెద్దలు చెప్పుదురు. ౧౩౫

వసిష్ఠమహామునీ! నీయొక్క బలమింతనిచెప్పుట శలవిగాదు. మిగుల పరాక్రమము గలవాఁడైనను విశ్వామిత్రమహారాజు నీకంటె నతిశయుఁడు కాఁడు. నీప్రభావమే మిక్కిలియుం నధికమైనది. ౧౪౫

పూజ్యుఁడవైన వసిష్ఠమహర్షీ! నీమంత్రప్రభావమువలన వృద్ధినొందిన

తస్య దర్పబలం యత్తన్నాశయామి దురాత్మనః. ౧౫½

ఇత్యుక్తస్తు తయా రామ వసిష్ఠస్సుమహాయశాః,
సృజస్వేతి తదోవాచ బలం పరబలారుజమ్. ౧౬½

తస్య తద్వచనం శ్రుత్వా సురభిస్సాసృజత్తదా. ౧౭
తస్యా హుంభారవోత్సృష్టాః పహ్లవాశ్శతశో నృప,
నాశయంతి బలం సర్వం విశ్వామిత్రస్య పశ్యతః. ౧౮

బలం భగ్నం తతో దృష్ట్వా రథేనాక్రమ్య కౌశికః,
సరాజా పరమక్రుద్ధో రోషవిస్ఫారితేక్షణః. ౧౯
పహ్లవాన్నాశయామాస శస్త్రైరుచ్చావచైరపి. ౧౯½
విశ్వామిత్రార్దితాన్ దృష్ట్వా పహ్లవాంఛ్ఛతశస్తదా,
భూయ ఏవాసృజత్కోపాచ్ఛకాన్ యవనమిశ్రితాన్. ౨౦½
తైరాసీత్సంవృతా భూమిశ్శకైర్యవనమిశ్రితైః. ౨౧

ప్రభావద్భిర్మహావీర్యైర్హేమకింజల్కసన్నిభైః,
దీర్ఘాసిపట్టసధరైర్హేమవర్ణాంబరావృతైః. ౨౨
నిర్దగ్ధం తద్బలం సర్వం ప్రదీప్తైరివ పావకైః. ౨౨½

తతోఽస్త్రాణి మహాతేజా విశ్వామిత్రో ముమోచ హ,
తైస్తైర్యవనకాంభోజాః పహ్లవాశ్చాకులీకృతాః. ౨౩½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, చతుఃపఞ్చాశస్సర్గః.

మహిమగలనన్ను నియోగింపుము. దురాత్ముఁడగు నావిశ్వామిత్రునియొక్క గర్వబలమంతయును నాశముఁ జేసెదను. ౧౫

రాముఁడా! మహాయశుఁడగు నావసిష్ఠమహర్షి కామధేనువుచే నిట్లు చెప్పఁబడినవాఁడై యప్పుడు శత్రుబలంబుల నడఁగఁ ద్రొక్కఁగల బలమును సృజియింపు మని యాకామధేనువుతోఁ జెప్పెను. ౧౬

ఆకామధేను వావసిష్ఠమహర్షి మాట విని యప్పుడు సృజించెను. ౧౭

రాముఁడా! ఆకామధేనువుయొక్క పశువులు సేయుహుంభాయను శబ్దముచే నిర్మింపఁబడిన పల్లవులను మ్లేచ్ఛులావిశ్వామిత్రమహారాజు చూచుచుండఁగా నతనిసైన్యమంతయుం జంపిరి. ౧౮

పిమ్మట కుశికపుత్రుఁ డగు విశ్వామిత్రమహారాజు నాశమునొందిన తన సైన్యమునుజూచి రోషముచేఁగన్నులుఋఁచుచు నత్యంతకోపముతో మ్లేచ్ఛులను రథముచే నాక్రమించి యద్భుతంబులగు శస్త్రములచేతఁ జంపెను. ౧౯,౧౯౫

అప్పు డాకామధేనువు వేలకొలందిగా విశ్వామిత్రునిచేతఁ జంపఁబడిన పల్లవసంజ్ఞికులగు మ్లేచ్ఛులను జూచి కోపముతో యవనులతోఁగూడియున్న శకసంజ్ఞులగు మ్లేచ్ఛులను మరల సృజించెను. ౨౦౫

ఆయవనులతోఁగూడియున్న శకసంజ్ఞగల మ్లేచ్ఛులచే భూమియంతయుం నావరింపఁ బడినదాయెను. ౨౧

మిగులఁ బ్రకాశించుచున్నట్టియు మిక్కుటంబగు పరాక్రమముగల్గి సంపంగిఱేకులకు సరియైన కాంతులుగల్గిపొడవైన నకత్తులు పట్టసములును ధరించికొని బంగారువన్నెబట్టలుగల యామ్లేచ్ఛులచేత నావిశ్వామిత్రమహారాజు బలమంతయును మండుచున్న నిప్పులచేతఁ బలె నిశ్శేషముగఁ గాల్పఁబడెను.

అంతమిగులఁ బరాక్రమవంతుఁడగు విశ్వామిత్రమహారాజమోఘంబులగు నస్త్రములం బ్రయోగించె నంత నాయస్త్రములచేత యవనులు కాంభోజులు పల్లవులు అను పేరంబరగిన మ్లేచ్ఛులందఱును వ్యాకులముఁ గలవారుగాఁ జేయఁబడిరి. ౨౩౫

ఇది యేబదినాలవసర్గము.

## పఞ్చపఞ్చాశస్సర్గః.

తతస్తానాకులాన్ దృష్ట్వా విశ్వామిత్రాస్త్రమోహితాన్,
వసిష్ఠశ్చోదయామాస కామధుక్సృజ యోగతః. ౧

తస్యా హుంభారవాజ్జాతాః కాంభోజా రవిసన్నిభాః,
ఊధసస్త్వథ సంజాతాః పహ్లవాశ్శస్త్రపాణయః. ౨
యోనిదేశచ్చ యవనాశ్శకృద్దేశాచ్ఛకాస్తథా,
రోమకూపేషు చ మ్లేచ్ఛా హారీతాస్సకిరాతకాః. ౩

తైస్తైర్నిషూదితం సర్వం విశ్వామిత్రస్య తత్క్షణాత్,
స పదాతిగజం సాశ్వం సరథం రఘునందన. ౪

దృష్ట్వా నిషూదితం సైన్యం వసిష్ఠేన మహాత్మనా,
విశ్వామిత్రసుతానాం చ శతం నానావిధాయుధమ్. ౫
అభ్యధావత్సుసంక్రుద్ధం వసిష్ఠం జపతాం వరమ్. ౫½

హుంకారేణైవ తాన్ సర్వాన్ దదాహ భగవానృషిః. ౬

తే సాశ్వరథపాదాతా వసిష్ఠేన మహాత్మనా.
భస్మీకృతా ముహూర్తేన విశ్వామిత్రసుతాస్తదా. ౭

దృష్ట్వా వినాశితాన్ పుత్రాన్ బలం చ సుమహాయశాః,
సవ్రీడశ్చింతయావిష్టో విశ్వామిత్రోఽభవత్తదా. ౮
సముద్ర ఇవ నిర్వేగో భగ్నదంష్ట్ర ఇవోరగః,
ఉపరక్త ఇవాదిత్యస్సద్యో నిష్ప్రభతాం గతః. ౯

## ఏబదియైదవ సర్గము

పిమ్మట వసిష్ఠమహర్షి విశ్వామిత్రమహారాజుయొక్క యమ్ములవేటుల కోర్వఁజాలక పరువిడుచున్న తనసైనికులం జూచి యోకామధేనువా! నీవు యోగమహిమవలన మరల శాయవనాదులను సృజింపుమని ప్రేరేపించెను. ౧

ఆకామధేనువుయొక్క హుంభాయనుధ్వనివలన సూర్యునితో సమానులయిన కాంభోజులును స్తనప్రదేశంబువలన వస్త్రములను ధరించినపప్లవులను వారలును యోనిప్రదేశంబునుండి యవనులనువారలును శకృత్ప్రదేశమునుండి శకులనువారలును రోమకూపములనుండి తురకలును బోయలతోఁగూడిన హారీతులనువారలును బుట్టిరి. ౨, 3

రామఁడా! కాలుబలముతోను గజములతోను గుఱ్ఱములతోను రథములతోను గూడిన విశ్వామిత్రమహారాజుయొక్క సర్వసైన్యము నిమిషకాలములో నాకాంభోపపప్లవయవనాది మ్లేచ్ఛులచేతఁ జంపఁబడినది. ౪

విశ్వామిత్రునియొక్క కొడుకులు నూర్గురును మహాత్ముఁడైన వసిష్ఠమహాముని చేతఁ జంపఁబడిన తమసైన్యమునుజూచి మిగుల కోపముతోఁగూడుకొని యున్నట్టియుం దపముఁజేయుం వారలలో శ్రేష్ఠుఁడైనట్టి వసిష్ఠమహర్షినిగూర్చి పరువెత్తిరి. ౫, ౫

మహాత్మ్యముగల వసిష్ఠమహర్షి వారల నందరను హుంకారముచేతనే దహించెను. ౬

అప్పుడు చతురంగబలముతోఁ గూడిన యావిశ్వామిత్రునికొమారులు మహాప్రభావముగల వసిష్ఠునిచేత ముహూర్తకాలములో బూడిదగాఁ జేయఁబడిరి. ౭

అప్పుడు మహాకీర్తిసంపన్నుఁడగు విశ్వామిత్రమహారాజు చనిపోయిన తనకొడుకులనుఁ జతురంగబలమును జూచి లజ్జతోను చింతతోను గూడినవాఁడాయెను. ౮

అప్పుడావిశ్వామిత్రుఁడు వేగములేని సముద్రమువలె యుద్ధప్రవృత్తిలేనివాఁడై తీయఁబడిన కోరలుగల సర్పమువలె శక్తిలేనివాఁడగుచు రాహువుచే గ్రహింపఁబడిన సూర్యునివలె తేజోహైన్యము బొందెను. ౯

హతపుత్రబలో దీనో లూనపక్ష ఇవ ద్విజః,
హతదర్పో హతోత్సాహో నిర్వేదం సముపద్యత. ౧౦

స పుత్రమేకం రాజ్యాయ పాలయేతి నియుజ్య చ,
పృథివీం క్షత్రధర్మేణ వనమేవాన్వపద్యత. ౧౧

స గత్వా హిమవత్పార్శ్వం కిన్నరోరగసేవితమ్,
మహాదేవప్రసాదార్థం తపస్తేపే మహాతపాః. ౧౨

కేనచిత్త్వథ కాలేన దేవేశో వృషభధ్వజః,
దర్శయామాస వరదో విశ్వామిత్రం మహాబలమ్. ౧౩

కిమర్థం తప్యసే రాజన్ బ్రూహి యత్తే వివక్షితమ్,
వరదోఽస్మి వరో యస్తే కాంక్షితస్సోఽభిధీయతామ్. ౧౪

ఏవముక్తస్తు దేవేన విశ్వామిత్రో మహాతపాః,
ప్రణిపత్య మహాదేవమిదం వచనమబ్రవీత్. ౧౫
యది తుష్టో మహాదేవ ధనుర్వేదో మమానఘ,
సాంగోపాంగోపనిషదస్సరహస్యః ప్రదీయతామ్. ౧౬

యాని దేవేషు చాస్త్రాణి దానవేషు మహర్షిషు,
గంధర్వయక్షరక్షస్సు ప్రతిభాంతు మమాఽనఘ. ౧౭

తవ ప్రసాదాద్భవతు దేవదేవ మమేప్సితమ్. ౧౭½

చంపఁబడిన కొడుకులును సైన్యమునుగల యావిశ్వామిత్రుఁడు ఛేదింపఁబడిన యాఱెలుగల పక్షివలె దీనుఁడై గర్వము నుత్సాహమును లేనివాఁడై చతురంగబలము మొదలగువానియందు నిష్ఫలత్వబుద్ధినిఁ బొందెను. ౧౦

ఆవిశ్వామిత్రుఁడు తనపుత్రులలోఁ జావక మిగిలియున్న యొకకుమారుని క్షత్రధర్మముతో భూమిఁ బరిపాలింపుచుండు మని రాజ్యముసేయ నియమించి తానరణ్యమునకుఁ బోయెను. ౧౧

అతిశయంబగు తపముగల యావిశ్వామిత్రుఁ డీశ్వరానుగ్రహముఁగల్గుటకై కిన్నరులు సర్పములును వాసము సేయుచుండునట్టి హిమాలయప్రాంతప్రదేశము నాశ్రయించి తపం బొనర్చెను. ౧౨

పిమ్మట మఱికొంతకాలమునకు దేవతలకుఁ బ్రభువును వరంబు నొసఁగునట్టి పరమేశ్వరుఁడు మహాబలుఁడగు విశ్వామిత్రునకుఁ దనస్వరూపంబు గనుపఱచెను. ౧౩

ఓరాజా! ఎందునిమిత్తము తపముసేయుచున్నావు నీ వివక్షితార్థమేది చెప్పుము? నేను వరముల నిచ్చువాఁడను నీచేఁ గోరఁబడువర మేదో దానిని జెప్పుము. ౧౪

అధికమైన తపముగల విశ్వామిత్రమహారాజీశ్వరునిచే నిట్లుఁ జెప్పఁబడినవాఁ డగుచు నాపరమేశ్వరు నమస్కరించి యీమాట చెప్పెను. ౧౫

పాపరహితుఁడవగునో మహాదేవుఁడా! నీవు సంతుష్టుఁడవై తివేని యంగము లుపాంగము లుపనిషత్తులు మఱియుం నుపదేశగమ్యంబులగు రహస్యమంత్రములు వీనితోఁ గూడియుండుధనుర్వేదము నాకుఁ దయచేయుము. ౧౬

పాపరహితుఁడవైన యోస్వామీ! దేవదానవమహర్షిగంధర్వయక్షరక్షస్సులయం దేయేయస్త్రములు గలవో యవియన్నియుం నాయందుఁ బ్రకాశించుఁగాక. ౧౭

దేవతలకు దేవుఁడవైన యోస్వామీ! మఱియొక నా మనోరథమును మీప్రసాదమువల్ల నగుఁగాక. ౧౭½

ఏవమ స్త్వితి దేవేశో వాక్యముక్త్వా గత స్తదా. ౧౭

ప్రాప్య చాస్త్రాణి రాజర్షి ర్విశ్వామిత్రో మహాబలః,
దర్పేణ మహతా యుక్తో దర్పపూర్ణోఽభవ త్తదా. ౧౯

వివర్ధమానో వీర్యేణ సముద్ర ఇవ పర్వణి,
హతమేవ తదా మేనే వసిష్ఠమృషిస త్తమమ్. ౨౦

తతో గత్వాశ్రమపదం ముమోచాస్త్రాణి పార్థివః,
యైస్త త్తపోవనం సర్వం నిర్దగ్ధం చాస్త్రతేజసా. ౨౧

ఉదీర్యమాణమస్త్రం తద్విశ్వామిత్రస్య ధీమతః,
దృష్ట్వా విప్రద్రుతాస్సర్వే మునయశ్శతశో దిశః. ౨౨

వసిష్ఠస్య చ యే శిష్యాస్తథైవ మృగపక్షిణః,
విద్రవంతి భయాద్భీతా నానాదిగ్భ్యస్సహస్రశః, ౨౩

వసిష్ఠస్యాశ్రమపదం శూన్యమాసీన్మహాత్మనః. ౨౩½

ముహూర్తమివ నిశ్శబ్దమాసీదిరిణసన్నిభమ్. ౨౪

వదతో వై వసిష్ఠస్య మా భైరితి ముహుర్ముహుః,
నాశయామ్యద్య గాధేయం నీహారమివ భాస్కరః. ౨౫

అప్పుడు దేవదేవుఁ డగునీశ్వరుఁ డిట్లగుఁగాక యని వరమిచ్చి యంతర్హితుఁ డాయెను. ౧౮

అప్పుడు మహాబలుఁడును రాజర్షి యగు విశ్వామిత్రుఁడు క్షత్రియత్వాదిప్రయుక్త గర్వముగలవాఁడయ్యును నస్త్రబల మబ్బుటచే మిక్కిలి గర్వము గలవాఁడాయెను. ౧౯

అప్పు డావిశ్వామిత్రుఁడు పర్వమందు సముద్రమువలె పరాక్రమముచే వృద్ధిఁబొందుచు ఋషిశ్రేష్ఠుఁడగు వసిష్ఠమహర్షిని జంపఁబడినవానిగానే తలఁచెను. ౨౦

అపిమ్మట విశ్వామిత్రమహారాజు వసిష్ఠాశ్రమప్రదేశమును జేరి యే యస్త్రములచేతను స్వతేజస్సుచేతను నావసిష్ఠమహర్షియొక్క తపోవనమంతయుఁ గాల్పఁబడినదో యాయస్త్రములను విడిచిపెట్టెను. ౨౧

ఆవసిష్ఠాశ్రమమందుండు మునులందఱుఁ బ్రయోగింపఁబడుచున్న ధైర్యవంతుఁడగు విశ్వామిత్రునియొక్క యాయస్త్రములను జూచి గుంపులు గుంపులుగా నలుదెసలను బాఱిరి. ౨౨

అప్పు డచటనున్న వసిష్ఠమహామునియొక్క శిష్యులంద ఱెట్లు బరువెత్తిరో యట్లు మృగములును బక్షులును భయము గలుగఁ జేయుచున్న యస్త్రజాతమువలన భయపెట్టఁబడినవై వేనవేలుగాఁ దమతమ స్థానములనుండి పరువెత్తినవి. ౨౩

భగ్నుఁడైన వసిష్ఠమహర్షియొక్క తపోవనము చెట్లు పొదలు మొదలగునవి లేనిదియై యుండెను. ౨౪

మఱియు నాతపోవనము ముహూర్తకాలము శబ్దరహితముగాను నూషరక్షేత్రమునకు సరియైనదిగా నుండెను. ౨౫

రక్షకుఁడైన నేనుండఁగా మీకేమిభయము? సూర్యుఁడు మంచునువలె నేనిప్పు డావిశ్వామిత్రుని జంపుచున్నాను. భయము పడవలదని వసిష్ఠమహాముని మాటిమాటికిని జెప్పుచుండఁగా నాయనమాటను లక్ష్యపెట్టక భయము పడి యందున్నవారందఱును పలాయితులైరి. ౨౬

ఏవముక్త్వా మహాతేజా వసిష్ఠో జపతాం వరః,
విశ్వామిత్రం తదా వాక్యం సరోషమిదమబ్రవీత్ ౨౬

ఆశ్రమం చిరసంవృద్ధం యద్వినాశితవానసి,
దురాచారోఽసి తన్మూఢ తస్మాత్త్వం న భవిష్యసి. ౨౭

ఇత్యుక్త్వా పరమక్రుద్ధో దండముద్యమ్య సత్వరః,
విధూమమివ కాలాగ్నిం యమదండమివాపరమ్. ౨౮

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పఞ్చపఞ్చాశస్సర్గః.

## షట్పఞ్చాశస్సర్గః

ఏవముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహాబలః,
ఆగ్నేయమస్త్రముత్క్షిప్య తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్. ౧
బ్రహ్మదండం సముత్క్షిప్య కాలదండమివాఽపరమ్,
వసిష్ఠో భగవాన్ క్రోధాదిదం వచనమబ్రవీత్. ౨
క్షత్రబంధో స్థితోఽస్మ్యేష యద్బలం తద్విదర్శయ,
నాశయామ్యద్య తే దర్పం శస్త్రస్య తవ గాధిజ. 3

క్వచ తే క్షత్రియబలం క్వచ బ్రహ్మబలం మహత్,
పశ్య బ్రహ్మబలం దివ్యం మమ క్షత్రియపాంసన. ౪

తస్యాస్త్రం గాధిపుత్రస్య ఘోరమాగ్నేయముద్యతమ్,
బ్రహ్మదండేన తచ్ఛాంతమగ్నేర్వేగ ఇవాంభసా. ౫

అధిక తేజోవంతుఁడును తరము చేయువారలలో శ్రేష్ఠుఁడునైన యా వసిష్ఠమహాముని యిట్లు స్వజనముతోఁ జెప్పి యంత నావిశ్వామిత్రునిగూర్చి రోషముతోఁగూడిన యీమాటఁ జెప్పెను. ౨౬

మూఢుఁడవగు విశ్వామిత్రుఁడా! చిరకాలమునుండి వృద్ధిఁబొందింపఁబడిన నాయాశ్రమము నెందువల్ల నాశముఁజేసినవాఁడ వయితివో అందువలన నింద్యమైన యాచారము గలవాఁడవయితివి. నీ వందువలననె మిగులవు.

మిక్కిలి కోపముతోఁ గూడియున్న వసిష్ఠమహాముని యిట్లుచెప్పి త్వరతోఁ గూడినవాఁడై పొగలేని కాలాగ్నివలెను రెండవదగు కాలదండమునువలెనున్న బ్రహ్మదండమును బట్టికొనెను. ౨౭

ఇది యేబదియైదవ సర్గము.

---

## ఏబదియాఱవ సర్గము

అధికబలముగల విశ్వామిత్రుఁడు వసిష్ఠునిచే నిట్లు బలుకఁబడినవాఁడగుచు నాగ్నేయాస్త్రముఁ జేతఁబట్టి నిలునిలు మని పలికెను. ౧

మాహాత్మ్యముగల వసిష్ఠమహర్షి రెండవకాలదండమునువలె బ్రహ్మదండమెత్తి క్రోధమువలన నీమాటఁజెప్పెను. ౨

క్షత్రియాధముఁడ వగు విశ్వామిత్రుఁడా! ఇదుగో యున్నాఁడను. నీబలమెట్టిదో దానిని జక్కఁగాఁ జూపుము. నీయొక్కయు నీశస్త్రముయొక్కయు గర్వమును నాశముఁ జేయుచున్నాఁడను. ౩

క్షత్రియాధముఁడా! నీయొక్క క్షత్రియబల మెక్కడ? గొప్పదగు బ్రహ్మబల మెక్కడ? శ్రేష్ఠంబగు నాబ్రహ్మబలమునుఁ జూడుమని వసిష్ఠుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౪

గాధికొమారుఁడగు నావిశ్వామిత్రునిచేఁ బ్రయోగింపఁబడి ఘోరంబగుచుండుచున్న నాయాగ్నేయాస్త్రము నీటిచే నార్పఁబడిన నిప్పులవేడిమివలె నాబ్రహ్మదండముచేతఁ జల్లారెను. ౫

వారుణం చైవ రౌద్రం చ ఐంద్రం పాశుపతం తథా,
ఐషీకం చాపి చిక్షేప కుపితో గాధినందనః. ౬

మానవం మోహనం చైవ గాంధర్వం స్వాపనం తథా,
జృంభణం మాదనం చైవ సంతాపనవిలాపనే. ౭
శోషణం దారణం చైవ వజ్రమస్త్రం సుదుర్జయమ్,
బ్రహ్మపాశం కాలపాశం వారుణం పాశమేవచ. ౮
పైనాకాస్త్రం చ దయితం శుష్కార్ద్రే అశనీ ఉభే,
దండాస్త్ర మథ పైశాచం క్రౌంచమస్త్రం తథైవచ. ౯
ధర్మచక్రం కాలచక్రం విష్ణుచక్రం తథైవచ,
వాయవ్యం మథనం చైవ అస్త్రం హయశిర స్తథా. ౧౦
శక్తిద్వయం చ చిక్షేప కంకాళం ముసలం తథా,
వైద్యాధరం మహాస్త్రంచ కాలాస్త్రమథ దారుణమ్, ౧౧
త్రిశూలమస్త్రం ఘోరంచ కాపాలమథ కంకణమ్,
ఏతాన్యస్త్రాణి చిక్షేప సర్వాణి రఘునందన. ౧౨
వసిష్ఠే జపతాం శ్రేష్ఠే తదద్భుతమివాభవత్. ౧౨½

తాని సర్వాణి దండేన గ్రసతే బ్రహ్మణస్సుతః. ౧౩

తేషు శాంతేషు బ్రహ్మాస్త్రం క్షిప్తవాన్ గాధినందనః. ౧౩½

తదస్త్రముద్యతం దృష్ట్వా దేవాస్సాగ్నిపురోగమాః,
దేవర్షయశ్చ సంభ్రాంతా గంధర్వాస్సమహోరగాః. ౧౪½

అంత గాంధిపుత్రుం డగువిశ్వామిత్రుండు మిగులఁ గోపముగలవాఁ డగుచు వారుణాస్త్రము రౌద్రాస్త్రము నైంద్రాస్త్రము పాశుపతాస్త్రము నైషీకాస్త్రము అగు నస్త్రంబుల నొక్కపెట్టునఁ బడవైచెను. ౬

అంతట విశ్వామిత్రుఁడు మిక్కుటమగుకోపముతో మానవము మోహనము గాంధర్వముస్వాపనము జృంభణము మాదనము సంతాపనము విలాపనము శోషణము దారణము వజ్రము బ్రహ్మపాశము కాలపాశము వరుణపాశము పైనాకము దయితము శుష్కము ఆర్ద్రము పైశాచము దండము కాంచము ధర్మచక్రము కాలచక్రము విష్ణుచక్రము వాయవ్యము మథనము హాయశిరము వైద్యాధరము మున్నగునస్త్రముల శూలముల చక్రంబుల పాశంబుల పిడుగుల ముసలముల నన్నింటిని ప్రయోగించెను. ౭-౧౨

తపోవంసుఁలో శ్రేటియగు నా వసిష్ఠమహామునివిషయమై యాయస్త్ర ప్రయోగము గార్యలేశమైనను జేయఁజాలక పోవుటవల్ల మిగుల నాశ్చర్యముగ నుండెను. ౧౨½

బ్రహ్మపుత్రుఁడైన వసిష్ఠమహాముని యాయస్త్రములనన్నింటిని యద్భుతమగునట్లు తన బ్రహ్మదండముచే గ్రసించెను. ౧౩

విశ్వామిత్రుఁడు తనయస్త్రములన్నియుం వ్యర్థములు కాఁగా నప్పుడు బ్రహ్మాస్త్రమునుఁ బ్రయోగించెను. ౧౩½

అప్పుడు అగ్నిదేవుఁడు ముందుగాగల దేవతలును దేవర్షులును గంధర్వులును మహోరగులును విశ్వామిత్రునిచేఁ బ్రయోగింపఁబడిన బ్రహ్మాస్త్రమును జూచి భ్రాంతచిత్తులైరి. ౧౪½

త్రైలోక్యమాసీత్సంత్రస్తం బ్రహ్మాస్త్రే సముదీరితే. ౧౫
తదప్యస్త్రం మహాఘోరం బ్రాహ్మం బ్రాహ్మేణ తేజసా,
వసిష్ఠో గ్రసతే సర్వం బ్రహ్మదండేన రాఘవ. ౧౬
బ్రహ్మాస్త్రం గ్రసమానస్య వసిష్ఠస్య మహాత్మనః,
త్రైలోక్యమోహనం రౌద్రం రూపమాసీత్సుదారుణమ్. ౧౭
రోమకూపేషు సర్వేషు వసిష్ఠస్య మహాత్మనః,
మరీచ్య ఇవ నిష్పేతురగ్నేర్ధూమాకులార్చిషః. ౧౮

ప్రాజ్వలద్బ్రహ్మదండశ్చ వసిష్ఠస్య కరోద్యతః,
విధూమ ఇవ కాలాగ్నిర్యమదండ ఇవాపరః. ౧౯

తతోఽస్తువన్ మునిగణా వసిష్ఠం జపతాం వరమ్,
అమోఘం తే బలం బ్రహ్మన్ తేజో ధారయ తేజసా. ౨౦
నిగృహీతస్త్వయా బ్రహ్మన్ విశ్వామిత్రో మహాతపాః.
ప్రసీద జపతాం శ్రేష్ఠ లోకాస్సంతు గతవ్యథాః. ౨౧

ఏవముక్తో మహాతేజాశ్శమం చక్రే మహాతపాః. ౨౧½

విశ్వామిత్రోఽపి నికృతో వినిశ్వస్యేదమబ్రవీత్. ౨౨

ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్,
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే. ౨౩

తదేతత్సమవేక్ష్యాహం ప్రసన్నేంద్రియమానసః,

బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁగానే ముల్లోకములుఁ దల్లడిల్లెను. ౧౫

రాముఁడా! వసిష్ఠమహర్షి బ్రహ్మదేవతాకమై మహాఘోరంబుగనున్న నాయస్త్రమంతయుఁను దన బ్రహ్మదండముచేత మ్రింగెను. ౧౬

అప్పుడు బ్రహ్మాస్త్రమును మ్రింగఁగనే వసిష్ఠమహామునికిఁ త్రైలోక్య మోహనంబును భయంకరంబును సుదారుణంబును నగురూపముఁ గలిగెను. ౧౭

మహాత్ముఁడగు వసిష్ఠమహర్షియొక్క సమస్తములయిన రోమకూపములనుండి పొగతోఁగూడిన మంటలుగల నిప్పునుండి వచ్చుస్ఫులింగముల చాడ్పున జ్వాలలు బయలుపడినవి. ౧౮

వసిష్ఠమహామునియొక్క హస్తమందు ధరింపఁబడియున్న బ్రహ్మదండము రెండవదియగు యమదండముమాడ్కియు ధూమము లేక జ్వలించుచున్న కాలాగ్నియుఁను బోలె మిగుల మండుచుండెను. ౧౯

అనంతరము మునులు వసిష్ఠుఁ జేరి ఓ బ్రాహ్మణుఁడవగు వసిష్ఠుఁడా! నీబల మెక్కువైనది. నీమహిమచే నా బ్రహ్మాస్త్ర తేజ ముపశమింపుము. అధికమైన తపముగల విశ్వామిత్రుఁడు నీచే నోటువడెను. జపముచేయువారలలో నుత్తముఁడవైన వసిష్ఠుఁడా జనులంతయు దుఃఖములేనివార లగుదురుగాక యని పూజ్యుఁడైన వసిష్ఠమహర్షిని స్తోత్రము జేసిరి. ౨౦, ౨౧

అధికతపమును తేజస్సునుగల వసిష్ఠుఁడు, మునులచే నిట్లుఁ బ్రార్థింపఁబడి కోపశమనముఁ జేసెను. ౨౧౪

పరాభవ మొందిన విశ్వామిత్రుఁడును నిట్టూర్పు నిగుడించి యీమాటఁ జెప్పెను. ౨౨

క్షత్రియబలము నిందింపఁదగిన బలము. బ్రాహ్మణ్యరూపమగు తేజోబలమె మిక్కిలియు శ్రేష్ఠమయినబలము. ఇప్పు డొక బ్రహ్మదండముచే నాయొక్క బ్రహ్మాస్త్రములును గొట్టువడిన వని విశ్వామిత్రుఁడు సెప్పెను. ౨౩

ఈరెండుబలములకును గల యెచ్చుతగ్గులను జూచి విడువఁబడిన క్షత్రరోషముగల నేను ముందు బ్రాహ్మణ్యపాదకమైన తపమెద్దియో యట్టి గొప్ప

తపో మహాత్సమాస్థాస్యే యద్వై బ్రహ్మత్వకారణమ్. ౨౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షట్పఞ్చాశస్సర్గః.

---

## సప్తపఞ్చాశస్సర్గః.

తతస్సంతప్తహృదయస్స్మరన్నిగ్రహమాత్మనః,
వినిశ్శ్వస్య వినిశ్శ్వస్య కృతవైరో మహాత్మనా. ౧
స దక్షిణాం దిశం గత్వా మహిష్యా సహ రాఘవ,
తతాప పరమం ఘోరం విశ్వామిత్రో మహాతపః. ౨

ఫలమూలాశనో దాంతశ్చచార సుమహత్తపః,

అథాస్య జజ్ఞిరే పుత్రాస్సత్యధర్మపరాయణాః,
హవిష్యందో మధుష్యందో దృఢనేత్రో మహారథః. ౩

పూర్ణే వర్షసహస్రే తు బ్రహ్మా లోకపితామహః,
అబ్రవీన్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. ౪

జితా రాజర్షిలోకాస్తే తపసా కుశికాత్మజ,
అనేన తపసా త్వాం తు రాజర్షిరితి విద్మహే. ౫

ఏవముక్త్వా మహాతేజా జగామ సహ దైవతైః,
త్రివిష్టపం బ్రహ్మలోకం లోకానాం పరమేశ్వరః. ౬

తపంబు నవలంబించెద నని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౨౪

ఇది యేబదియాఱవ సర్గము.

## ఏబదియేడవ సర్గము

రామునుఁడా! అటువెనుక సంతాపమొందిన మనబుతో మనోనిగ్రహము సేయవలయు నను తలంపుగలిగి మహానుభావుఁ డగువసిష్ఠునితో ద్వేషించియున్న యావిశ్వామిత్రుఁడు మాటిమాటికి నిట్టూర్పులు విడుచుచు భార్యతోఁగూడ శరావతీనదిదక్షిణపుదిక్కు నాశ్రయించి కఠినంబగు గొప్ప తపస్సును సర్వోత్కృష్టమగున ట్లొనర్చెను. ౧,౨

మఱియు నావిశ్వామిత్రుఁడు ఫలమూలంబు లాహారముగాఁ గైకొని నియమముతో నుత్తమం బగుతపంబు సల్పెను.

పిమ్మట నీవిశ్వామిత్రునకు సత్యవంతులును ధార్మికులు నగు హావిష్యందుఁడు మధుష్యందుఁడు దృఢనేత్రుఁడు మహారథుఁడు అను పేర్లుగల కొడుకులు జనించిరి. 3

అట్లుఁ దపంబు సేయుచుండ వెయ్యిసంవత్సరములు నిండగానే సకలలోక పితామహుఁ డగు బ్రహ్మదేవుండు వచ్చి తపమే ధనముగాఁగలయావిశ్వామిత్రునిఁగూర్చి మధురంబగుమాటఁ జెప్పెను. ౪

విశ్వామిత్రుఁడా! నీతపస్సుచే రాజర్షిలోకంబులు జయింపఁబడినవి. నీవొనరించిన యీతపముచేత నిన్నిపుడు రాజర్షివని తలంచెదమని బ్రహ్మదేవుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౫

సకలలోకములకుఁ బ్రభువును మహాతేజుఁడు నగు బ్రహ్మదేవుఁ డిట్లు పలికి దేవతలతోడఁగూడి స్వర్గమునకువెళ్లి యాపిమ్మటఁ దనదగు బ్రహ్మలోకముఁగూర్చి వెళ్లెను. ౬

విశ్వామిత్రోఽపి తచ్ఛ్రుత్వా హ్రియా కించిదవాఙ్ముఖః,
దుఃఖేన మహతాఽఽవిష్టస్సమన్యురిదమబ్రవీత్. ౭
తపశ్చ సుమహత్తప్తం రాజర్షి రితి మాం విదుః,
దేవాస్సర్షిగణాస్సర్వే నాస్తి మన్యే తపఃఫలమ్. ౮

ఇతి నిశ్చిత్య మనసా భూయ ఏవ మహాతపాః,
తపశ్చకార కాకుత్స్థ పరమం పరమాత్మవాన్. ౯

ఏతస్మిన్నేవ కాలే తు సత్యవాదీ జితేంద్రియః,
త్రిశంకురితి విఖ్యాత ఇక్ష్వాకుకులవర్ధనః. ౧౦
తస్య బుద్ధిస్సముత్పన్నా యజేయమితి రాఘవ,
గచ్ఛేయం సశరీరేణ దేవానాం పరమాం గతిమ్. ౧౧

స వసిష్ఠం సమాహూయ కథయామాస చింతితమ్,
అశక్యమితి చాప్యుక్తో వసిష్ఠేన మహాత్మనా. ౧౨

ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన స యయౌ దక్షిణాం దిశమ్,
తతస్తత్కర్మసిద్ధ్యర్థం పుత్రాంస్తస్య గతో నృపః. ౧౩
వాసిష్ఠా దీర్ఘతపసస్తపో యత్ర హి తేపిరే,
త్రిశంకుస్సుమహాతేజాశ్శతం పరమభాస్వరమ్. ౧౪
వసిష్ఠపుత్రాన్ దదృశే తప్యమానాన్ యశస్వినః. ౧౪½
సోఽభిగమ్య మహాత్మానస్సర్వానేవ గురోస్సుతాన్. ౧౫
అభివాద్యానుపూర్వ్యేణ హ్రియా కించిదవాఙ్ముఖః,
అబ్రవీత్సుమహాభాగాన్ సర్వానేవ కృతాంజలిః. ౧౬

విశ్వామిత్రుఁడు నామాటవిని లజ్జచేఁ గొంచము తలవంచికొని మహాదుఃఖముతోఁగూడి దైన్యమునొందినవాఁడగుచు నీమాటఁ జెప్పెను. ౭

గొప్పతపస్సు. చేసితిని. ఋషిగణములతోఁగూడిన దేవతలందఱు నన్ను రాజర్షి యనిరి. నాతపస్సున కిది సరియైనఫలము కాదని తలంచెద నని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౮

రాముఁడా? మహాతపోవంతుఁడును మహాయత్నముగలవాఁడు నగు విశ్వామిత్రుఁడిట్లు మనంబున నిశ్చయించి మున్ను తాఁజేసియున్న తపమున కంటె నెక్కుడగు తప మొనర్చెను. ౯

ఈసమయమందే సత్యవంతుఁడును జితేంద్రియుఁడును నిక్ష్వాకువంశవర్ధనుఁడు నగు త్రిశంకు వను ప్రసిద్ధుఁ డెవఁడుండెనో. ౧౦

ఓరాముఁడా! దేవతాయోగ్యమయిన స్వర్గము నీనాశరీరముతోఁ బొందవలెను. అందు కనువైనయాగము చేయవలెను అని యాత్రిశంకువునకుఁ దలఁపు గలిగెను. ౧౧

ఆత్రిశంకుమహారాజు వసిష్ఠమహర్షిని రావించి శరీరముతో స్వర్గముఁ జేరుట కనువైన యజ్ఞముచేయుటనుఁ జెప్పి మహానుభావుఁ డగు నావసిష్ఠునిచే నట్టి యజ్ఞముజేయుట నీకశక్యమనియును జెప్పఁబడినవాఁడాయెను. ౧౨

వసిష్ఠమహర్షిచేత నిరాకరింపఁబడిన నాత్రిశంకువు దక్షిణదిక్కునకు వెళ్లి పిమ్మట నాయజ్ఞకర్మసిద్ధికొఱకు వసిష్ఠమహాముని కొడుకులం బొందెను. ౧౩

అధికమైన పరాక్రమముగల త్రిశంకుమహారాజు దీర్ఘతపస్సుగలవసిష్ఠపుత్రు లెచ్చోటఁ దపముజేయుచుండిరో యచ్చోటికి వెళ్లి మిక్కిలిఁబ్రకాశించుచుఁ గీర్తిమంతులై తపంబొనర్చుచున్న వసిష్ఠపుత్రుల నూర్వురం జూచెను.

ఆత్రిశంకుమహారాజు పూజ్యులగు గురుపుత్రుల నందఱం గనుఁగొని వసిష్ఠమహామునియొక్క నిరాకరణమువల్లఁ గలిగినసిగ్గుచేఁ గొంచెముఁగఁ దల వంచికొని జ్యేష్ఠానుక్రమము దప్పక నమస్కరించి చేమోడ్పుగలవాఁ డగుచు మహానుభావులగు వసిష్ఠపుత్రులనందఱను గూర్చి పలికెను. ౧౪, ౧౫

శరణం వః ప్రపద్యేఽహం శరణ్యాన్ శరణాగతః,
ప్రత్యాఖ్యాతోఽస్మి భద్రం వో వసిష్ఠేన మహాత్మనా. ౧౭

యష్టుకామో మహాయజ్ఞం తదనుజ్ఞాతుమర్హథ,
గురుపుత్రానహం సర్వాన్నమస్కృత్య ప్రసాదయే. ౧౮

శిరసా ప్రణతో యాచే బ్రాహ్మణాన్ తపసి స్థితాన్,
తే మాం భవంతస్సిద్ధ్యర్థం యాజయంతు సమాహితాః.
సశరీరో యథాఽహం హి దేవలోకమవాప్నుయామ్. ౧౯½

ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన గతిమన్యాం తపోధనాః,
గురుపుత్రానృతే సర్వాన్నాహం పశ్యామి కాంచన. ౨౦½

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమా గతిః,
పురోధసస్తు విద్వాంసస్తారయంతి సదా నృపాన్. ౨౧½

తస్మాదనంతరం సర్వే భవంతో దైవతం మమ. ౨౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తపఞ్చాశస్సర్గః.

---

## అష్టపఞ్చాశస్సర్గః.

తతస్త్రిశంకోర్వచనం శ్రుత్వా క్రోధసమన్వితమ్,
ఋషిపుత్రశతం రామ రాజానమిదమబ్రవీత్. ౧

ప్రత్యాఖ్యాతో హి దుర్బుద్ధే గురుణా సత్యవాదినా,
తం కథం సమతిక్రమ్య శాఖాంతరముపేయివాన్. ౨

రక్షకుల నపేక్షించివచ్చిన నేను రక్షణసమర్థు లగుమిమ్ము రక్షకులుగా బొందుచున్నాఁడను. మీకు మంగళమగుఁగాక. మహానుభావుఁడగు వసిష్ఠ మహర్షిచే నిరాకరింపఁబడితినని త్రిశంకువు జెప్పెను. ౧౭

గొప్పయజ్ఞముచేయఁ గోర్కిగలవాఁడ నట్టియజ్ఞానుష్ఠాన మనుగ్రహించుటకు మీరు దగియున్నారు. నేగురుపుత్రుల నందఱ నమస్కరించి ప్రసన్నులు కావలయు నని ప్రార్థించుచున్నాఁడను. ౧౮

తపోనిష్ఠులును బ్రహ్మవేత్తలు నగు మిమ్ము శిరంబుచే నమస్కరించి యాచించెదను. నేనెట్లు శరీరముతోఁ గూడ స్వర్గలోకమును బొందఁగలనో యట్లుఁ బ్రసిద్ధులగు మీరలు సావధానచిత్తులరై నాయిష్టము సిద్ధించునట్లు నన్ను యజింపఁజేయుఁ డని యాత్రిశంకుమహారాజు చెప్పెను. ౧౯

తపోవంతులగు గురుపుత్రులారా! వసిష్ఠమహర్షిచే నిరాకృతుఁడనైన నేను గురుపుత్రులయిన మిమ్ము దక్క యజ్ఞసాధనోపాయమగు మఱియొక గతి యున్నట్లు చూడలే నని త్రిశంకువు సెప్పెను. ౨౦

వేత్తలగు పురోహితులు సర్వకాలములయందు రాజులనుఁ దరింపఁ జేయుచున్నారు. ఇక్ష్వాకువంశపురాజుల కందఱకును బురోహితుఁ డగు వసిష్ఠ మహర్షియె ముఖ్యతారకముగదా! యని త్రిశంకువుఁ జెప్పెను. ౨౧

సర్వరక్షకుఁడగు వసిష్ఠునికి వెనుక నాకు గురుపుత్రు లగుమీరందఱు దరింపఁజేయవలసిన దైవములుగదా; యని త్రిశంకువు చెప్పెను. ౨౨

ఇది యేబదియేడవసర్గము.

---

## ఏబదియెనిమిదవ సర్గము

రాముఁడా! త్రిశంకుఁడు చెప్పినమాట విని పిమ్మట కోపమునొందిన యావసిష్ఠమహాముని యొక్క కొడుకులందఱు నారాజునుఁగూర్చి యీమాటఁ జెప్పిరి. ౧

దుర్మార్గుఁడవగు త్రిశంకుఁడా! కల్పాంతరవృత్తాంతపరిజ్ఞాత గావున యథార్థముఁ జెప్పినగురువువలన నిరాకరింపఁబడితివి సరిగదా? పిమ్మట నాయనను విడిచి యాశ్రమాంతరము నొందు కవలంబించితివి? ౨

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమో గురుః,
న చాతిక్రమితుం శక్యం వచనం సత్యవాదినః. 3

అశక్యమితిచోవాచ వసిష్ఠో భగవానృషిః,
తం వయం వై సమాహర్తుం క్రతుం శక్తాః కథం తవ. ౪

బాలిశస్త్వం నరశ్రేష్ఠ గమ్యతాం స్వపురం పునః,
యాజనే భగవాంఛక్తస్త్రైలోక్యస్యాపి పార్థివ. ౫

అవమానం చ తత్కర్తుం తస్య శక్ష్యామహే కథమ్. ౫½

తేషాం తద్వచనం శ్రుత్వా క్రోధపర్యాకులాక్షరమ్,
స రాజా పునరేవైతానిదం వచనమబ్రవీత్. ౬½
ప్రత్యాఖ్యాతోఽస్మి గురుణా గురుపుత్రైస్తథైవ చ,
అన్యాం గతిం గమిష్యామి స్వస్తి వోఽస్తు తపోధనాః. ౭½

ఋషిపుత్రాస్తు తచ్ఛ్రుత్వా వాక్యం ఘోరాభిసంహితమ్,
శేపుః పరమసంక్రుద్ధాశ్చండాలత్వం గమిష్యసి. ౮½

ఏవముక్త్వా మహాత్మానో వివిశుస్తే స్వమాశ్రమమ్. ౯

అథ రాత్ర్యాం వ్యతీతాయాం రాజా చండాలతాం గతః,
నీలవస్త్రధరో నీలః పురుషో ధ్వస్తమూర్ధజః. ౧౦
చిత్రమాల్యానులేపశ్చ ఆయసాభరణోఽభవత్. ౧౦½

ఇక్ష్వాకువంశమురాజుల కందఱకును బురోహితుఁ డగు వసిష్ఠుఁడు పర మాచార్యుఁడు సత్యవంతుఁ డగు నాయనచెప్పినమాట యతిక్రమింప నలవి గానిది యని చెప్పెను. ౩

మాహాత్మ్యముగల ఋషియగువసిష్ఠుఁ డేయజ్ఞమును జేయుంట కశక్యం బనిచెప్పెనో నీయొక్క యాక్రతువును జేయించుటకు మే మెట్లు సమర్థుల మగుదు మని చెప్పిరి. ౪

రాజా! మూర్ఖుఁడవుగ నున్నావు. మఱల నీవు నీపట్టణమునకు వెళ్లుము. మాహాత్మ్యముగల వసిష్ఠమహాముని మూఁడులోకములయందును యాగములు జేయించుటకు సామర్థ్యముగలవాఁడని చెప్పెను. ౫

సాధింపశక్యముగాని యజ్ఞమును నావసిష్ఠమహాముని కవమానమునుం జేయుంటకు మే మెట్లు సమర్థుల మగుదుము. ౫½

త్రిశంకుమహారాజు కోపముతో మేళనమైయుండునక్షరములుగలయా వసిష్ఠపుత్రులయొక్క యామాటవిని వీరలను గూర్చి మఱల నీమాటఁ జెప్పెను.

తపోధనులగు వసిష్ఠపుత్రులారా ! నాగురువుచేత నట్లె గురుపుత్రుల రగు మీచేతం బ్రత్యాఖ్యాతుఁడ నైతిని. మీకు మంగళమగుఁగాక. నేను మఱియొకయాజకుని బొందెదను అని త్రిశంకువు చెప్పెను. ౬½

అప్పు డావసిష్ఠమహాముని కొడుకులు సాక్షాత్కులగురుండును బ్రహ్మపుత్రుండు నగు వసిష్ఠు నతిక్రమించి పురోహితాంతరాశ్రయణము చేసెదనను నట్టి ఘోరాభిప్రాయయుక్తంబగు నాత్రిశంకునిమాట విని పరమకోపనులగుచుఁ జండాలుండవు గమ్మని నాత్రిశంకువునకు శాపంబిచ్చిరి. ౭½

మహామహిమంబుగల నావసిష్ఠపుత్రు లిట్లు శపించి తమ యాశ్రమమును జేరిరి. ౯

పిమ్మటఁ దెల్లవారగానే యాత్రిశంకుమహారాజు చండాలదేహము నొంది నల్లని బట్టలు గట్టుకొని నల్లనివాఁడై బిరుసైనశరీరముగల్గి కుఱుచలగు తలవెండ్రుకలతో శ్మశానమందుండు పూలదండలు గల్గి యందలి బూడిదను దేహమంతయును బూసికొని యినుముతోఁ జేయఁబడిన సొమ్ములుగలవాఁడుగా నుండెను. ౧౦, ౧౦½

తం దృష్ట్వా మన్త్రిణస్సర్వే త్యక్త్వా చణ్డాలరూపిణమ్,
ప్రాద్రవన్ సహితా రామ పౌరా యేఽస్యానుగామినః. ౧౧॥

ఏకో హి రాజా కాకుత్స్థ జగామ పరమాత్మవాన్,
దహ్యమానో దివారాత్రం విశ్వామిత్రం తపోధనమ్. ౧౨॥

విశ్వామిత్రస్తు తం దృష్ట్వా రాజానం విఫలీకృతమ్,
చణ్డాలరూపిణం రామ మునిః కారుణ్యమాగతః. ౧౩॥

కారుణ్యాత్స మహాతేజా వాక్యం పరమధార్మికః,
ఇదం జగాద భద్రం తే రాజానం ఘోరరూపిణమ్. ౧౪॥

కిమాగమనకార్యం తే రాజపుత్ర మహాబల,
అయోధ్యాధిపతే వీర శాపాచ్చణ్డాలతాం గతః. ౧౫॥

అథ తద్వాక్యమాజ్ఞాయ రాజా చణ్డాలతాం గతః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. ౧౬॥

ప్రత్యాఖ్యాతోఽస్మి గురుణా గురుపుత్రైస్తథైవ చ,
అనవాప్యైవ తం కామం మయా ప్రాప్తో విపర్యయః. ౧౭॥

సశరీరో దివం యాయామితి మే సౌమ్య దర్శనమ్,
మయా చేష్టం క్రతుశతం తచ్చ నావాప్యతే ఫలమ్. ౧౮॥

అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన,

రాముఁడా! ఈరాజును వెంబడించివచ్చిన పురజనులును మంత్రులును అందఱు చండాలరూపమునొందిన యాత్రిశంకువును జూచి త్యజించి గుంపుగూడి పఱచిరి. ౧౧॥

రాముఁడా! త్రిశంకుమహారాజు మిక్కిలి ధైర్యము గలవాఁడై వ్యసనముచేత రేయింబవలు దహింపఁబడుచున్నవాఁడగుచు ఒక్కఁడుగానే వసిష్ఠవిరోధియైన తపోవంతుఁడగు విశ్వామిత్రునిం గూర్చి వెళ్లెను. ౧౨॥

రాముఁడా! మననశీలుఁడగు విశ్వామిత్రమహాముని వసిష్ఠునిచేత నతని పుత్రులచేతను వ్యర్థమనోరథుఁడుగాఁ జేయఁబడి చండాలరూపమునొందిన నాత్రిశంకుమహారాజును జూచి దయగలవాఁడాయెను. ౧౩॥

త్రిశంకుఁడా! నీకు మంగళమగుగాక యనిచెప్పి పరమధార్మికుఁడును మహాతేజోవంతుఁడును నగు నావిశ్వామిత్రుఁడు ఘోరరూపమునొందియున్న త్రిశంకుమహారాజునుగూర్చి దయతో నీమాటఁ జెప్పెను. ౧౪॥

మహాబలుఁడవు రాజపుత్రుఁడవు శూరుఁడవు నయోధ్యాపతివియు నగు త్రిశంకుమహారాజా! నీవు వచ్చినపనియేమి? ఏకారణముచేత శాపమువలనఁ జండాలభావము నొందితి వని విశ్వామిత్రుఁ డడిగెను. ౧౫॥

ఈమాటఁ జండాలత్వము నొందిన త్రిశంకుమహారాజు విశ్వామిత్రునిచేఁ జెప్పఁబడినమాట విని మాటలాడుటయందు చతురుఁడగు నాత్రిశంకుఁడు మంచిచేమోడ్పు గలవాఁ డగుచు మాటలయందు సమర్థుఁడగు విశ్వామిత్రునిగూర్చి వాక్యముచెప్పెను. ౧౬॥

విశ్వామిత్రుఁడా! నేను నాయొక్క గురువుచేతను గురుపుత్రులచేతను నిరాకరింపఁబడినవాఁడనైతిని ఏకోరిక నుద్దేశించి గురువు గురుపుత్రులును ప్రార్థింపఁబడిరో యానామనోరథమును బొందకయే విపరీతప్రయోజనమగు జాతిభ్రంశము నాచే నొందఁబడినది యని త్రిశంకువుఁ జెప్పెను. ౧౭॥

సౌమ్యుఁడవగు విశ్వామిత్రుఁడా! యీశరీరముతోడనే స్వర్గమునకుఁ బోవలయునని నాసంకల్పము. నేను నూరుయజ్ఞములు చేసితిని దానిఫలమే నిఁచుం నాచేఁ బొందఁబడలేదు అని త్రిశంకుఁడు చెప్పెను. ౧౮॥

సుముఖుఁడవైన విశ్వామిత్రుఁడా! నాచే నసత్యమింతకుమున్న చెప్పఁ

కృచ్ఛ్రేష్వపి గతస్సౌమ్య క్షత్రధర్మేణ తే శపే. ౧౯

యజ్ఞైర్బహువిధైరిష్టం ప్రజా ధర్మేణ పాలితాః,
గురవశ్చ మహాత్మానశ్శీలవృత్తేన తోషితాః. ౨౦

ధర్మే ప్రయతమానస్య యజ్ఞం చాహర్తుమిచ్ఛతః,
పరితోషం న గచ్ఛంతి గురవో మునిపుంగవ. ౨౧

దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకమ్,
దైవేనాక్రమ్యతే సర్వం దైవం హి పరమా గతిః. ౨౨

తస్య మే పరమార్తస్య ప్రసాదమభికాంక్షతః,
కర్తుమర్హసి భద్రం తే దైవోపహతకర్మణః. ౨౩

నాన్యాం గతిం గమిష్యామి నాన్యశ్శరణమస్తి మే,
దైవం పురుషకారేణ నివర్తయితుమర్హసి. ౨౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, అష్టపఞ్చాశస్సర్గః

## ఏ కో న ష ష్టి త మ స్స ర్గః.

ఉక్తవాక్యంతు రాజానం కృపయా కుశికాత్మజః,
అబ్రవీన్మధురం వాక్యం సాక్షాచ్చండాలరూపిణమ్. ౧
ఐక్ష్వాక స్వాగతం వత్స జానామి త్వాం సుధార్మికమ్,
శరణం తే భవిష్యామి మాభైషీర్నృపపుంగవ.

బడలేదిక ముందు నెటువంటి యాపత్తులువచ్చినప్పటికి సనృత మాడఁజాలని యిప్పుడు నీయెదుట శాస్త్రధర్మముసాక్షిగాఁ బ్రమాణముఁజేసెదను. ౧౯

నేను నానావిధంబులగుయాగంబులఁ జేసితిని. ధర్మంబునం బ్రజలఁ బాలించితిని. మహాత్ములగు గురుజనంబుల వినయాదిగుణంబులచేతను బూజాదులచేతను సంతోషపఱచితిని. ౨౦

మునిశ్రేష్ఠుఁడ వగు విశ్వామిత్రుఁడా! నే నిట్లు ధర్మము సంపాదించుటకై ప్రయత్నించుచు యాగముసేయ నిచ్ఛగింపఁగా నాగురువులు సంతోషము నొందరు. ౨౧

కావున ప్రారబ్ధమగు నదృష్టమే యధికం బని తలంతు. పురుషకారంబున బ్రయోజనం బేమియు లేదు! అదృష్టం బంతయుం రూపుమాపి తానే స్థిరంబుగా నిలుచు; కావున నదియే పరమగతి. ౨౨

ఇట్లు పరమదుఃఖితుఁడ నాపురుషకారంబు దైవంబునం గొట్టఁబడియె; నీయనుగ్రహంబుఁ గోరెదను. అట్టి నాయం దనుగ్రహంబు సేయవలయు. నీకు మంగళమగుఁగాక. ౨౩

నేను మఱియొక్కనియొద్దకుఁ బోను; నీవు దక్క నాకు రక్షకుఁడు మఱియెవ్వఁడును లేఁడు. నీవు పౌరుషంబున దైవంబుఁ ద్రిప్పి నాకనుకూలంబుగాఁ జేయవలయు నని త్రిశంకువు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౨౪

ఇది యేబదియెనిమిదవసర్గము.

## ఏబదితొమ్మిదవ సర్గము

విశ్వామిత్రుఁడును ఇట్లు మాటలాడి చండాలరూపంబుతో నెదుట నున్న త్రిశంకునిఁజూచి దయగల్గి ఇట్లని మధురంబగు నొకమాట చెప్పెను. ౧

ఇక్ష్వాకువంశంబునఁబుట్టిన త్రిశంకుమహారాజా! నీకు స్వాగతంబగుఁగాక; నీవు మిక్కిలియుం ధార్మికుండ వని యెఱుఁగుదు; నిన్ను రక్షించెదను; నీవు రాజుల కందఱకును మేటివి భయపడవలదు. ౨

అహమామంత్రయే సర్వాన్మహర్షీన్పుణ్యకర్మణః,
యజ్ఞసాహ్యకరాన్ రాజన్ తతో యక్ష్యసి నిర్వృతః. ౩
గురుశాపకృశం రూపం యదిదం త్వయి వర్తతే,
అనేన సహ రూపేణ సశరీరో గమిష్యసి. ౪
హస్తప్రాప్తమహం మన్యే స్వర్గం తవ నరాధిప,
యస్త్వం కౌశికమాగమ్య శరణ్యం శరణాగతః. ౫

ఏవముక్త్వా మహాతేజాః పుత్రాన్ పరమధార్మికాన్,
వ్యాదిదేశ మహాప్రాజ్ఞాన్ యజ్ఞసంభారకారణాత్. ౬

సర్వాన్ శిష్యాన్ సమాహూయ వాక్యమేతదువాచహ. ౬½
సర్వానృషిగణాన్వత్సా ఆనయధ్వం మమాజ్ఞయా,
సశిష్యసుహృదశ్చైవ సర్త్విజస్సుబహుశ్రుతాన్. ౭½
యదన్యో వచనం బ్రూయాన్మద్వాక్యబలచోదితః,
తత్సర్వమఖిలేనోక్తం మమాఖ్యేయమనాదృతమ్, ౮½

తస్య తద్వచనం శ్రుత్వా దిశో జగ్ముస్తదాజ్ఞయా. ౯

ఆజగ్మురథ దేశేభ్యస్సర్వేభ్యో బ్రహ్మవాదినః, ౯½
తేచ శిష్యాస్సమాగమ్య మునిం జ్వలితతేజసమ్,
ఊచుశ్చ వచనం సర్వే సర్వేషాం బ్రహ్మవాదినామ్. ౧౦½
శ్రుత్వా తే వచనం సర్వే సమాయాంతి ద్విజాతయః. ౧౧
సర్వదేశేషు చాగచ్ఛన్ వర్జయిత్వా మహోదయమ్. ౧౧½

నేను బుణ్యకర్ములును యాగమునకుఁ దోడ్పాటుసేయఁగలవారునగు మహర్షులనందఱనుబిలిచెదను; అంత నీవు సుఖంబున యాగంబుసేయఁగలవు. 3

నీయం దిప్పుడు గురుశాపంబున గల్గిన యేచండాళరూపం బున్నదో దానితోఁగూడనే సశరీరుఁడవై స్వర్గము నొందెదవు.

త్రిశంకుమహారాజా! నీవుశరణుచొరఁదగినవాఁడయిన విశ్వామిత్రుని శరణుచొచ్చినావు కావున నీకు స్వర్గము ఆఱచేతనున్నవిధంబున నయాయాసంబుగా ఘటిల్లంగలదని తలంచెదనని విశ్వామిత్రుఁడు త్రిశంకువుతోఁ జెప్పెను.

ఇట్లుచెప్పి మహాతేజుఁడగు విశ్వామిత్రుఁడు మిక్కిలియుం ధార్మికులును గొప్ప పండితులు నగు తన కొడుకులను జూచి "మీరలు యాగంబునకుఁ గావలసినవాని సంపాదింపుఁడు" అని యాజ్ఞాపించెను. ౬

విశ్వామిత్రుఁడు దనశిష్యుల నందఱనుబిలిచి వారలతో నిట్లనిచెప్పెను.

బాలులారా! నాయాజ్ఞచేఁ బోయి శిష్యులతోను స్నేహితులతోను బుత్విజులతోను బండితులతోను గూడిన బుషుల నందఱను దోడ్కొనిరండు.

మీరుగాక మఱియెవ్వఁడైనను నామాటవినినంతనే యేదైనను జెప్పెనేని యట్లనాదరణచేఁ జెప్పినమాటల నన్నియుం నాకుఁ జెప్పవలయును. అని విశ్వామిత్రుఁడు శిష్యులకుఁజెప్పెను. ౭౫

విశ్వామిత్రుఁడుచెప్పిన మాటను విని యతనియాజ్ఞను శిష్యులందఱు దిక్కులకుఁబోర్చి పోయిరి. ౮

అంత సమస్తదేశంబులనుండియుం బ్రహ్మవాదులగుమునులు వచ్చిరి. ౮౫

ఆశిష్యులు నందఱుఁ గాంతిచేఁ బ్రకాశించుచున్న విశ్వామిత్రునిఁజేరి బ్రహ్మవాదులగు మునులందఱును దమతోఁజెప్పినమాట నిట్లని చెప్పిరి. ౧౦౫

నీమాటను విని బ్రాహ్మణులందఱును వచ్చుచున్నారు. ౧౧

మహోదయుఁడు దక్క సమస్తదేశంబులందుండు మునులును వచ్చినారు. ౧౧౫

వాసిష్ఠం తచ్ఛ్రుతం సర్వం క్రోధపర్యాకులాతురమ్,
యదాహ వచనం సర్వం శృణు త్వం మునిపుంగవ. ౧౨

క్షత్రియో యాజకో యస్య చండాళస్య విశేషతః,
కథం సదసి భోక్తారో హవి స్తస్య సురర్షయః. ౧౩

బ్రాహ్మణా వా మహాత్మానో భుక్త్వా చండాళభోజనమ్,
కథం స్వర్గం గమిష్యంతి విశ్వామిత్రేణ పాలితాః. ౧౪
ఏతద్వచననైష్ఠుర్యమూచుస్సంరక్తలోచనాః,
వాసిష్ఠా మునిశార్దూల సర్వే తే సమహోదయాః. ౧౫

తేషాం తద్వచనం శ్రుత్వా సర్వేషాం మునిపుంగవః,
క్రోధసంరక్తనయనస్సరోషమిదమబ్రవీత్. ౧౬
యే దూషయంత్యదుష్టం మాం తప ఉగ్రం సమాస్థితమ్,
భస్మీభూతా దురాత్మానో భవిష్యంతి న సంశయః. ౧౭

అద్య తే కాలపాశేన నీతా వైవస్వతక్షయమ్,
సప్తజాతి శతాన్యేవ మృతపా స్సంతు సర్వశః. ౧౮

శ్వమాంసనియతాహారా ముష్టికా నామ నిర్ఘృణాః,
వికృతాశ్చ విరూపాశ్చ లోకాననుచరంత్విమాన్. ౧౯

మహోదయస్తు దుర్బుద్ధిర్మామదూష్యం హ్యదూషయత్,
దూషితస్సర్వలోకేషు నిషాదత్వం గమిష్యతి. ౨౦

మునిశ్రేష్ఠుఁడవగువిశ్వామిత్రుఁడా ! వసిష్ఠునికొడుకులు నూర్వురు కోపంబునఁ దడఁబడుచున్న మాటలుగలవారలై చెప్పినమాటల నంతయుఁ జెప్పెదము; వినుము. ౧౨॥

యాగముచేయించువాఁడు క్షత్రియుఁడైనవిశ్వామిత్రుఁడు; యజ్ఞముచేయువాఁడు చండాలుఁడు. అట్టి చండాలునియాగమునందు దేవత లెట్లు హవిస్సును భుజింపుదురు? ఋషులుగాని యార్త్విజ్య మవలంబించి హోమముసేయఁగా మిగిలినహవిస్సు నెట్లు భుజింపఁగలరు? ౧౩॥

విశ్వామిత్రునిమాట విని చండాలాన్నముఁ భక్షించు మహాత్ములగుబ్రాహ్మణులు నెట్లు స్వర్గంబు నొందఁగలరు? ౧౪॥

మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా! మహోదయుఁడును వసిష్ఠపుత్రులు నందఱును గోపంబున నెఱ్ఱనైనకండ్లుగల్గి యతిపరుషంబుగా నిప్పుడు చెప్పినట్లు చెప్పిరి అని శిష్యులు విశ్వామిత్రునితోఁ జెప్పిరి. ౧౫॥

ఆశిష్యులందఱును జెప్పినమాటలు విని మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు కోపంబున నెఱ్ఱనైనకండ్లుగలవాఁడై రోషముతోఁ నిట్లని చెప్పెను. ౧౬॥

భయంకరంబగు తపస్సుచేయుచుండుటను బట్టి యదుష్టుఁడనగు నన్ను నెవ్వరు దూషించెదరో దురాత్ములగు నా వసిష్ఠపుత్రులును మహోదయుండును భస్మీభూతులు గాఁగలరు; ఇందు సందియంబులేదు. ౧౭॥

ఆవసిష్ఠునికొడుకులు ఇప్పుడు కాలపాశంబున యమునియొద్దకును యింపఁబడి పిమ్మట నేడునూఱుజన్మములవఱకును పీనుఁగుమాంసంబులను దినుచుందురుగాక. ౧౮॥

ఆవసిష్ఠపుత్రులు ముష్టికు లనుహీనజాతియందు బుట్టి కుక్కమాంసమును నియతముగాఁ దినుచు నిర్దయులై వికృతమగుచున యాచారంబును ఆకారంబును గల్గి యీలోకంబులను బరింతురుగాక. ౧౯॥

దుర్బుద్ధియగు మహోదయుఁడు దూషింపఁగూడని నన్ను దూషించెను గదా! అతఁడు సమస్తలోకంబులందును దూషితుఁడై నిషాదజాతియందుఁ బుట్టును. ౨౦॥

ప్రాణాతిపాతనిరతో నిరనుక్రోశతాం గతః,
దీర్ఘకాలం మమ క్రోధాద్దుర్గతిం వర్తయిష్యతి. ౨౧౪

ఏతావదుక్త్వా వచనం విశ్వామిత్రో మహాతపాః,
విరరామ మహాతేజా ఋషిమధ్యే మహామునిః. ౨౨౪

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకోనషష్టితమస్సర్గః

---

## ష ష్టి త మ స్స ర్గః.

తపోబలహతాన్ కృత్వా వాసిష్ఠాన్ సమహోదయాన్,
ఋషిమధ్యే మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత. ౧

అయ మిక్ష్వాకుదాయాద స్త్రిశంకురితి విశ్రుతః,
ధర్మిష్ఠశ్చ వదాన్యశ్చ మాం చైవ శరణం గతః. ౨
తేనానేన శరీరేణ దేవలోకజిగీషయా. ౨౪

యథాయం స్వశరీరేణ స్వర్గలోకం గమిష్యతి,
తథా ప్రవర్త్యతాం యజ్ఞో భవద్భిశ్చ మయా సహ. 3౪
విశ్వామిత్రవచశ్శ్రుత్వా సర్వఏవ మహర్షయః,
ఊచుస్సమేత్య సహితా ధర్మజ్ఞా ధర్మసంహితమ్. ౪౪
అయం కుశికదాయాదో మునిః పరమకోపనః,
యదాహ వచనం సమ్యగేతత్కార్యం న సంశయః. ౫౪
అగ్నికల్పో హి భగవాన్ శాపం దాస్యతి రోషితః. ౬

తస్మాత్ప్రవర్త్యతాం యజ్ఞస్సశరీరో యథా దివమ్,
గచ్ఛేదిక్ష్వాకుదాయాదో విశ్వామిత్రస్య తేజసా. ౭

ఆమహోదయుఁడు ప్రాణనాశముచే యూనసక్తుఁడై నిర్దయుఁడై వాడు కోపంబునం జేసి చిరకాలంబు నిందనీయంబగు జీవిక నవలంబించి యుండఁగలఁ డని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౨౧॥

అధికమైనతపంబును ప్రభావంబుగల విశ్వామిత్రమహాముని ఋషుల నడుమ, నింతమట్టుకుఁ జెప్పి యంత నూరకుండెను. ౨౨॥

ఇది యేబదితొమ్మిదవసర్గము.

---

## అఱువదవ సర్గము

మహాప్రభావుఁ డగువిశ్వామిత్రుఁడు తనతపోబలంబున మహోదయుని తోఁగూడ వసిష్ఠపుత్రుల నందఱ హతులగావించి మరల ఋషులనడుమ నిట్లని చెప్పెను. ౧

వీఁడు ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవాఁడు; త్రిశంకువని పేరు; ఇతఁడు మిగుల ధార్మికుఁడు దాతయు. ఇతఁడు పూర్వము క్షత్రియరూపముగానుండి యిప్పుడు శాపంబునఁ జండాలత్వమునొందినశరీరముతోనే స్వర్గమునొందఁగోరి నన్ను శరణుచొచ్చినాఁడు. ౨॥

ఈత్రిశంకు వెట్లు తనదేహంబుతో స్వర్గమునొందునో అట్లు మీరు నన్నుఁగూడి యాగముజరిగింపుఁడని విశ్వామిత్రుఁడు చెప్పెను. ౩॥

విశ్వామిత్రునిమాట విని ధర్మజ్ఞులగు నామహర్షులందఱు ఒకటిగాఁజేరి పరస్పర మిట్లని ధర్మయుక్తంబుగా మాటలాడుకొనిరి. ౪॥

కుశికవంశంబునంబుట్టిన యీవిశ్వామిత్రుఁడు మిగులఁగోపంబుగల వాఁడు; ఇతఁడు చెప్పినది చక్కఁగాఁజేయఁదగినదే; సంశయములేదు. ౫॥

భగవంతుఁ డగు విశ్వామిత్రుఁడు నిప్పువంటివాఁడు; ఇతనికిఁ గోపంబు గలుగఁజేసితిమేని మనల శపించును. ౬॥

కావున యాగము జరిగింపుఁడు, ఈత్రిశంకువు విశ్వామిత్రుని తేజంబున నెట్లు సశరీరంబుగా స్వర్గమునొందునో అట్లు యాగముఁ జేయింపుఁడు; అందఱు

తథా ప్రవర్త్యతాం యజ్ఞస్సర్వే సమధితిష్ఠత. ౭½
ఏవముక్త్వా మహర్షయశ్చక్రుస్తాస్తాః క్రియాస్తదా,
యాజకశ్చ మహాతేజా విశ్వామిత్రోఽభవత్క్రతౌ. ౮½

ఋత్విజశ్చానుపూర్వ్యేణ మంత్రవన్మంత్రకోవిదాః,
చక్రుః కర్మాణి సర్వాణి యథాకల్పం యథావిధి. ౯½
తతః కాలేన మహతా విశ్వామిత్రో మహాతపాః,
చకారావాహనం తత్ర భాగార్థం సర్వదేవతాః. ౧౦½
నాభ్యాగమంస్తదాహూతా భాగార్థం సర్వదేవతాః. ౧౧

తతః క్రోధసమావిష్టో విశ్వామిత్రో మహామునిః,
స్రువముద్యమ్య సక్రోధ స్త్రిశంకుమిదమబ్రవీత్. ౧౨
పశ్య మే తపసో వీర్యం స్వార్జితస్య నరేశ్వర,
ఏష త్వాం సశరీరేణ నయామి స్వర్గమోజసా. ౧౩

దుష్ప్రాపం సశరీరేణ దివం గచ్ఛ నరాధిప. ౧౩½

స్వార్జితం కించిదప్యస్తి మయా హి తపసః ఫలమ్,
రాజన్ స్వతేజసా తస్య సశరీరో దివం వ్రజ. ౧౪½

ఉక్తవాక్యే మునౌ తస్మిన్ సశరీరో నరేశ్వరః,
దివం జగామ కాకుత్స్థ మునీనాం పశ్యతాం తదా. ౧౫½

దేవలోకగతం దృష్ట్వా త్రిశంకుం పాకశాసనః,
సహ సర్వైస్సురగణైరిదం వచనమబ్రవీత్. ౧౬½

బారంభింపుఁడని ఋషులు పరస్పరము మాటలాడుకొనిరి. ౭½

మహర్షు లిట్లు పరస్పరము మాటలాడి నిర్ణయించుకొని అప్పుడు, యాగమునం దయ్యెకార్యంబులం జేసిరి; మహాతేజుఁ డగువిశ్వామిత్రుఁడును అధ్వర్యుఁడయ్యె. ౮½

మంత్రజ్ఞులగు ఋత్విజులును వరుసగా సమస్తకర్మంబుల మంత్రయుక్తంబుగఁ గల్పసూత్రంబునఁ జెప్పఁబడినట్లు యథాశాస్త్రంబుగఁ జేసిరి. ౯½

అంతనాయాగంబునందుమహాతపస్వియగు విశ్వామిత్రుఁడు హావిర్భాగములనిచ్చుటకై సమస్తదేవతలఁ జిరకాలము మంత్రంబులచేఁ బిలచెను. ౧౦½

ఆవిశ్వామిత్రుఁడు హావిర్భాగ మొసఁగుట కెంతపిలిచినను దేవతలెవ్వరును రారైరి. ౧౧

అంత విశ్వామిత్రమహాముని కోపంబునొంది స్రువంబెత్తి రోషంబున త్రిశంకునిజూచి యిట్లని చెప్పెను. ౧౨

త్రిశంకుమహారాజా! నాదుస్వార్జితంబగుతపంబు ప్రభావముఁజూడు, ఇదిగో! తపఃప్రభావంబున నిన్నిప్పుడు సశరీరంబుగా స్వర్గమునకుఁ బోవునట్లు చేసెదను. ౧౩

త్రిశంకుమహారాజా! ఇతరు లెవరికిని బొందఁగూడని స్వర్గమును నీవు సశరీరంబుగాఁ బొందుము. ౧౩½

త్రిశంకుమహారాజా! నేను సంపాదించిన తపఃఫలంబు కొంచెంబైన నున్నదిగదా! దానిప్రభావంబునఁజేసి నీవు దేహంబుతోఁగూడ స్వర్గంబున కరుగుము. అని విశ్వామిత్రుఁడు సెప్పెను. ౧౪½

రాముఁడా! ఇట్లు విశ్వామిత్రమహాముని చెప్పగానే యప్పుడు మునులందఱుఁ జూచుచుండఁ ద్రిశంకువు దేహంబుతోఁగూడి స్వర్గంబు నొందెను. ౧౫½

దేవేంద్రుఁడు ఇట్లు సశరీరంబుగా స్వర్గంబునొందిన త్రిశంకువునుజూచి దేవతలనందఱుగూడి యిట్లని చెప్పెను. ౧౬½

త్రిశంకో గచ్ఛ భూయ స్త్వం నాసి స్వర్గకృతాలయః,
గురుశాపహతో మూఢ పత భూమిమవాక్శిరాః. ౧౭

ఏవముక్తో మహేంద్రేణ త్రిశంకురపతత్పునః,
విక్రోశమాన స్త్రాహీతి విశ్వామిత్రం తపోధనమ్. ౧౮
తచ్ఛ్రుత్వా వచనం తస్య క్రోశమానస్య కౌశికః,
రోషమాహారయ త్తీవ్రం తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్. ౧౯
ఋషిమధ్యే స తేజస్వీ ప్రజాపతిరివాపరః,
సృజన్ దక్షిణమార్గస్థాన్ సప్తర్షీనపరాన్ పునః. ౨౦
నక్షత్రమాలామపరామసృజత్క్రోధమూర్ఛితః,
దక్షిణాం దిశమాస్థాయ మునిమధ్యే మహాయశాః. ౨౧
సృష్ట్వా నక్షత్రవంశం చ క్రోధేన కలుషీకృతః,
అన్య మింద్రం కరిష్యామి లోకో వా స్యాదనింద్రకః. ౨౨
దైవతా న్యపి సక్రోధా త్స్రష్టుం సముపచక్రమే. ౨౩
తతః పరమసంభ్రాంతాస్సర్షి సంఘాస్సురాసురాః,
విశ్వామిత్రం మహాత్మానమూచుస్సానునయం వచః. ౨౪
అయం రాజా మహాభాగ గురుశాపపరిక్షతః,
సశరీరో దివం యాతుం నార్హ త్యేవ తపోధన. ౨౫

తేషాం తద్వచనం శ్రుత్వా దేవానాం మునిపుంగవః,
అబ్రవీత్సుమహద్వాక్యం కౌశికస్సర్వదేవతాః. ౨౬
సశరీరస్య భద్రం వస్త్రిశంకోరస్య భూపతేః,
ఆరోహణం ప్రతిజ్ఞాయ నానృతం కర్తుముత్సహే. ౨౭

త్రిశంకూ ! నీవు మఱలఁ బొమ్ము; నీవు స్వర్గంబునం దుండఁదగవు; తెలివిలేనివాఁడా ! నీవు గురుశాపంబునఁ గొట్టువడితివి; తలక్రిందుగా నేలఁ బడుము. అని యింద్రుఁడు త్రిశంకుతోఁ జెప్పెను. ౧౬½

ఇట్లు దేవేంద్రుఁడు చెప్పఁగానే త్రిశంకువు తపోధనుఁడగు విశ్వామిత్రుని గూర్చి "రక్షింపుము." అని యఱచుచు మఱలఁ బడెను. ౧౭

ఇట్లఱచుచున్న యాత్రిశంకుమాటవిని విశ్వామిత్రుఁడు తీవ్రంబగు కోపంబునొంది పడుచున్న త్రిశంకును జూచి 'నిలు నిలు'మని చెప్పెను. ౧౮½

మహాప్రభావుఁ డగునావిశ్వామిత్రుఁడు ఋషులనడుమనుండి దక్షిణపు దిక్కునందు వేఱుగా సప్తర్షులసృజించి రెండవబ్రహ్మదేవుఁడనఁదగి యుండెను.

అధికంబగుకీర్తిగల విశ్వామిత్రుఁడు చాలగోపించి మునులనడుమనుండి దక్షిణపుదిక్కునందు క్రొత్తగా నక్షత్రంబుల సృజించెను. ౨౧½

ఇట్లు నక్షత్రములసృజించి విశ్వామిత్రుఁడు కోపంబున "మఱియొక యింద్రునైనజేసెదను లేనియెడ ప్రపంచమునందింద్రుఁడే లేకపోవుఁగాక. ౨౨½

ఆవిశ్వామిత్రుఁడు గోపంబున దేవతలనుగూడ సృజింప యత్నించెను. ౨౩

అంత ఋషులును దేవతలును నసురులును మిక్కిలియుం, వేఱఁగుపడి మహాత్ముండగు విశ్వామిత్రునియొద్దకువచ్చి యతనినూఱడించుచు నిట్లని చెప్పిరి.

మహాభాగుఁడవు తపోధనుఁడవగు విశ్వామిత్రుఁడా! ఈత్రిశంకుమహారాజు గురుశాపంబున గొట్టువడినవాఁడు కావున దేహంబుతోఁగూడ స్వర్గంబు నొందుటకుఁ దగఁ డనుట సత్యము. అని దేవతలు విశ్వామిత్రునితోఁ జెప్పిరి.

ఆదేవతలు చెప్పినమాటలు విని మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుఁడు దేవతల నెల్లరనుజూచి మిక్కిలియుఁ బూజ్యంబగుమాట చెప్పెను. ౨౭

మీకు మంగళమగుఁగాక 'ఈత్రిశంకుమహారాజు దేహముతోఁగూడ స్వర్గమునకుఁ బోవుఁగాక:'యని ప్రతిజ్ఞఁజేసి దానిదప్పుఁజేయనొల్లను. ౨౮

స్వర్గోఽస్తు సశరీరస్య త్రిశంకోరస్య శాశ్వతః. ౨౭½
నక్షత్రాణి చ సర్వాణి మామకాని ధ్రువాణ్యథ. ౨౮
యావల్లోకా ధరిష్యంతి తిష్ఠంత్యేతాని సర్వశః,
మత్కృతాని సురాస్సర్వే తదనుజ్ఞాతు మర్హథ. ౨౯
ఏవముక్తాస్సురాస్సర్వే ప్రత్యూచుర్మునిపుంగవమ్. ౨౯½

ఏవం భవతు భద్రం తే తిష్ఠంత్వేతాని సర్వశః. ౩౦
గగనే తాన్యనేకాని వైశ్వానరపథాద్బహిః.
నక్షత్రాణి మునిశ్రేష్ఠ తేషు జ్యోతిష్షు జాజ్వలన్. ౩౧
అవాక్ఛిరాస్త్రిశంకుశ్చ తిష్ఠత్వమరసన్నిభః. ౩౧½

అనుయాస్యంతి చైతాని జ్యోతీంషి నృపసత్తమమ్,
కృతార్థం కీర్తిమంతం చ స్వర్గలోకగతం యథా. ౩౨½

విశ్వామిత్రస్తు ధర్మాత్మా సర్వదేవైరభిష్టుతః,
ఋషిభిశ్చ మహాతేజా బాఢమిత్యాహ దేవతాః, ౩౩½
తతో దేవా మహాత్మానో మునయశ్చ తపోధనాః,
జగ్ముర్యథాగతం సర్వే యజ్ఞస్యాంతే నరోత్తమ. ౩౪½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షష్టితమస్సర్గః.

## ఏకషష్టితమస్సర్గః.

విశ్వామిత్రో మహాత్మాథ ప్రస్థితాన్ ప్రేక్ష్య తానృషీన్,
అబ్రవీన్నరశార్దూలస్సర్వాంస్తాన్వనవాసినః. ౧

ఈ త్రిశంకువు సశరీరముగానే శాశ్వతంబగు స్వర్గంబునొందుఁగాక.

నేను సృజించిన యీనక్షత్రంబు లన్నియు లోకంబులుండుదనుక స్థిరంబు లయియుండుఁగాక; దేవతలారా! మీరలందఱును, దాని నొప్పుకొన వలయును. అని విశ్వామిత్రుఁడు దేవతలతోఁ జెప్పెను. ౨౬,౨౭

విశ్వామిత్రుఁడు చెప్పినమాటను విని, దేవతలందఱును అతని కిట్లని బదులుచెప్పిరి. ౨౯½

మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా! నీకు మంగళంబగుఁగాక; నీవు చెప్పినట్లు అగుఁగాక; నీవుసృజించిన నక్షత్రంబులన్నియు నాకాశమం దనాది జ్యోతిశ్చక్రమార్గంబునకు వెలుపల నన్నివిధంబుల శాశ్వతంబులుగానే యుండుఁగాక; ఈ త్రిశంకువును వానినడుమను దలక్రిందుగాఁ బ్రకాశించుచు దేవతాసమానుఁడై యుండుఁగాక. ౩౦,౩౧½

ఈనక్షత్రంబులును కృతార్థుఁడును కీర్తిశాలియునగు త్రిశంకుమహారాజునను స్వర్గమునొందినవాని నెట్లో అట్లనుసరింపుచుండును. అని దేవతలు విశ్వామిత్రునకుఁ జెప్పిరి. ౩౨½

మహాప్రభావుఁడును ధర్మాత్ముఁడు నగు విశ్వామిత్రుఁ డట్లు దేవతలచేతను ఋషులచేతను బొగడఁబడి దేవతలఁజూచి, "మంచిది" అని చెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగు రామఁడా! అంత యాగంబు ముగిసినపిదప మహాత్ములగు దేవతలును తపోధనులగు మునులు నందఱును వచ్చినట్లుపోయిరి.

ఇది యఱువదవ సర్గము.



## అఱువదియొకటవ సర్గము

అంత మహాత్ముఁడును బురుషశ్రేష్ఠుఁడు నగు విశ్వామిత్రుఁడు యాగమునకై వచ్చినఋషులందఱును బోవుటనుజూచి తన తపోవనంబుననుండు మునులంజూచి యిట్లని చెప్పెను. ౧

మహావిఘ్నః ప్రవృత్తోఽయం దక్షిణామాస్థితో దిశమ్,
దిశమన్యాం ప్రపత్స్యామ స్తత్ర తప్స్యామహే తపః. ౨
పశ్చిమాయాం విశాలాయాం పుష్కరేషు మహాత్మనః,
సుఖం తపశ్చరిష్యామః పరం తద్ధి తపోవనమ్. ౩

ఏవముక్త్వా మహాతేజాః పుష్కరేషు మహామునిః,
తప ఉగ్రం దురాధర్షం తేపే మూలఫలాశనః. ౪

ఏతస్మిన్నేవ కాలే తు అయోధ్యాధిపతిర్నృపః,
అంబరీష ఇతి ఖ్యాతో యష్టుం సముపచక్రమే. ౫
తస్య వై యజమానస్య పశుమింద్రో జహార హ,
ప్రణష్టే తు పశౌ విప్రో రాజానమిదమబ్రవీత్. ౬

పశురద్య హృతో రాజన్ ప్రణష్టస్తవ దుర్నయాత్,
అరక్షితారం రాజానం ఘ్నంతి దోషా నరేశ్వర. ౭

ప్రాయశ్చిత్తం మహద్ధ్యేతన్నరం వా పురుషర్షభ,
ఆనయస్వ పశుం శీఘ్రం యావత్కర్మ ప్రవర్తతే. ౮

ఉపాధ్యాయవచశ్శ్రుత్వా సరాజా పురుషర్షభ,
అన్వియేష మహాబుద్ధిః పశుం గోభిస్సహస్రశః. ౯
దేశాన్ జనపదాంస్తాంస్తాన్నగరాణి వనాని చ,
ఆశ్రమాణి చ పుణ్యాని మార్గమాణో మహీపతిః. ౧౦
సపుత్రసహితం తాత సభార్యం రఘునందన,

ఈదక్షిణపుదిక్కునందు గొప్పవిఘ్నము సంభవించినది; కావున మఱి యొకదిక్కునకుఁ బోవుదము; అచ్చటనే తపంబు సేయుందము. ౨

విశాలమయిన పశ్చిమపుదిక్కునఁ బుష్కరతీర్థంబుల తీరంబులందు సుఖముగాఁ దపంబు గావింతము; అది మంచితపోవనంబుగదా! అని విశ్వామిత్రుఁడు ఋషులతోఁ జెప్పెను. 3

ఇట్లా ఋషులకుఁజెప్పి మహాప్రభావుఁడగు విశ్వామిత్రమహాముని పశ్చిమదిక్కునకుఁబోయి యందలిపుష్కరతీర్థంబుల తీరంబులందు ఫలమూలంబులే యాహారంబుగాఁగొని భయంకరంబును దురాధర్షంబునగు తపంబు గావించెను.

ఈకాలమునందే అయోధ్యకుఁ బ్రభువగు నగు యంబరీషుఁడను రాజొకఁడు యాగముసేయ నారంభించెను. ౫

యాగముసేయుచున్న యాయంబరీషునిపశువును దేవేంద్రుఁ డపహరించెను. ఇట్లు పశువు కనుపడకుండుటనుజూచి పురోహితుఁడు రాజుతో నిట్లని చెప్పెను. ౬

అంబరీషుఁడా! నీ వేమఱియుండుటఁజేసి యాగపశువు నెవ్వరో యపహరించిరి; అది యిప్పుడు కానఁబడదయ్యె; ఇట్లు ఏమఱియున్న రాజును దోషంబులు చంపును. ౭

మనుష్యశ్రేష్ఠుఁడ వగు నంబరీషుఁడా! ఇప్పుడు గల్గిన యపచారము నకుఁ జేయవలసిన ప్రాయశ్చిత్తంబు చాలగొప్పది; కనుపడకపోయినపశువును వెదకికొని తెచ్చుట యుత్తమము. లేనియెడల మనుష్యపశువునైనను యాగకార్యారంభముసేయుటకు మున్నె శీఘ్రంబుగాఁ దేవలయునని పురోహితుఁడు చెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! పురోహితునిమాట విని మహాబుద్ధిశాలియగు నాయంబరీషుఁడు, వేనవేలుగా గోవులనుగొని నరపశువును వెదకెను.

రాముఁడా! ఆయంబరీషుఁడు, అయ్యైదేశంబుల గ్రామంబులఁ బట్టణంబుల నడవులఁ బవిత్రంబులగు నాశ్రమంబుల వెదకుచు నెందును నరపశువును బడయఁజాలక భృగుతుందంబను పర్వతంబునకరిగి యచ్చోఁ గొడుకులతో భార్యతోను

భృగుతుందే సహాసీనమృచీకం సందదర్శ హ. ౧౧
తమువాచ మహాతేజాః ప్రణమ్యాభిప్రసాద్యచ,
బ్రహ్మర్షిం తపసా దీప్తం రాజర్షిరమితప్రభః. ౧౨
పృష్ట్వా సర్వత్రకుశలమృచీకం తమిదం వచః. ౧౨½

గవాం శతసహస్రేణ విక్రీణీషే సుతం యది,
పశోరర్థే మహాభాగ కృతకృత్యోఽస్మి భార్గవ. ౧౩½

సర్వే పరిసృతా దేశా యాజ్ఞియం న లభే పశుమ్,
దాతుమర్హసి మూల్యేన సుతమేకమితో మమ. ౧౪½

ఏవముక్తో మహాతేజా ఋచీకస్త్వబ్రవీద్వచః,
నాహం జ్యేష్ఠం నరశ్రేష్ఠ విక్రీణీయాం కథంచన. ౧౫½

ఋచీకస్య వచశ్శ్రుత్వా తేషాం మాతా మహాత్మనామ్,
ఉవాచ నరశార్దూలమంబరీషం తపస్వినీ. ౧౬½
అవిక్రేయం సుతం జ్యేష్ఠం భగవానాహ భార్గవః. ౧౭
మమాపి దయితం విద్ధి కనిష్ఠం శునకం నృప,
తస్మాత్కనీయసం పుత్రం న దాస్యే తవ పార్థివ. ౧౮
ప్రాయేణ హి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః,
మాతౄణాం తు కనీయాంసస్తస్మాద్రక్షే కనీయసమ్. ౧౯

ఉక్తవాక్యే మునౌ తస్మిన్ మునిపత్న్యాం తథైవచ,
శునశ్శేఫస్స్వయం రామ మధ్యమో వాక్యమబ్రవీత్. ౨౦

గూడఁ గూర్చుండియున్న ఋచీకమహర్షిని జూచెను. ౧౦,౧౧

అతిపరాక్రమశాలియు రాజర్షియుఁ గొలఁదిలేని కాంతిగలవాఁడునగు నంబరీషుఁడు బ్రహ్మర్షియుఁ దపస్సుచేఁ బ్రకాశించువాఁడు నగు ఋచీకుని నమస్కరించి సంతోషపఱచి యన్నిటను గుశలంబడిగి యతనితో నిట్లని చెప్పెను. ౧౨, ౧౨½

మహాభాగుఁడ వగు ఋచీకుఁడా! నూఱువేలయావులఁ బుచ్చుకొని యొక్కకొడుకును నాకు యాగపశు వగుటకై విక్రయింతువేని నేను గృతార్థుఁడ నగుదును. ౧౩½

నే నన్నిదేశంబులను దిరిగితిని; ఎందును నాయాగమునకుఁ గావలసిన పశువుఁ బడయలేనైతి; నీ వీకొడుకులలో నొక్కని వెలదీసికొని నాకీవలయు నని యంబరీషుఁడు ఋచీకునితోఁ జెప్పెను. ౧౪½

మహాతేజుఁడగు ఋచీకుఁడును అంబరీషునిమాట విని యిట్లని చెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడ వగు నంబరీషుఁడా! నే నేమైనను బెద్దకొడుకు నమ్ముట లేదని ఋచీకుఁ డంబరీషునితోఁ జెప్పెను. ౧౫½

ఋచీకునిమాట విని మహాత్ము లగు నాకొడుకులతల్లి చాలఁ దపస్సు గలది పురుషశ్రేష్ఠుఁ డగు నంబరీషునిజూచి యిట్లని చెప్పెను. ౧౬½

అంబరీషుఁడా! భగవంతుఁడును భార్గవుఁడునగు ఋచీకుఁడు పెద్ద కుమారుని విక్రయింపనని చెప్పెను; నాకుఁ గనిష్ఠుఁడగు శునకుఁ డనువాఁడు చాలఁ బ్రియుఁ డని యెఱుఁగుము. కావున నీకుఁ గనిష్ఠు నివ్వనొల్లను. ౧౭,౧౮

అంబరీషుఁడా! ప్రాయముగా లోకంబున తండ్రులకుఁ బెద్దకొడుకులును దల్లులకుఁ గడపటికొడుకులునుఁ బ్రియులుగదా! కావున నేనుఁ గడపటివాని రక్షించెదనని తల్లి యంబరీషునితోఁ జెప్పెను. ౧౯

రాముఁడా! ఋచీకుఁడును అతనిభార్యయుఁ జెప్పినమాట విని నడిమి కొడుకైన శునశ్శేఫుఁ డనువాఁడు తానే యంబరీషుని జూచి యిట్లని చెప్పెను. ౨౦

పితా జ్యేష్ఠమవిక్రేయం మాతా చాహ కనీయసమ్,
విక్రీతం మధ్యమం మన్యే రాజన్ పుత్రం నయస్వ మామ్. ౨౧

గవాం శతసహస్రేణ శునశ్శేఫం నరేశ్వరః,
గృహీత్వా పరమప్రీతో జగామ రఘునందన. ౨౨
అంబరీషస్తు రాజర్షి రథ మారోప్య సత్వరః,
శునశ్శేఫం మహాతేజా జగామాశు మహాయశాః. ౨౩

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకషష్టితమస్సర్గః.

---

## ద్విషష్టితమస్సర్గః

శునశ్శేఫం నరశ్రేష్ఠ గృహీత్వా తు మహాయశాః,
వ్యశ్రామ్యత్పుష్కరే రాజా మధ్యాహ్నే రఘునందన. ౧

తస్య విశ్రమమాణస్య శునశ్శేఫో మహాయశాః,
పుష్కరక్షేత్రమాగమ్య విశ్వామిత్రం దదర్శ హ. ౨
తప్యంతమృషిభిస్సార్ధం మాతులం పరమాతురః. ౨½
వివర్ణవదనో దీనస్తృష్ణయా చ శ్రమేణ చ.
పపాతాంకే మునేరాశు వాక్యం చేదమువాచ హ. ౩½
న మేఽస్తి మాతా న పితా జ్ఞాతయో బాంధవాః కుతః,
త్రాతుమర్హసి మాం సౌమ్య ధర్మేణ మునిపుంగవ. ౪½
త్రాతా త్వం హి మునిశ్రేష్ఠ సర్వేషాం త్వం హి భావనః. ౫

అంబరీషుఁడా! తండ్రి జ్యేష్ఠుని విక్రయింప నని చెప్పుచున్నాఁడు; తల్లియుఁ గనిష్ఠుని విక్రయింప నని చెప్పుచున్నది. కావున నడిమివాని విక్రయించినట్లు తలఁచెదను; నడిమివాఁడనగు నన్నుఁ గొనిపొమ్మని శునశ్శేఫుఁడు చెప్పెను. ౨౧

అంబరీషమహారాజు లక్షగోవు లొసఁగి శునశ్శేఫునిఁ బుచ్చుకొని పరమ సంతోషంబున బోయెను. ౨౨

మహాపరాక్రమశాలియును మహాకీర్తిగలవాఁడును రాజర్షియు నగు నంబరీషుఁడు వేగముగా శునశ్శేఫుని రథం బెక్కించుకొని శీఘ్రంబుగాఁ బోయెను. ౨౩

ఇది యఱువదియొకటవసర్గము.

---

## అఱువది రెండవ సర్గము

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! మహాయశుం డగునంబరీషుండు ఇట్లు శునశ్శేఫునిం దోడ్కొని పోవుచు మధ్యాహ్నము కాఁగానే పుష్కర తీర్థమందు కొంత విశ్రమించెను. ౧

అంబరీషుండు విశ్రమించుచుండఁగా మహాయశుండును బరమదుఃఖితుండు నగు శునశ్శేఫుండు పుష్కరక్షేత్రంబునొంది ఋషులతోఁ గూడఁ దపస్సు సేయుచున్న తన మేనమామయగు విశ్వామిత్రునిం జూచెను. ౨

ఆశునశ్శేఫుండు దప్పిచేతను అలసటచేతను రంగుదప్పిన ముఖముగల్గి శీఘ్రంబుగా విశ్వామిత్రుని యుత్సంగము పైఁబడి యిట్లని చెప్పెను. ౩½

నాకుఁ దల్లిగాని తండ్రిగాని బంధువులుగాని జ్ఞాతులుగాని యెవ్వరును లేరు; నీవు సౌమ్యుండవు మునిశ్రేష్ఠుఁడవు. ధర్మంబున నన్ను రక్షింపుము. ౪½

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీవె యందఱకును రక్షకుండవు; మేలుకలుగఁ జేయువాఁడవు. ౫

రాజా చ కృతకార్యస్స్యాదహం దీర్ఘాయురవ్యయః,
స్వర్గలోకముపాశ్నీయాం తపస్తప్త్వా హ్యనుత్తమమ్. ౮

త్వం మే నాథో హ్యనాథస్య భవ భవ్యేన చేతసా,
పితేవ పుత్త్రం ధర్మాత్మం స్త్రాతుమర్హసి కిల్బిషాత్. ౭

తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహాతపాః,
సాన్త్వయిత్వా బహువిధం పుత్త్రానిదముువాచ హ. ౮
యత్కృతే పితరః పుత్త్రాన్ జనయంతి శుభార్థినః,
పరలోకహితార్థాయ తస్య కాలోఽయమాగతః. ౯

అయం బాలో మునిసుతో మత్తశ్శరణమిచ్ఛతి,
అస్య జీవితమాత్త్రేణ ప్రియం కురుత పుత్త్రకాః. ౧౦
సర్వే సుకృతకర్మాణస్సర్వే ధర్మపరాయణాః,
పశుభూతా నరేంద్రస్య తృప్తిమగ్నేః ప్రయచ్ఛత. ౧౧
నాథవాంశ్చ శునశ్శేఫో యజ్ఞశ్చావిఘ్నితో భవేత్,
దేవతాస్తర్పితాశ్చ స్యుర్మమ చాపి కృతం వచః. ౧౨

మునేస్తు వచనం శ్రుత్వా మధుష్యందాదయస్సుతాః,
సాభిమానం నరశ్రేష్ఠ సలీలమిదమబ్రువన్. ౧౩

కథమాత్మసుతాన్ హిత్వా త్రాయసేఽన్యసుతం విభో,
అకార్యమివ పశ్యామశ్శ్వమాంస ఇవ భోజనే. ౧౪

అంబరీషునికార్యమును నెఱవేఱవలయును; నేనును దీర్ఘాయుష్కుఁడనై యేమాత్రమును నాశమునొందక శ్రేష్ఠంబగు తపంబుసల్పి స్వర్గముఁ బొందవలయును. ౬

ధర్మబుద్ధిగల విశ్వామిత్రుఁడా! నీవు మంగళకరంబగు హృదయంబుతో ననాథుఁడనగు నాకు నాథుఁడవు కమ్ము; తండ్రి కొడుకునట్లు ఈయాపదను దొలఁగించి నన్ను రక్షింపుమని శునశ్శేఫుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౭

ఆశునశ్శేఫుఁడు చెప్పినమాటను విని మహాతపశ్శాలియగు విశ్వామిత్రుఁడు పలుతెఱంగుల ననునయించి తనకొడుకులనుజూచి యిట్లని చెప్పెను.

మంగళముఁగోరునట్టి తండ్రులు ఏప్రయోజన మపేక్షించి కొడుకులను బుట్టింతురో మీకును మాకును బరలోకంబునందు మేలుగల్గుటకై యాప్రయోజనంబున కిప్పుడు సమయంబు గల్గినది. ౯

కొడుకులారా! మునిపుత్రుఁడగు నీ చిన్నవాఁడు నన్ను శరణుజొచ్చి యున్నాఁడు వీనిఁ బ్రాణంబుమాత్రం బొసఁగి సంతోషంబుగావింపుఁడు. ౧౦

మీరలందఱుఁ బుణ్యకర్ములరు అందఱు ధర్మమునందు యాసక్తులరు అంబరీషునియాగమునకుఁ బశువై యగ్నికిని దృప్తిసేయుఁడు. ౧౧

ఇట్లుచేసినచో శునశ్శేఫుఁడును రక్షింపఁబడినవాఁడగును. అంబరీషుని యాగమును బూర్ణమగును. దేవతలును దృప్తినొందినవా రగుదురు. పితృవాక్యము జేసినట్లగుచున్నది. అని విశ్వామిత్రుఁడు దనకొడుకులతోఁ జెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! విశ్వామిత్రుఁడు చెప్పినమాటలువిని మధుచ్ఛందుఁడు మొదలగు నతనికొడుకులు అహంకారంబునఁ జేసి పరిహాసంబుగా నిట్లని చెప్పిరి. ౧౩

నీవు మాకొడయుఁడవు అయినను నీకొడుకులను రక్షించుటను విడిచిపెట్టుకొని మఱియొక్కనికొడుకు నెట్టురక్షించెదవు? మంచియన్నమును విడిచి కుక్కమాంసమును దినుటవలె నకార్యమని యెంచెదమని కొడుకులు విశ్వామిత్రునితోఁ జెప్పిరి. ౧౪

తేషాం తద్వచనం శ్రుత్వా పుత్రాణాం మునిపుంగవః,
క్రోధసంరక్తనయనో వ్యాహర్తుముపచక్రమే. ౧౫
నిస్సాధ్వసమిదం ప్రోక్తం ధర్మాదపి విగర్హితమ్,
అతిక్రమ్య తు మద్వాక్యం దారుణం రోమహర్షణమ్. ౧౬

శ్వమాంసభోజినస్సర్వే వాసిష్ఠా ఇవ జాతిషు,
పూర్ణం వర్షసహస్రం తు పృథివ్యామనువత్స్యథ. ౧౭

కృత్వా శాపసమాయుక్తాన్ పుత్రాన్ మునివరస్తథా,
శునశ్శేఫమువాచార్తం కృత్వా రక్షాం నిరామయమ్. ౧౮

పవిత్రపాశైరాసక్తో రక్తమాల్యానులేపనః,
వైష్ణవం యూపమాసాద్య వాగ్భిరగ్నిముదాహర. ౧౯

ఇమే తు గాథే ద్వే దివ్యే గాయేథా మునిపుత్రక,
అంబరీషస్య యజ్ఞేఽస్మింస్తతస్సిద్ధిమవాప్స్యసి. ౨౦

శునశ్శేఫో గృహీత్వా తే ద్వే గాథే సుసమాహితః,
త్వరయా రాజసింహం తమంబరీషమువాచ హ. ౨౧
రాజసింహ మహాసత్త్వ శీఘ్రం గచ్ఛావహే సదః,
నిర్వర్తయస్వ రాజేంద్ర దీక్షాం చ సముపావిశ. ౨౨

తద్వాక్యమృషిపుత్రస్య శ్రుత్వా హర్షసముత్సుకః,
జగామ నృపతిశ్శీఘ్రం యజ్ఞవాటమతంద్రితః. ౨౩
సదస్యానుమతే రాజా పవిత్రకృతలక్షణమ్,

ఆకొడుకులు చెప్పినమాట విని మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు మిక్కిలియుఁ గోపించి యిట్లని చెప్పెను. ౧౫

నామాట నతిక్రమించియుం గొంతమాత్రమును భయంబులేక మీరు ధర్మంబువలనను నిందితంబయిన గగుర్పాటుగల్గించుచు భయంకరముగానుండు నీమాటం జెప్పితిరి. ౧౬

మీరలు అందఱు వసిష్ఠునికొడుకులట్లు ముష్టికులయి కుక్కమాంసమును దినుచు, వేయేండ్లు భూమియందు వసియింపఁగలరని విశ్వామిత్రుఁడు కొడుకులతోఁ జెప్పెను. ౧౭

మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు అట్లు తనకొడుకుల శపియించి ఆర్తుఁడగు శునశ్శేఫునిఁజూచి ఏమియుం బాధలేనట్లు మంత్రితవిభూతి మొదలగు రక్షచేసి యిట్లనిచెప్పెను. ౧౮

నీవు దర్భలత్రాళ్లచేఁ గట్టఁబడి రక్తవర్ణంబు లగుపుష్పమాలికలును మైపూఁతయును ధరించి, విష్ణుదేవతాకంబగు యూపస్తంభమును బొందు నప్పుడు నేను జెప్పఁబోవు వచనములచే నగ్నిదేవునిఁగూర్చి స్తుతింపుము. ౧౯

మునికుమారుఁడవగు శునశ్శేఫుఁడా! అంబరీషుఁడు చేయుం నీయాగమునందు దివ్యంబులగు నీగాథల రెంటినిమాత్రము గానముసేయుము; దాన నీవాయుస్సును బొందుదువు అని విశ్వామిత్రుఁడు శునశ్శేఫునితోఁ జెప్పెను.

శునశ్శేఫుఁడా రెండుగాథల గ్రహించి సమ్మదినొందినవాఁడై, వేగమునఁబోయి రాజశ్రేష్ఠుఁడగు నంబరీషునిఁజూచి యిట్లని చెప్పెను. ౨౧

మహాబలుఁడవు రాజశ్రేష్ఠుఁడవు నగు నంబరీషుఁడా! శీఘ్రముగా యాగశాలకుఁ బోవుదము; యాగదీక్ష నారంభించి నెఱవేర్పుమని శునశ్శేఫుఁ డంబరీషునితోఁ జెప్పెను. ౨౨

ఆశునశ్శేఫుఁడు చెప్పినమాటవిని యంబరీషుఁడు సంతోషంబున నధికంబగు నుత్సాహంబునొంది జాగుసేయక శీఘ్రముగా యాగశాలకుఁ బోయెను.

అంబరీషుఁడు సదస్యులచే ననుమతుఁడై యాశునశ్శేఫుని దర్భలచేఁ

పశుం రక్తాంబరం కృత్వా యూపే తం సమబంధయత్. ౨౪

సబద్ధో వాగ్భిరగ్ర్యాభిరభితుష్టావ వై సురౌ,
ఇంద్రమింద్రానుజం చైవ యథావన్మునిపుత్రకః. ౨౫
తతః ప్రీతస్సహస్రాక్షో రహస్యస్తుతితర్పితః,
దీర్ఘమాయుస్తదా ప్రాదాచ్ఛునశ్శేఫాయ రాఘవః. ౨౬
స చ రాజా నరశ్రేష్ఠ యజ్ఞస్య చ సమాప్తవాన్,
ఫలం బహుగుణం రామ సహస్రాక్షప్రసాదజమ్. ౨౭
విశ్వామిత్రోఽపి ధర్మాత్మా భూయస్తేపే మహాతపాః,
పుష్కరేషు నరశ్రేష్ఠ దశవర్షశతాని చ. ౨౮

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ద్విషష్టితమస్సర్గః.

---

త్రిషష్టితమస్సర్గః

పూర్ణే వర్షసహస్రే తు వ్రతస్నాతం మహామునిమ్,
అభ్యాగచ్ఛన్ సురాస్సర్వే తపఃఫలచికీర్షవః. ౧
అబ్రవీత్సుమహాతేజా బ్రహ్మా సురుచిరం వచః,
ఋషిస్త్వమసి భద్రంతే స్వార్జితైః కర్మభిశ్శుభైః. ౨

తమేవముక్త్వా దేవేశస్త్రిదివం పునరభ్యగాత్. ౨౪

విశ్వామిత్రో మహాతేజా భూయస్తేపే మహత్తపః. 3
తతః కాలేన మహతా మేనకా పరమాప్సరాః,
పుష్కరేషు నరశ్రేష్ఠ స్నాతుం సముపచక్రమే. ౪
తాం దదర్శ మహాతేజా మేనకాం కుశికాత్మజః,

గట్టఁబడిన యొట్టినివస్త్రముఁ జుట్టిన పశువునుగాఁ జేసి యూపస్తంభమునందు బంధించెను. ౨౪

అశునశ్శేఫుఁడు యూపంబునందుఁ గట్టఁబడిన శ్రేష్ఠంబులగు వాగాథలచే నింద్రోపేంద్రుల యథావిధిగా బ్రస్తుతించెను. ౨౫

రాముఁడా! అంత దేవేంద్రుఁడు, శునశ్శేఫుఁడు రహస్యముగాఁ జేసిన స్తుతిచేఁ దృప్తినొంది సంతసించినవాఁడై శునశ్శేఫునకు దీర్ఘాయువు నిచ్చెను.

పురుష శ్రేష్ఠుఁడవగు రామఁడా! ఆయంబరీషుఁడును దేవేంద్రుని యనుగ్రహంబున యాగఫలంబు బహుగుణంబుగా నొందెను. ౨౬

ధర్మాత్ముఁడును మహాతపస్వియగు విశ్వామిత్రుఁడును మఱల వేయి సంవత్సరములు పుష్కరక్షేత్రంబులందుఁ దపంబు గావించెను. ౨౭

ఇది యఱువదిరెండవసర్గము.

---

## అఱువదిమూడవ సర్గము

వేయేండ్లును నిండఁగనే దేవతలందఱును ఆతపంబునకు ఫలం బొసంగఁగోరి వ్రతాంతమందు స్నాతుఁడగు విశ్వామిత్రమహామునియొద్దకు వచ్చిరి.

మహాతేజుఁడగు బ్రహ్మదేవుఁడు విశ్వామిత్రుని జూచి నీకు మంగళమగుఁగాక నీవు చేసిన మంగళకరంబులగు తపస్సులచే నీవు ఋషియని చెప్పఁబడెదవు అని మనోహరంబుగాఁ జెప్పెను. ౨

దేవతలకును బ్రభువయిన బ్రహ్మదేవుఁడు ఆవిశ్వామిత్రున కిట్లు చెప్పి మఱల స్వర్గంబు నొందెను. ౩

మహాప్రభావుఁడగు విశ్వామిత్రుఁడు మఱల గొప్పతపంబుగావించెను.

పురుషశ్రేష్ఠుఁడ వగు రాముఁడా! అంత దీర్ఘకాలమునకు వెనుక మేనక యనెడు నప్సరస పుష్కరతీర్థమునందు స్నానము సేయుచుండెను. ౪

మహాతేజుఁడగు విశ్వామిత్రుఁడు సౌందర్యంబున సరిలేక యాపుష్క

రూపేణాప్రతిమాం తత్ర విద్యుతం జలదే యథా. ౫

దృష్ట్వా కందర్పవశగో మునిస్తామిద మబ్రవీత్. ౫½
అప్సరస్స్వాగతం తేఽస్తు వస చేహ మమాశ్రమే,
అనుగృహ్ణీష్వ భద్రం తే మదనేన సుమోహితమ్. ౬½

ఇత్యుక్తా సా వరారోహా తత్ర వాసమథాకరోత్. ౭

తస్యాం వసంత్యాం వర్షాణి పంచ పంచ చ రాఘవ,
విశ్వామిత్రాశ్రమే రామ సుఖేన వ్యతిచక్రముః. ౮
అథ కాలే గతే తస్మిన్విశ్వామిత్రో మహామునిః,
సవ్రీళ ఇవ సంవృత్తశ్చింతాశోకపరాయణః. ౯
బుద్ధిర్మునేస్సముత్పన్నా సామర్షా రఘునందన, ౯½

సర్వం సురాణాం కర్మైతత్తపోపహరణం మహత్. ౧౦

అహోరాత్రాపదేశేన గతా స్సంవత్సరా దశ,
కామమోహాభిభూతస్య విఘ్నోఽయం ప్రత్యుపస్థితః. ౧౧

వినిశ్శ్వస న్మునివరః పశ్చాత్తాపేన దుఃఖితః,
భీతామప్సరసం దృష్ట్వా వేపంతీం ప్రాంజలిం స్థితామ్. ౧౨
మేనకాం మధురైర్వాక్యైర్విసృజ్య కుశికాత్మజః,
ఉత్తరం పర్వతం రామ విశ్వామిత్రో జగామహ. ౧౩
స కృత్వా నైష్ఠికీం బుద్ధిం జేతుకామో మహాయశాః,

రంబునందు మేఘమునందు మెఱుపుంబోలెఁ బ్రకాశించుచున్న యామేనకం జూచెను. ౫

విశ్వామిత్రుఁడు మేనకనుజూచి పరవశుఁడై దానితోనిట్లని చెప్పెను.

అప్సరసవయిన మేనకా! నీకు స్వాగతమగుఁగాక. నీ విచ్చట నాయాశ్రమమందుండి నాతోఁ గ్రీడింపుచుండుము. నీకు మంగళమగుఁగాక. మన్మథునిచే మోహము నొందింపఁబడి పరవశుఁడనై యున్నన న్ననుగ్రహింపుమని విశ్వామిత్రుఁడు మేనకతోఁ జెప్పెను. ౬

ఉత్తమస్త్రీయయిన యామేనక విశ్వామిత్రునిమాట లాలకించి వాసముచేసెను. ౭

రాముఁడా! ఇటుల మేనక విశ్వామిత్రుని యాశ్రమమందు వాసముసేయుచుండఁగానే సుఖముగాఁ బదిసంవత్సరంబులు కడచినవి. ౮

ఆపదిసంవత్సరములు కడవఁగానే విశ్వామిత్రమహాముని సిగ్గుపడి చింతయును దుఃఖమును బొందెను. ౯

రాముఁడా! ఆ విశ్వామిత్రుఁడు రోషంబునొంది యిట్లని యాలోచించెను. ౧౦

నాతపంబు తఱుఁగునట్లు సేయుటకై ఈ కార్యంబంతయుం దేవతలు చేసిరి. ౧౧

ఒక్కయహోరాత్రంబట్లు పదిసంవత్సరంబులును గడచినవి; మన్మథమోహంబునకు లోఁబడుటవలన నాకీవిఘ్నంబు సంభవించిన దని విశ్వామిత్రుఁడు చింతించెను. ౧౧

రాముఁడా! మునిశ్రేష్ఠుఁడును గుశవంశమునందుఁ బుట్టినవాఁడు నగు విశ్వామిత్రుఁడు నిట్టూర్పులు విడుచుచుఁ బశ్చాత్తాపంబు నొంది దుఃఖించుచు తనయెదుట భయంబున వణంకుచుఁ జేతులు మొగిడ్చి నిలుచున్న మేనకను జూచి తియ్యనిమాటల నాబిడనంపి హిమవత్పర్వతంబునకుఁ బోయెను.

అధికమయిన కీర్తిగల యావిశ్వామిత్రుఁడు కౌశికీనది గట్టుచేరి దృఢ

కౌశికీతీరమాసాద్య తపస్తేపే సుదారుణమ్. ౧౪

తస్య వర్షసహస్రం తు ఘోరం తప ఉపాసతః,
ఉత్తరే పర్వతే రామ దేవతానామభూద్భయమ్. ౧౫
ఆమన్త్రయన్ సమాగమ్య సర్వే సర్షిగణాస్సురాః,
మహర్షిశబ్దం లభతాం సాధ్వయం కుశికాత్మజః. ౧౬

దేవతానాం వచశ్శ్రుత్వా సర్వలోకపితామహః,
అబ్రవీన్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. ౧౭
మహర్షే స్వాగతం వత్స తపసోగ్రేణ తోషితః,
మహత్త్వమృషిముఖ్యత్వం దదామి తవ కౌశిక. ౧౮

బ్రహ్మణస్స వచశ్శ్రుత్వా సర్వలోకేశ్వరస్య హ,
న విషణ్ణో న సంతుష్టో విశ్వామిత్రస్తపోధనః. ౧౯
ప్రాంజలిః ప్రణతో భూత్వా సర్వలోకపితామహమ్,
ప్రత్యువాచ తతో వాచం విశ్వామిత్రో మహామునిః. ౨౦
మహర్షిశబ్దమతులం స్వార్జితైః కర్మభిశ్శుభైః,
యది మే భగవానాహ తతోఽహం విజితేంద్రియః. ౨౧

తమువాచ తతో బ్రహ్మా న తావత్త్వం జితేంద్రియః.
యతస్వ మునిశార్దూల ఇత్యుక్త్వా త్రిదివం గతః. ౨౨

విప్రస్థితేషు దేవేషు విశ్వామిత్రో మహామునిః,
ఊర్ధ్వబాహుర్నిరాలంబో వాయుభక్షస్తపశ్చరన్. ౨౩

మయిన సంకల్పముచేసి యింద్రియంబుల జయింప నిచ్ఛగొని యతిభయం
కరంబగు తపంబు గావించెను. ౧౪

రాముఁడా ! ఇట్లు హిమవత్పర్వతమునందు వేయేండ్లు భయంకరంబుగా
నావిశ్వామిత్రుఁడు తపంబుసేయఁగా దేవతలు భయంబునొందిరి. ౧౫

దేవతలు ఋషులు సంఘమును బ్రహ్మదేవునికడ కేతెంచి "ఈవిశ్వా
మిత్రుఁడు "మహర్షి" యని పిలువఁబడుగాక" అని చెప్పి బ్రహ్మదేవుని
విశ్వామిత్రునియొద్దకు వచ్చుటకుఁ బిలిచిరి. ౧౬

సమస్తలోకంబులకును బితామహుఁ డగు బ్రహ్మదేవుఁడు దేవతలమాటను
విని తపోధనుఁ డగువిశ్వామిత్రుని జూచి మనోహరంబుగా నిట్లని చెప్పెను.

మహర్షి వగుఁ బిడ్డఁడా! నీకు స్వాగతం బగుఁగాక; నీవు చేసినభయం
కరం బగుతపంబునకు సంతసించితిని ; నీకు మహర్షిత్వం బిచ్చెద నని బ్రహ్మ
విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౧౭

సమస్తలోకనాయకుఁ డగు బ్రహ్మదేవునిమాట విని తపోధనుఁ డయిన
యావిశ్వామిత్రుఁడు దుఃఖింపను లేదు; సంతోషింపను లేదు ౧౮

విశ్వామిత్రమహాముని చేతులు మొగిడ్చి నమస్కరించి యంత నెల్ల
లోకంబులకును బితామహుఁడయిన బ్రహ్మదేవునితో నిట్లని చెప్పెను. ౨౦

భగవంతుఁడ వగు నీవు నేను జేసినమంగళకరంబు లగు తపంబులకై
నాకు "మహర్షి" యను పేరొసంగుదువేని యప్పటికి నేను జితేంద్రియుఁడ
నయిన ట్లగుచున్నదని విశ్వామిత్రుఁడు బ్రహ్మతోఁ జెప్పెను. ౨౧

అంత బ్రహ్మదేవుఁడు విశ్వామిత్రుని జూచి "మునిశ్రేష్ఠుఁడ వగు
విశ్వామిత్రుఁడా ! నీవు జితేంద్రియుఁడవు మాత్రము కావు; ఇంకను బ్రయ
త్నింపుము" అని చెప్పి స్వర్గంబునకుఁ బోయెను. ౨౨

దేవతలు పయనంబయి పోఁగానే మహామునియగు విశ్వామిత్రుఁడు
చేతులుపైకెత్తి యెంతమాత్రంబు నూఁతలేక నిరాలంబుఁడై వాయువును
దినుచుఁ దపంబు గావించెను. ౨౩

ఘర్మే పంచతపా భూత్వా వర్షాస్వాకాశసంశ్రయః,
శిశిరే సలిలస్థాయీ రాత్ర్యహాని తపోధనః. ౨౪
ఏవం వర్షసహస్రం హి తపో ఘోరముపాగమత్. ౨౪½

తస్మిన్ సంతప్యమానే తు విశ్వామిత్రే మహామునౌ,
సంభ్రమస్సుమహానాసీత్సురాణాం వాసవస్య చ. ౨౫½
రంభామప్సరసం శక్రస్సహ సర్వైర్మరుద్గణైః,
ఉవాచాత్మహితం వాక్యమహితం కౌశికస్య చ. ౨౬½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, త్రిషష్టితమస్సర్గః.

---

## చతుష్షష్టితమస్సర్గః.

సురకార్యమిదం రంభే కర్తవ్యం సుమహత్త్వయా,
లోభనం కౌశికస్యేహ కామమోహసమన్వితమ్. ౧

తథోక్తా సాఽప్సరా రామ సహస్రాక్షేణ ధీమతా,
వ్రీళితా ప్రాంజలిర్వాక్యం ప్రత్యువాచ సురేశ్వరమ్. ౨
అయం సురపతే ఘోరో విశ్వామిత్రో మహామునిః,
ఘోరముత్స్రజతే క్రోధం మయి దేవ న సంశయః. ౩
తతో హి మే భయం దేవ ప్రసాదం కర్తుమర్హసి. ౩½

ఏవముక్తస్తయా రామ రంభయా భీతయా తదా,
తామువాచ సహస్రాక్షో వేపమానాం కృతాంజలిమ్. ౪½

మా భైషి రంభే భద్రం తే కురుష్వ మమ శాసనమ్. ౫

తపోధనుఁడగు విశ్వామిత్రుఁడు వేసవికాలంబునఁ బంచాగ్నిమధ్యంబుననుండుచు వానకాలంబున బయలనిలుచుచు శిశిరఋతువునందు రేయుం బవలును నీటమునింగినటించుచు నిట్లు వేయిసంవత్సరంబులు భయంకరంబుగఁ దపంబు గావించెను. ౨౪॥

ఆవిశ్వామిత్రమహాముని యిట్లుగ్రమంబుగాఁ దపము సేయుచుండఁగా దేవతలు నింద్రుఁడును మిగుల భయంబు నొందిరి. ౨౫॥

ఇంద్రుఁడు దేవతల నెల్లరనుగూడి రంభనుజూచి తనకు మేలును విశ్వామిత్రునకుఁ గీడును గలుగుటకై యిట్లని చెప్పెను. ౨౬॥

ఇది యఱువదిమూఁడవసర్గము.

---

## అఱువదినాలవ సర్గము

రంభా! నీవు విశ్వామిత్రునకు మన్మథమోహంబు కల్పించి యతని నీయం దాసగొనునట్లు సేయవలయును; ఇది గొప్పది దేవతాకార్యము కావున దీని నీవు తప్పక సేయవలయునని యింద్రుఁడు రంభతో ననెను. ౧

రాముఁడా! ఆరంభ బుద్ధిమంతుఁడగు నింద్రుఁడు చెప్పినమాట విని సిగ్గుపడి చేతులు మొగిడ్చి దేవేంద్రునిజూచి యిట్లని చెప్పెను. ౨

దేవేంద్రుఁడా! ఈవిశ్వామిత్రమహాముని చాలఁ గోపిష్ఠుఁడు; నేను వోదునేని నన్ను భయంకరంబుగాఁ గోపంబుబూనిశపించును సందియము లేదు.

దేవేంద్రుఁడా! అందువలననేకదా! నాకు వెఱపు గలుగుచున్నది. కావున నన్ననుగ్రహింపవలయునని రంభ దేవేంద్రునితోఁ జెప్పెను. ౩॥

రాముఁడా! అప్పుడిట్లు వెఱపుఁజెందినరంభసెప్పినమాటల విని సహస్రాక్షుఁడగు దేవేంద్రుఁడు భయంబున వడంకుచు చేతులు మొగిడ్చికొని నిలుచున్న రంభను జూచి యిట్లని చెప్పెను. ౪॥

రంభా! నీవు వెఱవకుము; నీకు మంగళ మగుఁగాక; నే నాజ్ఞాపించినట్లు సేయుము. ౫

కోకిలో హృదయగ్రాహీ మాధవే రుచిరద్రుమే,
అహం కందర్పసహితస్థాస్యామి తవ పార్శ్వతః. ౬
త్వం హి రూపం బహుగుణం కృత్వా పరమభాస్వరమ్,
తమృషిం కౌశికం రంభే భేదయస్వ తపస్వినమ్. ౭

సా శ్రుత్వా వచనం తస్య కృత్వా రూపమనుత్తమమ్,
లోభయామాస లలితా విశ్వామిత్రం శుచిస్మితా. ౮
కోకిలస్య చ శుశ్రావ వల్గు వ్యాహరతస్స్వనమ్,
సంప్రహృష్టేన మనసా తత ఏనాముదైక్షత. ౯
అథ తస్య చ శబ్దేన గీతేనాప్రతిమేన చ,
దర్శనేన చ రంభాయా మునిస్సందేహమాగతః. ౧౦
సహస్రాక్షస్య తత్కర్మ విజ్ఞాయ మునిపుంగవః,
రంభాం క్రోధసమావిష్టశ్శశాప కుశికాత్మజః. ౧౧
యన్మాం లోభయసే రంభే కామక్రోధజయైషిణమ్,
దశవర్షసహస్రాణి శైలీ స్థాస్యసి దుర్భగే. ౧౨

బ్రాహ్మణస్సుమహాతేజాస్తపోబలసమన్వితః,
ఉద్ధరిష్యతి రంభే త్వాం మత్క్రోధకలుషీకృతామ్. ౧౩

ఏవముక్త్వా మహాతేజా విశ్వామిత్రో మహామునిః,
అశక్నువన్ ధారయితుం క్రోధం సంతాపమాగతః. ౧౪

తస్య శాపేన మహతా రంభా శైలీ తదాఽభవత్, ౧౫
వచశ్శ్రుత్వా తు కందర్పో మహర్షేస్స చ నిర్గతః. ౧౬

నేను మన్మథునిగూడి వసంతఋతువునందు మనోహరంబగు వృక్షమునందు మనోహరంబయిన కోయిలరూపంబునొంది నీప్రక్కనుండెదను.

రంభా ! నీవును శృంగారాదిగుణంబులుగల్గి పరమభాస్వరంబుగానుండు రూపంబు ధరించి యుగ్రంబుగాఁ దపంబుగావింపుచుండు విశ్వామిత్రునిమనస్సును తపంబునుండి మఱలునట్లు సేయుమని యింద్రుఁడు రంభతోఁ జెప్పెను.

తెల్లని చిఱునవ్వుగల్గి సుందరియయియుండు రంభ యింద్రునిమాటవిని ఉత్తమంబగు రూపంబుధరించి విశ్వామిత్రుని ప్రలోభించెను. ౯

ఆవిశ్వామిత్రుఁడు మనోహరంబుగాఁ గూయుచున్న కోయిలపాఁతను విని యంతట సంతుష్టంబగు మనంబుతో నెదుట నిలుచున్నరంభను జూచెను.

అంత విశ్వామిత్రమహాముని యాకోయిలధ్వని వినియుం రంభనుజూచియుం రంభపాడినగానము నాలకించియును సందేహంబు నొందెను. ౧౦

మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు దాని దేవేంద్రుండుచేసిన పనిగా నెఱిఁగి కోపమునొంది రంభ నిట్లని శపించెను. ౧౧

దుష్టప్రయత్నము చేయు రంభా ! నీవు కామక్రోధంబుల జయింపఁ బూనిన నన్నుఁ ప్రలోభించుచున్నావు కావున, నీవు పదివేలేండ్లు ఱాయిగా నుండఁగలవు. ౧౨

రంభా ! మహాప్రభావుఁడును దపోబలంబుగలవాఁడు నగు బ్రాహ్మణుఁడయిన వసిష్ఠుఁడు నాకోపంబునఁ గలంకఁబాఱియున్న నిన్ను శాపంబునుండి తొలఁగించునని విశ్వామిత్రుఁడు రంభను శపియించెను. ౧౩

మహాప్రభావుఁడగు విశ్వామిత్రమహాముని కోపంబుపట్టలేక యిట్లు రంభను శపియించి యటుపిమ్మట కోపము నిగ్రహింపఁజాలనయితినని పశ్చాత్తాపంబు నొందెను. ౧౪

అప్పుడావిశ్వామిత్రుని మహాశాపంబున రంభ శిలారూపంబునొందెను.

మన్మథుఁడును దేవేంద్రుఁడును విశ్వామిత్రమహర్షి రంభను శపియించుట వినినంతనె యచ్చోటనుండక పాఱిరి. ౧౫

కోపేన స మహాతేజా స్తపోపహరణే కృతే,
ఇంద్రియైరజితై రామ న లేభే శాంతిమాత్మనః. ౧౬

బభూవాస్య మనశ్చింతా తపోపహరణే కృతే, ౧౬½
నైవ క్రోధం గమిష్యామి న చ వక్ష్యే కథంచన,
అథవా నోచ్ఛ్వసిష్యామి సంవత్సరశతాన్యపి. ౧౭½
అహం విశోషయిష్యామి హ్యాత్మానం విజితేంద్రియః. ౧౮
తావద్యావద్ధి మే ప్రాప్తం బ్రాహ్మణ్యం తపసార్జితమ్,
అనుచ్ఛ్వసన్నభుంజాన స్తిష్ఠేయం శాశ్వతీస్సమాః. ౧౯
న హి మే తప్యమానస్య క్షయం యాస్యంతి మూర్తయః. ౧౯½

ఏవం వర్షసహస్రస్య దీక్షాం స మునిపుంగవః,
చకారాప్రతిమాం లోకే ప్రతిజ్ఞాం రఘునందన. ౨౦½

ఇతి శ్రీమద్బాలకాణ్డే, చతుష్షష్టితమస్సర్గః.

---

## పఞ్చషష్టితమస్సర్గః.

అథ హైమవతీం రామ దిశం త్యక్త్వా మహామునిః,
పూర్వాం దిశమనుప్రాప్య తప స్తేపే సుదారుణమ్. ౧
మౌనం వర్షసహస్రస్య కృత్వా వ్రతమనుత్తమమ్,
చకారాప్రతిమం రామ తపః పరమదుష్కరమ్. ౨

పూర్ణే వర్షసహస్రే తు కాష్ఠభూతం మహామునిమ్,
విఘ్నైర్బహుభిరాధూతం క్రోధో నాంతర ఆవిశత్. 3

రాముఁడా! ఇట్లు కోపముగాలంబుగాఁ దపస్సు తఱుఁగుటను జూచి మహాప్రభావుఁడగు విశ్వామిత్రుఁడు జితేంద్రియుండు కానందున మనశ్శాంతి బొందఁడయ్యె. ౧౬

ఇట్లు తపస్సు తఱుఁగఁగానే విశ్వామిత్రుఁ డిట్లని సంకల్పించెను.

నే నింకఁ గోపంబునొందుట లేదు మాటలాడుటయును లేదు; లేక పెక్కునూఱేండ్లయినను నిట్టూర్పువిడువకయే యుండెదను. ౧౭

నేనింద్రియంబులను జయించి దేవతలను శోషింపఁజేసెదను. ౧౮

నాకెంతలోపల తపంబున సంపాదింపఁబడు బ్రాహ్మణత్వంబు కలుగునో అంతవఱకును పెక్కుసంవత్సరంబులయినను నిట్టూర్పువిడువక భుజింపక యుండెదను. ౧౯

నేను దపంబు సేయుచుండెదను గావునఁ దపఃప్రభావంబునంజేసి నా యవయవంబులు క్షయింపకుండెడు అని విశ్వామిత్రుఁడు సంకల్పించెను. ౧౯

రాముఁడా! మునిశ్రేష్ఠుఁడగు నావిశ్వామిత్రుఁడు వేయిసంవత్సరంబులకు దీక్షను "నిట్టూర్పువిడువక భుజింపక తపంబు గావించెదను" అని ప్రతిజ్ఞను జేసెను. ౨౦

ఇది యఱువదినాలవ సర్గము.

---

## అఱువదియైదవ సర్గము

రాముఁడా! అంత విశ్వామిత్రమహామునియుత్తరపుదిక్కును విడిచి తూర్పుదిక్కునకుఁబోయి యతిభయంకరంబుగాఁ దపంబుగావించెను. ౧

రాముఁడా! ఆవిశ్వామిత్రుఁడు వేయిసంవత్సరములు మాటలాడకుండు నట్లు సంకల్పించి లోకంబున నెచ్చటను సరిలేనిదియు నితరుల కెంతమాత్రంబును జేయ నశక్యమైనదియు నగు తపంబు గావించెను. ౨

వేయిసంవత్సరంబులును ముగియఁగానే, ఎన్నివిఘ్నంబులు వచ్చినను కొయ్యవలె నిశ్చలుఁడైన విశ్వామిత్రుఁడు కోపంబు నొందఁడయ్యె. 3

స కృత్వా నిశ్చయం రామ తప ఆతిష్ఠదవ్యయమ్. ౩½

తస్య వర్షసహస్రస్య వ్రతే పూర్ణే మహావ్రతః. ౪
భోక్తుమారబ్ధవానన్నం తస్మిన్ కాలే రఘూత్తమ,
ఇంద్రో ద్విజాతిర్భూత్వా తం సిద్ధమన్నమయాచత. ౫

తస్మై దత్వా తదా సిద్ధం సర్వం విప్రాయ నిశ్చితః,
నిశ్శేషితే ఽన్నే భగవానభుక్త్వైవ మహాతపాః. ౬
న కించిదవదద్విప్రం మౌనవ్రతముపస్థితః. ౬½

అథ వర్షసహస్రం వై నోచ్ఛ్వసన్మునిపుంగవః. ౭

తస్యానుచ్ఛ్వసమానస్య మూర్ధ్ని ధూమో వ్యజాయత,
త్రైలోక్యం యేన సంభ్రాంతమాదీపితమివాభవత్. ౮
తతో దేవాస్సగంధర్వాః పన్నగాసురరాక్షసాః,
మోహితాస్తేజసా తస్య తపసా మందరశ్మయః. ౯
కశ్మలోపహతాస్సర్వే పితామహమథాబ్రువన్. ౯½
బహుభిః కారణైర్దేవ విశ్వామిత్రో మహామునిః,
లోభితః క్రోధితశ్చైవ తపసా చాభివర్ధతే. ౧౦½

న హ్యస్య వృజినం కించిద్దృశ్యతే సూక్ష్మమప్యథ. ౧౧
న దీయతే యదిత్వస్య మనసా యదభీప్సితమ్,
వినాశయతి త్రైలోక్యం తపసా సచరాచరమ్. ౧౨
వ్యాకులాశ్చ దిశస్సర్వా న చ కించిత్ప్రకాశతే,
సాగరాః క్షుభితాస్సర్వే విశీర్యంతే చ పర్వతాః. ౧౩

రాముఁడా! ఇట్లావిశ్వామిత్రుఁడు ఏర్పాటుచేసికొని విఘ్నము రాకుండునట్లు నియమముగాఁ దపంబు గావించెను. ౩½

ఆ వేయిసంవత్సరంబుల నియమంబు ముగియఁగానే మహావ్రతంబు పూనియుండు విశ్వామిత్రుఁడు అన్నముదిన యత్నించెను; అప్పు డింద్రుఁడు బ్రాహ్మణవేషంబు ధరించి యావిశ్వామిత్రునికడ కేతెంచి సిద్ధంబగు నన్నంబుఁ బెట్టు మని యాచించెను. ౪, ౫

ఇట్లు మౌనవ్రతం బవలంబించి మహాతపంబు సేయం విశ్వామిత్రుఁడు సందేహింపక అప్పుడు సిద్ధంబగునన్నంబు నంతయు నా బ్రాహ్మణున కొసంగి యాబ్రాహ్మణుఁ డన్నమంతయుఁ దినివేయఁగా నతనితో నేమియుఁ బలుకక యూరకుండెను. ౬, ౬½

అంత మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు వేయిసంవత్సరములు నిట్టూర్పు విడువక తపంబుగావించెను. ౭

ఆవిశ్వామిత్రుం డట్లు నిట్టూర్పు విడువకుండఁగా నతనిశిరస్సునఁ బొగ లేచినది; ఆపొగచేత ముల్లోకంబులును గలతనొంది కాల్పఁబడిన ట్లయినవి. ౮

అంత దేవతలును గంధర్వులును పన్నగులును అసురులును రాక్షసులును అందఱును ఆవిశ్వామిత్రునితప స్సనెడు నగ్నిచే మూర్ఛితులయి కాంతి వీడి దుఃఖమునొంది బ్రహ్మదేవునితో నిట్లని చెప్పిరి. ౯½

బ్రహ్మదేవుఁడా! విశ్వామిత్రమహాముని పెక్కుకారణంబుల మనచే లోభంబు నొందునట్లును, కోపంబు నొందునట్లును జేయఁబడినను దపంబునఁ జాల వృద్ధిఁ బొందుచున్నాఁడు. ౧౦½

ఇప్పు డీవిశ్వామిత్రునియందు ఏదైనఁ గొంచెమయినను బాపంబులేదు.

ఈవిశ్వామిత్రుఁడు కోరినదాని నితని కివ్వకుండుదుమేని యితఁడు తపంబున జంగమస్థావరంబులతోఁగూడిన ముల్లోకంబుల నశింపఁజేయును. ౧౧

దిక్కులన్నియుఁ గలంతనొందియున్నవి; ఏదియుఁ బ్రకాశింపదయ్యె. సముద్రంబులన్నియుఁ గలఁతపడియున్నవి; పర్వతంబులును సడలిపడుచున్నవి.

ప్రకంపతే చ పృథివీ వాయుర్వాతి భృశాకులః,
బ్రహ్మన్న ప్రతిజానీమో నాస్తికో జాయతే జనః. ౧౪

సమ్మూఢమివ త్రైలోక్యం సంప్రక్షుభితమానసమ్,
భాస్కరో నిష్ప్రభశ్చైవ మహర్షేస్తస్య తేజసా. ౧౫

బుద్ధిం న కురుతే యావన్నాశే దేవ మహామునిః,
తావత్ప్రసాద్యో భగవా నగ్నిరూపో మహాద్యుతిః. ౧౬

కాలాగ్నినా యథా పూర్వం త్రైలోక్యం దహ్యతేఽఖిలమ్,
దేవరాజ్యం చికీర్షేత నీయతా మస్య యన్మతమ్. ౧౭

తతస్సురగణాస్సర్వే పితామహపురోగమాః,
విశ్వామిత్రం మహాత్మానం మధురం వాక్యమబ్రువన్. ౧౮
బ్రహ్మర్షే స్వాగతం తేఽస్తు తపసా స్మ సుతోషితాః. ౧౮½

బ్రాహ్మణ్యం తపసోగ్రేణ ప్రాప్తవానసి కౌశిక. ౧౯

దీర్ఘమాయుశ్చ తే బ్రహ్మన్ దదామి సమరుద్గణః,
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గచ్ఛ సౌమ్య యథాసుఖమ్. ౨౦

పితామహవచశ్శ్రుత్వా సర్వేషాం చ దివౌకసామ్,
కృత్వా ప్రణామం ముదితో వ్యాజహార మహామునిః. ౨౧

బ్రహ్మదేవుఁడా! భూమి వణంకుచున్నది; గాలి మిక్కిలియుఁ గలఁత పడి వీఁచుచున్నది; జనులు నాస్తికు లట్లు కర్మముల విడిచియున్నారు; దీనికిఁ బ్రతీకార మేమి సేయవలయునో మే మెఱుఁగము. ౧౪

మహర్షి యగు నావిశ్వామిత్రుని కాంతిఁజేసి ముల్లోకంబుల నుండు వారును కలఁతనొంది మోహము నొందినట్లున్నవారు, సూర్యుఁడు కాంతి వీడి మందుండుగాఁ గానఁబడియెను. ౧౫

బ్రహ్మదేవుఁడా! భగవంతుఁడును నిప్పువంటివాఁడును నగు విశ్వామిత్రమహాముని లోకములనన్నింటిని నశింపఁ జేయఁ దలంపుఁగొనుటకు మున్నె యతని సంతోషపఱచుట మేలు. ౧౬

పూర్వము ప్రళయాగ్నిదహించినట్లు ఈవిశ్వామిత్రుఁడు ముల్లోకంబుల నన్నింటిని దహింపఁగలఁడు; ఇతఁడు ఇంక దేవరాజ్యంబును జేయఁ గోరినను గోరును; కావున ఇతఁడు కోరుదాని నిమ్ము. అని దేవతలు బ్రహ్మదేవునితోఁ జెప్పిరి. ౧౭

అంత దేవతలందఱును బ్రహ్మదేవు మున్నిడికొని మహాత్ముఁడగు విశ్వామిత్రుని యొద్దకుఁబోయి యతనితో మధురంబుగా నిట్లని చెప్పిరి ౧౮

బ్రహ్మర్షివగు విశ్వామిత్రుఁడా! నీకు స్వాగతంబగుఁగాక; నీవు చేసిన తపంబునకుఁ జాల సంతోషించితి మని దేవతలు చెప్పిరి. ౧౮½

విశ్వామిత్రుఁడా! నీవు భయంకరంబగు తపంబుచేసినందున బ్రాహ్మణత్వంబు నొందితివి. ౧౯

బ్రాహ్మణుఁడవు శాంతుఁడవు నగువిశ్వామిత్రుఁడా! నీకు నేనును దేవతలును జేరి దీర్ఘంబగు నాయుస్సు నిచ్చెదము; నీవు మంగళమును బొందుము; నీకు మంగళమగుఁగాక; సుఖముగాఁ బొమ్ము. అని బ్రహ్మదేవుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౨౦

విశ్వామిత్రమహాముని బ్రహ్మదేవుఁడును దేవతలును జెప్పినమాట విని సంతసించి వారికి నమస్కారముచేసి యిట్లని చెప్పెను. ౨౧

బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘమాయుస్తథైవచ,
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయంతు మామ్. ౨౨

క్షత్ర వేదవిదాం శ్రేష్ఠో బ్రహ్మవేదవిదామపి,
బ్రహ్మపుత్రో వసిష్ఠో మామేవం వదతు దేవతాః. ౨౩

యద్యయం పరమః కామః కృతో యాంతు సురర్షభాః. ౨౩½

తతః ప్రసాదితో దేవైర్వసిష్ఠో జపతాం వరః,
సఖ్యం చకార బ్రహ్మర్షిరేవమస్త్వితి చాబ్రవీత్. ౨౪½

బ్రహ్మర్షిస్త్వం న సందేహస్సర్వం సంపత్స్యతే తవ,
ఇత్యుక్త్వా దేవతాశ్చాపి సర్వా జగ్ముర్యథాగతమ్. ౨౫½
విశ్వామిత్రోఽపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రాహ్మణ్యముత్తమమ్,
పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాం వరమ్. ౨౬½
కృతకామో మహీం సర్వాం చచార తపసి స్థితః. ౨౭
ఏవం త్వనేన బ్రాహ్మణ్యం ప్రాప్తం రామ మహాత్మనా. ౨౭½
ఏష రామ మునిశ్రేష్ఠ ఏష విగ్రహవాంస్తపః,

ఏష ధర్మపరో నిత్యం వీర్యస్యైష పరాయణమ్. ౨౮½

ఏవముక్త్వా మహాతేజా విరరామ ద్విజోత్తమః. ౨౯

నాకు బ్రాహ్మణత్వము దీర్ఘాయువును గల్గునేని ఓంకారమును, వషట్కారమును, వేదంబులును నేను మఱియొకరికిఁ జెప్పుటకును యాగమునందు యాజనంబున వినియోగించుటకును దగువాఁడ నగుదుఁగాక. ౨౨

దేవతలారా! క్షత్రియులకు యోగ్యంబులగు వేదంబుల నెఱింగిన వారిలోను బ్రాహ్మణులకు యోగ్యంబు లగువేదంబుల నెఱింగినవారిలోను శ్రేష్ఠుఁడును బ్రహ్మదేవుని కుమారుఁడు నైయుండువసిష్ఠుఁడు మీరుచెప్పినట్లు నన్నుఁ గూర్చి "బ్రాహ్మణుఁడు" అని చెప్పవలయును. ౨౩

నాకు ముఖ్యముగానుండు యీకోర్కె నెఱవేర్చితిరేని దేవతలందఱు వెళ్లవచ్చును. ౨౩½

అంత జపము సేయువారిలో శ్రేష్ఠుఁడును బ్రహ్మర్షియు నగువసిష్ఠుఁడు దేవతలచే సంతోషపెట్టఁబడి విశ్వామిత్రునితో సఖ్యంబుగావించి "దేవతలు చెప్పినట్లే యగుఁగాక" యని చెప్పెను. ౨౪½

నీవు బ్రహ్మర్షివి; ఇందుకు సందియంబు లేదు. బ్రహ్మర్షికిఁగల యధికారము లన్నియు నీకును గలుగు! అని చెప్పి దేవతలందఱును వచ్చినట్లు పోయిరి.

ధర్మాత్ముఁడగు విశ్వామిత్రుఁడును ఉత్తమంబగు బ్రాహ్మణ్యంబునొంది, మునిశ్రేష్ఠుఁడును బ్రహ్మర్షియు నగు వసిష్ఠుని బూజించెను. ౨౫½

ఈ విశ్వామిత్రుఁ డిట్లు తనకోర్కెనిబొంది తపస్సుసేయుచు భూమి యంతయుఁ దిరిగెను. ౨౬

రాముఁడా! మహాత్ముఁడగు నీవిశ్వామిత్రుఁడు ఈప్రకారముగనే బ్రాహ్మణ్యంబు నొందెను. ౨౬½

రాముఁడా! ఈవిశ్వామిత్రుఁడు మునులలో శ్రేష్ఠుఁడు; ఇతఁడు ఆకారంబు నొందిన తపస్సనందగు; ఇతఁడు ఎప్పుడును ధర్మమునే సేయువాఁడు; ఇతఁడు మహాపరాక్రమశాలి; అని శతానందుఁడు రామునకుఁ జెప్పెను. ౨౭½

మహాతేజుఁడును బ్రాహ్మణశ్రేష్ఠుఁడు నగుశతానందుఁడు రాముని కట్లుచెప్పి యంత నూరకుండెను.

శతానందవచశ్శ్రుత్వా రామలక్ష్మణసన్నిధౌ,
జనకః ప్రాంజలిర్వాక్యమువాచ కుశికాత్మజమ్. ౩౦
ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుంగవః,
యజ్ఞం కాకుత్థ్సహితః ప్రాప్తవానసి ధార్మిక. ౩౧

పావితోఽహం త్వయా బ్రహ్మన్ దర్శనేన మహామునే. ౩౧½

విశ్వామిత్ర మహాభాగ బ్రహ్మర్షీణాం వరోత్తమ,
గుణా బహువిధాః ప్రాప్తాస్తవ సందర్శనాన్మయా. ౩౨½
విస్తరేణ చ తే బ్రహ్మన్ కీర్త్యమానం మహత్తపః,
శ్రుతం మయా మహాతేజో రామేణ చ మహాత్మనా. ౩౩½

సదస్యైః ప్రాప్య చ సదః శ్రుతాస్తే బహవో గుణాః. ౩౪
అప్రమేయం తప స్తుభ్యమప్రమేయం చ తే బలమ్,
అప్రమేయా గుణాశ్చైవ నిత్యం తే కుశికాత్మజ. ౩౫

పితామహస్య చ యథా యథా హ్యైవవహ్న్యమాపతేః,
తృప్తిరాశ్చర్యభూతానాం కథానాం నాస్తి మే విభో. ౩౬
కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్. ౩౬½

శ్వః ప్రభాతే మహాతేజో ద్రష్టుమర్హసి మాం పునః. ౩౭

స్వాగతం తపతాం శ్రేష్ఠ మామనుజ్ఞాతుమర్హసి. ౩౭½

రామలక్ష్మణులసమీపంబున శతానందుఁడు చెప్పినమాటవిని జనకుఁడు చేతులు మొగిడ్చి విశ్వామిత్రునిఁజూచి యిట్లని చెప్పెను. ౩౦

ధార్మికుఁడవు మునిశ్రేష్ఠుఁడవు నగువిశ్వామిత్రుఁడా ! నీవు కాకుత్థ్స వంశంబునఁబుట్టిన రామలక్ష్మణులనుగూడి నాయాగంబునకు వచ్చినావు కావున నేను ధన్యుఁడను; అనుగ్రహింపఁబడినవాఁడను అగుచున్నాను. ౩౧

బ్రాహ్మణుఁడ వగువిశ్వామిత్రమహామునీ! నీవు దర్శనం బొసంగి నన్నుఁ పరిశుద్ధుని గావించితివి. ౩౧½

బ్రహ్మర్షులలో నుత్తమోత్తముఁడవు మహాభాగుఁడ వగు విశ్వామిత్రుడా ! నిన్నుఁ జూచుటవలన నాకు బహుగుణంబులు ప్రాప్తించినవి. ౩౨½

మహాతేజుఁడవు బ్రాహ్మణుఁడవు నగువిశ్వామిత్రుఁడా! మిక్కిలియుఁ గొనియాడఁబడుచున్న నీమహాతపస్సును నేమను మహాత్ముఁడగు రాముఁడును వింటిమి. ౩౩½

సభకువచ్చియున్న సభికులును నీ పెక్కుగుణంబుల నాలకించిరి. ౩౪

విశ్వామిత్రుఁడా ! బ్రహ్మదేవునియుఁ శివునియుఁ తపోబలగుణంబులట్లు నీతపస్సును బలంబును గుణంబులును ఎల్లప్పుడును. "ఇంత" అని లెక్కింప నలవిగావు. ౩౫

ఒడయుఁడవైన విశ్వామిత్రుఁడా! ఆశ్చర్యములుగానుండు నీకథ లెంత వినినను "జాలు" ననియే తోఁచ దయ్యె. ౩౬

మునిశ్రేష్ఠుఁడవగు విశ్వామిత్రుఁడా ! సూర్యాస్తమయము కాఁబోవుచున్నది; కాన నేను సాయంకాలమునందుఁ జేయవలయు కర్మంబులఁ జేయఁబోయెదను. ౩౬½

మహాప్రభావుఁడ వగువిశ్వామిత్రుఁడా! రేపు ప్రాతఃకాలంబున నన్ను మఱలఁ జూడుము. ౩౭

తపస్సు సేయువారలలో శ్రేష్ఠుఁడ వగువిశ్వామిత్రుఁడా! నీకు స్వాగత మగుఁగాక : నా కనుజ్ఞ యిమ్ము. అని జనకుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను.

ఏవముక్తో మునివరః ప్రశస్య పురుషర్షభమ్,
విససర్జాశు జనకం ప్రీతం ప్రీతమనా స్తదా. ౩౮

ఏవముక్త్వా మునిశ్రేష్ఠం వైదేహో మిథిలాధిపః.
ప్రదక్షిణం చకారాశు సోపాధ్యాయస్స బాంధవః. ౩౯

విశ్వామిత్రోఽపి ధర్మాత్మా సహరామస్సలక్ష్మణః,
స్వవాటమభిచక్రామ పూజ్యమానో మహర్షిభిః. ౪౦

ఇతి శ్రీమద్బాలకాణ్డే, పఞ్చషష్టితమస్సర్గః.

---

## షట్షష్టితమస్సర్గః

తతః ప్రభాతే విమలే కృతకర్మా నరాధిపః,
విశ్వామిత్రం మహాత్మానమాజుహావ సరాఘవమ్. ౧

తమర్చయిత్వా ధర్మాత్మా శాస్త్రదృష్టేన కర్మణా,
రాఘవౌ చ మహాత్మానౌ తదా వాక్యమువాచహ. ౨
భగవన్ స్వాగతం తేఽస్తు కిం కరోమి తవానఘ,
భవానాజ్ఞాపయతు మామాజ్ఞాప్యో భవతా హ్యహమ్. ౩

ఏవముక్తస్స ధర్మాత్మా జనకేన మహాత్మనా,
ప్రత్యువాచ మునిర్వీరం వాక్యం వాక్యవిశారదః. ౪

పుత్రౌ దశరథస్యేమౌ క్షత్రియౌ లోకవిశ్రుతౌ,
ద్రష్టుకామౌ ధనుశ్శ్రేష్ఠం యదేతత్త్వయి తిష్ఠతి. ౫
ఏతద్దర్శయ భద్రం తే కృతకామౌ నృపాత్మజౌ,

అప్పుడు ఇట్లు జనకుఁడు చెప్పఁగా మునిశ్రేష్ఠుఁ డగువిశ్వామిత్రుఁడు సంతసించి యట్లు సంతసించియున్న పురుషశ్రేష్ఠుఁ డగుజనకుని గొనియాడి శీఘ్రముగాఁ బంపెను. ౩౮

ఇట్లు విదేహదేశమునకు రాజయిన జనకుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పి శీఘ్రంబుగా నుపాధ్యాయుండు బంధువులనుగూడి యతనికిఁ బ్రదక్షిణంబు చేసెను. ౩౯

ధర్మాత్ముఁ డగువిశ్వామిత్రుఁడును రామలక్ష్మణులనుగూడి మహర్షులచేఁ బూజింపఁబడుచు తనవిడిదికిఁ బోయెను. ౪౦

ఇది యఱువదియైదవ సర్గము.

---

## అఱువదియాఱవ సర్గము

అంత స్వచ్ఛమయిన ప్రాతఃకాలము కాఁగా జనకుఁడు ప్రాతఃకాలము నందు చేయవలసిన కర్మంబులఁ జేసి మహాత్ముఁడగు విశ్వామిత్రుని రామలక్ష్మణులను రప్పించెను. ౧

ధర్మాత్ముఁ డగుజనకుఁడు యథావిధిగ నావిశ్వామిత్రుని మహాత్ము లగు రామలక్ష్మణులను బూజించి యిట్లని చెప్పెను. ౨

భగవంతుఁడవు పాపములేనివాఁడవు నగువిశ్వామిత్రుఁడా! నీకు స్వాగతంబగుఁగాక; నీ కేమిసేయుదును? నీవు నా కాజ్ఞాపింపుము. నేను నీచే నాజ్ఞాపింపఁదగిన వాఁడనే కదా! అని జనకుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పెను.

ధర్మాత్ముఁడును మాటలాడుటయందుఁ బండితుఁడు నగు నావిశ్వామిత్రమహాముని మహాత్ముఁ డగుజనకునిమాట విని వీరుం డగు నతనిఁజూచి యిట్లని బదులుచెప్పెను. ౪

ఈదశరథునికొడుకు లిర్వురును క్షత్రియవంశోత్పన్నులు; లోకప్రసిద్ధులు; వీరలు నీయొద్దనుండు శివధనుస్సును జూడఁగోరెదరు. ౫

నీకు మంగళమగుఁగాక; ఈధనుస్సును జూపుము. ఈరాచకొమారులు

దర్శనాదస్య ధనుషో యథేష్టం ప్రతియాస్యతః. ౬

ఏవముక్తస్తు జనకః ప్రత్యువాచ మహామునిమ్. ౬౹

శ్రూయతామస్య ధనుషో యదర్థమిహ తిష్ఠతి. ౭
దేవరాత ఇతి ఖ్యాతో నిమేష్షష్ఠో మహీపతిః,
న్యాసోఽయం తస్య భగవన్ హస్తే దత్తో మహాత్మనా. ౮

దక్షయజ్ఞవధే పూర్వం ధనురాయమ్య వీర్యవాన్,
రుద్రస్తు త్రిదశాన్ రోషాత్సలీల మిద మబ్రవీత్. ౯

యస్మాద్భాగార్థినో భాగాన్నాకల్పయత మే సురాః,
వరాంగాణి మహార్హాణి ధనుషా శాతయామి వః. ౧౦

తతో విమనసస్సర్వే దేవా వై మునిపుంగవ,
ప్రసాదయంతి దేవేశం తేషాం ప్రీతోఽభవద్భవః. ౧౧

ప్రీతియుక్తస్స సర్వేషాం దదౌ తేషాం మహాత్మనామ్. ౧౧౹
తదేతద్దేవదేవస్య ధనూరత్నం మహాత్మనః,
న్యాసభూతం తదా న్యస్తమస్మాకం పూర్వకే విభో. ౧౨౹

అథ మే కృషతః క్షేత్రం లాంగలాదుత్థితా మయా,
క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా. ౧౩౹

భూతలాదుత్థితా సాతు వ్యవర్ధత మమాత్మజా. ౧౪

దానిజూచి తమకోర్కినిబొంది యథేష్టంబుగా మఱల పోయెదరు. అని విశ్వామిత్రుఁడు జనకునితోఁ జెప్పెను. ౬.

జనకుఁడు విశ్వామిత్రుఁడు చెప్పినమాటవిని విశ్వామిత్రమహామునిని జూచి యిట్లని చెప్పెను. ౬౫.

ఈధను విచ్చట నెందుకున్నదో ఆప్రయోజనమును జెప్పెద వినుండు.

భగవంతుఁడ వగువిశ్వామిత్రుఁడా! నిమిచక్రవర్తి కాఱవపురుషుఁడు దేవరాతుఁ డనురాజొకఁ డుండెను; శివుఁ డీధనుస్సును ఆతనిచేతికి నిక్షేపము నుంచుకొనుటకై యిచ్చెను. ౮

మున్ను దక్షునియాగమును ధ్వంసముసేయుకాలమునందు పరాక్రమశాలి యగుశివుండు ధనుస్సు నాకర్షించి కోపంబున దేవతలనుజూచి యిట్లని చెప్పెను. ౯

దేవతలారా! యాగమునందు నేను హవిర్భాగమును గోరఁగా నాకు భాగమును కల్గింపకైతిరి; కావున శ్రేష్ఠంబులగు మీశిరంబుల ధనువుచే ఛేదించెద నని శివుఁడు దేవతలతోఁ జెప్పెను. ౧౦.

మునిశ్రేష్ఠుఁడ వగువిశ్వామిత్రుఁడా! అంత దేవతలందఱును దుఃఖంబు నొంది శివుని సంతోషపఱచిరి; శివుఁడును వారలవిషయమయి ప్రీతి నొందెను. ౧౧.

శివుఁడు సంతోషము నొంది యీధనుస్సును దేవతలకందఱకు నిచ్చెను.

ఒడయుఁడవైన విశ్వామిత్రుఁడా! మహాత్ముఁడును దేవదేవుఁడు నగు శివునిదయినట్టి యీధనుస్సును మునుపు మాపూర్వపురుషుఁడైన దేవరాతునకు దేవత లొసంగిరి. ౧౨౫.

అంత నేను యాగము సేయుటకై భూమిదున్నుచుండఁగా నాఁగలి వలన నొకకన్యక పుట్టినది; అది నేను యాగభూమిని శోధింపుచుండఁగా నాఁగటిచాలునఁబుట్టినది కావున "సీత" యని ప్రసిద్ధినొందినది. ౧౩౫.

ఇట్లు భూమివలనఁ బుట్టిన యీ సీతను నా కొమారితెగా నుంచికొని పెంచితిని. ౧౪

వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితేయమయోనిజా. ౧౪॥

భూతలాదుత్థితాం తాంతు వర్ధమానాం మమాత్మజామ్,
వరయామాసురాగమ్య రాజానో మునిపుంగవ. ౧౫॥
తేషాం వరయతాం కన్యాం సర్వేషాం పృథివీక్షితామ్,
వీర్యశుల్కేతి భగవన్ న దదామి సుతామహమ్. ౧౬॥

తతస్సర్వే నృపతయస్సమేత్య మునిపుంగవ,
మిథిలామభ్యుపాగమ్య వీర్యజిజ్ఞాసవస్తదా. ౧౭॥
తేషాం జిజ్ఞాసమానానాం వీర్యం ధనురుపాహృతమ్. ౧౮

న శేకుర్గ్రహణే తస్య ధనుషస్తోలనేఽపివా. ౧౮॥

తేషాం వీర్యవతాం వీర్యమల్పం జ్ఞాత్వా మహామునే,
ప్రత్యాఖ్యాతా నృపతయస్తన్నిబోధ తపోధన. ౧౯॥

తతః పరమకోపేన రాజానో మునిపుంగవ,
న్యరుంధన్మిథిలాం సర్వే వీర్యసందేహమాగతాః. ౨౦॥
ఆత్మాన మవధూతం తే విజ్ఞాయ నృపపుంగవాః,
రోషేణ మహతావిష్టాః పీడయన్ మిథిలాం పురీమ్. ౨౧॥
తతస్సంవత్సరే పూర్ణే క్షయం యాతాని సర్వశః,
సాధనాని మునిశ్రేష్ఠ తతోఽహం భృశదుఃఖితః. ౨౨॥
తతో దేవగణాన్ సర్వాన్ తపసాహం ప్రసాదయమ్,
దదుశ్చ పరమప్రీతాశ్చతురంగబలం సురాః. ౨౩॥

ఈకూఁతురు అయోనిజ కావున వీర్యవంతునకే యివ్వఁదగినదని యెంచి యెవ్వరికి నివ్వకయే యుంచితిని. ౧౪½

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! రాజు లనేకులువచ్చి నేలఁబుట్టి వర్ధిల్లుచున్న నాకొమార్తె యగు సీత "నిమ్మని" యడిగిరి. ౧౫½

భగవంతుండ వగువిశ్వామిత్రుఁడా! ఇట్లు కన్యను వరింపవచ్చినరాజుల కందఱకును "ఈకన్యక పరాక్రమముగలవానికే యివ్వఁదగినది" అని చెప్పి కొమార్తె నివ్వనైతిని. ౧౬½

అంత రాజులందఱునుం జేరి మిథిలకువచ్చి కన్యంబొందుట కెట్టిపరాక్రమంబు గావలయునో దానిం దెలియఁగోరిరి. ౧౭½

ఇట్లు కన్నియకు విలువయయిన పరాక్రమంబు తెలియంగోరిన యారాజులకు శివధనువుం దెచ్చి చూపితి. ౧౮

ఆరాజులు ఆధనుస్సును ఎత్తుటకుఁగాని, ఇట్టట్టుఁ గదలించుటకుఁగాని శక్తులు కారైరి. ౧౮½

తపోధనుండ వగు విశ్వామిత్రమహామునీ! పరాక్రమశాలులగు నారాజులపరాక్రమం బల్పంబుగాఁ దెలిసికొని యారాజుల నేను నిరాకరించితిని. అటువెనుకటివృత్తాంతంబు వినుము. ౧౯½

మునిశ్రేష్ఠుండ వగువిశ్వామిత్రుఁడా! అంత రాజులందఱును పరాక్రమములేనివారమెడు సంశయంబుగలుగుటంజేసి మిక్కిలియుఁ గోపించి మిథిలచుట్టును ముట్టడించిరి. ౨౦½

ఆరాజులు నాచేఁ దాము తిరస్కరింపఁబడిన ట్లెంచికొని చాలఁ గోపంబునొంది మిథిలాపట్టణంబును ముట్టడించి పీడగలుగునట్లు చేసిరి. ౨౧½

అంత నొకసంవత్సరంబు నిండఁగానే నాదుసైన్యసామగ్రియంతయుఁ దఱిఁగినది; దానంజేసి నేను జాలదుఃఖంబు నొందితిని. ౨౨½

అంతట నేను దపంబుగావించి దేవతలనందఱ సంతోషపఱిచితిని; దేవతలును జాల సంతోషపడి నాకుఁ జతురంగసేన నొసంగిరి. ౨౩½

తతో భగ్నా నృపతయో హన్యమానా దిశోయయుః,
అవీర్యా వీర్యసందిగ్ధాస్సామాత్యాః పాపకర్మణః. ౨౪

తదేతన్మునిశార్దూల ధనుః పరమభాస్వరమ్,
రామలక్ష్మణయోశ్చాపి దర్శయిష్యామి సువ్రత. ౨౫
యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే,
సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహమ్. ౨౬

ఇతి శ్రీమద్బాలకాణ్డే, షట్షష్టితమస్సర్గః

---

సప్తషష్టితమస్సర్గః.

జనకస్య వచశ్శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః,
ధనుర్దర్శయ రామాయ ఇతి హోవాచ పార్థివమ్. ౧
తతస్స రాజా జనకస్సామంతాన్వ్యాదిదేశ హ,
ధనురానీయతాం దివ్యం గంధమాల్యవిభూషితమ్. ౨
జనకేన సమాదిష్టాస్సచివాః ప్రావిశన్ పురీమ్,
తద్ధనుః పురతః కృత్వా నిర్జగ్ముః పార్థివాజ్ఞయా. ౩
నృణాం శతాని పంచాశద్వ్యాయతానాం మహాత్మనామ్,
మంజూషామష్టచక్రాం తాం సమూహుస్తే కథంచన. ౪

తామాదాయ తు మంజూషామాయసీం యత్ర తద్ధనుః,
సురోపమం తే జనక మూచుర్నృపతిమంత్రిణః. ౫
ఇదం ధనుర్వరం రాజన్ పూజితం సర్వరాజభిః,
మిథిలాధిప రాజేంద్ర దర్శనీయం యదిచ్ఛసి. ౬

పాపిష్ఠులును, పరాక్రమహీనులును, సంశయింపఁదగిన పరాక్రమము
కలవారలు నగు నారాజులు మంత్రులతో నాసేనవలన నవమానపడి కొట్టఁ
బడి దిక్కులకుం బాఱిరి. ౨౪

సువ్రతుండవు మునిశ్రేష్ఠుండ వగువిశ్వామిత్రుఁడా! పరమభాస్వరం
బగు నీధనుస్సును రామలక్ష్మణులకుం జూపెదను. ౨౫

విశ్వామిత్రుఁడా! రాముండు ఈధనువు నెక్కుపెట్టునేని నాకూఁతు
రయిన యయోనిజ యగుసీతను దశరథపుత్త్రుం డగురాముని కిత్తును. అని జన
కుండు విశ్వామిత్రునకుఁ జెప్పెను. ౨౬

ఇది యఱువదియాఱవ సర్గము.

---

## అఱువదియేడవ సర్గము

విశ్వామిత్రమహాముని జనకుండు చెప్పినమాట విని జనకుం జూచి
"రామునకు శివధనువుం జూపుము" అని చెప్పెను. ౧

అంత జనకమహారాజు మంత్రులంబిలిచి "గంధమాల్యంబుచే నలంక
రింపఁబడిన దివ్యంబగు శివధనువ్వం గొనితెండు" అని యాజ్ఞాపించెను. ౨

మంత్రు లిట్లు జనకునిచే నాజ్ఞాపింపఁబడి పట్టణంబుఁ బ్రవేశించి
యొడయుని పంపునంచేసి శివధనువుఁ గైకొని మఱలివచ్చిరి. 3

పొడువుగల దేహముగలవారలును, మహాబలులు నగునయిదువేల
మందిపురుషులు ఎనిమిదిచక్రములుగల్గి బండివలెనుండు నాపెట్టెను లాగిరి;
ఆయయిదువేలమందియుఁ నతిప్రయాసంబుననే లాగుచుండిరి. ౪

ఆమంత్రులు ఆశివధనువుం బెట్టియున్న యినుపపెట్టెయుం దీసికొని
దేవతుల్యుండగు జనకమహారాజుంజూచి యిట్లని చెప్పిరి. ౫

మిథిలకుఁ బ్రభుండవు రాజశ్రేష్ఠుండ వగు జనకమహారాజా! నీవు
రామునకు దేనింజూపఁగోరితివో సమస్తరాజులచేతనుం బూజింపఁబడిన యా
ధనుశ్శ్రేష్ఠంబు తెచ్చితిమి; ఇదిగో చూడుము. ౬

తేషాన్నృపో వచశ్శ్రుత్వా కృతాంజలిరభాషత,
విశ్వామిత్రం మహాత్మానం తౌ చోభౌ రామలక్ష్మణౌ. ౭
ఇదం ధనుర్వరం బ్రహ్మన్ జనకై రభిపూజితమ్,
రాజభిశ్చ మహావీర్యై రశక్తైః పూరితుం పురా. ౮

నైతత్సురగణాస్సర్వే నాసురా న చ రాక్షసాః,
గన్ధర్వయక్షప్రవరాస్సకిన్నరమహోరగాః. ౯
క్వ గతిర్మానుషాణాం చ ధనుషోఽస్య ప్రపూరణే.
ఆరోపణే సమాయోగే వేపనే తోలనేఽపి వా. ౧౦

తదేతద్ధనుషాం శ్రేష్ఠమానీతం మునిపుంగవ,
దర్శయైతన్మహాభాగ అనయో రాజపుత్రయోః. ౧౧

విశ్వామిత్రస్తు ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవమబ్రవీత్. ౧౨
బ్రహ్మర్షేర్వచనా ద్రామో యత్ర తిష్ఠతి తద్ధనుః,
మంజూషాం తామపావృత్య దృష్ట్వా ధనురథాబ్రవీత్. ౧౩

ఇదం ధనుర్వరం బ్రహ్మన్ సంస్పృశామీహ పాణినా,
యత్నవాంశ్చ భవిష్యామి తోలనే పూరణేఽపి వా. ౧౪
బాఢమిత్యేవ తం రాజా మునిశ్చ సమభాషత. ౧౪½

లీలయా స ధనుర్మధ్యే జగ్రాహ వచనాన్మునేః. ౧౫

జనకుం డామంత్రులమాట విని చేతులు మోగిడ్చి మహాత్ముండగు విశ్వామిత్రుని రామలక్ష్మణుల నిద్దఱుం జూచి యిట్లని చెప్పెను. ౭

బ్రాహ్మణుండ వగు విశ్వామిత్రుఁడా! ఈధనుస్సు పూర్వము మావంశస్థులగు జనకులచేతను దీని నెక్కుపెట్టంజాలని మహావీర్యులగు నితరరాజుల చేతనుం బూజింపఁబడుచుండినది. ౮

దేవతలుగాని యసురులుగాని రాక్షసులుగాని గంధర్వులుగాని యక్షులుగాని కిన్నరులుగాని యురగులుగాని యీధనువు నెక్కిడఁజాలరు. ౯

దేవాదులకె యిట్లుండఁగా నీధనుస్సును వంచుటకుఁగాని యల్లెత్రాడు మోపెట్టుటకుఁగాని బాణంబుఁ గూర్చుటకుఁగాని అల్లెత్రాడు నీడ్చుటకుఁగాని యిట్టట్టు కదలించుటకుఁగాని మనుష్యులలో నెవ్వరుచుం జాలరనుట సిద్ధంబె.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! విండ్లలో శ్రేష్ఠంబును ఇదివఱ కెవ్వరిచేతను మోపిడంగూడనిదియునగు నీశివధనువు తేఁబడియున్నది; రాచకొమరులగు నీరామలక్ష్మణులకు దీనింజూపుము అని జనకుండు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౧౧

ధర్మాత్ముం డగువిశ్వామిత్రుండు జనకుండు చెప్పినమాటను విని రామునిం జూచి "విల్లు చూడుము" అని చెప్పెను. ౧౨

రాముండు బ్రహ్మర్షి యగు విశ్వామిత్రుని యనుమతిఁగొని ఆధనువు నుంచియుండు పేటికం దెఱచి ధనువుంజూచి యంత విశ్వామిత్రునితో నిట్లని చెప్పెను. ౧౩

బ్రాహ్మణుండవగు విశ్వామిత్రుఁడా! ఇప్పు డీధనుశ్శ్రేష్ఠంబును జేతము ట్టెదను. మఱియుం దానింగదలించుటకును మోపెట్టుటకునుం బ్రయత్నించెదను.

జనకమహారాజును విశ్వామిత్రమహామునియును రామునింజూచి 'మంచిది' అని చెప్పిరి. ౧౪౫

రాముండు విశ్వామిత్రుని యనుజ్ఞనొంది ఎంతమాత్రంబును బ్రయాసములేక లీలతో నాధనుర్మధ్యంబుఁ బట్టుకొనెను. ౧౬

పశ్యతాం నృసహస్రాణాం బహూనాం రఘునందనః,
ఆరోపయత్స ధర్మాత్మా సలీలమివ తద్ధనుః,
ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః. ౧౬

తద్బభంజ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః. ౧౬½

తస్య శబ్దో మహానాసీన్నిర్ఘాతసమనిస్వనః,
భూమికంపశ్చ సుమహాన్ పర్వతస్యేవ దీర్యతః. ౧౭½

నిపేతుశ్చ నరాస్సర్వే తేన శబ్దేన మోహితాః,
వర్జయిత్వా మునివరం రాజానం తౌ చ రాఘవౌ. ౧౮½
ప్రత్యాశ్వస్తే జనే తస్మిన్రాజా విగతసాధ్వసః,
ఉవాచ ప్రాంజలిర్వాక్యం వాక్యజ్ఞో మునిపుంగవమ్. ౧౯½

భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః. ౨౦

అత్యద్భుతమచింత్యం చ న తర్కితమిదం మయా. ౨౦½

జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా,
సీతా భర్తారమాసాద్య రామం దశరథాత్మజమ్. ౨౧½
మమ సత్యా ప్రతిజ్ఞా చ వీర్యశుల్కేతి కౌశిక. ౨౨

సీతా ప్రాణైర్బహుమతా దేయా రామాయ మే సుతా. ౨౨½

పెక్కువేలజనంబులు చూచుచుండఁగా ధర్మాత్ముం డగునా రాముఁడు శివధనువును ఎంతమాత్రంబును శ్రమంబు లేకయె మోపెట్టెను

ధర్మాత్ముఁడగు రాముఁడు ఇట్లు మోపెట్టి యాశివధనువును బాణముతోఁ గూరించెను. ౧౬

మహాయశుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు రాముఁడు ఆశివధనువును నడుమను విఱిచివేసెను. ౧౬½

ఆధనువు విఱుచుటంగలిగినధ్వని పిడుగుధ్వనింబోలి గొప్పదిగా నుండినది. పర్వతంబు పగులునప్పుడుంబోలె నప్పుడు భూమి మిక్కిలియుం గదలినది. ౧౭½

మునిశ్రేష్ఠుం డగువిశ్వామిత్రుఁడును జనకమహారాజును రామలక్ష్మణులునుం దక్క దక్కిన మనుష్యులందఱును ఆధ్వనికి మూర్ఛిల్లి నేలంబడిరి. ౧౮½

ఇట్లు మూర్ఛిల్లిపడిన జనులందఱు మూర్ఛదేఱఁగానే మాటలయందుఁ బండితుండగు జనకుండు నిర్భయుండై చేతులు మొగిడ్చి మునిశ్రేష్ఠుం డగు విశ్వామిత్రుంజూచి యిట్లని చెప్పెను ౧౯½

భగవంతుండ వగు విశ్వామిత్రుఁడా! దశరథునిపుత్రుం డగురాముని పరాక్రమంబు నేను జూచితిని. ౨౦

ఎవ్వఁడైన నీ శివధనుస్సును వంచివిఱుచునని నే నిదివఱ కూహింపలేదు; దేవతలకు నశక్యమయినందున మనస్సుచే నైనఁ దలంచుట కవకాశంబుగల్గ దయ్యె; ఇంత బాలుం డింతటికార్యంబు సేయుట చాల నాశ్చర్యముగానున్నది.

నాకూఁతురగు సీత దశరథకుమారుఁడగు రామునిం బెనిమిటిగాఁ బడసి జనకవంశంబునకుఁ గీర్తికలుగఁ జేయును. ౨౧½

"సీత పరాక్రమంబుగలవానికే యిచ్చెదను" అని నేఁ జేసిన ప్రతిన యును సత్యంబయినది. ౨౨

నాప్రాణంబులకన్న నెచ్చుగా నెన్నఁబడుచుండు నదియును నాకొమార్తెయును నగు సీతను రామున కొసంగెదను. ౨౨½

భవతోఽనుమతే బ్రహ్మన్ శీఘ్రం గచ్ఛంతు మంత్రిణః,
మమ కౌశిక భద్రంతే అయోధ్యాం త్వరితా రథైః. ౨౩౺

రాజానం ప్రశ్రితైర్వాక్యై రానయంతు పురం మమ,
ప్రదానం వీర్యశుల్కాయాః కథయంతు చ సర్వశః. ౨౪౺

మునిగుప్తౌ చ కాకుత్స్థౌ కథయంతు నృపాయ వై. ౨౫

ప్రీయమాణం తు రాజానమానయంతు సుశీఘ్రగాః. ౨౫౺

కౌశికశ్చ తథేత్యాహ రాజా చాభాష్య మంత్రిణః. ౨౬
అయోధ్యాం ప్రేషయామాస ధర్మాత్మా కృతశాసనాన్,
యథావృత్తం సమాఖ్యాతుమానేతుం చ నృపం తదా. ౨౭
ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తషష్టితమస్సర్గః.

---

అష్టషష్టితమస్సర్గః

జనకేన సమాదిష్టా దూతాస్తే క్లాంతవాహనాః,
త్రిరాత్రముషితా మార్గే తేఽయోధ్యాం ప్రావిశన్ పురీమ్.

(రాజ్ఞో భవన మాసాద్య ద్వారస్థానిద మబ్రువన్,

శీఘ్రం నివేద్యతాం రాజ్ఞే దూతాన్నో జనకస్య చ.

ఇత్యుక్తా ద్వారపాలాస్తే రాఘవాయ న్యవేదయన్.)

బ్రాహ్మణుండవగు విశ్వామిత్రుఁడా! నీకు మంగళమగుఁగాక; నీ యనుజ్ఞఁబొంది నాదుమంత్రులు వేగిరపడి రథంబులనెక్కి శీఘ్రంబుగా నయోధ్యకుఁ బోవుదురుగాక. ౧౩౪

మంత్రులుపోయి, వినయంబున నిచ్చటి వృత్తాంతములం జెప్పి, దశరథు నిటకుం దోడితెత్తురుగాక; పరాక్రమంబుగలవానికి యివ్వఁదగిన సీతను రామున కిచ్చుటకు నిశ్చయించుట మొదలగు వృత్తాంతము నంతయుం నతనికిం జెప్పుదురుగాక. ౧౮౪

మంత్రులు "రామలక్ష్మణులు విశ్వామిత్రమహాముని చే రక్షింపఁబడి యున్నవారు" అని దశరథునకుం జెప్పుదురుగాక. ౧౯

మంత్రులు శీఘ్రముగాఁబోయి యీమాటలు చెప్పఁగా సంతోషంబు నొంది యంండు నాదశరథు నిటకుఁ దోడితెత్తురుగాక అని జనకుండు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౧౯౪

విశ్వామిత్రుండు "సాగే" యనెను ధర్మాత్ముం డగు జనకుండును మంత్రులఁ బిలిచి వివాహోత్సవపత్రికల నిచ్చి "జరిగినవృత్తాంతము నంతయుఁ జెప్పి దశరథునిదోడితెండు" అని యాజ్ఞాపించి యయోధ్యకుఁ బంపెను.

ఇది యఱువదియెడవ సర్గము.

---

## అఱువదియెనిమిదవ సర్గము

జనకునిచే నాజ్ఞాపింపఁబడిన యావార్తాహారులు తమగుఱ్ఱము లలయు నట్లు వేగిరముగా, మూఁడురాత్రులు పయనముసేసి యయోధ్యాపట్టణము ప్రవేశించిరి. ౧

ఆదూతలు దశరథుని యిల్లుచేరి వాకిటనుండు కావలివాండ్రం జూచి యిట్లని చెప్పిరి.

"జనకునిదూతల మగుమేము వచ్చియున్నాము" అని దశరథునకుం దెల్పుఁడు అని దూతలు ద్వారపాలకులతోఁ జెప్పిరి.

ఆద్వారపాలకులుఁ దూతలమాట విని "జనకునికడనుండి రాయబారులు వచ్చియున్నారు" అని దశరథునకుం దెల్పిరి.

తే రాజవచనాద్దూతా రాజవేశ్మ ప్రవేశితాః,
దదృశుర్దేవసంకాశం వృద్ధం దశరథం నృపమ్. ౨

బద్ధాంజలిపుటాస్సర్వే దూతా విగతసాధ్వసాః,
రాజానం ప్రయతా వాక్యమబ్రువన్మధురాక్షరమ్. ౩
మైథిలో జనకో రాజా సాగ్నిహోత్రపురస్కృతమ్,
కుశలం చావ్యయం చైవ సోపాధ్యాయపురోహితమ్. ౪
ముహుర్ముహుర్మధురయా స్నేహసంయుక్తయా గిరా,
జనకస్త్వాం మహారాజ పృచ్ఛతే సపురస్సరమ్. ౫
పృష్ట్వా కుశలమవ్యగ్రం వైదేహో మిథిలాధిపః,
కౌశికానుమతే వాక్యం భవంతమిదమబ్రవీత్. ౬
పూర్వం ప్రతిజ్ఞా విదితా వీర్యశుల్కా మమాత్మజా,
రాజానశ్చ కృతామర్షా నిర్వీర్యా విముఖీకృతాః. ౭

సేయం మమ సుతా రాజన్ విశ్వామిత్రపురస్సరైః,
యదృచ్ఛయాగతైర్వీరైర్నిర్జితా తవ పుత్రకైః. ౮

తచ్చ రాజన్ ధనుర్దివ్యం మధ్యే భగ్నం మహాత్మనా,
రామేణ హి మహారాజ మహత్యాం జనసంసది. ౯

అస్మై దేయా మయా సీతా వీర్యశుల్కా మహాత్మనే,
ప్రతిజ్ఞాం కర్తుమిచ్ఛామి తదనుజ్ఞాతుమర్హసి. ౧౦

సోపాధ్యాయో మహారాజ పురోహితపురస్సరః,
శీఘ్రమాగచ్ఛ భద్రం తే ద్రష్టుమర్హసి రాఘవౌ. ౧౧

ఆరాయబారులు దశరథునిపంపున రాజగృహంబులోనికిం బోవం గావలివాండ్లచే విడువంబడి దేవతుల్యుండును వృద్ధుండు నగు దశరథమహారాజుం జూచిరి. ౨

ఆరాయబారులందఱును చేతులు మొగిడ్చి భయంబు వీడి పరిశుద్ధులయి దశరథునింజూచి మధురంబుగా నిట్లని చెప్పిరి. 3

దశరథమహారాజా! మిథిలాధిపతియగు జనకమహారాజు, "నీకును నీయగ్నిహోత్రంబులకును నీఋత్విజులకును బురోహితునకును నీపరివారజనులకును క్షేమంబె? యారోగ్యంబె" యని మాటిమాటికిని స్నేహంబున మధురంబగు వాక్యంబున నడుగుచున్నాఁడు. ౪,౫

మిథిలకుఁ బ్రభువయిన జనకమహారాజు ఇటు కొఱంతలేని క్షేమంబడిగి విశ్వామిత్రునియనుమతిని నీతో నీమాట జెప్పుమనెను. ౬

"నాకొమార్తెను పరాక్రమంబు గలవాని కెయిత్తును" అని మున్నె నేఁ జేసిన ప్రతిన మీకందఱకును దెలిసియేయున్నది; రాజులును గోపించి యుద్ధమునకువచ్చి నిర్వీర్యులయి పరాజయంబునొందిరి అనునదియును దెలిసినదియె.

దశరథమహారాజా! అట్లు సమానరాజులకును గోర్కెగలిగి యెవ్వరికినిం బొందరాని నాకూఁతురయిన సీతను నాభాగ్యంబున విశ్వామిత్రుని వెంట వచ్చిన పరాక్రమశాలియగు నీచిన్నికొడుకయిన రాముఁడు సాధించెను.

దశరథమహారాజా! ఇదివఱ కెవ్వరిచేనైనను గదలింపనుం గూడని దివ్యంబగు శివధనువును మహాపరాక్రమశాలియగు రాముండు పెక్కండ్రు జనులు చూడఁగా నడుమం బట్టి విఱిచెను. ౯

నేను పరాక్రమంబుగలవానికే యివ్వఁదగినసీతను, మహాపరాక్రమశాలియగు రామున కిచ్చెదను; నాప్రతినను నెఱవేర్పఁగోరెదను; నీవు దానికనుజ్ఞ యివ్వవలయును. ౧౦

దశరథమహారాజా! నీవు ఋత్విజులను బురోహితునింగూడి శీఘ్రంబుగా రావలయును; నీకు మంగళమగుఁగాక; నీవు రామలక్ష్మణులం జూడవలయును. ౧౧

ప్రీతిం చ మమ రాజేంద్ర నిర్వర్తయితుమర్హసి,
పుత్రయోరుభయోరేవ ప్రీతిం త్వమపి లప్స్యసే. ౧౨

ఏవం విదేహాధిపతిర్మధురం వాక్యమబ్రవీత్,
విశ్వామిత్రాభ్యనుజ్ఞాతశ్శతానందమతే స్థితః. ౧౩
(ఇత్యుక్త్వా విరతా దూతా రాజగౌరవశంకితాః)

దూతవాక్యం తు తచ్ఛ్రుత్వా రాజా పరమహర్షితః,
వసిష్ఠం వామదేవం చ మంత్రిణోఽన్యాంశ్చ సోఽబ్రవీత్. ౧౪

గుప్తః కుశికపుత్రేణ కౌసల్యానందవర్ధనః,
లక్ష్మణేన సహ భ్రాత్రా విదేహేషు వసత్యసౌ, ౧౫
దృష్టవీర్యస్తు కాకుత్స్థో జనకేన మహాత్మనా,
సంప్రదానం సుతాయాస్తు రాఘవే కర్తుమిచ్ఛతి. ౧౬
యది వో రోచతే వృత్తం జనకస్య మహాత్మనః,
పురీం గచ్ఛామహే శీఘ్రం మాభూత్కాలస్య పర్యయః. ౧౭
మంత్రిణో బాఢమిత్యాహుస్సహసర్వైర్మహర్షిభిః. ౧౭½
సుప్రీతశ్చాబ్రవీద్రాజా శ్వోయాత్రేతి స మంత్రిణః. ౧౮

మంత్రిణస్తాం నరేంద్రస్య రాత్రిం పరమసత్కృతాః,
ఊషుస్తే ముదితాస్సర్వే గుణైస్సర్వైస్సమన్వితాః. ౧౯

ఇతి శ్రీమద్బాలకాణ్డే, అష్టషష్టితమస్సర్గః.

---

రాజశ్రేష్ఠుండ వగుదశరథుఁడా ! నాప్రార్థన నంగీకరించి నాకు సంతోషంబు సేయవలయును. నేను కూఁతులనిద్దఱ సంతోషంబునం జూచు నట్లు నీవును నీయిద్దఱ కొడుకుల సంతోషంబునఁ జూడఁగలవని జనకుండు నీతోఁ జెప్పుమనెను. ౧౨

విదేహాధిపతి యగుజనకుండు విశ్వామిత్రుని యనుమతిని శతానందుని సమ్మతియుం బొంది యీప్రకారముగా మధురంబగుమాటఁ జెప్పెను. ౧౩

(రాయబారులు ఈప్రకారము దశరథునితోఁ జెప్పి రాజుముందట నెచ్చుగా మాటలాడఁగూడదనందున నంత నూరకుండిరి.)

ఆ రాయబారులమాట వినినంతటనే దశరథుండు సంతోషంబున నుప్పొంగి వసిష్ఠుని వామదేవుని మఱియుం నితరులగు మంత్రులనుం జూచి యిట్లని చెప్పెను. ౧౪

కౌసల్యకు సంతోషమును వృద్ధిఁబొందించునట్టి మనరాముండు లక్ష్మణునింగూడి విశ్వామిత్రునిచే రక్షింపఁబడుచు నిప్పుడు విదేహదేశమందున్నాఁడు.

మహాపరాక్రమశాలియగు జనకుండు రామునిపరాక్రమంబు గనుంగొనెను; జనకుండు తనకూఁతును రామున కియ్యఁ గోరుచున్నాఁడు. ౧౫

మహాత్ముండగు జనకుండు పంపినవృత్తాంతము మీకుసమ్మతమగు నేనిశీఘ్రంబుగా మిథిలాపురి కరుగుదము; జాగు సేయరాదు. అని వసిష్ఠాదులతో ననెను.

మంత్రులును మహర్షులు నందఱును "మంచిది" అని చెప్పిరి. ౧౬౹

ఆదశరథమహారాజు పరమసంతుష్టుండై మంత్రులఁజూచి "రేపుబయనంబయ్యెదము" అని చెప్పెను. ౧౭

మంత్రిగుణంబులన్నియు గలిగినట్టి యాజనకుని మంత్రులందఱును దశరథునివలన మిక్కిలియును సత్కారమునొంది సంతోషంబున నారాత్రి నంతయుం నుండిరి. ౧౮

ఇది యఱువదియెనిమిదవ సర్గము.

## ఏకోనసప్తతితమస్సర్గః

తతో రాత్ర్యాం వ్యతీతాయాం సోపాధ్యాయస్సబాంధవః,
రాజా దశరథో హృష్ట స్సుమంత్ర మిద మబ్రవీత్. ౧
అద్య సర్వే ధనాధ్యక్షా ధనమాదాయ పుష్కలమ్,
వ్రజంత్వగ్రే సువిహితా నానారత్నసమన్వితాః. ౨
చతురంగబలం చాపి శీఘ్రం నిర్యాతు సర్వశః,
మమాజ్ఞాసమకాలంచ యానయుగ్యమనుత్తమమ్. 3
వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః,
మార్కండేయస్సుదీర్ఘాయుః ఋషిః కాత్యాయన స్తథా. ౪
ఏతే ద్విజాః ప్రయాంత్వగ్రే స్యందనం యోజయస్వ మే,
యథా కాలాత్యయో న స్యాద్దూతా హి త్వరయంతి మామ్.
వచనాత్తు నరేంద్రస్య సా సేనా చతురంగిణీ,
రాజానమృషిభిస్సార్ధం వ్రజంతం పృష్ఠతోఽన్వగాత్. ౬
గత్వా చతురహం మార్గం విదేహానభ్యుపేయివాన్,
రాజా తు జనకశ్శ్రీమాన్ శ్రుత్వా పూజామకల్పయత్. ౭

తతో రాజాన మాసాద్య వృద్ధం దశరథం నృపమ్,
జనకో ముదితో రాజా హర్షంచ పరమం యయౌ. ౮
ఉవాచ చ నరశ్రేష్ఠో నరశ్రేష్ఠం ముదాఽన్వితః. ౮½

స్వాగతం తే మహారాజ దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ,
పుత్రయోరుభయోః ప్రీతిం లప్స్యసే వీర్యనిర్జితామ్. ౯½

దిష్ట్యా ప్రాప్తో మహాతేజా వసిష్ఠో భగవానృషిః,

## అఱువదితొమ్మిదవ సర్గము

అంత నారాత్రి గడవఁగానే దశరథమహారాజు ఋత్విజులను బంధువులనుంగూడి సంతసించి సుమంత్రుంజూచి యిట్లని చెప్పెను. ౧

ఇప్పుడు కోశాధికారులందఱును శ్రేష్ఠంబగుధనంబుఁ దీసికొని నానావిధంబులగు రత్నంబులతోఁ గూడి సిద్ధులయి పోవుదురుగాక. ౨

నేను, ఆజ్ఞచేసినక్షణమంతట చతురంగం బగుసేనయును శ్రేష్ఠంబులగు మేనాలు రథంబులు మొదలగునవియును అన్నియును బయలువెడలుగాక. 3

జాగుకానట్లుగా వసిష్ఠుండును వామదేవుండును జాబాలియును గాశ్యపుండును, దీర్ఘాయువగు మార్కండేయుండును గాత్యాయనుండును ఈబ్రాహ్మణులు ముందఱం బోదురుగాక. నన్ను దూతలు తొందరపఱచుచున్నారుగదా అని దశరథుండు సుమంత్రునితోఁ జెప్పెను. ౪.౫

దశరథమహారాజు నాజ్ఞను ఆచతురంగసేన ఋషులతోఁగూడఁ బోవుచున్న దశరథమహారాజువెంట వెంబడించి వెళ్లెను. ౬

ఆదశరథుండు నాలుగుదినములు పయనంబుచేసి విదేహదేశంబు ప్రవేశించెను. శ్రీమంతుండగు జనకుండును దశరథుండు తనదేశముఁ బ్రవేశించుటను విని యచ్చట నచ్చట నతనికిఁ బూజఁగావించెను. ౭

అంత జనకమహారాజు వృద్ధుం డగుదశరథమహారాజుం జూచి సంతసంబున మిక్కిలియు గగుర్పాటు నొందెను. ౮

పురుషశ్రేష్ఠుఁడగు జనకమహారాజు సంతోషంబునొంది పురుషశ్రేష్ఠుం డగు దశరథునింజూచి యిట్లని చెప్పెను. ౯

రఘువంశంబునంబుట్టిన దశరథ మహారాజా! నీకు స్వాగతంబగుఁగాక; మాభాగ్యంబున నీవిచ్చోటికి వచ్చితివి. నీయిద్దఱుకొడుకుల పరాక్రమంబునం గలిగిన సంతోషంబు ననుభవింపఁగలవు. ౧౦

మహాతేజుఁడును భగవంతుఁడునగువసిష్ఠమహార్షి బ్రాహ్మణవర్యులనెల్లరం

సహ సర్వైర్నృపశ్రేష్ఠైర్దేవైరివ శతక్రతుః. ౧౦౫

దిష్ట్యా మే నిర్జితా విఘ్నా దిష్ట్యా మే పూజితం కులమ్,
రాఘవైస్సహ సంబంధాద్వీర్యశ్రేష్ఠైర్మహాత్మభిః. ౧౧౫

శ్వః ప్రభాతే నరేంద్రేంద్ర నిర్వర్తయితుమర్హసి,
యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ వివాహమృషిసమ్మతమ్. ౧౨౫

తస్య తద్వచనం శ్రుత్వా ఋషిమధ్యే నరాధిపః,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః ప్రత్యువాచ మహీపతిమ్. ౧౩౫

ప్రతిగ్రహో దాతృవశశ్శ్రుతమేతన్మయా పురా,
యథా వక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యామహే వయమ్. ౧౪౫

ధర్మిష్ఠం చ యశస్యం చ వచనం సత్యవాదినః,
శ్రుత్వా విదేహాధిపతిః పరం విస్మయ మాగతః. ౧౫౫

తతస్సర్వే మునిగణాః పరస్పరసమాగమే,
హర్షేణ మహతా యుక్తాస్తాం నిశామవసన్ సుఖమ్. ౧౬౫
రాజాచ రాఘవౌ పుత్రౌ నిశామ్య పరిహర్షితః,
ఉవాస పరమప్రీతో జనకేన సుపూజితః. ౧౭౫
జనకోఽపి మహాతేజాః క్రియాం ధర్మేణ తత్త్వవిత్,
యజ్ఞస్య చ సుతాభ్యాం చ కృత్వా రాత్రిమువాసహ. ౧౮౫

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకోనసప్తతితమస్సర్గః.

గూడి దేవతలంగూడి నూరు యాగంబులుచేసిన దేవేంద్రుండుం బోలె మా భాగ్యంబున నిచ్చోటికి కేతెంచె. ౧౦

పరాక్రమంబున శ్రేష్ఠులును మహాత్ములు నగురఘువంశంబునంబుట్టిన వారితో వియ్యంబు దొరకొనుటంజేసి నాభాగ్యంబున నావిఘ్నంబులు నశించి నవి; నాభాగ్యంబున నాకులంబు ప్రశస్తంబైనది. ౧౧

పురుషశ్రేష్ఠుండవు రాజశ్రేష్ఠుండవు నగు దశరథుఁడా! రేపటిప్రాతః కాలమునందు యాగాంతంబున ఋషులను సమ్మతంబగునటుల వివాహంబు నెఱవేర్పవలయునని జనకుండు దశరథునితోఁ జెప్పెను. ౧౨

ఆజనకుండు చెప్పినమాటవిని మాటలయందుఁ బండితులలో శ్రేష్ఠుండగు దశరథమహారాజు ఋషులనడుమ జనకమహారాజుం జూచి యిట్లని బదులు చెప్పెను. ౧౩

ఇచ్చువాఁడు ఎప్పుడిచ్చునో అప్పుడు పుచ్చుకొనువాఁడు పుచ్చుకొనునే గానివేరులేదు. కావున ప్రతిగ్రహము దాతయధీనము. నీవిట్లు కన్యాప్రదానము చేయుటను నేను వినియున్నాఁడను. నీవెట్లు చెప్పుదువో మేమట్లె చేయుం దుము. అని దశరథుండు చెప్పెను. ౧౪

విదేహదేశంబున కధిపతియగు జనకుండు మిక్కిలియు ధర్మంబుతోఁ గూడినదియును గీర్తికరంబునగు నాదశరథునిమాట విని మిగుల నాశ్చర్యంబు నొందెను. ౧౫

అంత మునులందఱును ఒండొరులకును సమాగమంబు గలుగుటంజేసి మిగుల సంతసంబంది యారాత్రియంతయుఁ సుఖంబుండిరి. ౧౬

దశరథమహారాజును దనకొడుకులగు రామలక్ష్మణులంజూచి సంతోషంబున గగుర్పాటునొంది జనకునిచేఁ బూజింపఁబడి మిగుల సంతసించుచుండెను.

మహాతేజుండును ధర్మతత్త్వంబు నెఱింగినవాఁడు నగుజనకుండును యాగమునకు మిగతపడిన కార్యము నిర్వర్తించి కొమార్తెలకును వివాహమునకు ముందుజేయవలసిన యంకురార్పణము మొదలగు కార్యములు నెఱవేర్చి యారాత్రియంతయుఁ గడపెను.

ఇది యఱువదితొమ్మిదవ సర్గము.

## సప్తతితమస్సర్గః

తతః ప్రభాతే జనకః కృతకర్మా మహర్షిభిః,
ఉవాచ వాక్యం వాక్యజ్ఞశ్శతానందం పురోహితమ్. ౧

భ్రాతా మమ మహాతేజా యవీయానతిధార్మికః,
కుశధ్వజ ఇతి ఖ్యాతః పురీ మధ్యవసచ్ఛుభామ్. ౨
వార్యాఫలకపర్యంతాం పిబన్నిక్షుమతీం నదీమ్,
సాంకాశ్యాం పుణ్యసంకాశాం విమానమివ పుష్పకమ్. ౩

తమహం ద్రష్టుమిచ్ఛామి యజ్ఞగోప్తా స మే మతః,
ప్రీతిం సోఽపి మహాతేజా ఇమాం భోక్తా మయా సహ. ౪

(ఏవ ముక్తే తు వచనే శతానందస్య సన్నిధౌ,
ఆగతాః కేచిదవ్యగ్రా జనక స్తాన్ సమాదిశత్.)
శాసనాత్తు నరేంద్రస్య ప్రయయుశ్శీఘ్రవాజిభిః,
సమానేతుం నరవ్యాఘ్రం విష్ణు మింద్రాజ్ఞయా యథా. ౫

(సాంకాశ్యాం తే సమాగత్య దదృశుశ్చ కుశధ్వజమ్,
న్యవేదయన్యథావృత్తం జనకస్య చ చింతితమ్.
తద్వృత్తం నృపతిశ్శ్రుత్వా దూతశ్రేష్ఠైర్మహాబలైః.)
ఆజ్ఞయాఽథ నరేంద్రస్య ఆజగామ కుశధ్వజః. ౫4
స దదర్శ మహాత్మానం జనకం ధర్మవత్సలమ్. ౬

డెబ్బదియవ సర్గము

అంత ప్రాతఃకాలము కాఁగానే చక్కఁగా మాటలాడనెఱింగిన జనకుం డును యాగీయకార్యముల నిర్వర్తించి మహర్షులం గూడి పురోహితుం డగు శతానందునింజూచి యిట్లని చెప్పెను. ౧

మహాపరాక్రమశాలియుఁ బరమధార్మికుండు నగు నాతమ్ముఁడు కుశ ధ్వజుండనువాఁడు శత్రువు రాకుండుటకై చుట్టును అగడ్తలయందుఁ బాఁతి పెట్టఁబడిన శూలములుగలిగి (చుట్టును నీటి కుంపిరికచెట్లు గలిగి)మంగళకరంబై పుణ్యంబై పుష్పకవిమానంబుంబోలెఁ గనుపట్టుచున్న సాంకాశ్యయనెడు పట్టణం బునందు ఇక్షుమతీనది నీళ్లు త్రావుచు నివసించుచున్నాఁడు. ౨, ౩

నే నాకుశధ్వజునిం జూడఁగోరెదను; అతండు నాయాగంబురక్షించు వాఁడు; మహాపరాక్రమశాలియగు నతండును ఈ శివధనుర్భంగంబునను సీతా వివాహంబునను గల్గుసంతోషంబు ననుభవింప వచ్చుండని జనకుండు శతా నందునితోఁ జెప్పెను. ౪

(జనకుం డిట్లు శతానందునిముందటఁ జెప్పఁగానే కొందఱు సేవకులు కానివారు వచ్చిరి; జనకుండు వారల కాజ్ఞాపించెను.)

వారలు జనకుం డాజ్ఞాపించినంతటనే పురుషశ్రేష్ఠుండగు కుశధ్వజుని దేవేంద్రునాజ్ఞను విష్ణుదేవునట్లు తోడ్కొనివచ్చుటకై వేగంబుగాఁ బోవు గుఱ్ఱంబుల నెక్కి పోయిరి. ౫

ఆదూతలు సాంకాశ్యం జేరి కుశధ్వజునిజూచి రాముండు శివధనువును విఱుచుట మొదలగు జరిగినవృత్తాంతమును జనకుని యభిప్రాయంబునుం దెల్పిరి.

మనుష్యులకుఁ బ్రభువయిన కుశధ్వజుండు బలవంతులగు దూతశ్రేష్ఠుల వలన నావృత్తాంతమంతయుం విని జనకమహారాజుననుపునం జేసి మిథిలకు వచ్చెను.

ఆకుశధ్వజుండు; మహాత్ముండును ధర్మమునందు మిగుల నాసక్తుండు నగు జనకమహారాజుం జూచెను. ౭

సోఽభివాద్య శతానందం రాజానం చాపి ధార్మికం,
రాజార్హం పరమం దివ్యమాసనం చాధ్యరోహత. ౭

ఉపవిష్టావుభౌ తౌ తు భ్రాతరావతితేజసౌ,
ప్రేషయామాసతుర్వీరౌ మంత్రిశ్రేష్ఠం సుదామనమ్. ౮

గచ్ఛ మంత్రిపతే శీఘ్రమైక్ష్వాకుమమితప్రభమ్,
ఆత్మజైస్సహ దుర్ధర్షమానయస్వ సమంత్రిణమ్. ౯

ఔపకార్యం స గత్వా తు రఘూణాం కులవర్ధనమ్,
దదర్శ శిరసా చైన మభివాద్యేదమబ్రవీత్. ౧౦

అయోధ్యాధిపతే వీర వైదేహో మిథిలాధిపః,
స త్వాం ద్రష్టుం వ్యవసితస్సోపాధ్యాయపురోహితమ్. ౧౧

మంత్రిశ్రేష్ఠవచశ్శ్రుత్వా రాజా సర్షిగణస్తదా,
సబంధురగమత్తత్ర జనకో యత్ర వర్తతే. ౧౨
స రాజా మంత్రిసహితస్సోపాధ్యాయస్సబాంధవః,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో వైదేహమిదమబ్రవీత్. ౧౩
విదితం తే మహారాజ ఇక్ష్వాకుకులదైవతమ్,
వక్తా సర్వేషు కృత్యేషు వసిష్ఠో భగవానృషిః. ౧౪

విశ్వామిత్రాభ్యనుజ్ఞాతస్సహ సర్వైర్మహర్షిభిః,
ఏష వక్ష్యతి ధర్మాత్మా వసిష్ఠో మే యథాక్రమమ్. ౧౫

ఆకుశధ్వజుండు శతానందునకును ధార్మికుం డగు జనకమహారాజున కును నమస్కారముచేసి రాజయోగ్యంబును మిగుల నున్నతంబును శ్రేష్ఠంబు నగు సింహాసనంబు నెక్కెను. ౭

పరాక్రమశాలులును తేజస్వులు నగుతోడంబుట్టువులయిన యాజనక కుశధ్వజులిర్వురును ఆసనంబునంగూర్చుండి మంత్రిశ్రేష్ఠుని సుదామనుండను వాని దశరథునికడకుఁ బంపిరి. ౮

మంత్రిశ్రేష్ఠుండవగు సుదామనుఁడా ! నీవు శీఘ్రంబుగాఁబోయి కొలఁత పెట్టరానికాంతిగల్గి దుర్ధర్షుండై మంత్రులంగూడియున్న దశరథమహారాజును అతనికొడుకులనుం దోడితెమ్మని చెప్పి పంపిరి. ౯

ఆసుదామనుండు దశరథుండుండు విడిదికింబోయి యచ్చట రఘువంశ వర్ధనుండగు దశరథునింజూచి యతనికి సాష్టాంగంబుగ నమస్కరించి యిట్లని చెప్పెను. ౧౦

పరాక్రమశాలివి అయోధ్యాధిపుఁడ వగు దశరథుఁడా ! మిథిలాధి నాథుండగు నాజనకుండు ఋత్విజులతోను బురోహితునితోనుం గూడ నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడని సుదామనుండు చెప్పెను. ౧౧

మంత్రిశ్రేష్ఠుండగు సుదామనుండు చెప్పినమాటను విని యప్పుడు దశ రథుండు ఋషులను బంధువులనుంగూడి జనకుం డున్నచోటికిం బోయెను. ౧౨

మాటలయందుఁ బండితుండగు నాదశరథమహారాజు మంత్రులను ఋత్విజులను బంధువులనుంగూడి జనకమహారాజుంజూచి యిట్లని చెప్పెను.

జనకమహారాజా ! భగవంతుండగు వసిష్ఠమహర్షి ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవారి కిలువేల్పనియుం వారికార్యములనన్నింటను మాటలాడువాఁడనియుం నీకుఁ దెలిసియేయున్నది. ౧౪

ధర్మాత్ముండగు నీవసిష్ఠుండు విశ్వామిత్రుని యనుజ్ఞనొంది మహర్షుల నందఱింగూడి నావంశంబు క్రమంబుగాఁ జెప్పునని దశరథుండు జనకునితోఁ జెప్పెను. ౧౫

ఏవముక్త్వా నరశ్రేష్ఠే రాజ్ఞాం మధ్యే మహాత్మనాం,
తూష్ణీంభూతే దశరథే వసిష్ఠో భగవానృషిః. ౧౬
ఉవాచ వాక్యం వాక్యజ్ఞో వైదేహం సపురోధసం. ౧౬½
అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మాన్మరీచిస్సంజజ్ఞే మరీచేః కాశ్యపస్సుతః. ౧౭½

వివస్వాన్ కాశ్యపాజ్జజ్ఞే మనుర్వైవస్వత స్స్మృతః,
మనుః ప్రజాపతిః పూర్వమిక్ష్వాకుస్తు మనోస్సుతః. ౧౮½
తమిక్ష్వాకుమయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్. ౧౯
ఇక్ష్వాకోస్తు సుతశ్శ్రీమాన్ కుక్షిరిత్యేవ విశ్రుతః. ౧౯½
కుక్షేరథాత్మజశ్శ్రీమాన్ వికుక్షిరుదపద్యత.
వికుక్షేస్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్. ౨౦½

బాణస్య తు మహాతేజా అనరణ్యః ప్రతాపవాన్,
అనరణ్యాత్పృథుర్జజ్ఞే త్రిశంకుస్తు పృథోస్సుతః. ౨౧½
త్రిశంకోరభవత్పుత్రో దుందుమారో మహాయశాః,
యువనాశ్వసుతస్త్వాసీన్మాంధాతా పృథివీపతిః. ౨౨½

మాంధాతుస్తు సుతశ్శ్రీమాన్ సుసంధిరుదపద్యత,
సుసంధేరపి పుత్రౌ ద్వౌ ధ్రువసంధిః ప్రసేనజిత్. ౨౩½
భరతాత్తు మహాతేజా అసితో నామ జాతవాన్. ౨౪½

యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యంత శత్రవః,
హైహయాస్తాలజంఘాశ్చ శూరాశ్చ శశిబిందవః. ౨౫½

పురుషశ్రేష్ఠుండగు దశరథుండు మహాత్ములగు రాజులనదుమ నిట్లుచెప్పి యూరకుండఁగానే మాటలయందుఁ బండితుండును భగవంతుండు నగు వసిష్ఠ మహర్షి పురోహితునిం గూడియున్న జనకుంజూచి యిట్లని చెప్పెను. ౧౭౹

ఎవ్వరికిం దెలియరాని కారణంబుగల్గి శాశ్వతుండై నిత్యుండై నాశరహితుండై యుండు బ్రహ్మకలఁడు; అతనికి మరీచి పుట్టెను; ఆమరీచికి కాశ్యపుఁడు పుట్టెను. ౧౮౹

కాశ్యపునకు సూర్యుఁడు పుట్టెను; సూర్యుని కొడుకు మనువనువాఁడు; ఆమనువె మున్ను రాజయ్యెను; ఆమనువునకు ఇక్ష్వాకుండనువాఁడు పుట్టెను.

ఆ ఇక్ష్వాకువె యయోధ్యయందు మొదటిరాజని యెఱుంగుము. ౧౯

ఇక్ష్వాకువు కొడుకు శ్రీమంతుండగు కుక్షియయ్యెను. ౧౯౹

కుక్షికి శ్రీమంతుండగు వికుక్షియనుకొడుకు పుట్టెను; వికుక్షికి మహాతేజుండును బరాక్రమశాలియునగు బాణుండను పుత్త్రుండు పుట్టెను. ౨౦౹

బాణునకు మహాతేజుండును బరాక్రమశాలియు నగునరణ్యుండు పుట్టెను; అనరణ్యునకుఁ బృథువనువాఁడు పుట్టెను;పృథువుపుత్త్రుండు త్రిశంకువు.

త్రిశంకువునకు మహాయశుండగు దుందుమారుండను కొడుకు పుట్టెను; అతనికి యువనాశ్వుండను నామాంతరముగలదు; అతనికి మాంధాత యను వాఁడు పుత్త్రుండయ్యె. ౨౧౹

మాంధాతకు శ్రీమంతుండగు సుసంధియను వాఁడు పుట్టెను; సుసంధికిని ధ్రువసంధియని ప్రసేనజిత్తని నిర్వురుకొడుకులు గల్గిరి. ౨౩౹

ధ్రువసంధికిఁ గీర్తిశాలియగు భరతుం డనువాఁడు పుట్టెను; భరతునకు మహాపరాక్రమశాలి యయిన యసితుం డనుపుత్త్రుండు జనియించెను. ౨౪౹

ఆయసితునకు హైహయులును దాలజంఘులును శూరులగు శశిబిందువులును ఈరాజులు శత్రువులయి హింససేయుచుండిరి. ౨౫౹

తాంస్తు స ప్రతియుధ్యన్వై యుద్ధే రాజా ప్రవాసితః. ౨౬

హిమవంతముపాగమ్య భృగుప్రస్రవణేఽవసత్,
అసితోఽల్పబలో రాజా మంత్రిభిస్సహితస్తదా. ౨౭

ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతురితి శ్రుతమ్. ౨౭½

ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరం దదౌ. ౨౮

తతశ్శైలవరం రమ్యం బభూవాభిరతో మునిః,
భార్గవశ్చ్యవనో నామ హిమవంతముపాశ్రితః. ౨౯

తత్రైకా తు మహాభాగా భార్గవం దేవవర్చసమ్,
వవందే పద్మపత్రాక్షీ కాంక్షంతీ సుతమాత్మనః. ౩౦

తమృషిం సాఽభ్యుపాగమ్య కాళిందీ చాభ్యవాదయత్. ౩౦½

స తామభ్యవదద్విప్రః పుత్రేప్సుం పుత్రజన్మని. ౩౧

తవ కుక్షౌ మహాభాగే సుపుత్రస్సుమహాబలః,
మహావీర్యో మహాతేజా అచిరాత్సంజనిష్యతి. ౩౨
గరేణ సహితశ్శ్రీమాన్ మా శుచః కమలేక్షణే. ౩౨½
చ్యవనం తు నమస్కృత్య రాజపుత్రీ పతివ్రతా,
పతిశోకాతురా తస్మాత్పుత్రం దేవీ వ్యజాయత. ౩౩½

ఆయసితుండును వారలు యుద్ధమునకు రాఁగా వారలతోఁ బోరుచుం డఁగా నాయుద్ధమునందే పరాజితుండై యూరు వెడలఁగొట్టఁబడెను. 26

అప్పుడు అసితుండు అల్పంబగు సేనంగూడి మంత్రులతో హిమవత్పర్వతంబునకుఁబోయి యచ్చట భృగుప్రస్రవణంబను శిఖరంబున వాసముసేయుచుండెను. 27

అప్పుడా యసితునిభార్య లిర్వురును గర్భములు ధరించిరి అని వినియున్నాను. 27½

ఆభార్యలలో నొక్కతె తనసవతికి దానిగర్భము నశించుటకై విషము పెట్టిన భక్ష్యంబు నిచ్చినది. 28

అంత భృగువంశంబునంబుట్టిన చ్యవనుండనుమహర్షి యసితు ననుగ్రహింపఁ గోరి రమణీయంబును బర్వతరాజంబునగు హిమవత్పర్వతంబునకు వచ్చెను. 29

ఆయిర్వురిలో మిక్కిలియుం భాగ్యశాలియుఁ దామరపూరేకులవంటి కండ్లుగలదియు నగువిషంబు భక్షించినభార్య తనకొడుకు క్షేమంబుగాఁ బుట్టవలెనని కోరి వేల్పునకుంబోలెఁ గాంతిగల భార్గవుండగు చ్యవనుని నమస్కరించెను. 30

అట్లు సవతికి విషంబిడిన కాళిందియను మఱియొకభార్యయును ఆచ్యవను దగ్గరి యతనికి నమస్కారంబు గావించెను. 30½

బ్రాహ్మణుండగు నాచ్యవనుండు కొడుకుంగోరి తనకుమొదట నమస్కరించిన విషంబు దిన్నదానిం జూచి కొడుకు జనించువిషయమై యిట్లని చెప్పెను. 31

మహాభాగ్యశాలివగు చిన్నదానా! నీకడుపునందు మహాబలుండునుమహాపరాక్రమశాలియును మహాతేజుండును శ్రీమంతుండునగు మంచిపుత్రుండు విషముతోఁగూడినవాఁడై శీఘ్రంబుగాఁబుట్టును.అనిచ్యవనుండుచెప్పెను. 32½

పతివ్రతయును బట్టపురాణియునగు నారాచకొమార్తె చ్యవనునకు మ్రొక్కి యంతఁ బెనిమిటి చనిపోవఁగా మిక్కిలి దుఃఖమునొంది చ్యవను ననుగ్రహంబునం జేసి పుత్రుఁ గనెను. 33½

సపత్న్యా తు గర స్తస్యై దత్తో గర్భజిఘాంసయా,
సహ తేన గరేణైవ జాతస్స సగరోఽభవత్. ౩౪½
సగరస్యాసమంజస్తు అసమంజా త్తథాంఽశుమాన్,
దిలీపోంఽశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. ౩౫½

భగీరథాత్కకుత్థ్సశ్చ కకుత్థ్సస్య రఘుస్సుతః. ౩౬

రఘోస్తు పుత్ర స్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః,
కల్మాషపాదో హ్యభవ త్తస్మాజ్జాత స్తు శంఖణః. ౩౭

సుదర్శనశ్శంఖణస్య అగ్నివర్ణ స్సుదర్శనాత్. ౩౭½
శీఘ్రగ స్త్వగ్నివర్ణస్య శీఘ్రగస్య మరుస్సుతః,
మరోః ప్రశుశ్రుక స్త్వాసీదంబరీషః ప్రశుశ్రుకాత్. ౩౮½
అంబరీషస్య పుత్రోఽభూన్నహుషః పృథివీపతిః,
నహుషస్య యయాతి స్తు నాభాగ స్తు యయాతిజః. ౩౯½
నాభాగస్య బభూవాజః అజాద్దశరథోఽభవత్,
అస్మాద్దశరథాజ్జాతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౦½
ఆదివంశవిశుద్ధానాం రాజ్ఞాం పరమధర్మిణామ్,
ఇక్ష్వాకుకులజాతానాం వీరాణాం సత్యవాదినామ్. ౪౧½
రామలక్ష్మణయోరర్థే త్వత్సుతే వరయే నృప,
సదృశాభ్యాం నరశ్రేష్ఠ సదృశే దాతుమర్హసి. ౪౨

ఇతి శ్రీమద్బాలకాణ్డే, సప్తతితమస్సర్గః.

ఆబిడకుఁ జవలి గర్భమును బోఁగొట్టఁదలంచి విషముఁ బెట్టెను; ఆవిష
ముతోఁగూడనే పుట్టినందున నాపుత్త్రుండు సగరుం డనంబడెను. ౩౪

సగరున కసమంజుఁడు పుట్టెను; అసమంజున కంశుమంతుండు జనిం
చెను; అంశుమంతునకు దిలీపుఁ డనువాఁడు కల్గెను. దిలీపునకు భగీరథుండు
పుట్టెను. ౩౫

భగీరథునకుఁ గకుత్థ్సుండు పుట్టెను; కకుత్థ్సునకు రఘు వనువాఁడు
కలిగెను. ౩౬

రఘువునకుఁబూర్వము ప్రవృద్ధుండను పేరొంది యవ్వల వసిష్ఠునిశాపం
బున రాక్షసుండై పురుషాదుండను నామంబునొంది యంత దాను వసిష్ఠుని
శపింప జలము గ్రహించి తనభార్య యాఁగడింపఁగా దానివిడిచిన నది తన
కాళ్లమీఁదం బడుటవలనఁ గల్మాషపాదుఁడను పేరం బ్రసిద్ధుండైన పుత్త్రుండు
గల్గెను; అతనికి శంఖణుం డనువాఁడు పుట్టెను. ౩౭

శంఖణునకు సుదర్శనుండు పుట్టెను; సుదర్శనునకగ్నివర్ణుండు జనించెను.

అగ్నివర్ణునకు శీఘ్రగుండు పుట్టెను; శీఘ్రగునకు మరువు జనించెను;
మరువునకుఁ బ్రశుశ్రుకుండు కలిగెను; ప్రశుశ్రుకున కంబరీషుండు పుట్టెను.

అంబరీషునకు భూపతియయిన నహుషుం డనువాఁడు పుత్త్రుండయ్యె;
నహుషునకు యయాతి పుట్టె;యయాతికి నాభాగుండనువాఁడు జనించె. ౩౯

నాభాగున కజుండనువాఁడు పుట్టెను; ఆజునకు దశరథుండు జన్మిం
చెను; ఈదశరథునకు సహోదరులగు శ్రీరామలక్ష్మణులు పుట్టిరి. ౪౦

జనకుఁడా! మొదటనుండి పరిశుద్ధంబగు వంశంబుగల్గి పరమధార్మికులై
పరాక్రమశాలులై సత్యవాదులయిన యిక్ష్వాకువంశ్యులగు రాజులకులము
నందుఁబుట్టిన రామలక్ష్మణులకు సీతోర్మిళా కన్యల నిమ్మని కోరెదను; వీరును సీతోర్మి
ళలును రూపసౌందర్యంబుల నీడుగానున్నవారు; వీరికి సీతోర్మిళల నిచ్చుట
యుక్తంబగు అని వసిష్ఠుండు జనకునితోఁ జెప్పెను. ౪౧, ౪౨

ఇది డెబ్బదియవసర్గము.

## ఏకసప్తతితమస్సర్గః.

ఏవం బ్రువాణం జనకః ప్రత్యువాచ కృతాంజలిః. ।

శ్రోతుమర్హసి భద్రం తే కులం నః పరికీర్తితమ్. ౧

ప్రదానే హి మునిశ్రేష్ఠ కులం నిరవశేషతః,
వక్తవ్యం కులజాతేన తన్నిబోధ మహామునే. ౨

రాజాఽభూత్త్రిషు లోకేషు విశ్రుతస్స్వేన కర్మణా,
నిమిః పరమధర్మాత్మా సర్వసత్త్వవతాం వరః. ౩
తస్య పుత్రో మిథిర్నామ మిథిలా యేన నిర్మితా,
ప్రథమో జనకో నామ జనకాదప్యుదావసుః. ౪
ఉదావసోస్తు ధర్మాత్మా జాతో వై నందివర్ధనః,
నందివర్ధనపుత్రస్తు సుకేతుర్నామ నామతః. ౫
సుకేతోరపి ధర్మాత్మా దేవరాతో మహాబలః,
దేవరాతస్య రాజర్షేర్బృహద్రథ ఇతి స్మృతః. ౬
బృహద్రథస్య శూరోఽభూన్మహావీరః ప్రతాపవాన్,
మహావీరస్య ధృతిమాన్ సుధృతిస్సత్యవిక్రమః. ౭
సుధృతేరపి ధర్మాత్మా దృష్టకేతుస్సుధార్మికః,
దృష్టకేతోస్తు రాజర్షేర్హర్యశ్వ ఇతి విశ్రుతః. ౮
హర్యశ్వస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రతింధకః,
ప్రతింధకస్య ధర్మాత్మా రాజా కీర్తిరథస్సుతః. ౯
పుత్రః కీర్తిరథస్యాపి దేవమీఢ ఇతి స్మృతః,
దేవమీఢస్య విబుధో విబుధస్య మహీధ్రకః. ౧౦

## డెబ్బదియొకటవ సర్గము

వసిష్ఠుం డట్లు చెప్పఁగానే జనకుండు చేతులు మొగిడ్చి వసిష్ఠునకు బదులుచెప్పెను.

నీకు మంగళమగుఁగాక; పొగడ్తకెక్కిన మావంశమును నీవు వినవలయును. ౧

మునిశ్రేష్ఠుండవగు వసిష్ఠుఁడా! మంచికులంబునందుఁ బుట్టినవాఁడు తాను గన్యాదానంబు సేయునపుడు తనవంశమునంతయు, నిశ్శేషంబుగాఁ జెప్పవలయును; నావంశము చెప్పెద వినుము. ౨

తనకర్మంబులచేత ముల్లోకంబులందును బ్రసిద్ధికెక్కి. పరమధార్మికుండై బలవంతుల నెల్లరిలోను శ్రేష్ఠుండై నిమియను నొకరాజుండెను. ౩

అనిమికుమారుండు మిథియనువాఁడు; అతనిచేతనే యీమిథిల నిర్మింపఁబడినది. అతండే మొదటి జనకుండు; అతని కుదావసువు కలిగెను. ౪

ఉదావసువునకు ధర్మాత్ముం డగునందివర్ధనుండు పుట్టెను; నందివర్ధనునకు సుకేతువని ప్రసిద్ధుండయిన కొడుకు గల్గెను. ౫

సుకేతువునకు ధర్మాత్ముండును అధికమయిన బలముగలవాఁడునగు దేవరాతుండు జనించెను; రాజర్షి యగుదేవరాతునకు బృహద్రథుం డనువాఁడుకలిగెను.

బృహద్రథునకు శూరుండును బరాక్రమశాలియునగుమహావీరుండుకలిగెను; మహావీరునకుధైర్యశాలియు సత్యపరాక్రముండు నగుసుధృతి జన్మించెను.

సుధృతికి ధర్మంబు బుద్ధిగలిగి ధర్మంబు నాచరించుచుండిన దృష్టకేతువు జన్మించెను; రాజర్షి యగు దృష్టకేతువునకును హర్యశ్వుం డనువాఁడు గల్గెను.

హర్యశ్వునికొడుకు మరువనంబడియె; మరువునకుఁ బ్రతింధకుఁడు, ప్రతింధకునకు ధర్మబుద్ధిగల కీర్తిరథుండను పుత్రుండు గల్గె. ౯

కీర్తిరథునిపుత్రుండు దేవమీఢుం డనంబడెను; దేవమీఢునకు విబుధుం డనువాఁడు గల్గెను; విబుధునకు మహీధ్రకుఁడు జన్మించె. ౧౦

మహీంధ్రకసుతో రాజా కీర్తిరాతో మహాబలః,
కీర్తిరాతస్య రాజర్షేర్మహారోమా వ్యజాయత. ౧౧
మహారోమ్ణస్తు ధర్మాత్మా స్వర్ణరోమా వ్యజాయత,
స్వర్ణరోమ్ణస్తు రాజర్షేర్హ్రస్వరోమా వ్యజాయత. ౧౨
తస్య పుత్రద్వయం జజ్ఞే ధర్మజ్ఞస్య మహాత్మనః,
జ్యేష్ఠోఽహమనుజో భ్రాతా మమ వీరః కుశధ్వజః. ౧౩

మాం తు జ్యేష్ఠం పితా రాజ్యే సోఽభిషిచ్య నరాధిపః,
కుశధ్వజం సమావేశ్య భారం మయి వనం గతః. ౧౪

వృద్ధే పితరి స్వర్యాతే ధర్మేణ ధురమావహమ్,
భ్రాతరం దేవసంకాశం స్నేహాత్పశ్యన్ కుశధ్వజమ్. ౧౫
కస్యచిత్త్వథ కాలస్య సాంకాశ్యాదగమత్పురాత్,
సుధన్వా వీర్యవాన్రాజా మిథిలామవరోధకః. ౧౬
స చ మే ప్రేషయామాస శైవం ధనురనుత్తమమ్,
సీతా కన్యా చ పద్మాక్షీ మహ్యం వై దీయతామితి. ౧౭
తస్యాప్రదానాద్బ్రహ్మర్షే యుద్ధమాసీన్మయా సహ. ౧౭½

స హతోఽభిముఖో రాజా సుధన్వా తు మయా రణే. ౧౮
నిహత్య తం మునిశ్రేష్ఠ సుధన్వానం నరాధిపమ్,
సాంకాశ్యే భ్రాతరం వీరమభ్యషించం కుశధ్వజమ్. ౧౯

కనీయానేష మే భ్రాతా అహం జ్యేష్ఠో మహామునే,
దదామి పరమప్రీతో వధ్వౌ తే మునిపుంగవ. ౨౦

మహీధ్రకునకు మహాబలుండగు కీర్తిరాతుం డనువాఁడు కల్గెను; రాజర్షి యగుకీర్తిరాతునకు మహారోముండు జన్మించెను. ౧౧

మహారోమునకు ధార్మికుండగు స్వర్ణరోముండు కల్గెను; రాజర్షి యగు నాస్వర్ణరోమునకు హ్రస్వరోముండు జన్మించెను. ౧౨

ధర్మముల నెఱింగినవాఁడును మహాత్ముండు నగు నాహ్రస్వరోమునకు మే మిర్వురము కొడుకులము పుట్టితిమి; నేను బెద్దవాఁడను, నాతమ్ముండు పరాక్రమశాలియగు కుశధ్వజుండు. ౧౩

మాతండ్రి యగు నాహ్రస్వరోముండు జ్యేష్ఠపుత్రుండ నగు నన్ను రాజ్యాభిషిక్తునిం జేసి కుశధ్వజుని రక్షించుభారము నాయందుంచి తపోవనం బునకుం బోయెను. ౧౪

ముదుసలియగు తండ్రి చనిపోవఁగానే నేను దేవసమానుండు దమ్ముండు నగుకుశధ్వజునిస్నేహంబునంజూచుచు ధర్మంబున రాజ్యభారంబు వహించితిని.

అంతఁగొంత కాలమయినపిమ్మట సాంకాశ్యపురంబునుండి పరాక్రమ శాలియగు సుధన్వుం డనెడురాజు ముట్టడివేయుటకై మిథిలకు వచ్చెను. ౧౬

ఆసుధన్వుండును శ్రేష్ఠంబగు శివధనువును, దామరపూలవంటి కండ్లు గల సీతను నాకీవలయును అని దూతల నాయొద్దికిఁ బంపెను. ౧౭

బ్రహ్మర్షి వగువసిష్ఠుఁడా! నేనాసుధన్వునకు శివధనువు సీతను ఇవ్వకుం డుటంజేసి నాకును అతనికిని యుద్ధమైనది. ౧౮

ఆసుధన్వుండును యుద్ధమునందు నా కెదురునడిచి నాచేఁజంపఁబడెను.

మునిశ్రేష్ఠుఁడ వగు వసిష్ఠుఁడా! మనుష్యులకుఁ బ్రభువయిన యా సుధన్వునిం జంపి సాంకాశ్యపట్టణమునందు పరాక్రమశాలియగు నాతమ్ముఁడ యిన కుశధ్వజునిఁ బట్టాభిషిక్తునిఁ గావించితిని. ౧౯

మునిశ్రేష్ఠుండ వగు వసిష్ఠమహాముని! వీఁడు నాతమ్ముండగు కుశధ్వజుండు; నేను జ్యేష్ఠుండను; నీవడిగినట్లు పరమసంతోషంబున నాయిద్దఱఁ గొమార్తెల నిచ్చెదను. ౨౦

సీతాం రామాయ భద్రంతే ఊర్మిళాం లక్ష్మణాయచ. ౨౦౫
వీర్యశుల్కాం మమ సుతాం సీతాం సురసుతోపమామ్,
ద్వితీయామూర్మిళాం చైవ త్రిర్వదామి న సంశయః. ౨౧౫

దదామి పరమప్రీతో వధ్వౌ తే రఘునందన.

౨౨
రామలక్ష్మణయో రాజన్ గోదానం కారయస్వహ,
పితృకార్యం చ భద్రంతే తతో వైవాహికం కురు. ౨౩
మఘాహ్యద్య మహాబాహో తృతీయే దివసే ప్రభో,
ఫల్గున్యాముత్తరే రాజం స్తస్మిన్ వైవాహికం కురు. ౨౪

రామలక్ష్మణయో రాజన్ దానం కార్యం సుఖోదయమ్. ౨౪౫

ఇతి శ్రీమద్బాలకాణ్డే, ఏకసప్తతితమస్సర్గః.

---

## ద్వి స ప్త తి త మ స్స ర్గః.

తముక్తవంతం వై దేహం విశ్వామిత్రో మహామునిః,
ఉవాచ వచనం వీరం వసిష్ఠసహితో నృపమ్. ౧
అచింత్యాన్యప్రమేయాని కులాని నరపుంగవ,
ఇక్ష్వాకూణాం విదేహానాం నైషాం తుల్యోఽస్తి కశ్చన. ౨

సదృశో ధర్మసంబంధస్సదృశో రూపసంపదా.
రామలక్ష్మణయో రాజన్ సీతా చోర్మిళయా సహ. ౩

నీకు మంగళమగుఁగాక; రామునకుసీతను లక్ష్మణునకూర్మిళను ఇచ్చెదను. పరాక్రమంబు గలవానికె యిచ్చునట్లు నిశ్చయింపఁబడినదియుం దేవ పుత్రివంటిదియుం నగు నాకూఁతురయిన సీతను రెండవకూఁతురయిన యూర్మిళను మనోవాక్కాయంబులచేతను ఇచ్చెదను; సందియంబులేదని వసిష్ఠునితోఁ జెప్పెను. ౨౧౪

దశరథుఁడా! నేను బరమసంతోషంబున సీతను ఊర్మిళను ఇచ్చెదను. దశరథుఁడా! రామలక్ష్మణులకు సమావర్తనము చేయించుము! నీకు మంగళమగుఁ గాక; అటుపిమ్మట నాందిశ్రాద్ధమును జేయించుము. ౨౩

మహాబాహుండవగు దశరథమహారాజా! ఈదినమునందు మఘానక్షత్రముగదా! ఇంక నేటికి మూఁడవదినమునందు శుభప్రదంబగు నుత్తరఫల్గునీ నక్షత్రమునందు వివాహకార్యమును జేయుంచుము. ౨౪

దశరథమహారాజా! సుఖముగలిగించునట్టి గోదానాది దానంబులను రామలక్ష్మణులచేఁ జేయింపవలయును అని జనకుండు దశరథునితోఁ జెప్పెను.

ఇది డెబ్బదియొకటవ సర్గము.

---

## డెబ్బదిరెండవ సర్గము

విశ్వామిత్రమహాముని వసిష్ఠునింగూడి ఇట్లుచెప్పి యూరకున్న పరాక్రమశాలియగు జనకమహారాజుం జూచి యిట్లని చెప్పెను. ౧

పురుషశ్రేష్ఠుండవగు జనకుఁడా! ఇక్ష్వాకువంశపురాజుల వంశమును విదేహదేశపురాజుల వంశమును తలంపను గొలతపెట్టనుం గూడునట్టిమహిమ గలవి; వీరలకు సరి యెవ్వఁడును లేఁడు. ౨

ఈవివాహసంబంధము సమానంబులగుకులంబులకుఁ గల్గుటంజేసి తగియున్నది. వధూవరులకుంగల సౌందర్యముచేతను జాలనొప్పియున్నది. సీతయును ఊర్మిళయును రామలక్ష్మణులకుఁ దగియున్నవారు. రామలక్ష్మణులును సీతకును ఊర్మిళకును దగియున్నవారు. ౩

వక్తవ్యంచ నరశ్రేష్ఠ శ్రూయతాం వచనం మమ. ౩

భ్రాతా యవీయాన్ధర్మజ్ఞ ఏష రాజా కుశధ్వజః. ౪
అస్య ధర్మాత్మనో రాజన్ రూపేణాప్రతిమం భువి,
సుతాద్వయం నరశ్రేష్ఠ పత్న్యర్థం వరయామహే. ౫

భరతస్య కుమారస్య శత్రుఘ్నస్య చ ధీమతః,
వరయామస్సుతే రాజన్ తయోరర్థే మహాత్మనోః. ౬

పుత్రా దశరథస్యేమే రూపయౌవనశాలినః,
లోకపాలోపమాస్సర్వే దేవతుల్యపరాక్రమాః. ౭

ఉభయోరపి రాజేంద్ర సంబంధేనానుబధ్యతామ్,
ఇక్ష్వాకోః కుల మవ్యగ్రం భవతః పుణ్యకర్మణః. ౮

విశ్వామిత్రవచశ్శ్రుత్వా వసిష్ఠస్య మతే తదా,
జనకః ప్రాంజలిర్వాక్యమువాచ మునిపుంగవౌ. ౯

కులం ధన్యమిదం మన్యే యేషాం నో మునిపుంగవౌ,
సదృశం కులసంబంధం యదాజ్ఞాపయథస్స్వయమ్. ౧౦

ఏవం భవతు భద్రం వః కుశధ్వజసుతే ఇమే,
పత్న్యౌ భజేతాం సహితౌ శత్రుఘ్నభరతావుభౌ. ౧౧

ఏకాహ్నా రాజపుత్రీణాం చతసృణాం మహామునే.
పాణీన్ గృహ్ణంతు చత్వారో రాజపుత్రా మహాబలాః. ౧౨

పురుషశ్రేష్ఠుఁడవగు జనకుఁడా! ఇంకం జెప్పవలసినది కొంచెమున్నది. నాచెప్పునది వినుము. ౪

ఈకుశధ్వజమహారాజు నీకుందమ్ముండు చాలధర్మంబుల నెఱింగినవాఁడు.

పురుషశ్రేష్ఠుండవగు జనకుఁడా! ధర్మాత్ముండగు నీకుశధ్వజుని కూఁతుల నిద్దఱను రూపంబున భూమియం దెచ్చటను సరిలేనివారలను భార్యార్థముగా వరించెదము. ౫

జనకమహారాజా! భరతునికొఱకును ధీమంతుండగు శత్రుఘ్నునికొఱకును మహాపరాక్రమశాలులగు నీయిద్దఱికొఱకు కుశధ్వజుకూఁతుల నిద్దఱను వరించుచున్నాము. ౬

ఈదశరథుని కొడుకులందఱును సౌందర్యమునను యౌవనంబునను ఒప్పుచున్నవారు! దిక్పాలురతో సాటిసేయఁ దగుదురు; దేవతలకుంబోలెఁ బరాక్రమంబు గలవారలు. ౭

జనకుఁడా! నిర్దోషంబగు నిక్ష్వాకువంశమును బుణ్యాకర్ముండవగు నీవంశమును ఈరెండును వియ్యముచేసి, చుట్టఱికముగలవగుఁగాక. అని విశ్వామిత్రుఁడు జనకునితోఁ జెప్పెను. ౮

అప్పుడు జనకమహారాజు విశ్వామిత్రుఁడు చెప్పినమాట విని వసిష్ఠుని యనుజ్ఞనొంది చేతులుమొగిడ్చికొని యావిశ్వామిత్ర వసిష్ఠులంజూచి యిట్లని చెప్పెను. ౯

మునిశ్రేష్ఠులగు విశ్వామిత్ర వసిష్ఠులారా! మీరు మాకు సరియయిన వంశముతో వియ్యముచేయుమని మీరలయ్యే యాజ్ఞాపించుచున్నారు. కావున మావంశము ధన్యంబని తలంచుచున్నాను. ౧౦

మీరు చెప్పినట్లగుఁగాక; మీకు మంగళమగుఁగాక! శత్రుఘ్నుండును భరతుండును వీరిద్దఱునుంగూడి యీకుశధ్వజునికూఁతుల నిద్దఱనుం బెండ్లాడుదురు గాక. ౧౧

విశ్వామిత్రమహామునీ! మహాబలులగు రాజపుత్రులు నల్వురును ఒక్కపగటనే నల్వురరాజపుత్రులను బెండ్లాడుదురుగాక. ౧౨

ఉత్తరే దివసే బ్రహ్మన్ ఫల్గునీభ్యాం మనీషిణః,
వైవాహికం ప్రశంసంతి భగో యత్ర ప్రజాపతిః. ౧౩

ఏవముక్త్వా వచస్సౌమ్యం ప్రత్యుత్థాయ కృతాంజలిః,
ఉభౌ మునివరౌ రాజా జనకో వాక్య మబ్రవీత్. ౧౪
పరో ధర్మః కృతో మహ్యం శిష్యోఽస్మి భవతో స్సదా. ౧౪½

ఇమాన్యాసనముఖ్యాని ఆసాతాం మునిపుంగవౌ. ౧౫

యథా దశరథస్యేయం తథాఽయోధ్యాపురీ మమ,
ప్రభుత్వే నాస్తి సందేహో యథార్హం కర్తు మర్హథ. ౧౬

తథా బ్రువతి వైదేహే జనకే రఘునందనః,
రాజా దశరథో హృష్టః ప్రత్యువాచ మహీపతిమ్. ౧౭
యువా మసంఖ్యేయగుణౌ భ్రాతరౌ మిథిలేశ్వరౌ,
ఋషయో రాజసంఘాశ్చ భవద్భ్యామభిపూజితాః. ౧౮
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గమిష్యామి స్వమాలయమ్,
శ్రాద్ధకర్మాణి సర్వాణి విధాస్యామీతి చాబ్రవీత్. ౧౯

తమాపృష్ట్వా నరపతిం రాజా దశరథ స్తథా.
మునీంద్రౌ తౌ పురస్కృత్య జగామాశు మహాయశాః. ౨౦

స గత్వా నిలయం రాజా శ్రాద్ధం కృత్వా విధానతః,
ప్రభాతే కాల్యముత్థాయ చక్రే గోదానముత్తమమ్. ౨౧

## —◎ వైదికగ్రంథములు. ◎—

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| అభిశ్రవణమ్ | ... | 0 | 8 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆపస్తంబప్రవరకాండము, సటీక | ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండము, సటీక | ... | 0 | 4 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 4 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము (ఆశ్వలాయనము), చిన్నసైజు | ... | 0 | 8 |
| ఋగ్వేదసంహిత, మొదటిఅష్టము, టీకా తాత్పర్యసహితము, పాతప్రతి | ... | 5 | 0 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 4 |
| తిథిమంత్రములు (ఆరాధ్యులది) | ... | 0 | 3 |
| దేవతార్చన | ... | 0 | 2 |
| తైత్తిరీయ అరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| నవగ్రహారాధనమ్ | ... | 0 | 6 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 1 | 4 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| పుదూరుద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| బ్రహ్మయజ్ఞము | ... | 0 | 3 |
| మంత్రప్రశ్నములు, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| మహాన్యాసము, సస్వరము | ... | 0 | 12 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యజుర్వేదసంధ్యావందనము, సస్వరము ... | 0 | 3 |
| యజుర్వేదపురుషసూక్త శ్రీసూక్తములు,ఆంధ్రటీకాసహితము | 0 | 6 |
| యజుర్వేదఆబ్దికమంత్రములు ... | 0 | 8 |
| యజుర్వేదపూర్వప్రయోగచంద్రిక, సస్వరము ... | 2 | 8 |
| రుద్రము, సస్వరము ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, భాష్య, సాంధ్రటీక ... | 2 | 8 |
| వైదికమతచరిత్రము, శ్రీగోపరాజు వైకుంఠరావుగారిది ... | 3 | 0 |
| శ్రీవైష్ణవాహ్నికము ... | 0 | 8 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము ... | 1 | 0 |
| వ్రతరత్నాకరము, ద్వితీయభాగము ... | 2 | 0 |
| వ్రతచూడామణి, సంస్కృతము ... | 2 | 8 |
| వేదమాహాత్మ్యము, (తెనుగువచనము) ... | 0 | 2 |
| వేదములోని వ్యవసాయము ,, ... | 0 | 2 |
| సత్యనారాయణవ్రతకల్పము, తాత్పర్యసహితము ... | 0 | 12 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 2 |
| కేశవాదిచతుర్వింశతినామభాష్యము ... | 0 | 4 |
| బాలరామాయణము, పెద్దచ్చు ... | 0 | 2 |
| ,, సటీక ... | 0 | 4 |
| శ్రీమద్వాల్మీకిరామాయణము, మూలము ... | 8 | 0 |
| ,, సుందరకాండము, మూలము ... | 2 | 0 |
| ,, ఉత్తరకాండము, రఫ్‌ప్రతి ... | 2 | 0 |
| అధ్యాత్మరామాయణము, మూలము ... | 2 | 8 |
| భవిష్యపురాణము-బ్రాహ్మపర్వము, ఆంధ్రతాత్పర్యం ... | 6 | 0 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, సాంధ్రతాత్పర్యము | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.